# నన్నెచోడుని కుమార సంభవము ప్రాచీనగ్రంథమా?

డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్
తెలుగు శాఖ ఆంధ్ర విశ్వకళాపరిషత్

రమణశ్రీ ప్రచురణ
విశాఖపట్టణము.

ప్రథమముద్రణ :

సంక్రాంతి, 1983
వేయి ప్రతులు
వెల రూ. 45/-

ప్రతులకు :

శ్రీమతి కె. వి. రమణ
నెం. 1. సీ సేండ్స్ క్వార్టర్స్
ఆంధ్రాయూనివర్సిటీ
వాల్తేరు

ముద్రణ :

శ్రీ మోహన్ ప్రింటర్స్,
క్రౌన్ టాకీస్ వెనుక
కాకినాడ

# అంకితము

గురువునకు, కులపతిభే
దరహితవిద్యార్థికల్పతరువునకు, మనో
హరవరబోధనచణునకు,
సరసమధురమృదువచనరచననిపుణునకున్ -

అమృతహృదయునకు, సంయమి
సమ సహృదయునకు, ఉదారచరితునకు, మహో
త్తమగుణభరితునకు, క్రియా
కమనీయదయామయునకు, కావ్యమయునకున్ -

తారాతోరణకవితా
ధారాధారణభగీరథప్రాయునకున్,
భారతదర్శన బహుళా
ధారవిమర్శనమనోరథస్థేయునకున్ -

పరిహాసకుశలకరుణా
పరాయణప్రగతిగీతపరమసుకృతికిన్,
దరహాసవిశదసమతా
నిరూపణప్రముఖశీలనియమప్రకృతికిన్ -

నయమార్గసుప్రసిద్ధా
న్వయ శ్రీనండూరివంశనామార్యునకున్,
జయమార్గసుప్రసిద్ధా
హ్వయ వేంకటరామకృష్ణమాచార్యునకున్.

# కృతిస్వీకృతి

ప్రథిత మానవల్లి రామకృష్ణకవీంద్రు
సాహితీమహేంద్రజాలమహిమ
ఆంధ్రవాఙ్మయమును అరువదేండ్లకుపైన
అద్భుతావహముగ అలముకొనియె.

నమ్మలేని నిజము- నన్నెచోడు కృతి- కృ
త్రిమకుమారసంభవమును గూర్చి
వ్రాసినావు విపులపరిశోధనలు చేసి
నచ్చునట్లు బుధులు మెచ్చునట్లు.

సాహితీజగతిని ఝంఝానిలము వోలె
భూప్రకంపనాల వోలె కుదిపి
నీ విమర్శఘాటి నిప్పుకొండను మించె!!
విజయమందగలదు నిజము తుదకు-

మెచ్చగలరు మేటి మేధావులౌ వారు
నీ విమర్శ చదివి నిజము నెరిగి
తెలుగు వాఙ్మయమున స్థిరతటిల్లత వోలె
మెరసి నీ యశస్సు మించుగాత!

కూర్చినావు కృతిని గురుదక్షిణగ నాకు
తెలుగుతల్లి యెడద పులకరింప!
పరమపావనమ్ము గురుశిష్యబంధమ్ము
అందుకొనుము గురుని ఆశిషములు.

# మున్నుడి

మొట్టమొదట "నన్నెచోడుని కుమారసంభవము" మొత్తము ఏకముఖముగ చదివినప్పుడు (1956) నా కది చాల అర్వాచీనగ్రంథమని అనిపించినది. తదుపరి, పాఠము చెప్పినప్పుడెల్ల (1959-79) అర్వాచీనగ్రంథమనియే అంతరాత్మప్రబోధము. అయినను, "ప్రమాణమన్తఃకరణప్రవృత్తయః" అని సిద్ధాంతము చేయక, తిక్కనకు పూర్వగ్రంథమనియే రాద్ధాంతము చేసితిని. అంతరాత్మప్రబోధమును అందిచ్చితిని. తిక్కనకు తర్వాతి గ్రంథమను తీర్మానమును పరిశీలించి, తిక్కనకు పూర్వగ్రంథమని పాతికపుటలు వ్రాయుసరికి (1979) ఒక విషయము అడ్డు వచ్చినది. "ఇదేమి? ఇట్లు అడ్డు రాఁగూడదే! అంతరాత్మప్రబోధము ధ్రువపడునట్లున్నదే!!" అని వ్రాసిన పాతికపుటల వ్యాసమును ప్రక్కకు నెట్టి, కుమారసంభవమును కూలంకషముగ చూచుకొలఁది అర్వాచీనగ్రంథమనుటకు మాత్రమేగాక, నవీనగ్రంథమనుటకును సాధనసంపత్తి లభించినది.

నన్నెచోడునికిని నాకును పూర్వజన్మవైరము లేదు. మానవల్లి రామకృష్ణకవి గారికిని నాకును ప్రస్తుతజన్మవైరమును లేదు. కవిగారి వార్ధకదశ నాకు ప్రాథమికదశ. వారికిని నాకును ముఖపరిచయమైనను లేదు. వారియెడల వైయక్తికమైన వైమనస్యము కలుగుటకు నిమిత్తము లేదు. కవిగారి వాఙ్మయకృషి ఎంత గౌరవము కలిగించునదియో అంత లాఘవమును కలిగించునది. కారణము, వారి సాహిత్యపరమైన అనార్జవము. "కుమారసంభవము రెండు విరుద్ధాంశములకు సంగమ స్థానము" అని పింగళి లక్ష్మీకాంతముగారి పాఠప్రవచనము. అది యథార్థము. ఉత్తమప్రబంధముల ఉత్తమలక్షణములు, అధమప్రబంధముల అధమలక్షణములు రాశీభూతమైన రచన కుమారసంభవము. అది ప్రాచీనతమగ్రంథమైనను, ప్రాచీనతరగ్రంథమైనను, ప్రాచీనగ్రంథమైనను ప్రశంసనీయమే. నవీనగ్రంథమనుటకు లభించిన సాధనసంపత్తి కంటె, ప్రాచీనగ్రంథమే అనుటకు సమర్థమైన సాధనసంపత్తి లభించిన నాకును సంతోషమే.

ఇది ఆంధ్రసాహిత్యజగత్తునకు ఆకస్మికవిద్యుద్ఘాతసదృశము కావున, ఒక యశఃకాయుని మీద ఒకానొక ఆరోపణము కలదుగావున, సాధకబాధకములను

సరిచూచుట- అన్ని గ్రంథములకు అదిమూలములను అరసిచూచుట- తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథములను తఱచిచూచుట మొదలైన తలస్పర్శిపరిశీలనములు చేసితిని. (26.8.1979- 25.7.1982) ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఆధ్వర్యవమున జరిగిన ఆంధ్రప్రదేశప్రాచ్యపండితసదస్సులో (1979) ఒక అంశమును చదివినది మొదలు, ఇంతవఱకును కనిపించిన కవిపండిత విమర్శకులకెల్ల వివరించితిని. కొందఱికి వినిపించితిని. విసుగుచెందక విని, సంభ్రమాశ్చర్యచకితులగుచు సమ్మతించిన సహవ్రతులకు, సహృదయులకు కృతజ్ఞతలు.

అడిగిన వెంటనే అభిప్రాయము లొసగిన ఆచార్యశ్రీ గంటి జోగిసోమయాజి, ఆచార్యశ్రీ దివాకర్ల వేంకటావధాని, విద్వత్కవి వెంపరాల సూర్యనారాయణశాస్త్రి, విద్వాన్ రావూరి దొరస్వామిశర్మ. శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగార్లకు అ

కవిగారి వసంతవిలాసము వ్రాతప్రతిని డాక్టర్ పి.యస్.ఆర్.అప్పారావుగారి అనుమతి గైకొని అందఁజేసిన కుమారి చేవెళ్ల పద్మాదేవికి; ముద్రణసారథ్యము వహించిన చిరంజీవి మునుగంటి వేంకటరావుకు; ముఖపత్రమును చక్రబంధమును రూపొందించిన చిరంజీవి ఈశ్వర్‌కు; ముద్రించిన చిరంజీవి దిండి సాయిబాబాకు శుభాకాంక్షలు.

తెలుగు సాహిత్యచరిత్రను తొలుత నాకు పాఠముచెప్పిన (1951-53) పరిష్కృతగ్రంథమును ఆద్యంతము విని ఆమోదముద్ర వేసిన (1982)- అంకితము నందుటకు అంగీకరించిన- అస్మద్గురువర్యులు డాక్టర్ నండూరి వేంకటరామకృష్ణమాచార్యులుగారికి నమస్సులు.

— కొర్లపాటి శ్రీరామమూర్తి

# విషయసూచిక

ప్రధాన గ్రంథము : పుట



అనుబంధములు :

# కుహనావాదము

అసలు "నన్నెచోడుని కుమారసంభవము" అచ్చుగుటకు ముందు, "నన్నియ భట్టునకు నూఱేండ్లు ముందున్న రాజకవిచంద్రుని గ్రంథమొకటి లభియించెనను వృత్తాంతము వార్తాపత్రికలయందు ప్రకటింపఁబడి"నది[1]. అప్పుడే, "నన్నియకుఁ బూర్వపుఁ గవి పేరితో గ్రంథమే సృష్టింపఁబడుచున్న"దను వదంతి కూడ వ్యాపించినది[2]. అది విన్న మానవల్లి రామకృష్ణకవిగారు, "దీనిని నేనో మఱి యెవ్వరో రచించి గ్రంథప్రాశస్త్యమునకై ప్రాచీనుల పేర వ్యవహరింపఁబడెననియు గ్రంథమును బ్రకటింపక మునుపే యొక వార్త పుట్టినది. ఇట్టి వార్తను ఖండింపకున్న మహాపాపము" అని 1908 వ సంవత్సరమునందు ఖండించిన, 1909వ సంవత్సరమునందు కుమారసంభవము ప్రథమభాగముతోపాటు ప్రకటించిన విషయమిది[3]:

> "కుమారసంభవములోని పద్యము అథర్వణచ్ఛందము, పెద్దన లక్షణసారసంగ్రహము, కవిసంజీవని, రత్నాకరము, లక్షణశిరోమణి, వీనిలో నుదాహరింపఁబడినవి. అథర్వణుఁడు - క॥ మగణమ్ముఁ గదియ రగణము వగవక కృతి మొదట నిలుపువానికి మరణంబగు నిక్కము మంత్రము మదియందె యగునని యిది తొల్లి వేంకటాదిత్యుఁ డనిన్ - యనియును బూర్ణబిందుప్రాసముక్రింద పద్యమును నుదాహరించెను. కవిసంజీవనిలో నెక్కటిపదములక్రింద - 'నన్నెచోడుని కుమారసంభవములోని' - ఆయతమతి సుతసప్తోపాయముల నెఱుంగ వలయుఁ బ్రతి సామము భేదాయతి దానము దండము మాయోపేక్షేంద్ర జాలమంత్రములోలిన్। అని మఱియు 'పూని రహస్యం బాడెడు వానికి నిదివా నిరీక్ష్య వక్తవ్యం రాత్రౌ నైవచ నైవచ యను మానిత హితభాషణంబు మది నిలుపందగున్' అని యిచ్చియున్నాడు. వీనిలోఁ బై పద్యము 10వ యాశ్వాసమున నున్నది. క్రిందిపద్యము దీనిలో లేదు. ఎచ్చటిదో యెఱుంగుటకును వలను లేదు. పెద్దన లక్షణసారసంగ్రహములో ౬వ ఆశ్వాసమునుండియు రత్నాకరకర్త ౪వ యాశ్వాసమునుండియుఁ బద్యము లుదాహరించియున్నారు."

ఇందు పెద్దన అన చిత్రకవి పెద్దన. అతని లక్షణసారసంగ్రహమునందు కుమారసంభవములోని పద్యములు ఆరవ ఆశ్వాసమునుండి కాదుసరికదా, ఏ ఆశ్వాసమునుండియును ఉదాహరింపఁబడలేదు. అంతేకాదు. ఏకావ్యమునుండియును ఉదాహరింపఁబడలేదు. ఇక లక్షణశిరోమణి అన పొత్తపి వేంకటరమణకవి లక్షణశిరోమణి. అందును కుమారసంభవములోని పద్యము ఒక్కటికూడ ఉదాహరింపఁబడలేదు. గణపవరపు వేంకటకవి సర్వలక్షణశిరోమణికి సంబంధించు ఆంధ్రప్రయోగరత్నాకరమునందు "నన్నెచోడకళావిలాసము"నుండి రెండు పద్యములు ఉదాహరింపఁ బడినవికాని "నన్నెచోడుని కుమారసంభవము"నుండి ఒక్క పద్యముకూడ ఉదాహరింపఁబడలేదు. మఱి కవిసంజీవని అన కవిజనసంజీవని లేక కవిలోకసంజీవని. అది ముద్దరాజు రామన కృతి. ఏకైకప్రతి లభించినది. అది కూడ అసమగ్రము. అందు "ఎక్కటివళులు" అను ఎత్తుగడయే లేదు. ఎక్కటి వళులందును కుమారసంభవమునందులేని "ఆయతమతి" అను పద్యముగాని, కుమార సంభవమునందు లేని "పూని రహస్యంబాడెడు" అను పద్యముగాని ఉదాహరింపఁబడ లేదు. అంతేకాదు. "నన్నెచోడుని కుమారసంభవములోని" అను మాట అంతకంటె లేదు. ఉపరి, కవిసంజీవనినుండి ఇతరలాక్షణికులు ఉట్టంకించిన లక్ష్యలక్షణములందును కుమారసంభవపద్యముగాని, కుమారసంభవప్రసక్తిగాని కానరాదు.

ఇక అథర్వణుని ఛందస్సు. ఇది తమదగ్గఱ కలదని మానవల్లి రామకృష్ణ కవిగారు పలుకుటయేగాని, 'పలుతడవ లడిగి'నను వేటూరి ప్రభాకరశాస్త్రిగారికిని చూపలేదు![4] అథర్వణుడు "మగణమ్ముఁ గదియ ........ తొల్లి వేంకటాదిత్యుఁ డనిన్" అని, పూర్ణబిందుప్రాసముక్రింద పద్యమును ఉదాహరింపవలసిన ఆవశ్యకము లేదు. "మగణమ్ముఁ గదియ రగణము" అను పద్యమునకు, పూర్ణబిందు ప్రాసమునకు లక్ష్యలక్షణసంబంధము లేదు. అయినను ఉదాహరించెననుట చిత్రము. అది ఎల్లరును అనుసరించుట, విశ్వసించుట అంతకంటె విచిత్రము. ఇంతకు అథర్వణచ్ఛందస్సు ఇప్పటికిని అనుపలబ్ధము. "ఇది ప్రసిద్ధమైన ఛందమే కాని నేఁడు లభించదు. ఇతరలక్షణగ్రంథములలో దీని పద్యములు 30 వఱకు లభించెను." అని రావూరి దొరస్వామిశర్మగారు అందిచ్చినసమాచారము[5]. అందును "మగణమ్ముఁ గదియ రగణము" అను పద్యము లేదు. అంతేకాదు. అది ముద్రితాముద్రితలక్షణగ్రంథములందు మృగ్యము.

కనుక, "మహాపాప" మనిన "వా ర్త"ను ఖండించుటకు మానవల్లి రామకృష్ణ కవిగారు కావించిన పని లక్షణగ్రంథముల సాక్ష్యమును కల్పించుట మాత్రమే! ఇది గమనార్హము.

కవిసంజీవనియందు కలదన్న విషయము, ఛందస్సు లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారము అను ఒక అర్వాచీనలక్షణగ్రంథమునందు కలదు. అందు "నన్నెచోడుని కుమారసంభవములోని" అను ఎత్తుగడ లేదుగాని, "కుమారసంభవం" అను ఉపక్రమణిక ఉన్నది. రంగయ (?) సర్వలక్ష్ణసారము అను మరొక అర్వాచీన లక్షణగ్రంథమునందు ఇట్లు కలదు.

"వ. నన్నెచోడకుమారసంభవము

క॥ నెఱి గలిగి నాడు నాటికి
గుఱి గడవన్ జేరి జఘనకుచకచభరముల్
చిఱుదొడలు నడుము నజ్ఞును
విఱిగడినో యనుచు గిరిజ వెఱచుచు నడువన్."

ఇక పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు ఇట్లు కలదు.

"నన్నెచోడకుమారసంభవము

మ॥ హరినీలోపమమధ్యకేశి శశిబింబాస్యోష్ఠ రాజీవకే
సరనేత్రామలగంధి విద్రుమలతానద్వర్ణతన్వంగి సిం
ధురకుంభాలసయానపూర్ణరుచి సంస్తుత్యారుణజ్వాంఘ్రికం
ధర శై వాత్మజ చెప్పనొప్పవె సుధాధర్మార్ధచూడామణీ.

క॥ నెరి గడిచి నాడు నాటికి
గురి గడవంగ నెరిగి జఘనకుచకచభరముల్
చిరుతొడలు నడుమ నద్రును
విరిగెడినో యనుచు గిరిజ వెరచుచు నడిచెన్."

ఇందు "విఱిగడినో, పూర్ణరుచి, అరుణజ్వాంఘ్రి, శై వాత్మజ, ధర్మార్ధ" అనునవి లేఖకదోషములు. అవి "విఱిగెడినో, పూర్ణకుచ, అరుణాబ్జాంఘ్రి, శైలా

త్మజ, ధామార్ధ" అని ఉండవలయును." పూర్ణకుచ, అరుణాబ్జాంఘ్రి, శైలాత్మజ, ధామార్ధ" అని కుమారసంభవమునందు కలవుగాని, "విఱిగెడినో" అని లేదు. "విఱుగకతప్పదని'' అని కలదు. కుమారసంభవములోని పాఠము ప్రబంధరత్నాకరము, సర్వలక్షణసారము అను రెండుగ్రంథములందు ఒకేవిధముగ మాఱుట కంటె, రెండుగ్రంథములలోని ఒకేవిధమైన పాఠము కుమారసంభవమునందు మఱొకవిధముగ మాఱుట సుకరము. కనుక సంశయము కలుగును.

మహాపాపమును ఖండించునెడ మౌనము వహించి, మానవల్లి రామకృష్ణకవి గారు అర్థవివరణ చేయునెడ అందఁజేసిన విషయమిది[6]:

> "ఈ పద్యమునకుఁ బూర్వ మొక్కపద్యము నా ప్రతులలో విడిపోయినట్లు తోచుచున్నది. ప్రబంధమణిభూషణములోఁ గుమార సంభవమునుండి యేడాశ్వాసములలో ౪౦. ౨౬౫, ౨౯౩, ౪౪౫, ౫౫౪, ౫౮౧, ౫౮౬, ౮౩౩, ౮౨౩. ఈ పద్యము లుదాహరింపఁ బడినవి. దీనిలోనిదని యీక్రింది పద్యము కూడ నీయఁబడినది. అది నా ప్రతులలో విడిచిపోయెనేమో. "భూచరు లంబరంబునను పోవుట మేలన ........ పర్వె నుర్వరన్" ఇది 792గా నుండ వలయును."

ఇందు "ప్రబంధమణిభూషణము" అనునది మానవల్లి రామకృష్ణకవిగారే 1910వ సంవత్సరమునందు ప్రకటించినది. అందు "భూచరులంబరంబునను" అను పద్యము" నన్నెచోడుని కుమారసంభవములోనిదని" లేదు. అంతేకాదు. "దీనిలోని పద్యము లేయే కావ్యములలోనివో తత్తత్కృతు లెవ్వరో యించుక తెలిపెదను. ఇది యల్పకార్యమైనను నా పాలిటికి యన్వేషణకార్యము చేయుచుట్టి నంత భారమయ్యెనుగాని పద్యముల నన్నిటికి మూలము గుర్తింపఁజాలెడు భాగ్యము నాకుఁ గలుగలేదు." అని మానవల్లి రామకృష్ణకవిగారి అభిభాషణమే[7]. ఉపరి,

> "కుమారసంభవములోని పద్యములు- ౩౯, ౪౨, ౬౫, ౧౯౨, ౧౯౩, ౧౯౯, ౨౦౮, ౨౩౩, ౩౩౮, ౩౬౫, ౬౩౦, ౬౬౬, ౬౬౫, ౬౬౯, ౬౫౫, ౬౫౪, ౬౦౫, ౭౯౧."

అని ఉద్ధరణము[8].

అసలు "ప్రబంధమణిభూషణము" అను ప్రాచీనగ్రంథము లేదు. 1918వ సంవత్సరమునందు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అందిచ్చిన సమాచారమిది[9]

> "కవిగారు ప్రబంధమణిభూషణము పేరుతో ప్రచురించిన సంధానమునకు ప్రతులు నాల్గయిదు తంజావూరు పుస్తకశాలలో నున్నవి. కాని వానియందు లేని పద్యము లనేకములు వీరి ముద్రణమునఁ జేరినవి. వీరేమే ప్రతులనుబట్టి యీగ్రంథమును ముద్రింపఁ గల్గినదో తెలియదు."

1971వ సంవత్సరమునందు నిడుదవోలు వేంకటరావుగారి నిర్ణయమిది[10]:

> "తంజావూరి పుస్తకశాల గ్రంథసూచి- సంఖ్య. R. 189. ప్రబంధరత్నాకరము. R. 190-193- ప్రబంధసారశిరోమణి. నాలుగు ప్రతులు ........ నేటి ప్రబంధమణిభూషణములోనున్న చాల పద్యము లందు (ప్రబంధరత్నాకరమునందు) లేవు కాబట్టి యిది మూలము కాదు. (ప్రబంధమణిభూషణమునకు) ఇది ప్రబంధసారశిరోమణి మూలమనుటకు బాధకము లున్నవి. ........ ప్రబంధసారశిరోమణికే ప్రబంధసారము అని మారుపేరు."

ఇట్లు 1933వ సంవత్సరమునందు ఆంధ్రవిశ్వకళాపరిషత్ ప్రకటించిన తంజావూరు మహారాజశరభోజీసరస్వతీమహల్ గ్రంథాలయాంధ్ర గ్రంథవివరణపట్టికయందు కలదు. మఱి, సరస్వతీమహలు గ్రంథాలయములోని 190-193 సంఖ్యల తాళపత్రగ్రంథములు నాల్గింటి తాళపత్రముఖపత్రికలందును ప్రబంధసారము అని కలదు. కాని నాలుగు ప్రతులును ప్రబంధసారశిరోమణిప్రతులు కావు. ఒక రెండు 190, 191 సంఖ్యల తాళపత్రగ్రంథములు ప్రబంధసారశిరోమణిప్రతులు. మఱొక రెండు 192, 193 సంఖ్యల తాళపత్రగ్రంథములు ప్రబంధసారప్రతులు. ప్రబంధసారము ప్రబంధసారశిరోమణికి మారుపేరు కాదు. అక్కడక్కడ సమానపద్యములున్నను అదొక గ్రంథము. ఇదొక గ్రంథము. ఇంతకు కవిగారు ప్రచురించిన ప్రబంధమణిభూషణమునకు ఆధారము ప్రబంధసారశిరోమణి. అయినను ప్రబంధరత్నాకరములోని పద్యములును ప్రబంధమణిభూషణమునందు కలవు. అందును ఇందును లేని అనేక పద్యములు ప్రబంధమణిభూషణమునందు చేరినవి. ప్రబంధసారశిరోమణిలోని అనేక పద్యములు ప్రబంధమణిభూషణమునందు జారినవి. అవి 160 పైగా, ఇవి 80 పైగా కలవు.

ప్రబంధమణిభూషణమునందు కుమారసంభవపద్యములు పదునెన్మిది గలవు. ఒక పద్యము (182) కుమారసంభవమునందు లేదు. ఎనిమిది పద్యములు (399, 666, 667, 668, 673, 674, 781) ప్రబంధసారశిరోమణియందు లేవు. ప్రబంధ రత్నాకరమునందును లేవు. ప్రబంధసారశిరోమణియందు ఉన్న తొమ్మిదిపద్యము లందును ఒక పద్యము (68) లక్ష్మీపరిణయములోనిదని ఒక ప్రబంధసారశిరోమణి ప్రతియందు కలదు. (R. 191.) ప్రతి మొత్తము మీద ఒక్కచోట పద్యములకు ఆకరములైన గ్రంథముల పేరులు తొమ్మిది కలవు. 1. కవికర్ణరసాయనము. 2. సుభద్రాకల్యాణము (విజయవిలాసము) 3. కళాపూర్ణోదయము. 4. కవిమనో హరము. 5. గిరిజాపరిణయము. 6. హరివంశము. 7. పూర్ణచంద్రోదయము. 8. లక్ష్మీపరిణయము. 9. వీరభద్రవిజయము. ఇందు లక్ష్మీపరిణయములోనిదని కల పద్యము కుమారసంభవమునందు కలదు. ఇట్లు ప్రబంధరత్నావళియందు చిమ్మ పూడి అమరేశ్వరుని విక్రమసేనములోనిదని కల పద్యము (24), మడికి సింగన సకలనీతిసమ్మతమునందు ముద్రామాత్యమునుండి ఉదాహరించిన పద్యము (785) కుమారసంభవమునందు కలవు. అందుకు హేతువు సంకలనగ్రంథకర్తలు భ్రమ ప్రమాదములకు లోనగుట సంభవమే కాని, సంకలనగ్రంథములలోని పద్యములు కుమారసంభవమునందు కుదురుకొనుటకూడ అసంభవము కాదు. అంతేకాదు, ప్రబంధమణిభూషణమునందు ప్రకటించిన ఎనిమిది కుమారసంభవపద్యములు ప్రబంధ మణిభూషణమునకు మూలమైన ప్రబంధసారశిరోమణియందు లేవు. కనుక ప్రబంధ సారశిరోమణియందు కల పద్యములు కుమారసంభవమునందు ఆగముప్రాయములు కావచ్చును.

1910వ సంవత్సరమునందలి మానవల్లి రామకృష్ణకవిగారి మొదటి ప్రతి పాఠనమిది[11]:

"ఆంధ్రభాషలో నాకు లభించినంతవట్టు పరికింప సంగ్రహ (సంకలన) కృతికర్తల మడికి సింగనయే ప్రథముఁడు. అతఁడు ప్రాచీన పంచతంత్రి, ప్రాచీనకామందకము, ముద్రామాత్యము, నీతిభూషణము, బద్దెనసీతి, కుమారసంభవము, భారతము, మంచిభట్టు సస్యశాస్త్రము, మొదలగు గ్రంథములలోని రాజనీతిపద్యము లన్నియు నేటి సకలనీతి సమ్మతమను గ్రంథమునఁ గూర్చెను."

యందు కుమారసంభవము కలదు. కుమారసంభవపద్యములు రెండు కలి పిడికి సింగన సకలనీతిసమ్మతమును ప్రథమతః మానవల్లి రామకృష్ణకవిగారే 1923వ సంవత్సరమునందు ప్రకటించినది. దానికి ఆధారము కవిగారు, ("నైజామురాజ్యమున వనపర్తి సంస్థానమున నున్న కాలమున సమీపమున నుండు వనురచింత యను రాజాస్థానమునకుఁ గార్యాంతరమునఁ బోయియున్న కాలమునఁ దత్సంస్థానాధీశ్వరు లగు శ్రీమంతు రాజా ముక్కర సీతారామభూపాలబహద్దరువారు" ఒసగిన "బద్దెన నీతిశాస్త్రముక్తావళియు సకలనీతిసమ్మతమును లిఖింపఁబడియుండు కాగితపు సంపుటము" అని వారి వచనము[12]. అది కవిగారు, ఆంధ్రకవుల చరిత్రను సంస్కరించుటకు 1916వ సంవత్సరమునందు కందుకూరి వీరేశలింగముగారికి ఒసగిన జాబితేను[13] గాని, శతకకవుల చరిత్రను సంకలించుటకు 1924వ సంవత్సరమునకు ముందు వంగూరి సుబ్బారావుగారికి "దాని ప్రతి వ్రాయించి ........ కొన్ని దినములు ఎరువిచ్చి"నట్లు నిదర్శనము కలదు[14]. అనగా 1923వ సంవత్సరమునందు సకలనీతిసమ్మతమును ప్రకటించుటకు పూర్వము, కవిగారియొద్ద సకలనీతిసమ్మతము కాకితపుప్రతులు రెండు కలవని అవగాహనమగును. అందు ఒక కాగితపుప్రతి 1970వ సంవత్సరమునందు హైదరాబాదు ప్రాచ్యలిఖితగ్రంథాలయమునందు భద్రపఱుపఁబడినది[15]. అది 1901వ సంవత్సరము నాటిదని అందలి లేఖనకాలములనుబట్టి పి.యస్.ఆర్. అప్పారావుగారి అభిప్రాయము[16]. కాని, ఆ కాగితపుప్రతియందు రాజలాంఛనములు కానరావు. అంతేకాదు. కాగితములును అంత ప్రాచీనముగ లేవు. ఉపరి, అప్పటి లేఖనపద్ధతికి అతిముఖ్యలక్షణమైన వలపలగిలక సంప్రదాయము అక్కడక్కడ వినా అంతటను లేదు. కనుక 1923వ సంవత్సరము నాటిది కావలయును. అందు బద్దెన నీతిపద్యములు 150 తోపాటు సకలనీతిసమ్మతము పద్యగద్యములు 1122 కలవు. కనుక సకలనీతిసమ్మతము పద్యగద్యములు 1122-150 = 972. నాలుగు వచనములకు సంఖ్యానిర్దేశము లేదు. కనుక సకలనీతిసమ్మతము కాగితపుప్రతిలోని మొత్తము పద్యగద్యములు 972 + 4 = 976. ముద్రితగ్రంథములోని పద్యగద్యములు 993. అందు కాగితపుప్రతిలోని రెండు పద్యములు చేరలేదు[17]. అవి చేర్చిన, సకలనీతిసమ్మతము ముద్రితగ్రంథములోని మొత్తము పద్యగద్యములు 993 + 2 = 995. కాగితపుప్రతిలో లేకుండ ముద్రితగ్రంథమునందు చేరిన పద్యగద్యములు 995-976 = 19. కాగితపుప్రతిలో లేకుండ ముద్రితగ్రంథమునందు చేరిన వచనములు 31-25 = 6. కాగితపుప్రతిలో లేకుండ ముద్రితగ్రంథమునందు చేరిన పద్యములు 19-6 = 13. వీని చేర్పు కవిగారి కర

కౌశలము. కవిగారు ప్రకటించిన వల్లభామాత్యుని క్రీడాభిరామము గురించి "మా కరకౌశల మెక్కడను జూపఁబడలేదని" కవిగారి హెచ్చరిక[18]. అనగా కవిగారు ప్రకటించిన అన్యగ్రంథములందు కవిగారి కరకౌశలము కలదని అవగాహనమగును. అది కవిగారు వ్రాయించిన కాగితపుప్రతియందును అవకాశము.

కాగితపుప్రతియందు "ఆయతమతి" అను 338వ పద్యమునకు, "ఘనమెలఁగి" అను 784వ పద్యమునకు ముందు "కుమారసంభవము" అని కలదు. సకలనీతి సమ్మతమునందు మూడు ఆశ్వాసములు కలవు. కృత్యాద్యవస్థ కల ప్రథమాశ్వాసము ప్రారంభము వినా, ద్వితీయాద్యాశ్వాసముల ప్రారంభము ఒకేవిధముగ ఉండుట సర్వాంధ్రగ్రంథసాధారణపద్ధతి. అందుకు సకలనీతిసమ్మతము భిన్నము. ద్వితీయా శ్వాసమునందు ఆశ్వాసాదిపద్యమునకు అనంతరము "దేవా చిత్తంబున నవధరింపుము" అను వచనము కలదు. తదుపరి గ్రంథవిషయము కలదు. తృతీయాశ్వాసము నందును ఇట్లుండవలయును. కాని లేదు. "దేవా చిత్తంబున నవధరింపుము" అను వచనమునకు అనంతరము, గ్రంథవిషయమునకు ఉపోద్ఘాతప్రాయముగ ఒక పద్యము కలదు. తదుపరి "తత్ప్రకారం బెట్టిదనిన" అను వచనము, అనంతరము ఉపోద్ఘాతప్రాయమైన పద్యమునకు వివరణముగ గ్రంథవిషయము కలదు. ఉపో ద్ఘాతప్రాయమైన పద్యము కుమారసంభవపద్యము. ఇది మడికి సింగన రచనా ప్రణాళిక అయిన, మరి "ఆయతమతి" అను పద్యము కూడ సకలనీతిసమ్మతము నందు ప్రథమాశ్వాసమునందు గాక, ద్వితీయాశ్వాసమునందు సామదానభేదమాయో పేంద్రజాలోపాయములకు ఉపోద్ఘాతప్రాయముగ ఉండును. అంతేకాదు. "తత్ప్ర కారం బెట్టిదనిన" అను వచనము కూడ అచట ఉండును. కాని అట్లు లేదు. ఉపరి, తృతీయాశ్వాసమునందు "తత్ప్రకారం బెట్టిదనిన" అను వచనమునకు కాగి తపుప్రతియందు సంఖ్యానిర్దేశము లేదు. కనుక సకలనీతిసమ్మతములోని కుమార సంభవపద్యములు అనేకకల్పితములు కావచ్చును.

కుమారసంభవము [illegible] వ్రాతప్రతి, ముద్రితప్రతి. మానవల్లి రామకృష్ణకవిగారు 1909వ సంవత్సరమునందు ప్రథమభాగమును ప్రక టించినపుడు తదాధారములైన తాళపత్రగ్రంథముల సంగతి తెలుపలేదు. అనుబంధము నందు మాత్రము "నా ప్రతులలో" అనుమాట అప్రయత్నముగ కలదు. అయినా వారి యొద్ద అనేకప్రతులు కలవని అనిపించును. తంజావూరు సరస్వతీమహాలు గ్రంథా లయమునందు కుమారసంభవము తాళపత్రగ్రంథము ఒకటి మాత్రమే ఉండెను

అనంతరము[19], 1914వ సంవత్సరమునందు ద్వితీయభాగమును ప్రకటించినపుడు మానవల్లి రామకృష్ణకవిగారు తెలిపిన విషయమిది[20]:

"కుమారసంభవప్రతులలో నొకటి నాకు నైజాము రాజ్యమునఁ బ్రాచీనశాసనశోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశముననే లభించెను. తక్కినవి రెండును శుద్ధద్రవిడదేశముననే యగపడియె."

ఇందు కవిగారికి లభించిన కుమారసంభవప్రతులు మూడని ఇదమిత్థముగ కలదు. అంతేకాదు. అవి తమిళ, కన్నడదేశములందు మాత్రమే లభించినవని స్పష్టముగ కలదు. తెలుగు దేశమునందు మాత్రము తెలుగుకావ్యము కుమారసంభవము ప్రతి వెలుగు ముఖము చూడలేదు. తమిళ, కన్నడదేశములందు లభించిన మూడు ప్రతులును మూడవ కంటికి అగపడలేదు!

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయమిది[21]:

"ద్రవిడ కర్ణాటదేశములందు మూఁడు ప్రతులు దొరికినను నన్నిలోఁ నెక్కువ గ్రంథపాతము లుండుట వింతగా నున్నది. ఆ మూఁడుప్రతులు నొక్క మాతృకకే పుత్త్రికలా యేమి? కాకున్నచో నవి పాఠభేదములు లేకయు సమానగ్రంథపాతములు గలిగియుండుట వింతగదా? పట్టికలో ముఖ్యపాఠభేదములని వారు చూపినవి ప్రాయికముగా ముద్రణ సందర్భానుగుణముగాఁ జేయఁబడిన సంస్కారములకు ప్రాఁతప్రతిలో నున్న తప్పుపాఠములుగా గోచరించుచున్నవి. కుమారసంభవప్రతులయొక్కయుఁ బాఠములయొక్కయు రహస్యము లింకను బయల్పడవలసియేయున్నవి. కాని తంజాపురపు సరస్వతీ పుస్తకభాండాగారమునఁ దాటియాకులపై వ్రాయఁబడిన కుమారసంభవపుఁ బ్రతి యున్నది. అక్కడఁ దక్క నింతవఱకుఁ బ్రత్యంతర మెక్కడను మనకుఁ గనరాదు. వినరాదు."

జయంతి రామయ్యపంతులుగారి అభిప్రాయమిది[22]:

"తమకు మూఁడుప్రతులు దొరికినట్లు వ్రాసిరిగాని యేయే గ్రామము లందేయే గృహస్థులవలన నేయే ప్రతులు లభించినవో తెలుపరైరి. ఆ ప్రతులు కావలసినవారు చూచుటకవకాశము కలుగునట్లు

రాజకీయపుస్తకభాండాగారమునందుఁ గాని, యాంధ్రసాహిత్యపరి
షత్పుస్తకభాండాగారమునందుఁ గాని వానిని బోలు మఱియొక
పుస్తకాలయమునందుఁగాని యుంచవలసియుండెను. అట్లు చేయ
లేదు. లోకమంతకుఁ దెలిసిన తాటియాకు ప్రతి యొకటి గలదు.
అది తంజావూరు మహారాజా సర్ఫోజి సరస్వతీమహాలులో నున్నది.
దీనికిఁ బ్రతి యొకటి రామకృష్ణకవిగారు వ్రాయించుకొన్నారనుట
నిశ్చయము. అట్టిచో రామకృష్ణకవిగారీ ప్రతిని స్మరింపకపోవుటకుఁ
గారణ మేమున్నదో తెలియదు. తంజావూరు పేరైనను రామకృష్ణ
కవిగారు తలపెట్టలేదు. తంజావూరు ప్రతికిని రామకృష్ణకవిగారి ప్రతి
కిని పాఠభేదములు పలుతావుల గనఁబడుచున్నవి. ........ ఈ పాఠాం
తరముల నితరప్రతులనుండి తీసికొనిరనుట కట్టి ప్రతులున్నను
కొన్నను నే ప్రతిలో నే పాఠమున్నదో కవిగారు సూచింపలేదు.
మనకు వలెనే కవిగారికిని తంజావూరు ప్రతియొక్కటి మాత్రమే
లభించియుండునని యూహించుట కొక హేతువు కనఁబడుచున్నది.
........ రామకృష్ణకవిగారికి (తంజావూరి ప్రతిలో) ........ లోపిం
చిన భాగములు దొరకలేదు. వేఱు వేఱు ప్రదేశములందు దొరకిన
మూఁడు ప్రతులలోను నొక్కచోటనే లోపము లుండుట చిత్రము."

నడకుదుటి వీరరాజుపంతులు గారి అభిప్రాయమిది[23]:

"బ్ర.శ్రీ. రామకృష్ణకవిగారు గ్రంథపీఠికయందు తమకు
కుమారసంభవము ప్రతులు మూఁడు లభించియున్నవని వ్రాసినారు.
తంజావూరి వ్రాఁతప్రతిలో లుప్తములైయున్న భాగములే ముద్రిత
పుస్తకమునందును గానరాక, ఆయాస్థలములఁ జుక్కలు పెట్టఁబడి
యున్నవి. భిన్నదేశములందు పుట్టిన ప్రతులు మూఁటియందును
ఒక్కచోటనే పాఠములు పోయియుండుట యెల్లవారికి నాశ్చర్యముఁ
గొలుపకమానదు. కవిగారు లోకమునకుఁ గల యీ సందేహాశ్చర్యము
లను తీర్పవలసియున్నారు. రామకృష్ణకవిగారియొద్దనున్న ప్రతులు
మూఁడును ఏకమాతృకకే పుత్త్రికలేమో యని యనుకొనుటకు వా
రచ్చటచ్చటఁ జూపిన 'పాఠభేదములును', వారిచ్చిన 'ముఖ్యపాఠ

భేదములు’ అను శీర్షికగల యనుబంధపత్రమును, ఒండు రెండు చోట్లఁగల లుప్తభాగపూరణములును- వలనుపడనీయకున్నవి.”

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి అభిప్రాయమిది[24] :

“ద్వితీయసంపుటాంతమున ముఖ్యపాఠభేదములను శీర్షిక క్రిందఁ జేర్చిన పాఠములు తంజావూరి ప్రతిలోని పాఠములతో సరిగా నున్నవి ........ రెండవసంపుటములోని పాఠభేదములు ఒకటి రెండు దక్క మిగిలిన వన్నియుఁ దంజావూరి ప్రతిలోని పాఠములతో సరిగానున్నవి ........ ముద్రితప్రధానపాఠము లితరములగు ప్రతుల లోని వని యూహింపవలయునుగాని యట్లనుకొనుటకు వీలులేని విషమసందర్భమొకటి కనఁబడుచున్నది. తంజావూరి ప్రతిలోని తాటి యాకులు చినిఁగిపోవుటచేఁ గలిగిన లుప్తభాగములు ముద్రితపుఁ బ్రతిలోఁ గూడ లుప్తములుగానే యున్నవి ........ పయి పద్యములు తంజావూరి ప్రతినుండి గ్రహింపఁబడినవని చెప్పుటకుఁ దగిన యత్యంత సాదృశ్యము గలదు. అది కాదేని ముద్రితప్రతికి మూలాధారములని చెప్పఁబడు ప్రతులకును, తంజావూరి ప్రతికిని మాతృకాపుత్రికా భావమో, లేక యేకమాతృకత్వమో యుండితీరును. లేకున్న నన్ని ప్రతులలో నొకే యక్షరము దగ్గరనే లోపము సంభవించునా? ఇంత సాదృశ్యము గల ప్రతులఁజూచి పరిష్కరించినపుడు తంజావూరి ప్రతి పాఠములకంటె భిన్నములగు పద్యభాగము లెట్లువచ్చినవో దురవ గాహము. ఏదియెట్లున్నను మొత్తముమీఁద దంజావూరి ప్రతియే సర్వమునకు శరణమగుట తప్ప వేఱుగతి గనఁబడదు. పరిశీలింపఁగా ముద్రితభాగములకంటె భిన్నములగు ముఖ్యపాఠభేదములనని తంజా వూరిప్రతినుసరించియున్నవి. దానినే యొకరిపాఠమునకు నితర గ్రంథములు మూలములు గావలయును. తంజావూరిప్రతిలో నుంత యైనను భేదము లేకుండఁగనున్న పై (లుప్త) భాగములు చూడగా తంజావూరి ప్రతినుండియే మూలము గ్రహింపఁబడినట్లున్నది. ఈ సందర్భమెట్లు సంగతమగునో?”

ఇట్లు 1918వ సంవత్సరమునందు ప్రభాకరశాస్త్రిగారు, 1924వ సంవత్సరము నందు రామయ్యపంతులుగారు, 1931వ సంవత్సరమునందు వీరరాజుపంతులుగారు,

1937వ సంవత్సరమునందు లక్ష్మీపతిశాస్త్రిగారు ఎట్టి సందేహములు తెలిపినను, ఏమి ఆశ్చర్యములను ప్రకటించినను 1957వ సంవత్సరము వఱకు సజీవులైన మానవల్లి రామకృష్ణకవిగారు సాహిత్యజగత్తునకు కలిగిన సందేహాశ్చర్యములను తొలగింపలేదు. కారణము దురవగాహము. కవిగారియొద్ద మూడుప్రతులు కలవనుట కల్ల. కవిగారి ముద్రితగ్రంథమునకు, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయము లోని తాళపత్రగ్రంథము మూలమనుటకు సాధకములు కలవు. బాధకములును కలవు. లుప్తభాగములనుబట్టి, ముఖ్యపాఠభేదములనుబట్టి మూలమనిన- మొదటిపాఠములకు మూలము సంగతము కాదు. మొదటిపాఠములనుబట్టి మూలము కాదనిన- లుప్త భాగములకు, ముఖ్యపాఠభేదములకు భిన్నమూలము సంగతము కాదు. ఇట్లు ఈ సందర్భమెట్లును సంగతము కాదు. అనగా తంజావూరు సరస్వతీమహాలు గ్రంథా లయములోని కుమారసంభవము తాళపత్రగ్రంథమునందు ఏదో తంత్రము కలదని అవగాహనమగును.

తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని కుమారసంభవము తాళ పత్రగ్రంథము గుఱించి శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారు అందిచ్చిన సమాచారమిది[25]:

> "(తంజావూరి ప్రతియందు) నూటయిరువదియేడు తాటియాకు లున్నవి. అక్కడక్కడఁ గొంచెము శిథిలమయియున్నను మొత్తము మీఁద మంచిస్థితిలోనే యున్నది. అందాఱవయాశ్వాసము చివర "శ్రీమద్రాజాధిరాజమహారాజసహజిరాజభూపాలకసార్వభౌమస్య విజ యోస్తు; యిష్టార్థాస్సంతు."- "భవానీశంకరకృపయా ఆయుష్యభి వృద్ధిరస్తు" అనియు, అష్టమాశ్వాసము చివర "శ్రీమద్రాజాధిరాజ సహజిరాజభూపాలకసార్వభౌమస్యయిష్టార్థాః (ర్థాః) భవానీశంకర కృపయా సఫలాః సంతు." "ఉమామహేశ్వరౌ రక్షతు." "శివాయ నమః" అనియు వ్రాయఁబడియున్నది. అది ప్రతి వ్రాయునప్పుడు వ్రాసియుండును. దీనినిబట్టి యా ప్రతి సహజీకాలమున వ్రాయఁబడి నట్లూహింపవలసియున్నది: సహజీ కొంచెమించుమించుగా నిప్పటికి నూటయేఁబది సంవత్సరముల ప్రాంతమువాఁడని చరిత్రప్రసిద్ధి. అందలి యక్షరముల పోలికయుఁ దత్కాలమునే సూచించుచున్నవి. ఒకవేళ, ఆ ప్రతి వ్రాసినవాఁడు విచారణ లేకుండఁగ దాని మాతృకలోనిది గ్రహించెనేమోయని సంశయముగలిగినను ఆ ప్రతికి మాతృకయైన

నా కాలమున వ్రాయఁబడియుండుననుటకు సందేహపడనక్కఱలేదు."

ఇందు శహాజీకాలము పదునెన్మిదవశతాబ్ది ఉత్తరార్ధమని కలదు. (1937-150 = 1787) అక్షరముల పోలిక ఆకాలమును సూచించినచో తంజావూరిప్రతి లేఖనకాలము పదునెన్మిదవశతాబ్ది ఉత్తరార్ధమగును. కాని శహాజీకాలము పదునేడవ శతాబ్ది ఉత్తరార్ధము[26]. (1684-1710.) అక్షరముల పోలిక శతాబ్ది పూర్వమును సూచించిన, శతాబ్ది పరమును సూచించును. అంతేకాదు, అర్వాచీనలిపి కాలనిశ్చాయకము కాదు. ఉపరి, కుమారసంభవము తాళపత్రగ్రంథములోని లిపి, శహాజీకాలము నాటి తాళపత్రగ్రంథములలోని లిపి కంటె నవీనముగ కలదు. కుమారసంభవము తాళపత్రగ్రంథము అక్కడక్కడ శిథిలమైనను, క్రిమికీటకదష్టమైనను, పరిశీలకస్పృష్టమైనను ఇప్పటికిని అంత ప్రాచీనముగ లేదు: తాటాకు పెళపెళక్కలేదు. పట్టుకొన్న విరుగుటలేదు. ముట్టుకొన్న ముక్కలగుట లేదు, వల్లభామాత్యుని క్రీడాభిరామము వలె. పసుపురంగు కగ్గిపోలేదు. ప్రథమాశ్వాసము చివఱ "మంగళ మహాశ్రీశ్రీశ్రీ జేయస్ సర్వత్ర విజయీభవతు" అని, ద్వితీయాశ్వాసము చివఱ "మంగళాని భవన్తు" అని, చతుర్థాశ్వాసము చివఱ "మంగళమహాశ్రీశ్రీశ్రీం జేయను- శ్రీరామా-" అని, పంచమాశ్వాసము చివఱ "మంగళమహాశ్రీశ్రీశ్రీం జేయున్" అని, షష్ఠాశ్వాసము చివఱ "శ్రీమద్రాజాధిరాజ ........ అని, సప్తమాశ్వాసము చివఱ "మంగ్గలమహాశ్రీశ్రీశ్రీశ్రీశ్రీజేయున్- శ్రీరామ" అని, అష్టమాశ్వాసము చివఱ "శ్రీమద్రాజాధిరాజ........" అని, నవమాశ్వాసము చివఱ "మంగ్గళమహాశ్రీశ్రీశ్రీంజేయున్- భవానీశంక్కరోరక్షతు" అని, దశమాశ్వాసము చివఱ "మంగళమహాశ్రీశ్రీశ్రీశ్రీశ్రీంజేయును. కరకృతమపరాధం క్షంతు మహాజాంతి సంతః" అని, ఏకాదశాశ్వాసము చివఱ "మంగళమహాశ్రీం జేయున్" అని, ఏకాదశద్వాదశాశ్వాసముల నడుమ రెండుప్రక్కల ఏమియు లేకుండ ఒక తాటియాకు మీద నడుమ "శ్రీరామచంద్రాయ నమః" అని కలదు. "కరకృతమపరాధం క్షంతు మహాజాంతి సంతః" అను పంక్తినిబట్టి కుమారసంభవతాళపత్రప్రతిలేఖకుడు సంస్కృతభాషాపరిజ్ఞాత అనిపించును.

ఇక తాళపత్రగ్రంథములందు లేఖకుని పేరు, లేఖనకాలము- తిథివారనక్షత్ర సంవత్సరములు ఉండుట సాధారణపద్ధతి. అట్టిది కుమారసంభవము తాళపత్ర గ్రంథమునందు పంచమాశ్వాసము చివఱ వినా, ప్రతి-ఆశ్వాసము చివఱను కావలసినంత స్థలమున్నను లేఖకుని పేరు, లేఖనకాలము లేదు. అంతేకాదు. తాళపత్ర

గ్రంథములందు ప్రతిలేఖనప్రకరణమును ఉండుట సాధారణపద్ధతి. అట్టిచో కుమార సంభవము తాళపత్రగ్రంథమునందు శహాజీమహారాజునకు "విజయోస్తు. ఆయురభి వృద్ధిరస్తు, ఇష్టార్థాఃసఫలాఃసంతు" అని లేఖకుని ఆశీర్వచనములు కలవుగాని, లేఖ కుని ప్రతిలేఖనప్రకరణము లేదు. ఇదియెల్ల బనాయింపు జాడవలె భాసించునది. తాళపత్రగ్రంథములందు గంటము పెట్టని తాళపత్రములు కట్టలు లభించును. తాటాకు మీద గంటముతో వ్రాయఁగల లేఖకులు నిన్నమొన్నటి వఱకు దేశమునందు కలరు. తాళపత్రగ్రంథమును తయారుచేయుట తలకు మించిన పని కాదు. అంతేకాదు, రాత్రికి రాత్రి తయారుచేసిన హాస్యకారికల తాళపత్రగ్రంథమునకు తాళపత్రపుత్రికలు పుట్టినవి[27]. "ప్రాఁతతాటాకుల యలేఖముల"మీద రాత్రికి రాత్రియే తయారుచేసిన అశ్వశాస్త్రమునకు "వర్ణము"ను వేసి, మఱునాడు సంస్థానాధిపతికి చూపఁబడినది[28]. కనుక కుమారసంభవము తాళపత్రగ్రంథము కూడ తయారుకావచ్చును. అట్లు కావను టకు ఒక సాధనాభాసము కలదు. కాని పరీక్షానికషమున ప్రకాశించునది కాదు। అది ముందు వివరింతును.

మఱి 1914వ సంవత్సరమునందు ప్రకటించిన మానవల్లి రామకృష్ణకవిగారి మఱొక ప్రతిపాదనమిది[29]:

> "నన్నెచోడుఁడు నన్నియభట్టాదులకంటెఁ బ్రాచీనతరుఁడని కుమారసంభవములోని వ్యాకరణచ్ఛందోవిశేషాపూర్వ పదప్రయోగ ములు సహస్రముఖముల ఘోషించుచున్నవి. ఇతఁడు దీర్ఘముమీఁది యరసున్న నెఱసున్నగా వాడుకొనెను ....... తర్గు, మర్గు మొదల లగు రూపములు ప్రాకృతములుగా దీనిలోఁ బ్రాసస్థానములందే ప్రయోగింపఁబడెను ....... నన్నెచోడుని క్రౌంచపదమున యతి విచిత్రముగానున్నది ....... ఇది నన్నెచోడుని ప్రాచీనతకు గొప్ప కారణము."

ఇవి "గ్రంథము పురాతనమైనదని చూపుటకుఁ జాల్వ" అన్నదియు కాదని కందుకూరి వీరేశలింగముగారి వివరణము[30]. "నన్నెచోడుని ప్రాచీనతకు కారణ ములుగాఁ జూపిన విషయము" అని శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారి నిరాకరణము[31], "ఆ యీ విశేషములు నన్నయభట్టుకంటె నర్వాచీనులగు వారియందుఁ గన్పట్టు చున్నవి." అని నిడుదవోలు వేంకటరావుగారి నిరూపణము.[32] కనుక, "నన్నెచోడుని

కుమారసంభవము" కవితాసాక్ష్యమునుబట్టి "నన్నయభారతము కంటె పూర్వ గ్రంథము" అను పూర్వవాదము ప్రధ్వస్తము. కాని, నన్నెచోడుడు మల్లికార్జున పండితునికి సమకాలికుడు అనుటకు సావకాశము కలిగినది. అంతేకాదు. మల్లికార్జునపండితుడు, పాల్కురికి సోమనాథుడు వలె నన్నెచోడుడు శివకవి అని ప్రచుర ప్రచారము జరిగినది. ఉపరి, ఆంధ్రసాహిత్యచరిత్రమునందు శివకవియుగమున నన్నెచోడునికి ప్రథమస్థానము లభించినది. కుమారసంభవము శివునికి సంబంధించినది అగుటవలన కుమారసంభవకర్త శివకవి అనుటకు వీలు కలదు. కుమారసంభవములోని ఇష్టదేవతాస్తుతియందు శివుని వామాంగమునుండి విష్ణువు, దక్షిణాంగము నుండి బ్రహ్మ జనించి నట్లు కలదుగావున, కుమారసంభవకర్త శివకవి అనుటకు సాధనము కలదు. కుమారసంభవమునందు అంతట కుమారసంభవకృతిభర్త జంగమ మల్లికార్జునునికి, శివునికి అభేదాధ్యవసాయకల్పనము కలదుగావున, కుమారసంభవ కృతికర్త శివకవి అనుటకు బలము కలదు. కాని జంగమమల్లికార్జునునికి శివునితోనే గాక, విష్ణువుతోను, బ్రహ్మతోను అభేదాధ్యవసాయకల్పనము కలదు. ఇది శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు తెలిపినను[33], ఎవ్వరును గమనింపకపోవుట చిత్రము. కుమార సంభవమునందు వీరశైవసంప్రదాయములు కలవని నిడుదవోలు వేంకటరావుగారి నిరూపణము.[34] అది నిజమే. కాని, కుమారసంభవమునందు గురులింగమాభేదముతో పాటు హరిహరాభేదము కలదు.

1. "శ్రీమహిళామహనీయో
   ద్ధామోరస్స్థలుఁడు గీర్తితశ్లోకుఁడు దే
   జోమయుఁడు పుణ్యధనుఁడు మ
   హామునిముఖ్యుండు మల్లికార్జునుఁ డెలమిన్." 1ప.8ఆ.

ఇందు శ్రీమహిళ అనగా లక్ష్మీదేవి వలన మహనీయమైన, ప్రకాశమానమైన వక్షస్స్థలము ప్రధమమగుటః హరిపరము.

2. "శ్రీరామాసంచితవిస్ఫు
   రోరస్స్థలు నిర్మలాత్మయోగసుధాసా
   పారసుధాకరుఁ గనిని
   రేరుహారవి దివ్యమునివరేణ్యు సగర్వ్యున్." 200ప. 9ఆ.

ఇందు శ్రీరామాసంచితోరస్స్థలము విష్ణుపరము. నిర్మలాత్మయోగసుధాసార సుధాకరత్వము శివపరము.

3. "శ్రీరమణీ రమణీయ త
రోరస్థ్సలు నసఘు నసువినోదయవిద్యా
పారగు మునిముఖముకురుద
యారస సంపూర్ణు మల్లికార్జునదేవున్."   367 వ.10ఆ.

ఇందు శ్రీరమణీ రమణీయతరోరస్థ్సలము విష్ణుపరము. మునిముఖముకు రత్వము, దయారససంపూర్ణత్వము హరిహరసమానము.

4. "శ్రీరామాకేళీసీ
రేరుహపరిగళితలలితరేణుప్రకరా
సారాపూరితభూరిత
రోరస్థ్సల మందరాచలోరుప్రస్థున్."   782 వ.12ఆ.

ఇందు లక్ష్మీదేవి లీలాకమలమునుండి విరఁజిమ్మఁబడిన పుప్పొడిరాశిపరంపర నిండిన విశాలమైన వక్షస్థలము విష్ణుపరము. మందరాచలమహాప్రస్థానము హరిహరసమానము.

ఇది వీరశైవసంప్రదాయమునకు విరుద్ధము. అంతేకాదు. మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునకు, పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రకును మహా విరుద్ధము.

"హరిహరు లొక్కఁడె యని పల్కుచుంట
వెరవరి శివరూపు విష్ణురూపనుట
సిద్ధ మన్యోన్యవిరుద్ధంబు, విన న
బద్ధంబు నరకసంప్రాప్తంబు నరిని
షిద్ధంబుఁ గావునఁ జెన్నటిప్రశ్న
విద్ధర వినఁగూడునే ?"

అని వాదప్రకరణమున పాలకుఱికి సోమనాథుని కర్ణపిధానము.

"హరిసరసిజాసనాదులు
సరిగారని చెప్పు వివిధశాస్త్రములెల్లన్
నరు లీశ్వరభక్తులకును
సరియగుదురె జాతిరూపసామాన్యమునన్."

అని భక్తుల మహిమను_మల్లికార్జునపండితుని శాస్త్రార్థము. కుమారసంభవమునందు హరిహరాభేదతత్త్వముతోపాటు త్రిమూర్త్యభేదమును కలదు.

"శ్రీవాణీవరు నఖిలక
ళావిదు నఘరహితు నిహలలా(పే)క్షుఁ ద్రిత
త్త్వావిష్కృతమతి నఖిలకు
భావహు నణిమాదిగుణగణాలంకారున్." 658ప.6ఆ.

ఇందు వాణీవరుడను విశేషణము ప్రథమతః బ్రహ్మకు స్ఫోరకము. ఇట్లు ఆశ్వాసాదిని మాత్రమే కాదు; ఆశ్వాసమధ్యమునందును కలదు. గురులింగజంగమ మల్లికార్జునుని గురించి దంపుడుపాటలు పాడిన శబరకాంతలు "వాణీధరుని" గురించి పాడిరని కలదు.

"వేణుజమౌక్తికములు దొడి
గాణల కింపెసఁగ నెఱుకుఁగన్నెలు ప్రీతిన్
వాణీధరుఁ బాడిరి గీ
ర్వాణాధిపభోగి భువనవంద్యు నవింద్యున్." 706 ప.6ఆ.

ఇందు గురులింగజంగమమల్లికార్జునుడు వాణీధరుడు. 'వాణీధరుడు' అనగా ప్రథమతః బ్రహ్మ ప్రత్యక్షమగును. అధోక్షజశబ్దమునకు పాలకురికి సోమనాథుడు బసవపురాణమునందు చెప్పిన అవాచ్యమైన వ్యుత్పత్త్యర్థమును అరసిన, శివునిపరముగ విష్ణువు అనిపించు పదమును, బ్రహ్మ అనిపించు పదమును వీరశైవకవి ప్రయోగింపఁడని విశదము కాఁగలదు. అంతేకాదు. కుమారసంభవమునందు విష్ణునిరసనముతోపాట్లు, విష్ణుప్రశంసనము, విష్ణువర్ణనమును కలవు. అన్నిటికంటె ఆశ్చర్యము కృష్ణుని ప్రసక్తి కలదు. ఉపరి, కుమారసంభవమునందు కొన్ని "భావములచే శివాద్వైతసిద్ధాంతము సూచింపఁబడిమె ........ వీరశైవదీక్షాప్రశంస యెందును మన కావ్యమునఁ గానరాదు." అని ముందే మానవల్లి రామకృష్ణకవి గారి జాగ్రత్ప్రతిపాదనము[35]. కుమారసంభవము శివకవియుగలక్షణలక్షితము కాదు. కనుక "నన్నెచోడుని కుమారసంభవము" శివకవియుగమునకు చెందిన గ్రంథము కావలసిన ఆవశ్యకము లేదు.

కుమారసంభవము శివకవియుగమునకు చెందిన గ్రంథము కొనినో, తిక్కన యుగమునకు చెందిన గ్రంథము అగునా?- అగునని ప్రథమతః శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారి ప్రతిపాదనము[36]. తదుపరి, అయితీరునని వేదము వేంకటరాయశాస్త్రి (మనుమడు) గారి తీర్మానము[37]. ఎఱ్ఱనయుగము కంటెను అనంతరగ్రంథమని వేదాల తిరువేంగళాచార్యులుగారి అనుమానము[38]. "తిక్కన నన్నెచోడుల యుద్ధ వర్ణనలలో కానవచ్చు పెక్కు అర్థసంవాదములను శబ్దసంవాదములను తిక్కన నన్నెచోడుని గ్రంథమునుండి అపహరించెననుకొనుట అంత విశ్వాసయోగ్యము కాదు. అయిదు పర్వములలో పునరుక్తి లేకుండ పదునెనిమిదిరోజుల కురుపాండవయుద్ధ మును పదునెనిమిదిగంటలు చూడదగిన చలనచిత్రమువలె చిత్రించి ప్రదర్శించిన తిక్కనకు కుమారసంభవమునందలి రెండాశ్వాసముల యుద్ధవర్ణనాభాగమునుండి ఎరవు తెచ్చుకొనవలసినంతటి భాగ్యహీనత యేమి తటస్థించును? మీదుమిక్కిలి నన్నెచోడుని కాలము భావిపరిశోధకుల వలన నికరముగా తేలినపుడు తిక్కన యుద్ధవర్ణనలే కుమారసంభవయుద్ధవర్ణనలకు మాతృకలని తేలునేమో!" అని పింగళి లక్ష్మీకాంతముగారి క్రాంతదర్శనము[39].

కుమారసంభవమునందు ప్రాతవడ్డ మాటలు కలవుగావున, ప్రాచీనము గ్రంథమను భ్రాంతి కలుగుట సహజము. కాని, ప్రాతవడ్డమాటలు తమిళకర్ణాటాంధ్ర కవుల ప్రయోగములే. కుమారసంభవము ప్రథమభాగములోని రాతఱిల్లి(98) విగుర్వించి(189) పందల (212) కండవడము(415) ఓజపిడి(496) చిట్టము(597) కొలవేళలు(618) కాఁదపూవులు(701) వెంచ(717) కండరించు(943) గట్టివాలు (961) అను పదములకు, ద్వితీయభాగములోని దొరయు(12) ఒప్పము(56) చప్పరించుచు(101) వెఱ్ఱు(105) కట్టాయము(177) ముడి(212) తొంగలిపట్టెడు(224) గెడగొని(271) తుంతుర్వని(271) మలరు(307) నెరవు(344) అచ్చరువు(436) కలితనము(536) కతికండలు(606) కడితల(610) పేర్చు(612) చేతులుపీచుట(673) మార్బలము(690) గతి(692) అత్తల(715) ఖరదండ(760) మూపలించి(802) కునిసియాడ(882) అగుర్వగ(972) అను పదములకు తమిళ,కన్నడరవిప్రయోగములు కవిగారి అనుబంధ,లఘుటీకలందు కలవు. అంతేకాదు, ప్రథమభాగములోని అహోవక(79) కంపు(252) ఉఱరు(259) రేయెండ(259) ఉప్పయనము(313) మంచితెచ్చి[312] అరము[419] కాపువచ్చు[502] పక్కగొన[508] ఒత్తలించు[520] వన్నువ[597] కలపికొని[601] లగ్గవెగ్గిల్లి[611] వాసించి[624]

పొటించి[627] నేతల[638] పేరువెల్లంకి[692] తొప్ప[741] పొబగుడు[848] అన్నింతియ[869] కొఱడు[880] అను పదములకు, ద్వితీయభాగములోని దన్నె టెంగి[4] తావగొనక[19] సన్నలువాలు[101] వట్టించిరా[120] ఆండురు[151] కాన్పు[164] ముఱ్ఱటలు[251] పొలి(తి[263] చల్లు(దోరు[277] సావి[286] బేలు[287] విడి[294] డిగ్గ(దావి[406] మన్నాస[608] నెత్తురుపొత్తు[700] అను పదములకు కవిగారి అనుబంధ, లఘుటీకలందు తెలుగు కవిప్రయోగములు కలవు. కవిగారి అనుబంధ, లఘుటీకలందు లేని పదములకును పెక్కింటికి తమిళ, కన్నడ కవిప్రయోగములు ఉండును. కొన్నింటికి తెలుగు కవిప్రయోగములు కలవు. అనగా కుమారసంభవములోని ప్రాతవడ్డ మాటలు తమిళకర్ణాటాంధ్రకవిప్రయోగము లకు అనుసరణములని అవగాహనమగును. కనుక ప్రాతవడ్డ మాటలనుబట్టి కుమార సంభవము ప్రాచీనగ్రంథము కావలసిన ఆవశ్యకము లేదు. అంతేకాదు. ప్రాతవడ్డ మాటలను అర్వాచీనకవి ప్రయోగింపవచ్చునుగాని, క్రొత్తవైన మాటలను ప్రాచీన కవి ప్రయోగించుట అసంభవము. క్రొత్తవైన పదములను "నన్నెచోడుని కుమార సంభవమునందు కలవు. అవి పరిశీలనార్హములు.

1. "పోర( బాకు దాల్చి నీరుగొన్నటు ప్రతి
బలము నెల్ల( బాయపడ(గ( దోలి
గొడుగుక్రింది రూపు( బొడిచి జయంబు నీ
కిత్తు నధిప నన్ను నింత నమ్ము." 607ప.11ఆ.

ఇది కుమారసంభవయుద్ధవర్ణనములోని పద్యము. ఇందలి బాకుశబ్దము గుఱించి వేదము వేంకటరాయశాస్త్రిగారి వివరణమిది[40]:

"-ఈ గాకు శబ్దమెట్టి దేశ్యమోగాని కవిత్రయమువారుగాని శివకవులుగాని ప్రయోగించినట్లు కానరాదు. పరిశోధింపవలెను. కాని యిది బాఁకుశబ్దమే కాదు, ఇచ్చట పాఠాంతరమున్నది అని కొందఱ-భిప్రాయపడుటకు అవకాశమున్నది. ఈ పద్యమును ముద్రించునెడ దాఁకునప మందు అర్థబిందువును ముద్రించినారుగాన 'బాకు' శబ్దము కాదని వారి యభిప్రాయము. అట్లైనచో 'పోర' తర్వాత 'దాఁకు దాల్చి నీరు గొనుట యేమి? 'పాఁకుదల్చి' అనగా పాఁకును

త్రోసి అని శ్రీప్రభాకరశాస్త్రిగారి సవరణ యని వింటిని. అప్పుడు 'పోర'కు దూరాన్వయమగును. గొడుగుక్రింది రూపును బాఁకుతో పొడుచుట యనిన సంగతమగును. కాని 'నీరుగొన్నటు' అనుచో నుపమకు 'ప్రాకుదల్చి' అని యన్ననే వాక్యసంపూర్తి. పోనిండు. దీనిని వదలివేయుదము: అసలు బాఁకుశబ్దమే తెనుఁగను వారు లేక పోలేదు. ఏది యెట్లున్నను ఇది పదునాల్గవశతాబ్ది యనంతరమే ఆంధ్రవాఙ్మయములో కనఁబడుచున్నది."

ఇట తూమాటి దోణప్పగారి విమర్శనమిది[41]:

"'పోరఁ బాకు దాల్చి' అను పాఠము సరిగా లేదని వేదము వారి వాదము. పాఁకుదల్చి ( = పాకునుత్రోసి) యనుటలో దూరాన్వయదోషమున్నదని 'పోర బాఁకుదాల్చి' అను పాఠమును శాస్త్రి గారు అంగీకరించిరి. "పోరను మృతసంజీవనికారణమున........" అన్న నన్నయ్య ప్రయోగవైఖరిని పరికించినచో చోడకవి పోకడ గడుసరి కూర్పని తేలునేగాని విపరీతమనిపింపదు. ........ శాస్త్రి గారికి సమ్మతమయిన పాఠమునే అంగీకరించి(న) ........ 'నీరు గొన్నటు' అను భాగము నిరర్థకము కాదా? "కాని, నీరుగొన్నటు అనుచో ఉపమకు 'పాకుదల్చి' యన్ననే వాక్యసంపూర్తి" అని శాస్త్రి గారు వ్రాయుట ప్రక్రమభంగము. శాస్త్రిగారి వాదదౌర్బల్యమున కిది చాలు. వారి ఎత్తుగడ ఎగిరిపోయినది. ........ "పోరఁ బాకు దాల్చి నీరుగొన్నటు ........" అనుట కవిహృదయమని నా యూహము."

పయి పద్యమును సరిగా పరిశీలించినను, "వేదము వారి వాదము"ను జాగరూకతతో గమనించినను "పాకుఁ దాల్చి నీరుగొనుట యేమి?" అను ప్రశ్న అర్థమగును. అంతేకాదు. ఆ పాఠమునకు అర్థము లేదని కూడ అర్థమగును. అందుచే "పాఁకుదల్చి" అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణము. కాని పరిష్కృత పాఠము కూడ స్పష్టార్థప్రతిపత్తికము కాదు. ఆ పాఠమును గ్రహించిన "నాచును తొలగించి నీరు గొన్నట్లు ప్రతిబలమును పాయవడగ తోలి, గొడుగుక్రింది రూపును పొడిచి, జయము ఘటింతును" అని పద్యమునకు అర్థము వచ్చును. నాచును తొలగించుటకు, ప్రతిబలమును పాయవడ తోలుటకు సమానధర్మము కలదు.

నీరు గొనుటకు గొడుగుక్రింది రూపును పొడుచుటకు, జయము ఘటించుటకు సమానధర్మము లేదు. సమానధర్మము లేకుండ సాదృశ్యకల్పనము సమగ్రము కాదు. కనుక పరిష్కృతపాఠము సుష్ఠుప్రోక్తము కాదు. అంతేకాదు. "దాల్చి" అను పాఠమును వదలి "ఉదల్చి" అను పాఠమును కల్పించుట అధికప్రయత్నము. ఇక "పాకు దాల్చు నీరు గొన్నటు" అని దొణప్పగారు ఊహించిన పాఠమునుబట్టి పద్యమునకు అర్థము దురవగాహము. అంతేకాదు. "పోరను మృతసంజీవనికారణ మున" అను నన్నయ పద్యమునకు "పోరఁ బాఁకు దాల్చి" అను కుమారసంభవ పద్యమునకు హస్తిమశకాంతరము కలదు. "పోరఁ బాఁకు" అను పాఠమును గ్రహించిన పద్యము దూరాన్వయదోషదూషితము కాకపోదు. "పోర బాకు దాల్చి" అను సాధుపాఠమును గ్రహించిన, "యుద్ధమునందు బాకు ధరించి, నీరుగొన్నటు అనగా మంచినీళ్లు త్రాగినట్లు- అనగా సునాయాసముగ- ప్రతిబలమును పాయవడ తోలి, గొడుగుక్రింది రూపును (సేనాధిపతిని) పొడిచి, జయము ఘటింతును" అని పద్యమునకు అర్థము వచ్చును. మంచినీళ్లుత్రాగుటకు- ప్రతిబలమును పాయవడ తోలుటకు, గొడుగుక్రిందిరూపును పొడుచుటకు, జయము ఘటించుటకును సమాన ధర్మము (సునాయాసత్వము) సంగతము. పద్యము సుబద్ధము. పలుకు నుడికార మును పగటును. అంతేకాదు. స్పష్టార్థప్రతిపత్తి కలుగును. కనుక "వేదము వారి వాదము"నకు ఆపాదించిన "ప్రక్రమభంగము, వాదదౌర్బల్యము, ఎత్తుగడ ఎగిరి పోవుట" దొణప్పగారి విమర్శనమునకు తిరిగి సంక్రమించును.

ఒక పద్యము యొక్క అర్థమును గ్రహించుటకు ప్రధానమైన ఆధారము ప్రకరణము. ప్రకరణమును వదలిన ప్రత్యాఖ్యానము నిరాలంబనృత్యము. ప్రకృత పద్యమునకు ప్రకరణము వీరవృత్తిప్రకటనము. అందుకు ముందు వెనుకల పద్యములందు బాణములు(33) కుంతము(34) ఖడ్గము(35) పరిఘ(37) కలవు. తన్మధ్యస్థమైన ప్రకృతపద్యమునందును(36) వీరవృత్తిప్రకటనమునకు ఆవశ్యక మైనది ఆయుధము. అది పాకు కాదు. మఱి బాకు. నిర్వివాదముగ "పొడిచి"అని కలదు। దేనితో పొడుచును?- ఇట "బాకు = చేయీఁటె" అని మానవల్లి రామ కృష్ణకవిగారి లఘుటీక[42]. ఇది కవిహృదయము. కవిగారి లఘుటీకను బట్టి మాత్రమే గాక, పద్యమునుబట్టి, ప్రకరణమునుబట్టి కూడ, కుమారసంభవమునందు బాకు శబ్దము ప్రయుక్తము. అది అన్యదేశ్యము. యుద్ధసంబంధ్యన్యదేశ్యము. దేశము నందు యుద్ధసంబంధము లేకుండ యుద్ధసంబంధ్యన్యదేశ్యము కావ్యప్రవేశము

చేయుట అసంగతము. కనుక, "బాణ"శబ్దప్రయోగమునుబట్టి కుమారసంభవము "తురుష్కుల దండయాత్రలకు అనంతరము"నందలి గ్రంథమను "వేదము వారి వాదము" సమంజసము. ఆంధ్రావనియందు మాత్రమేగాక, దక్షిణాపథము మొత్తము మీద ప్రథమతః మహమ్మదీయుల దండయాత్ర సాగిన కాలము పదమూడవశతాబ్ది ఉత్తరార్ధము[43]. కనుక, కుమారసంభవము రచనాకాలము పదమూడవశతాబ్ది ఉత్తరార్ధము కంటె అనంతరము కావలయును.

2. కుమారసంభవమునందు తరవారి శబ్దమొకటు కలదు. అది సంస్కృతములోని అన్యదేశ్యమని వేదము వేంకటరాయశాస్త్రిగారి అభిప్రాయము[44]. ప్రసిద్ధ సంస్కృతపదమని తూమాటి దొణప్పగారి ప్రత్యభిప్రాయము[45]. తరవారిశబ్దమునకు భట్టబాణుని హర్షచరితమునందు ప్రయోగము కలదని సంస్కృతాంగ్లనిఘంటువు నందు కలదు[46]. అది నిమిత్తముగ "బాణోచ్ఛిష్ట"మని దొణప్పగారి సోల్లుంఠనము[47]. మోనియర్ విలియమ్సు ధర్మమా అని బాణోచ్ఛిష్టము దొరెకినదికాని, బాణహృదయము పట్టువడలేదు. తరవారిశబ్దము శ్రీహర్షుని నైషధీయచరితమునందు పదచ్ఛేదముతోడి అర్థభేదముల ప్రయుక్తము. అది శ్రీనాథుని శృంగారనైషధము నందును అట్లే కలదు. (169ప.5ఆ.) శ్రీహర్షుని ప్రయోగమిది :

"యా సర్వతో మునిరయా ప్యవతిష్ఠమానా
యామోదరై ర్జయతి నైకవిధాకరాయా
ఏతస్య సారితరవారినిధి స్స్వయం సా
యస్యాః ప్రతీతివిషయః పరతో నకోఽపి. 22స్గో.11శ్లో.

ఇందు "సారితరవారినిధిః" అను శ్రీహర్షుని ప్రయోగమునకు "[illegible] వారినిధయః సముద్రా" (సప్తసముద్రములు) అని [illegible], "[illegible] తరవారీవా వేదధార యస్యమున్నానాం నిధిః [illegible]" ([illegible] వెలవు) అని నలపక్షమున నారాయణపండితుని [illegible] వలపరముగా [illegible], [illegible] ఖడ్గసామాన్యవాచిగ వరించినను, [illegible] పండితుడు అర్థము చెప్పుట అరసిన, [illegible] కాదు. భట్టబాణుని హర్ష[illegible] నందు కొంతమునుపు [illegible] 198.) [illegible]

వారి, ఘోరతర + వారి" అను పదచ్ఛేదముల అర్థభేదములు కల "ఘోరతరవారినిధి" అను కుమారసంభవప్రయోగమునకు జన్యజనకభావము కలదు. అంతేకాదు. శ్రీహర్షుని నైషధీయచరితములోని "ఘూరితరవారి" అను పదబంధమును పదచ్ఛేదములతోడి అర్థభేదములతో మాత్రమేగాక; వరుణపక్షమున, ప్రభుపక్షమున సహితము కుమారసంభవమునందు కలదు.

"ఘూరితరివారివారిరు
హారావానంతనాగహారిభూధరల
క్ష్మీరమణశోభితుండై
నీరధివతిఁ బోలె వాహినీవిభుఁ డగుటన్." 585వ.11ఆ.

ఇందు "ఘూరితర + వారి" అని నైషధమునందు వలె వరుణపక్షమున, "ఘూరి + తరవారి" అని నలుని బదులు కుమారస్వామి పక్షమున పదచ్ఛేదములతోడి అర్థభేదములు కలవు. కనుక, హర్షనైషధములోని "ఘూరితరవారినిధిః" అను పదబంధమునకు, కుమారసంభవములోని "ఘోరతరవారి" అను పదబంధమునకు మాత్రమేగాక. "ఘూరితరవారి" అను పదబంధమునకును శబ్దతః, అర్థతః మాత్రమే గాక, సందర్భతః కూడ జన్యజనకభావము కలదు. తెలుగుకావ్యమును చదివి కాశ్మీర దేశసంస్కృతకవి చర్వణము చేయుట కంటె, సంస్కృతకావ్యమును చదివి తెలుగు కవి తెగచప్పరించుట సహజము. అంతేకాదు. కుమారసంభవము పూర్వకవితా చర్వణపుష్కలము. ఉపరి, హర్షనైషధప్రభావము కుమారసంభవస్వభావము. కనుక, "ఘూరితరవారినిధిః" జనకము. "ఘోరతరవారి, ఘూరితరవారి" జన్యములు. అనగా కుమారసంభవము హర్షనైషధమునకు అనంతరగ్రంథము. శ్రీహర్షుని నైషధీయచరితము రచనాకాలము పండ్రెండవశతాబ్ది ఉత్తరార్థము[48]. కుమారసంభవము రచనాకాలము పదమూడవశతాబ్ది ఉత్తరార్థము కంటె అనంతరము కావలయునని పూర్వోక్తము. ఇది తదుపబలకము.

ఇక "తరవారిశబ్దమును ప్రయోగించిన కుమారసంభవపద్యము అల్లాపుద్దీను చక్రవర్తిని గూర్చిన శ్లోకభావమునకు మెఱుఁగై అందుచేత తర్వాతిది కావచ్చును." అని "వేదము వారి వాదము[49]". శ్లోకప్రతిపాదకవిషయము గుణీభూతవ్యంగ్యము. అస్ఫుటము. పద్యప్రతిపాద్యము ........ సభంగశ్లేష, శబ్దచమత్కారము. కావున రెంటికిని పోలిక లేదు." అని దొణప్పగారి ప్రతివాదము[50]. అల్లాపుద్దీను చక్రవర్తిని

గూర్చిన శ్లోకమునందు వ్యంగ్యము కలదని, అస్ఫుటమని సాహిత్యదర్పణమునందు కలదు. గుణీభూతవ్యంగ్యము కలదని తద్వ్యాఖ్యానమునందు కలదు. కుమారసంభవ పద్యమునందును వ్యంగ్యము లేక గుణీభూతవ్యంగ్యము కలదని, అస్ఫుటమని సాహిత్యదర్పణమునందు, తద్వ్యాఖ్యానమునందు ఉండదుకదా! ఉన్నచో ఊహాగానము లేకపోయెడిది. శబ్దశక్తిమూలకధ్వని అని ఒక ధ్వనిప్రభేదము కలదు. అది శ్లేషమూలకము. శ్లేష సభంగము కావచ్చును. అభంగము కావచ్చును. అది శబ్దచమత్కారమే. ఇంతకు, ఆ శ్లోకపద్యములివి :

"సన్ధౌ సర్వస్వహరణం విగ్రహే ప్రాణనిగ్రహః
అల్లావదీననృపతౌ న సన్ధి ర్న చ విగ్రహః"

ఇందు "సంధియందు సర్వస్వహరణము, విగ్రహమునందు ప్రాణనిగ్రహము కనుక అల్లావదీననృపతితో సంధియు లేదు. విగ్రహమును లేదు." అని కలదు.

"ఇలఁ జిత్రము తారకు కర
తల సంగతమైన ఘోరతరవారి నొర
న్నిలుపగుఁ దనుఁ జొర కడరినఁ
దలమునుక యగు న్విరోధితతి కబ్జభవా." 370ప.4ఆ.

ఇందు "తారకుని చేతిలోని ఘోరతరవారిని (ఘోరమైనఖడ్గమును, ఘోరతరమైన నీటిని) చొచ్చిన (శరణుఁజొచ్చిన, మునిగిన) నిలువు (నిరోధము) అగును. చొరక అడరిన తల మునుక అగును." అని కలదు. ఇందు శ్లేష, చమత్కారము కలదు. అది చిత్రకవిత్వము. అందుకు "ఇలఁ జిత్రము" అను ఎత్తుగడ. కనుక శ్లోకమునకు మెఱుఁగై " పద్యము కలదు. అంతేకాదు. "సంధియు లేదు; విగ్రహమును లేదు" అనగా షాడ్గుణ్యములలోని సంధివిగ్రహములు కాక, యానాసనసంశ్రయణద్వైధాదికము కర్తవ్యమని (గుణీభూత) వ్యంగ్యము. "శరణుఁజొచ్చిన నిరోధము అనగా సంధి నిరుపయోగము, అడరిన తలమునుక అనగా ఎదిరించిన ప్రాణాపాయము" అనిన "యానాసనసంశ్రయణద్వైధాదికము కర్తవ్యమని (గుణీభూత) వ్యంగ్యము కాదా? ప్రస్ఫుటము కాక అస్ఫుటము కాదా? కానిచో, దేవతలు

[4]

బ్రహ్మతో మొఱపెట్టుకొననేల? పయి శ్లోకమునకు క్రింది పద్యము ప్రతిచ్ఛాయిన్వి కల్పనప్రాయము. శ్లోకము అసలు చాటువు. ఆమీద విశ్వనాథుని సాహిత్యదర్పణమునందు ఉట్టంకితము. అది కవులకు అంకస్థితార్థపేటి. ఇల్లాయున్ను చరమ కాలము 1318వ సంవత్సరము.[51]. సాహిత్యదర్పణము పరమకాలము 1400వ సంవత్సరము[52]. అనగా పదునాల్గవశతాబ్ది. కుమారసంభవము రచనాకాలము పదమూడవశతాబ్ది ఉత్తరార్ధము కంటె అనంతరము కావలయునని పూర్వోక్తము. అది సోపబలకము. ఇది తత్తదుపబలకము.

3. కుమారసంభవమునందు కైపుశబ్దము బహుధాప్రయుక్తము. అది అర్వాచీనమైన అన్యదేశ్యమని వేదము వేంకటరాయశాస్త్రిగారి పరిగణనము[53]. అతిప్రాచీనమైన శుద్ధదేశ్యమని తూమాటి దొణప్పగారి ప్రతిఘటనము[54]. అంతేకాదు. "ఉద్రేకము, కఠినత, కోపము, ద్వేషము, రోఁత, విజృంభణము, వైమనస్యము అను నర్థముల నన్నెచోడకవికృతిలో ఈ పదము పదునాలుగు తావుల ప్రయుక్తము ........ నన్నెచోడుడు ప్రయోగించిన 'కైపు'ను, మత్తు, మాదకద్రవ్యము అను నర్థములుకలిగి, అరబ్బీభాషాజన్యమగు 'కైపు'ను భిన్నవ్యుత్పత్తికములు. మొదటిది శుద్ధదేశ్యము. ప్రాచీనము. రెండవది అచ్చముగా అన్యదేశ్యము, అర్వాచీనము." అని దొణప్పగారి అన్యథాకరణము[55]. వారే ఒసగిన కైప్పు, కయ్పు, కప్పు, కైపె శబ్దముల తమిళ, మలయాళ, కన్నడ నిఘంటువులలోని అర్థములందు ఉద్రేకము, కోపము, విజృంభణము అను అర్థములు లేవు.[56]. కుమారసంభవములోని పద్యములకు ఉద్రేకము, కోపము, విజృంభణము అను అర్థములు సుసంగతములు కావు. ఉపరి కఠినత, ద్వేషము, రోఁత, వైమనస్యము అను అర్థములు కేవలము అసంగతములు. పదునాలుగు తావుల కాదు, పదునైదు స్థలముల కుమారసంభవమునందు కైపుశబ్దము కలదు.

1. "తన పతిఁ జెట్టలు పలికిన
జనకుంగని కోపవహ్ని సతిదేహము భో
రన మండె భానుగని కెం
పున మండెడు సూర్యకాంతపుత్త్రిక వోలెన్." 178వ.2ఆ.

ఇట "కెంపున మండెడు" అనుచోట "కైఁపున మండెడు" అను పాఠాంతరము కలదు. కాని, సూర్యుని చూచిన సూర్యకాంతపుత్త్రిక ఉద్రేకాదికములఁ బ్రజ్వరిల్లదు. సతిదేహము భోరన మండుటకు, సూర్యకాంతపుత్త్రిక కెంపున మండుటకు

సాదృశ్యకల్పనము సరిపడును. కనుక, "కైపున మండెడు" అను పాఠాంతరము కంటె, "కెంపున మండెడు" అను పాఠమే అర్థవంతము. అంతేకాదు. "కెంపున మండెడు" అనియే కవిగారి పాఠము. (178ప.2ఆ.)

2. "విరహాకాలంబు మరుబాణవితతిఁ గొన్న
గంటు లన్నియుఁ బ్రియుఁ గూడి కైపు మిగిలి
పెనఁగు నెడ నెట్ట విరిసెనా వనిత మేనఁ
గలయ నవనఖదంతవిక్షతము లడరె." 178ప.8ఆ.

ఇందు ప్రేయసీప్రియులు కైపు మిగిలి కౌగిలించుకొనునెడ ప్రేయసి మేన నఖక్షతములు, దంతక్షతములు వెలసెనని కలదు. ఆ కైపు మత్తు కాక మరొకటి కాదుకద! కైపెక్కి కౌగిలించుకొనిరని అర్థము. ఇందలి "కైపు" శబ్దమునకు మత్తు, మైకము, లాహిరి అను సూర్యరాయాంధ్రనిఘంట్వర్థములు సుప్రోక్తములు.

3. "మునుమిడి వైరివాహినుల ముట్టి పడల్పడ ద్రోసి నట్టి కైఁ
పునఁ బయికెత్తు వాహకుల పొంకమణం దల కొంతగోసి ము
న్నొక్కని వడివాలు పందలను గోవుల సూరలు దోలి మార్చు పే
ర్చునఁ బరికెల్లి గాల్గలన జొన్నలు గొన్న ఋణంబు నీఁగుదున్."
612ప.11ఆ.

ఇందు వీరభటుల- కైపున ఎదిరించు రథాశ్వగజసైనికుల పొంకమును అణచివేయు వీరవృత్తిప్రకటనము కలదు. ఆ వీరవృత్తిప్రకటనకు నిమిత్తమైన ఎదిరిసైనికుల- అనగా తారకాసురుని పక్షములోని రాక్షసుల-గట్టి కైపు మహోన్మదము. కనుక, ఇట కైపు అనగా మదము.

4. "అరిబల మంటఁదాఁకిన రయంబున నాత్మబలంబు వీఁగుచోఁ
దెరలఁగనీక వీచిపయిఁ దేకువ వచ్చు విరోధిసేనలన్
మరలఁగఁ దోలుచో నిలిచి మార్కొను వీరులఁ దాఁకి వీఁక జ
ర్జరితముగాఁ బడంబొడిచి చంపక చిత్తము కైఁపు వోవునే."
618ప.11ఆ.

ఇందు విరోధిసేనలను తరిమివేయునెడ ఎదురు నిలిచి ప్రతిఘటించు శత్రు వీరులను చిందఱవందఱగ పొడిచి చంపకుండ, చిత్తము కైపు కోపము వీరవృత్తి ప్రకటనము కలదు. చిత్తము కైపు అనగా చిత్తము యొక్క మదము. "కోపోద్రేక మని భావము" అని సూర్యరాయాంధ్రనిఘంటువునందు కలదు. కోపోద్రేకము కంటె మదోద్రేకము ప్రకరణోచితము. అంతకంటె తీట ఎక్కువ అర్థవంతము. అది మదజన్యము. ఇట "శౌర్యాటోప"మని అనంతరవచనము. (49వచ.) అది తత్పూర్వపద్యము(48ప.) లోని కైపు మదమనుటకు సాధకము.

5. "అంత నొండొంటింగని సూరుండు సూర్యకాంతాచలంబులుం
బోలె సురాసురవీరు లొండొరులంగని కైఁపు మిగిలి మహాఘోర
యుద్ధంబు సేయందొడంగిన." 684వచ.11.ఆ.

ఇందు "కైఁపు మిగులు"ట సురాసురవీరులకు, సూర్యసూర్యకాంతాచలములకు సమానధర్మము. సురాసురవీరుల కైపు మదము. అథవా, ఉద్రేకము. సూర్యుని కైపు మదము కావచ్చును. సూర్యకాంతాచలము కైపు మదము కాదు. మఱి ఉద్రేకాదికమును కాదు. ఇట కైపుశబ్దము ప్రకరణోచితముగ లేదు. పూర్వోదాహృతసూర్యకాంతపుత్త్రికాసందర్భమును పునశ్చరణము చేసిన, "కైఁపుమిగిలి" అను పాఠము కంటె "కెంపుమిగిలి" అను పాఠము అర్థవంతమని స్వయంవేద్యమగును. సూర్య, సూర్యకాంతమణుల సంబంధము కవిసమయప్రసిద్ధము. సురాసురవీరుల కెంపు కోపారుణిమ. సూర్య,సూర్యకాంతాచలముల కెంపు రూపారుణిమ.

6. "బిట్టుఱ నెమ్మెయిం గెలువఁ బెల్కుఱ లేచియ మెట్టి లేచినం
బట్టియు నడ్డనంబుల నపారభుజాబలగర్వమేర్పడన్
గిట్టిన బల్విడిన్ బొడిచి కీటడఁగించియుఁ బేర్చి యార్చుచున్
జెట్టిగ వీరులై దురము సేసిరి కైపున దీఁడి కాటునన్." 717ప.11ఆ.

ఇట "దీఁడికాటునన్" అనుచోట "ఈఁటెకాటునన్" అను పాఠాంతరము కలదు. వారు "ఈఁటెకాటు" అయినను, "దీఁడికాటు" అయినను, కైపున యుద్ధము చేయుట భావము. అనగా కైపెక్కి యుద్ధము చేసిరని అర్థము. కైపెక్కి అనగా మదమెక్కి అని అర్థము. కనుక యుద్ధము కైపు మదము. అథవా ఉన్మాదము. మదోన్మాదమును.

7. "శరహతి బాహుమూలములు చక్కనఁ ద్రెవ్విన మానకాదిసూ
కరముల పోలెఁ గోల్మసఁగి కైపున గొన్ని మదాంధగంధసిం
ధురములు దీవ్రదంతములు దూఱ రయంబున నొత్తి యెత్తి జ
ర్జరితముగా వడిం బొడిచి చంపె మహాజి భయంకరాకృతిన్."
723ప.11ఆ.

ఇందు బాణము దెబ్బకు శత్రువుల బాహుమూలములు తెగిపోయినను, ఆగక, ఆదిసూకరముల వలె కొన్ని మదాంధగంధసింధురములు కైపున తీవ్రదంతములు దూఱునట్లు ఒత్తి (గ్రుచ్చి), ఎత్తి, చిందఱవందఱగ పొడిచి చంపినవని కలదు. ఆదిసూకరముల వంటి మదాంధగంధసింధురముల కైపు మదవికారమే.

8. "నిరుఋతి వారిమాయల కనిం బ్రతిమాయలొనర్చి పేర్చి సం
గర మొనరింపఁబూని కడుఁగైపున మార్కొని తాఁకి వీఁక నా
యిరువుర మీఁద నొక్కట ననేకశిలీముఖవృష్టి ఘోరసం
గురిసె సురారివాహినులకున్ లయకాలఘనాఘనాభమై." 822ప.12ఆ.

ఇందు నిరృతి ఇద్దఱిని కడుఁగైపున ఎదుర్కొని యుద్ధము చేసినట్లు కలదు. ఇదియును యుద్ధము కైపు. అనగా మదమే. అథవా ఉద్రేకము.

9. "కైఁపునఁదాకి యేకాదశరుద్రు లుత్కలభీకరాఖ్యుల
గెలిచి రెదిరి" 840ప.12ఆ.

ఇందు ఏకాదశరుద్రులు ఉత్కలభీకరాఖ్యులను కైపున తాకి గెలిచినట్లు కలదు. ఇది కూడ యుద్ధము కైపు. అనగా మదమే. అథవా, ఉద్రేకము.

10. "ఘనతరదీర్ఘదంతములు గైఁపున నూఱియుఁ గేలు గేలుతోఁ
బెనచియుఁ బట్టి రాఁదిగిచి బెల్కుఱఁ ద్రోచియు నెత్తి త్రోచినం
వెనుకన నిల్చియుం గదియ వీఁకున జంగమపర్వతంబుల్
యన దివిజేంద్ర దంతి దివిజాహితదంతులు వోలెఁ బోరిలోన్."
851ప.12ఆ.

ఇందు "కోపావేశంబునం దలపడిన" (850వచ.) "మదకరులు(849ప.) ఘనతరదీర్ఘదంతములు కైపున నూఁటినట్లు కలదు. కోపావేశమున విజృంభించు మదకరుల కైపు మదమే కద!

> 11. "బలువిడిఁ దాఁకి వీఁకఁ గులపర్వతసంహతిపక్షమూలముల్
> గలుషముతోఁ దెగం దునుము గాయమునం బటుజృంభణంబుతో
> బలుతల ద్రెవ్వఁబాఱియు నుపాయమునన్ సురశత్రువక్త్రము ద్ర
> య్యలువడఁ దాకు కైవున మహాశని జంభునురంబు దాఁకినన్."
>
> 853వ.12ఆ.

ఇందు "కైవున" అను శబ్దము "కైపున" అను శబ్దమునకు రూపాంతరము. "కైపెక్కిన" అనుటకు "కైవెక్కిన" అని నాచన సోమనాథుని ప్రయోగము కలదు. (150వ.2ఆ.ఉ.హరి.) కనుక కైవున = కైపున. వజ్రాయుధము వృత్రాసురుని వ్రయ్యలు వడఁదాకు కైపున జంభాసురుని వక్షస్థలమును తాకినట్లు కలదు. ఇట కైపు ఇవార్థకము. ఇది గమనార్హమైన విశేషము. అది వక్ష్యమాణము.

> 12. "కరిముఖుఁ డల్గి పట్టుకొని కైఁపునఁ జిట్టునఁ ద్రిప్పి వ్రేయఁగా
> హరికులిశాతిభీతిఁ జను నద్రుల వోలెఁ బయోధిఁ గూలె న
> త్వరగతిఁ గొన్ని కొన్ని లయవాతవిధూతఘనాలి వోలె నం
> బరమునఁ దూలుచుండెఁ బృథుబంధురదైత్యకబంధసంఘముల్."
>
> 896వ.12ఆ.

ఇందు విఘ్నేశ్వరుడు క్రుద్ధుడయి పట్టుకొని కైపున చిట్టున త్రిప్పివేయగా రాక్షసుల మొండెములు కొన్ని సముద్రమునందు కొండల వలె కూలినట్లు, మరి కొన్ని ప్రళయముంఝూప్రభంజనమునకు ప్రిదిలిన మేఘములవలె ఆకాశమున దూలి నట్లు కలదు. క్రుద్ధుడైన విఘ్నేశ్వరుని యుద్ధము కైపు మదమే.

> 13. "కరులు దెమల్చి పట్టికొని కైఁపునఁ జిట్టునఁ ద్రిప్పి నుగ్గగా
> నరదసమూహిపై చి తగ నశ్వదళంబులు వట్టి వీచి భీ
> కరభటకోటి పైచి తలకంగ సురారిచతుర్బలంబులన్
> వరుసన మట్టి చంపెఁ బరవైరితనూజు గజంబు పోరునన్."
>
> 852వ.12ఆ.

ఇందు కుమారస్వామి ఏనుగు కైపున, తారకాసురుని ఏనుగులను పట్టుకొని చిట్టున త్రిప్పినట్లు కలదు. ఏనుగు కైపు మదమే కద!

14. "కరి శిరమాడ షణ్ముఖుఁడు గైఁపున వ్రేయుడుఁ గుంభమౌక్తికో
త్కర మసిధారఁ బొల్పెసఁగెఁ దారకు భంగము సూచి నవ్వు సం
గరజయకాంత కాంతరదకాంతియొ కాదని నాఁటు దీఱి వి
స్ఫురదవదాతఖడ్గలత పూచెనొ నా జయచైత్రసంపదన్." 961ప.12ఆ.

ఇందు షణ్ముఖుడు ఏనుగు శిరస్సు ఆడునట్లు (ఊడునట్లు) కైపున కత్తితో కొట్టినట్లుకలదు. ఇది పరల యుద్ధము కైపు. కత్తితో కొట్టు కైపు. అనగా మదమే. అథవా, ఉద్రేకము.

15. "కని త్రిపురారినందనుఁడు గైఁపున మాఱ్కొని నిల్చి శక్తి వై
చిన వడిఁబాఱి వజ్రధరు చేతి మహాశనిశైలపక్షముల్
దునియఁగ, బాఱునట్లు హరు దోర్గతశూలము వారణాసురేం
ద్రుని౯ దెగఁబాయు నట్లఖిలదుస్సహతేజముతో వెలుంగుచున్."
967ప.12ఆ.

ఇందు త్రిపురారినందనుడు కైపున ఎదుర్కొని నిలిచి శక్తిని వైచినట్లు కలదు. ఇది కూడ యుద్ధము కైపు. అనగా మదమే. అథవా, ఉద్రేకము.

ఇంత ఝటితిస్ఫూర్తిని కుమారసంభవములోని కైపుశబ్దమునకు మత్తు, మదము, అనవా, ఉద్రేకము అను అర్థములు భాసించుచున్నను, భాషాశాస్త్రజ్ఞులు ద్రావిడప్రాణాయామము చేయుటకు హేతువు, కుమారసంభవము పంద్రెండవశతాబ్ది గ్రంథమను ప్రగాఢవిశ్వాసము కావచ్చును. మొత్తముమీద కుమారసంభవమునందు పదునైదుస్థలముల కైపుశబ్దము కలదు. అందు నిర్ధారకస్థలములు పదమూడు మాత్రమే. ఒక స్థలమున మత్తు, ఎనిమిదిస్థలముల మదము, మూడుస్థలముల మదము లేక ఉద్రేకము, ఒకస్థలమున విధము అని మాత్రమే అర్థములు. తక్కిన రెండుస్థలములందును కైపుశబ్దమే కలదన్నను. "ఉద్రేకము, కఠినత, కోపము, ద్వేషము, రోత, విజృంభణము, వైమనస్యము" అను అర్థములును కుదరవు. సూర్యకాంతపుత్రికకు, సూర్యకాంతపర్వతమునకు ఉద్రేకాదులు అసంగతము. పద మూడు స్థలములందు మత్తు, మదము అను అర్థములు, అందు మూడుస్థలములందు

వాపత్తముగ ఉద్రేకము అను అర్థము కల కైపుశబ్దము అరబీభాషాజన్యమైన అన్యదేశ్యము. కనుక, కుమారసంభవములోని కైపుశబ్దము "ప్రాచీనమైన శుద్ధదేశ్యము" కాదు. అర్వాచీనమైన అన్యదేశ్యమే.

అన్యదేశ్యమైన కైపుశబ్దము ప్రథమతః తిక్కన భారతమునందు ప్రయుక్తము. అది భాషాశాస్త్ర పరిశోధకుల, పదప్రయోగపరిశీలకుల కంట పడలేదు. తిక్కన ప్రయోగమును సూర్యరాయాంధ్రనిఘంటువు చూపలేదు. అతిప్రసిద్ధమైన కృష్ణుని రాయబారము ఘట్టమునందే తిక్కన ప్రయోగము కలదు.

"ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధాత్రీభాగ మీ నేర్చునే
సుతుఁడుం గష్టుఁడు సంధియేల యగు నంచున్ మున్న కైపెక్కిన
ట్టి తలంపచ్యుత నీకుఁ గల్గినది గాండీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్ల యుండ మముఁ జింతం బాపరాదో కదే"

72ప.3ఆ.ఉ.ప.

ఇది అర్జునుడు కృష్ణునికి తన అభిప్రాయమును తెలుపునది. ఇందు దుర్యోధనుడు సంధి ఎందుకగునని ముందే కైపెక్కిన సంగతి కృష్ణునికి తెలియునని కలదు. కైపెక్కుట అనగా మదమెక్కుటయే. కనుక, తిక్కన ప్రయోగము అర్వాచీనమైన అన్యదేశ్యమే. తిక్కన శిష్యుడు మారన కూడ "కైపెక్కు" అను పదబంధమును ప్రయోగించెను. ఇది సూర్యరాయాంధ్రనిఘంటువునందు కలదు. తిక్కన ప్రయోగమును బట్టి అన్యదేశ్యమైన కైపుశబ్దము పదమూడవశతాబ్ది ఉత్తరార్ధమునందు ఆంధ్రభాషాప్రవిష్టమాయినట్లు స్పష్టము. కైపుశబ్దము పదమూడవ శతాబ్ది తుదిని అన్యదేశ్యమగుట సంభవమే కాని, కుమారసంభవము అప్పటి గ్రంథమగుట సంభవము కాదు. కారణము, ఇవార్థకమైన కైపుశబ్దమును కుమారసంభవము నందు కలదు. ఇది గమనార్హమైన విశేషమని, వక్ష్యమాణమని పూర్వోక్తము.

మఱి కైపుశబ్దమునకు విధము అను అర్థము కూడ సూర్యరాయాంధ్రనిఘంటువునందు కలదు. ప్రయోగము కుమారసంభవమునుండి ఉదాహరింపలేదుగాని, రామాభ్యుదయమునుండి, చంద్రాంగదచరిత్రమునుండి ఉదాహరింపఁబడినవి. "గీ. రావణునిఁ జెట్ట వట్టిన రాజ్యలక్ష్మి కైపు తోఁపించు బంత పొంతంబు గాంచి" అని రామాభ్యుదయప్రయోగము. (103ప.6ఆ.) "సీ. పొల్లు గావించు కైపున రథుల్

రసము౽ నడిపి నుగ్గాడిచె కడఁకఁ గరుల" అని చంద్రాంగదచరిత్ర ప్రయోగము. (100ప.6ఆ.) సూర్యరాయాంధ్రనిఘంటుపండితులు గ్రహించిన యయాతిచరిత్రము లోని కైపుశబ్దమును ఇవార్థకమే. ఆ పద్యమిది :

"కారుమెఱుంగులం దెగడు కైపున నొప్పు నెలంత అంత బం
గారపుఁ బళ్లెరంబుల వగన్ నునుము త్తెపుముగ్గులోన నిం
పారెడు కెంపుదివ్వియల నందపుఁగెంపొడవుల్ చెలంగఁగా
నారతు లిచ్చిరప్పుడు యయాతికి లేనగవొప్ప నమ్మలిన్." 103ప.4ఆ.

ఇందు "కారుమెఱుంగులం దెగడు కైపున నొప్పు నెలంతలు" అనగా "కారుమెఱుంగులం దెగడు కైవడి నొప్పు నెలంతలు" అనియే కదా అర్థము. కనుక ఇవార్థకము. కుమారసంభవములోని "సురశత్రు వృత్రు ప్రయ్యలువడఁ దాకు కైపున= కైపున మహాశని జంభు నురంబు దాఁకినన్" అనగా కూడ "సుర శత్రు వృత్రు ప్రయ్యలు వడఁదాకు కైవడి మహాశని జంభు నురంబు దాఁకినన్" అనియే అర్థము. కనుక ఇవార్థకము. ఇవార్థకమైన కైపు లేక కైపుశబ్దము ఇతర భాషలందు మృగ్యము. అనగా కైపుశబ్దమునకు ఇవార్థము ఆంధ్రభాషయందు అర్థ విపరిణామమని అవగాహనమగును. అర్థవిపరిణామము హఠాత్సంభూతము కాదు. కాలక్రమసంక్రాంతము. కనుక ఇవార్థకమైన కైపుశబ్దము పదమూడు, పదనాలుగు శతాబ్దులందే ఆంధ్రభాషయందు వ్యవస్థితమగుట సంభవముకాదు. అంతేకాదు. ఏతదర్థమున కైపుశబ్దము ప్రయుక్తమైన అయ్యలరాజు రామభద్రుని రామాభ్యు దయము, పైడిమఱ్ఱి వేంకటపతి చంద్రాంగదచరిత్రము, పొన్నెగంటి తెలగన్న యయాతిచరిత్రము పదునారవశతాబ్ది గ్రంథములు. అతఃపూర్వము ఇవార్థకమైన కైపుశబ్దమునకు ప్రయోగము ఇతరత్ర మృగ్యము. అనగా కైపుశబ్దమునకు ఇవా ర్థము పదునారవశతాబ్దికి పర్యవసితమని అవగాహనమగును. కనుక ఇవార్థకమైన కైపుశబ్దము ప్రయుక్తమైన "నన్నెచోడుని కుమారసంభవము" పదునారవశతాబ్ది కంటె ప్రాచీనగ్రంథము కావని ప్రతీయమానము.

కుమారసంభవమునందు కైపుశబ్దము బహుధా ప్రయుక్తమగుట కూడ ప్రాచీనతాభంజకము. అంతేకాదు. కుమారసంభవమునందు ప్రయుక్తమైన గడీ శబ్దము (947ప.7ఆ) అర్వాచీనతాద్యోతకము. గూడారము శబ్దము (600ప.11ఆ.)

అర్వాచీనతాస్ఫోరకము. మలాము, సలాము వంటి గులాము శబ్దము (ప్రతిప.10ఆ.) అర్వాచీనతాస్థాపకము.

కుమారసంభవములోని భాష జానుతెనుగు అని కుమారసంభవమునందే కలదు.

"సరళము గాఁగ భావములు జానుఁదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుస్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్." 35ప,1ఆ.

ఇందు జానుతెనుగు అను పదబంధము ఇతమిత్థముగ కలదు. అది జాను, తెనుగు అను రెండు ఆచ్ఛికపదముల సమాసము. జాను అను పదము నన్నయ భారతమునందు కలదు. (215ప.2ఆ.ఆర.ప.) "నన్నెచోడుని కుమారసంభవము" నందును కలదు. (15ప.2ఆ.) తిక్కన భారతమునందును కలదు. జానుతెనుగు అను సమాసము పాలకుఱికి సోమనాథుని వృషాధిపశతకమునందు, బసవపురాణమునందు, పండితారాధ్యచరిత్రమునందును కలవు. అవి తదర్థనిశ్చాయకములు.

"పలుకుఁబోడ తోడ సీకయును బాసదరుల్ గిలుపాఱుకున్న వె
న్నెల తల సేదుకత్తుకయు నిండిన వేలుపుపేఱు పజ్ఝపూ
సలు గల దేనివెంక పని జానుదెనుంగున విన్నవించెదన్
వలపు మదించలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా."

ఇది వృషాధిపశతకములోని పద్యము. ఇందు "పలుకుబోడ" మొదలు "వెంకపని" వఱకు మాత్రమేగాక, "విన్నవించెదన్ వలపు మదించలిర్ప" అనునది కూడ జానుతెనుగు. శతకలక్షణమైన మకుటములోని వృషాధిప పదబంధము వినా, పద్యమునందు సంస్కృతసమపదము లేదు. సంస్కృతసమేతరమైనభాష అచ్చతెనుగు. కనుక జానుతెనుగు అనగా అచ్చతెనుగు అని వృషాధిప శతకపద్యమును బట్టి అర్థము వచ్చును.

"ఉరుతరగద్యపద్యోక్తుల కంటె
సరసమై పరఁగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కి దైవార." 165-168.

ఇది బసవపురాణములోని ద్విపదలు. ఇందు సరసమై పరగినది, సర్వసామాన్యమైనది జానుతెనుగు అని స్పష్టముగ కలదు. అంతేకాదు. బసవపురాణములోని ద్విపదల తెనుగుభాష జానుతెనుగు అని ఇదమిత్థముగ కలదు. బసవపురాణములోని ద్విపదల భాష సరసమై పరగునది, సర్వసామాన్యమునైనది కాని, అచ్చతెనుగు కాదు. కనుక జానుతెనుగు అనగా కేవలము అచ్చతెనుగు అని మాత్రమే అర్థము కాదని అవగాహనమగును. అచ్చతెనుగు అయినను, కాకపోయినను; సరసమైన, సర్వసామాన్యమైన తెనుగు జానుతెనుగు అని బసవపురాణద్విపదకావ్యమును బట్టి యవగతమగును.

> "ఆయాధగద్యపద్యాదిప్రబంధ
> పూరితసంస్కృతభూయిష్ఠరచన
> మానుగా సర్వసామాన్యంబు గామి
> జానుతెనుఁగు విశేషము ప్రసన్నతకు" పుట 18.

ఇది పండితారాధ్యచరిత్రలోని ద్విపదలు. ఇందు సంస్కృతభూయిష్ఠరచన సర్వసామాన్యము కాకపోవుట వలన ప్రసన్నతకు జానుతెనుగు విశేషమని వివరముగ కలదు. అంతేకాదు పండితారాధ్యచరిత్రలోనిభాష జానుతెనుగు అని గర్భితముగ కలదు. పండితారాధ్యచరిత్రలోని తెలుగుభాష సర్వసామాన్యముకాని సంస్కృతభూయిష్ఠరచన కాదు. అచ్చతెనుగును కాదు. కనుక జానుతెనుగు అనగా కేవలము అచ్చతెనుగు అని మాత్రమే అర్థము కాదనియే అవగాహనమగును. అచ్చతెనుగు కాకపోయినను సంస్కృతభూయిష్ఠరచన కాని, సర్వసామాన్యమైన (సుబోధకమైన) తెనుగు జానుతెనుగు అని పండితారాధ్యచరిత్రద్విపదకావ్యమునుబట్టి ప్రస్ఫుటమగును.

"చేటతెనుంగున ద్విపద రచింతు" పుట 18.

అని పయి ద్విపదలకు కొంతముందు పాలకురికి సోమనాథుని ప్రతిపాదనము. కనుక జానుతెనుగు అనగా చేటతెనుగు అని పాలకురికి సోమనాథుని అభిప్రాయము. అచ్చతెనుగు చేటతెనుగు కావచ్చును; కాకపోవచ్చును. సంస్కృతభూయిష్ఠరచన చేటతెనుగు కాఁజాలదు. అనగా జానుతెనుగు కాఁజాలదని అర్థము.

మటి కుమారసంభవములోని భాష అచ్చతెనుగు కాదు. సర్వసామాన్యము ...ని, సంస్కృతభూయిష్ఠమైన తెనుగు. కనుక జానుతెనుగు కాదు. జాణతెనుగు

కావచ్చును. కాని కుమారసంభవమునందు జాణతెనుగు అని లేదు. జానుతెనుగు అనియే కలదు. కాని కాదు. ఇది పాలకురికి సోమనాథుని అనుకరించుటవలని అనర్థకము. అర్వాచీనతామూలకము.

ఒక్క భాషావిషయమే కాదు; ఛందోవిశేషమును అర్వాచీనతామూలకము. అది ఏదో కాదు; మానవల్లి రామకృష్ణకవిగారు నన్నయ కంటె "నన్నెచోడుని ప్రాచీనతకు గొప్ప" కారణమనిన క్రౌంచపదమే.

మానవల్లి రామకృష్ణకవిగారి ప్రతిపాదనమిది :[57]

"నన్నెచోడుని క్రౌంచపదమున 'యతి' విచిత్రముగా నున్నది.
'చంచుల నాస్వాదించుచు లేఁదూండ్లకరువు ప్రియలకు నొసఁగుచు మైలో
మాంచము లోలిం గంటుకితంబై పొడవుఁగ నదరుచుఁ బులినములం గ్రీ
డించుచు సంభాషించుచుఁ బ్రీలింబొలుచుచుఁ జెలఁగుచుఁ దొలయు సముద్య
త్క్రౌంచగతుల్ వీక్షించుచు భాస్వజ్జ్వలనుఁడు శరవణసరసికి వచ్చెన్.'

ఇందుఁ గందసీసములవలెఁ బ్రతిపాదము రెండు భాగములుగా విభజింపఁ బడి కందము(?)వలెఁ బూర్వార్ధమునఁ బ్రాసమును ద్వితీయార్థమున విశ్రమము మాత్రమే కూర్పఁబడియె. ద్వితీయప్రాస నియతి మాత్రము నన్నయ తిక్కన కవిజనాశ్రయకారాదిప్రాచీనులు పాటించిరి కాని యప్పకవి తన్మర్మము తెలియక వదలెను .... క్రౌంచపదము మాత్రాఛందమునఁబడి శీర్షకమగును. ఎట్లన రెండవ, నాల్గవ గణముల నాలుగు మాత్రలుగా సవరించి కడపటి గురువు ప్రోచిమైచి పూర్వగురువు రెండు మాత్రలుగాఁ బలికిన సీసమగును. .... రెండవ పాదము "మాంచము లోలిగఁ గంటుకితంబయి పొడవుఁగ నదరుచుఁ బులినములను" అను సీసపాదమగును. ఇందుఁ బూర్వార్థమునఁ బ్రాసయతియు, నుత్తరార్థమున విశ్రమమును గలవు. ఇట్టి నియమములు గల సీసములు నన్నియభట్టు భాగముననె పెక్కులు గలవు. .... నన్నియకాలమునకే క్రౌంచపదము ప్రవృత్తము కావునఁ బ్రథమాక్షరవిరతి ముఖ్యమని ప్రాసమున్నను రెండు విరమస్థానములు ప్రయోగించిరి. ఇది నన్నెచోడుని ప్రాచీనత కొక గొప్పకారణము."

ఇందు క్రౌంచపదవృత్తము పాదములోని రెండు, నాల్గు గణములను నాల్గు మాత్రలుగ పరిగణించి, పాదాంతగురువును పరిత్యజించి, తత్పూర్వగురువును రెండు మాత్రలుగ పరిగణించిన, అది సీసపాదము అగు మాట నిజము. సీసపాదమునందు మొదటిదళమునందు ప్రాసయతి, రెండవదళమునందు యతిమైత్రి ఉండవచ్చును గావున, అది క్రౌంచపదవృత్తపాదమునకు సరిపడు ననుమాట కూడ నిజము. ఇట్టి సీసపద్యములు నన్నయ ప్రయోగించిన మాట కూడ నిజము. కాని ద్వితీయప్రాస నియతి క్రౌంచపదవృత్తమునందు నన్నయ పాటించె ననుమాట నిజము కాదు, నన్నయ క్రౌంచపదవృత్తమును వ్రాయలేదు. కనుక, క్రౌంచపదము "నన్నయ కాలమునకే" వృత్తమయినదను మాట కూడ నిజము కాదు. నన్నయ కాలమునకు బహుపూర్వమే క్రౌంచపదము వృత్తము. క్రౌంచపదవృత్తమునకు లక్ష్యలక్షణములు పింగళచ్ఛందస్సునందే కలవు[58].

"'క్రౌంచపదా భ్మౌ స్భౌ నౌ నౌగ్ భూతేంద్రియవస్వృషయః (30సూ.7అ.)
యా కపిలాక్షీ పింగలకేశీ కవిరుచిరనుదినమనునయకఠినా
దీర్ఘతరాభిః స్థూలశిరాభిః పరివృతవపురతిశయకుటిలగతిః
ఆయతజంఘా నిమ్నకపోలా లఘుతరకుచయుగపరిచితహృదయా
సాపరిహార్యా క్రౌంచపదాస్త్రీ ధ్రువమిహనిరవధిసుఖమభిలషతా."

ఇందు క్రౌంచపదవృత్తమునకు భ,మ,స,భ,న,న,న,న,గ అనునవి గణము లని, 5,5,8,7 అక్షరములపై - అనగా 5,10,18,25 అక్షరములపై యతి అనియు కలదు. అంతేకాదు. ఇది 25వ అతికృతిచ్ఛందమునందు పుట్టిన వృత్తము. అనగా పాదమునకు ఇరువదియైదు అక్షరములు.

ఇక నాగవర్మ ఛందోంబుధియందు ఇట్లు కలదు[59].

"శీతకరోర్వీవాతశశాంకర్ యుగమితసురపురనివహదకడెయాళ్
భూతగణేశం భూతశరాశాగజదొళె యతిగళు మెసిదిరె పెసరిం
నీతియుతేకేళ్ నాతిశయోక్తి క్రమదొళె నెగళ్దు దతిశయరచనో
పేతమశేషోర్వీతళకం క్రౌంచపదమిదతిశయపదరచనెగళిం."

ఇందు అయిదవ అక్షరముపై ప్రాసయతి ఉండుట అభ్యధికము. ఇతరగణ, యతి పాదాక్షరనియమములు పింగళచ్ఛందస్సునకు అనుగుణము. పైంగళము సంస్కృతము. ఛందోంబుధి కన్నడము. కనుక సంస్కృత, కన్నడ క్రౌంచపద వృత్తములు ప్రాసయతివినా సర్వసమానము.

మఱి కవిజనాశ్రయమునందు ఇట్లు కలదు.

"పంచశరాభా ! సంచితపుణ్యా! భమసభననయపరిమితమైనన్
క్రౌంచపదాఖ్యం బంచితమయ్యెన్ గ్రమయతి దశవసుకలితముగాన్."

ఇందు అయిదవ అక్షరముపై ప్రాసయతి, పదవ పదునెన్మిదవ అక్షరములపై యతిమైత్రి కలదు. అంతేకాదు. పాదమునకు ఇరువదియైదు అక్షరములు లేవు. ఇరువదినాలుగు అక్షరములు మాత్రమే కలవు. ఇది 25వ అతికృతిచ్ఛందమునందు పుట్టిన వృత్తము కాదు. 24వ సంకృతిచ్ఛందమునందు పుట్టిన వృత్తము. అయినను సంస్కృతక్రౌంచపదవృత్తమునందు వలె 5,10,18 అక్షరములపై యతులు కలవు. కన్నడక్రౌంచపదవృత్తమునందు వలె 5వ అక్షరముపై ప్రాసయతి కలదు. తెలుగు క్రౌంచపదవృత్తము కనుక 10,18 అక్షరములపై యతిమైత్రి కలదు. ఇట్లు తిక్కన క్రౌంచపదవృత్తము కలదు.

"కౌరవసేనావీరులు లావుం గడిమియుఁ జలమును గడఁక యెలర్పన్
ధీరత సొంపుం గ్రూరత పెంపుం దెగువయు నెఱపఁగఁ దెరలక వీఁకన్
బోరఁ ద్రోవంగా రభసం బేపును గలితనమును బొలుపు వహింపన్
వారు భయంబుం గూరుటకుం గా వలసెను రుధిరము వదనము సేర్పన్."
(166వ. 1ఆ. ద్రో.ప.)

ఇట్లు పాలకుఱికి సోమనాథుని క్రౌంచపదవృత్తమును కలదు.

"భక్తివినీతుల్ యుక్తిసమేతుల్ భవభయవిగళితపశుగణహూతుల్
వ్యక్తసుబుద్ధుల్ శక్తిసమృద్ధుల్ వ్యపగతకులచయపరసుఖసిద్ధుల్
సూక్తిరసజ్ఞుల్ భక్తివిధిజ్ఞుల్ సురుచిరశుభకరసుకృతమనోజ్ఞుల్
భుక్తివిరక్తుల్ ముక్తినియుక్తుల్ పురహరభక్తుల్ బుధవినుతమహుల్."
(197వ. అనుభవసారము)

ఇందు చివఱిపాదమునందు ముద్రణదోషము కలదు. "బుధవినుతమహులు పురహరభక్తుల్" అని ఉండవలయును. పయి రెండు పద్యములందును పాదమునకు ఇరువదినాలుగు అక్షరములు కలవు. ప్రతిపాదమునందు 5వఅక్షరముపై ప్రాసయతి, 10,18అక్షరములపై యతిమైత్రులు కలవు. తిక్కన, సోమనాథుల క్రౌంచపద వృత్తములు లక్ష్యములుగ కవిజనాశ్రయమునందు క్రౌంచపదవృత్తలక్షణము కలదు[60].

ఇక ఎఱ్ఱన క్రౌంచపదవృత్తము ఇట్లు కలదు.

"సారవివేకా సౌఖ్యవిలోకా సకలరిపుభయదసమదసమీక్షా
ధారమణీయా బాధువిధేయా పరహితకరుణా ఫలసదుపాయా
ధీరచరిత్రా దీపితగోత్రా దివిజనగసదృశధృతియుతగాత్రా
వీరవరేణ్యా విశ్రుతపుణ్యా వినయగుణవిజయవిలసనగణ్యా."

(259వ.9ఆ.ఉ.భా.హరి.వంశము)

ఇందును పాదమునకు ఇరువదినాలుగు అక్షరములు కలవు. ప్రతిపాదము నందు 5,10,18వఅక్షరములపై యతిమైత్రి కలదు. 5వఅక్షరముపై ప్రాసయతి లేదు. క్రమయతి కలదు. అది పింగళచ్ఛందస్సునకు అనుగుణము.

మఱి నందితిమ్మన క్రౌంచపదవృత్తము ఇట్లు కలదు.

"అంకురితశ్రీసంగభుజాంకా హరిహయమణిమదహరతనువర్ణా
సంకటకృద్దైత్యాశయశంకా జనన నిజచరితశయధృతశంఖా
పంకజనాభాభంజితపంకా పరమపురుషభవపరిభవనామా
శంకరధావా కిసలయ సంకాశపదయుగకలశశరనిధిశయనా."

ఇందును పాదమునకు ఇరువదినాలుగు అక్షరములు కలవు. ప్రతిపాదము నందు 10,18అక్షరములపై మాత్రమే యతిమైత్రి కలదు. 5వఅక్షరముపై ప్రాస యతిలేదు. యతిమైత్రియు లేదు. ఇది కవిజనాశ్రయలక్షణమునకు, తిక్కన, సోమన, ఎఱ్ఱనల లక్ష్యములకును భిన్నము. అప్పకవిలక్షణమునకు అనుగుణము. ఇట్లుండుటకు హేతువు కలదు. నంది తిమ్మన క్రౌంచపదవృత్తము ద్వికందగర్భ క్రౌంచపదవృత్తము.

"అంకురితశ్రీసంగభు
జాంకా హరిహయమణిమదహరతనువర్ణా
సంకటకృద్దైత్యాశయ
శంకా జనన నిజచరితశయధృతశంఖా.
పంకజనాభా భంజిత
పంకా పరమపురుషభవపరిభవనామా
శంకరధావా కిసలయ
సంకాశపదయుగకలశశరనిధిశయనా.

ఇట్లు నంది తిమ్మన క్రౌంచపదవృత్తమునందు రెండు కందపద్యములు కలవు. ఒక్క అక్షరము కూడ మార్పు చేయకుండ తెలుగు క్రౌంచపదవృత్తము యథాతథముగ రెండు కందపద్యము లగును. కాని, క్రౌంచపదవృత్తములోని 5వ అక్షరముపై ప్రాసయతి లేదా యతిమైత్రి కందపద్యమునకు ప్రాసయతి మైత్రులు కావు. కనుక ప్రత్యేకముగ కల్పింపవలయును. అందుకు 5వఅక్షరముపై ప్రాసయతిని, లేదా యతిమైత్రిని నంది తిమ్మన పాటింపకపోవుట అపూర్వవిశేషము.

ఇది గమనించి, క్రౌంచపదవృత్తపాదము- రెండు, మూడు గణములను నాలుగు మాత్రలుగ పరిగణించుట, పాదాంతగురువును పరిత్యజించుట, తత్పూర్వ గురువును రెండు మాత్రలుగ పరిగణించుట చేసిన సీసపాదముగనని గ్రహించి తదనుగుణముగ క్రౌంచపదవృత్తమును కల్పించుట సంభవము. నంది తిమ్మన క్రౌంచపదవృత్తమునందు 5వ అక్షరముపై ప్రాసయతి లేదా యతిమైత్రి లేక పోయినను 10,18 అక్షరములపై క్రమయతి కలదు. పాదాద్యక్షరమునకు అనుగుణ మైన అక్షరము యతిమైత్రి లక్షణము. కనుక నంది తిమ్మన క్రౌంచపదవృత్తము సలక్షణము. "నన్నెచోడుని కుమారసంభవము"లోని క్రౌంచపదవృత్తమునందు 5వ అక్షరముపై ప్రాసయతి ఉన్నను, 10,18 అక్షరములపై క్రమయతి లేదు. పాదాద్యక్షరమునకు అనుగుణము కాని అక్షరము యతిమైత్రిభంగకరము. కనుక "నన్నెచోడుని కుమారసంభవము"లోని క్రౌంచపదవృత్తము అపలక్షణము. అనుకర ణము వలని అనర్థకము. నంది తిమ్మన క్రౌంచపదవృత్తము ద్వికందగర్భక్రౌంచ పదవృత్తము. "నన్నెచోడుని కుమారసంభవము"లోని క్రౌంచపదవృత్తము కల్పిత మాత్రాచ్ఛందఃప్రకారసీసపాదగర్భక్రౌంచపదవృత్తము. నంది తిమ్మన క్రౌంచపద వృత్తమునకు ప్రతిద్వంద్వికల్పనప్రాయము. అనగా నంది తిమ్మన పారిజాతాప హరణము కంటె "నన్నెచోడుని కుమారసంభవము" అనంతరగ్రంథమని అవ గాహనమగును. నంది తిమ్మన కాలము పదునారవ శతాబ్ది పూర్వార్ధము. కనుక, కల్పితమాత్రాచ్ఛందఃప్రకారసీసపాదగర్భక్రౌంచపదవృత్తము ప్రయుక్తమైన "నన్నె చోడుని కుమారసంభవము" పదునారవ శతాబ్ది కంటె ప్రాచీనగ్రంథము కాదని ప్రకాశమానము.

## ౨

# కృతకరచనము

కుమారసంభవము కవితాశృంగాటకము. తమిళకర్ణాటాంధ్రసంస్కృతపద్య సంవాదములు బహుళము. మలయాళపద్యసంవాదమును మఱి కలదేమో! మానవల్లి రామకృష్ణకవిగారు తెలుపలేదు. వారు తెలిపిన ఆంధ్రపద్యసంవాదములైన అనుశీలించిన జాడలు లేవు. అనుసరించిన అడుగుజాడలు కలవు[1]. కవిగారు పీఠికానుబంధలఘుటీకాటసూచికలందు "పోల్చిచూడుఁడు" అని ఉదాహరించిన తెలుగు పద్యములు "పోల్చిచూడ"వలసినవి. అవి :

1. "పదలాలిత్యము వర్ణశుద్ధియును శబ్దస్థైర్యమున్ మంగళా
స్పదభావంబును రాజయోగ్యతయు దోషస్ఫూర్తిరాహిత్యమున్
సదలంకారవిశేషముం గలిగి విశ్వప్రాణసౌభాగ్యసం
పదమైఁ దేజియుఁ బోలి క్రాలవలదా పద్యంబు హృద్యస్థితిన్."

ఇది "కవిలోకబ్రహ్మ పద్యము" అని కవిగారి నిర్దేశము[2]. కవిలోకబ్రహ్మ అన పెదపాటి సోమయ. అతని కృతులు నాలుగు. 1. అరుణాచలపురాణము. 2. కేదారఖండము. 3. త్రిపురవిజయము. 4. శివజ్ఞానదీపిక. ఇందు ఒక్కటియును ఇంతవఱకు ఉపలబ్ధము కాలేదు[3]. కాని, పెదపాటి సోమయ అరుణాచల పురాణమునుండి పది పద్యములు, కేదారఖండమునుండి మూడు పద్యములు, శివజ్ఞాన దీపికనుండి మూడు పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు; కేదారఖండమునుండి ఆరు పద్యములు, త్రిపురవిజయమునుండి ఒక పద్యము ఉదాహరణపద్యములు అను గ్రంథమునందు ఉదాహరింపఁబడినవి[4]. రెండు గ్రంథములందును కవిలోకబ్రహ్మ పెదపాటి సోమయ అని కలదు. అంతేకాదు. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమునందు "కవిలోకబ్రహ్మ శివజ్ఞానదీపిక" అని కలదు. కనుక కవిలోకబ్రహ్మ పెదపాటిసోమయ. పైన ఉదాహరించిన పద్యము కేదారఖండములోనిది. ఇట్టి పద్యము అరుణాచలపురాణములోను కలదని నిడుదవోలు వేంకటరావుగారి నిర్దేశము[7]. కేదారఖండపద్యమునందు పద్యమునకు అశ్వమునకు శ్లేషసంకీర్ణమైన సాదృశ్యము కలదు. పదలాలిత్యము, వర్ణశుద్ధి, శబ్దస్థైర్యము,

మంగళాస్పదనామము, రాజయోగ్యత, దోషస్ఫూర్తిరాహిత్యము, సదలంకారవిశేషము కలిగియుండుట పద్యలక్షణము. అర్థభేదమున అశ్వలక్షణమును. సమస్తగుణముల సౌభాగ్యసంపదతో పద్యము ప్రకాశించును. సమస్తమునకు ప్రాణమైన సౌభాగ్య సంపదతో అశ్వము ప్రకాశించును. అర్థభేదము స్పష్టము. శ్లేష అప్రయత్నసిద్ధము. కనుక కేదారఖండపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

> "పదబంధంబుల నగ్గలించి బుధశబ్దభ్రాజియై సద్గుణా
> స్పదమై దుష్కవిహృత్సరోజవనమున్ ఖండింపుచున్ భూరిస
> మ్మదలీలన్ విలసిల్లి సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్
> మదనాగంబును బోలెఁ గ్రాలవలదా మాటెందు లేకున్నతిన్." 40ప.1ఆ.

ఇందు మంచి కావ్యమునకు మదపుటేనుగునకు శ్లేషసంకీర్ణమైన సాదృశ్యము కలదు. రూపకమునకు కలదు. పదబంధముల అగ్గలము (=అతిశయము) మంచి కావ్యమునకు శోభ కలిగించునుగాని, మదపుటేనుగునకు శోభ కలిగించును. బుధ శబ్దభ్రాజనము (=పండితప్రకాశనము) మంచి కావ్యమునకు సుసంగతము. మదపు టేనుగునకు అసంగతము. బుధశబ్దమునకు దేవతార్థము కలదుగావున, ఏనుగు దేవతాస్వరూపమని సరిపెట్టుకొనవలయును. దుష్కవిహృచ్చయము లనెడి సరోజ వనములను మదపుటేనుగు భంజించునని, సరోజవనము లనెడి దుష్కవిహృచ్చయము లను మంచి కావ్యము భంజించునని "దుష్కవిహృత్సరోజవనమున్" అను రూపకమును అటునిటు అన్వయించుకొనవలయును. దుష్కవుల హృచ్చయములు దుర్గంధిలములు. సరోజవనములు సుగంధిలములు. అయినను సాదృశ్యముకొఱకు అభేదరంజనము! మంచి కావ్యము సద్గుణాస్పదము. మదపుటేనుగు కూడ సద్గుణా స్పదమట! మదపుటేనుగు భూరిసమ్మదలీలను దుర్గుణాస్పదమై విజృంభించుట ప్రసిద్ధము. సద్గుణాస్పదమై విలసిల్లుట అప్రసిద్ధము. అర్థద్వయము క్లిష్టము. శ్లేష ప్రయత్నసృష్టము. రూపకము బలవదాకృష్టము. కనుక కుమారసంభవములోని పద్యము కృతకము.

ఇట వేదాల తిరువేంగళాచార్యులు గారి అభిప్రాయమిది[8] :

> "మొదటి చరణముల్ "బుధశబ్దభ్రాజియై" అంటే సరిగా
> అర్థము పొసఁగినదా? ఏనుగు బృంహితాన్ని బుధశబ్దమంటారా?

అగ్గలించుట అంటే అతిశయించుటేనా? అపుడు పదబన్ధంబుల నగ్గలించి అంటే అర్థము సమన్వయించునా? కాళ్లకు కట్లతో ఏనుగ అతిశయించుటెంతైన గలదా? మారెందును లేక ఉన్నతిన్ గ్రాల వలసిన మదనాగము పదబంధంబుల నగ్గలించునా? ఈ పూర్వాపర వ్యాఘాతమునైన గమనించినారా .... ఏనుగ పక్షములో సరిగా శ్లేషను చివరిదాకా నిర్వహింపజాలక .... మధ్య దుష్క-విహ్యాత్స రోజవనముల్ అని రూపకము నాశ్రయింపవలసివచ్చినది. జగన్మాన్య ప్రభావంబునన్ గ్రాలవలదా? అసు దానితో మారెందు లే కున్నతిన్ అనునది పునరుక్తము కాదా? అన్నితప్పులు అంత అసామర్థ్యము కన్పడుచున్నది. .... పద్యములో .... పూరణము మాత్రమే ప్రయోజనముగా నుండు ప్రభావము, ఉన్నతిన్, బుధ, హృత్, భూరి, లీలన్ ఇత్యాదులు (కలవు) .... అసలు కూర్పే సరిగా లేదు. రచనాదృష్టిలో కూడనది మూడవ తరగతియే."

కుమారసంభవములోని పద్యమునందు కూర్పు సరిగా లేని మాట నిజము. అర్థము సరిగాఁ బొసగని మాట అంతకంటె యథార్థము. అయినను "ఈ రెంటిలోఁ దాత్పర్యము భేదించినను బూర్వపద్యమును స్మరించి సోమనాథుడు నూతనకల్పన చేసెనని తోచును." అని కవిగారి అభిప్రాయము[9]. కాని, కేదారఖండపద్యము చరికొండ ధర్మన్న చిత్రభారతములోని పద్యమునకు చిత్రిక పట్టినట్లు కలదు[10]. అంతేకాదు. అసమర్థమైన పద్యమును అనుసరించుట కంటె, అతిసమర్థమైన పద్యమును అనుకరించుట సహజము. కుమారసంభవములోని ప్రకృత పద్యము ప్రబంధశిరోమణియందు కలదు. అది కేదారఖండము కంటె అర్వాచీన గ్రంథము. అందలి పద్యము కుమారసంభవమునందు అవతరించుట కూడ అసంభవము కాదు.

2. అలితతి నీలముల్ ముదురుటాకులు పచ్చలు లేఁజిగుళ్లు కెం
పులు దళరాజి వజ్రముయల్ కవిరావళి లాఁడిముత్తియం
బులుగఁ బొసంగు చంగజునిఁ బొక్కసమెల్లను నాత్మలోన నిం
పులు పొదలించె రాజునకుఁ జూచి పెడంగగు పొన్న యున్నతిన్.

ఇది "సూరన ఉదయనోదయములోని ఆ౧-౧౩౪వ పద్య"మని కవిగారి నిర్దేశము.[11] ఇందు పొన్నచెట్ల వర్ణనము కలదు. తుమ్మెదలు ఇంద్రనీలములుగ, ముదురుటాకులు గరుడపచ్చలుగ. లేఁజిగురాకులు కెంపులుగ, పూలరేకులు వజ్రమయములుగ, మొగ్గలు ఆణిముత్యములుగ మన్మథుని కోశాగారమెల్లను పొసగుచు, విరబూచిన పొన్నచెట్లు రాజునకు మనస్సులో ఇంపు కలిగించినవని అర్థము. ఇది రాజునకు మాత్రమే కాదు; రసజ్ఞులకును ఇంపు కలిగించునది. తుమ్మెదల నల్లదనము, ముదురుటాకుల పచ్చదనము, లేత చిగురాకుల ఎఱ్ఱదనము, మొగ్గల పూలరేకుల తెల్లదనము సహజము. అవి నీలములు, పచ్చలు, కెంపులు, వజ్రములు, ఆణిముత్యములు అనిపించుట కూడ సహజము. అది మన్మథుని కోశాగారము అనిపించుటయును అంతకంటె సహజము. కనుక ఉదయనోదయపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

> "మొగడలు వజ్రముల్ విరులు ముత్తెము లింపగు నున్నుగెంపులేఁ
> జిగురులు పద్మరాగములు చిల్కలు వైరిజరాజి తుమ్మెదల్
> నగరిపునీలజాలములు నాఁ దనరారె వసంతవల్లభుం
> డగు వలరాజు పంచమణిహర్మ్యముల్ యనఁ జాతభూజముల్."
>
> 455ప.4ఆ.

ఇందు మామిడిచెట్ల వర్ణనము కలదు. మొగ్గలు వజ్రములు, పువ్వులు ముత్యములు, లేఁజిగురులు పద్మరాగములు, చిలుకలు గరుడపచ్చలు, అన తనరారినవి. ఎందుకు? మన్మథుని పంచమణిహర్మ్యములో అన రెండు "అన"లు. ఇది రాజునకు ఇంపు కలిగించినదికాదు. రసజ్ఞులకును ఇంపు కలిగించునదికాదు. "నున్నుగెంపు లేఁజిగురులు" కవిగారికి మాత్రము ఇంపు కలిగించినవి. అవి పద్మరాగములు అన తనరారినవి అనునెడ "కెంపు" విశేషము ఇంపు కలిగించునది కాదు. అంతేకాదు. మన్మథునికి నవరత్నమయసౌధములను గాక పంచమణిహర్మ్యములను మాత్రమే ప్రసాదించుటకు హేతువు పరికరము అయినగుట మాత్రమే. పంచమణిహర్మ్యములు ప్రసిద్ధము కాదు. అయినను ప్రతిష్ఠించుటకు లేఁజిగురులు పద్మరాగములు, చిలుకలు గారుత్మతరత్నపంక్తులు అనిపించుట సహజము గాని, మామిడి మొగ్గలు వజ్రములు, మామిడి పువ్వులు ముత్యములు అనిపించుట సహజము కాదు. అంతేకాదు. ఫలములు లేకుండ చిలుకలు వ్రాలుట కూడ సహజము కాదు.

ఉపరి, వలరాజు వసంతవల్లభుడట! ఇట వసంతశబ్దము ఋతువునకు ఉద్దిష్టమైనచోఁ వసంతవల్లభుడు వసంతుడే కాని వలరాజు కాడు. వసంతునకు నిర్దిష్టమైనచో, వలరాజు వసంతసఖుడు కాని వసంతవల్లభుడు కాడు. వల్లభశబ్దము మిత్రవాచకము కాదు. రతివల్లభుడైన వలరాజును వసంతవల్లభుని చేయుట గణమాత్రప్రయోజని. నీలములకు నగరిపువిశేషణము ప్రాసమాత్రప్రయోజని. కనుక, కుమారసంభవ పద్యము కృతకము.

3. "బొమవెక్కించిన విల్లు వంచు నునుఁజూపుల్ చంచలాచంచల
క్రమరేఖ న్నిగిడింప శాతవిశిఖౌఘంబుల్ మెయిన్నించు నె
య్యమునన్ బల్కఁగ నల్కమీఱి చటులజ్యాఘోషముంజేయు న
య్యుమ ప్రాపొంది రతీశ్వరుండు హరు బట్టోడింప నుట్టాడుచున్."

189ప.1ఆ.

ఇది తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యములోని పద్యమని కవిగారి సూచనమే[12]. కుమారస్వామి పుట్టిపెరిగి, తారకాసురుని సంహరించి, సావకాశముగ సామిమలకు వచ్చి, సావధానముగ మరల కైలాసమునకు వెళ్లినప్పటి, పార్వతీ పరమేశ్వరుల ప్రమదావనవిహారము ప్రకరణము. పార్వతి శరీరమునందలి నఖదంత క్షతములను పరికించి, నర్మగర్భముగ పలికిన, పరమేశ్వరుని పార్వతి చూపులతో బెదరించును. పరమేశ్వరుడు పార్వతికి పూల పచ్చడము కప్పును. అప్పుడు పార్వతి బొమవెక్కించిన మన్మథుడు విల్లు వంచును. చూపులు ప్రసరించిన తూపులు విసురును. అలుక మాని ఆదరముగ పలికిన వింటినారి మ్రోగించును. ఇది పార్వతి ప్రాపున పరమేశ్వరుని మీది పాతపగను మన్మథుడు సాధించు ప్రయత్నము. కనుబొమలకు విల్లు, కంటిచూపులకు వింటితూపులు, సంభాషణధ్వనికి జ్యాఘోషము కవిసమయప్రసిద్ధములు. కనుక పాండురంగమాహాత్మ్యపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

"నగరాజతనయ పన్నగరాజధరు మ్రోల
నిలువుడు మదనుఁ డేటలవి నిలిచె
నెలనాగ గటిబొమల్ వాలయింప నెత్తుడుఁ
జిత్తజుఁ డించు వి ల్లెత్తుకొనియె

హరిణాక్షి లసదపాంగాలోకనము నూలు
కొలుపుడు నమ్మరిఁ గొలిపె మరుఁడు
పతి నెఱనూరఁ బార్వతి సూచు నుఱుచూడ్కు-
లాడుడు నలరమ్ములాడె నిశుఁ
గంతుఁడేయఁదొడఁగె నంత నీశ్వరునకు
నచలవృత్తిఁ జలుపు నాత్మవిమల
యోగభావమెడపి రాగోత్కటంబున
గౌరియందు నిలిపెఁ గన్ను మనము." 415ప.5ఆ.

కుమారస్వామి జననము కొఱకు పార్వతీపరమేశ్వరులకు ప్రణయానురాగము కలిగించుటకు మన్మధుని శరసంధానము ప్రకరణము. పార్వతి పరమేశ్వరుని పాదారవిందములకు పుష్పాంజలి ఘటించి, కృతాంజలి అయి, పరమేశ్వరుని ముందర నిలుచును. మన్మధుడు పార్వతి హృదయమును మదనాస్త్రమున భేదించును. పార్వతి మదనప్రేరితయై కటాక్షవీక్షణములు ప్రసరించును. అంతేకాదు. పొంగి పొరలెత్తిన కటాక్షవీక్షణరసప్రవాహమున పరమేశ్వరుని ముంచి లేవదీయును! ముప్పుతిప్పలు పెట్టును.!! ఇంతచేసినను (505-513ప.5ఆ.) ఇంకను "త్రినయనుని తన నయన వాగురలకు లోపుసేయుచు, నగరాజతనయ పన్నగరాజధరు మ్రోల నిలువుడు" అని పయి పద్యము!!! నగరాజతనయ పన్నగరాజధరుని మ్రోల నిలిచిన వెంటనే- ఎప్పుడో నిలచినను ఇప్పుడు మఱల- మదనుడు ఏటలవి నిలుచును. ఎలనాగ కరిదొమలు పొలయింప నెత్తిన వెంటనే చిత్తజుడు ఇంచువిల్లెత్తుకొనును. హరిణాక్షి లసదపాంగావలోకనము నూలుకొలిపిన వెంటనే- ఇంతకు ముందే పార్వతి కటాక్షవీక్షణరసప్రవాహమున పరమేశ్వరుని ముంచి లేవదీసినను, ముప్పుతిప్పలు పెట్టినను మఱల- మరుడు అమ్మరిఁ గొలుపును. అరి అన వింటినారి. అమ్మ అరిగొలుపుట అనగా బాణమును వింటినారికి తగిలించుట. ఇంతకుముందు పరమేశ్వరుని తిప్పలు పెట్టిన పార్వతి కటాక్షవీక్షణములు మన్మధునికి కలిసిరాలేదు కాబోలు!-ఇంతవఱకు సీస పాదములు ఒక విధము. మూడు పాదములలోని అనంతర్యార్థకక్రియలకును కర్త పార్వతి. మూడు సమాపకక్రియలకును కర్త మన్మధుడు. నాల్గవపాదము నడక మాఱినది. అనంతర్యార్థకక్రియకు కర్త పార్వతి కాదు; చూడ్కులు. సమాపక క్రియకు కర్త మన్మధుడు కాడు. అలరమ్ములు. అనగా పూలబాణములు. పార్వతి సూచు నుఱుచూడ్కులు పతి నెఱనూర ఆడిన వెంటనే అలరమ్ములు పరమేశ్వరుని

ఆడెనట! ఇట పతి జగత్పతి కాదు. పార్వతీపతియే. పరమేశ్వరుడు పార్వతికి అప్పుడే పతి అట!! పరమేశ్వరుని నెన్నొసట పార్వతి నిశితదృక్కులు నిలిపిన వెంటనే పూలబాణములు పరమేశ్వరుని ఆడినవట!!! ఏమాడినవి? ఎన్ని పూల బాణములు ఆడినవి? స్పష్టార్థప్రతిపత్తి సన్నగిల్లిన, సీసపద్యమునకు సమతా గుణ మును సడలించిన ఈ నాల్గవసీసపాదము బలవదాకృష్టముగ భాసమానము. అసలు పద్యము ప్రకరణవిరుద్ధము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

ఇది కాళిదాసు కుమారసంభవమును వదలి, తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యములోని పద్యమును అనుకరించుట వలని అనర్థకము.

4. "ఆపురి నున్నతస్ఫటికహర్మ్యవిభాపటలంబు నింగి ను
ద్దీపితమై చెలంగ నిది దివ్యతరంగిణి యెత్తి వచ్చెఁ దా
నీ పయిత్రోవ నంచు బయలీఁదుచుఁ గోయఁ దలంతు రగ్రసం
స్థాపితహేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్." 70ప.1ఆ.

ఇది పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగారశాకుంతలములోని పద్యమని కవిగారి సూచనమే[13]. ఇందు హస్తినాపురవర్ణనము కలదు. హస్తిపురములోని ఉన్నత స్ఫటికసౌధముల కాంతిపటలము ఆకాశమునందు ప్రతిఫలించి అందగింపగా, ఆ పయిత్రోవను ఆకాశగంగ ప్రవహించుకొనుచు వచ్చినదని వియచ్చరాంగనలు ఆకాశమునందే ఈదులాడుచు సౌధాగ్రములందు స్థాపించిన పసిడికుండలను తామర పువ్వులని కోయదలంతురని కల్పనము. హస్తిపురములోని హర్మ్యములు ఆకాశము నంటుచున్నవను అతిశయోక్తి వ్యంగ్యము. స్ఫటికహర్మ్యముల కాంతిప్రవాహము దివ్యతరంగిణి అను భ్రాంతికి అనుకూలము. పసిడికుండలు పసిడితామరలను భ్రాంతికిని తావలము. కనుక శృంగారశాకుంతలపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది,

"గగనము దాఁకి చిత్రగతకాననసంహతిఁ బొల్చు హర్మ్యముల్
నగములు సాఁచి యూఁగిన ఘనంబులఁ బూర్ణసరోవరంబుల
న్వగ జలకేళి సల్పనని వచ్చి యెఱింగి వియచ్చరాంగనల్
మగుడుట సూచి నవ్వుదురు మాడువులందు రమించు దంపతుల్."
948ప.7ఆ.

ఇది ఓషధిప్రస్థపురవర్ణనము. ఇందు ఆకాశమును తాకి, చిత్రములలోని అడవుల సమూహముతో ఒప్పు హర్మ్యములు నగములు సాచి ఊఁగిన, మనస్సులందు పూర్ణసరోవరములను తలంపున జలక్రీడ లాడుటకు వచ్చి, అవి సరోవరములు కావని ఎఱిగి, వియచ్చరాంగనలు తిరిగిపోవుటను చూచి మేడలందు రమించు దంపతులు నవ్వుదురని కల్పనము. ఇందు ప్రథమతః వ్యంగ్యము కావలసిన హర్మ్యముల గగనస్పర్శ వాచ్యము, తదుపరి, "గగనము దాఁకి .... హర్మ్యముల్ నగములు సాఁచి యూఁగిన" అను పంక్తిని అర్థావగతి చింత్యము. నగములన కొండలు, చెట్లును. అవి "చిత్రగతకాననసంహతి"లోనివని అనుకొన్నను, హర్మ్యములు నగములు సాచి యూగుట సాగనివిషయము. హర్మ్యములు, నగములు 'సాఁచియూగిన'ను వియచ్చరాంగనలు మనస్సులందు తలంపవలసినది పూర్ణసరోవరము కాదు. భూకంపము. అసలు పూర్ణసరోవరములు అను భ్రాంతికి అవకాశము లేదు. "సాఁచి" అను పదమును "సూచి" అని సవరించిన, ఆకాశమును తాకి చిత్రగతములైన అడవుల సమూహముతో ఒప్పు హర్మ్యములు, నగములు చూచి, చలించిన మనస్సులందు పూర్ణసరోవరములను తలంపున వియచ్చరాంగనలు జలక్రీడలాడుటకు వచ్చి- ఇత్యాదిగ అర్థము వచ్చును. అప్పుడు కూడ పూర్ణసరోవరములు అను భ్రాంతికి అవకాశము లేదు. హర్మ్యములందలి చిత్రగతమైన అడవుల సమూహములోని చెట్లను చూచి చెంతను సరస్సు ఉండవచ్చునని తలంచిరనవచ్చును. అది ఊహ అగునుగాని, భ్రాంతి కాదు. అంతేకాదు. "చిత్రగతకాననసంహతిఁ బొల్చు హర్మ్యముల్ నగములు సూచి" అను పంక్తికి 'హర్మ్యములందలి చిత్రగతములైన అడవుల సమూహములోని చెట్లను చూచి" అను అర్థము రాదు. పద్యమునందు స్పష్టార్థప్రతిపత్తి లేదు. "సాఁగి యూఁగిన వనంబుల" అను మద్రాసు విశ్వవిద్యాలయము ప్రచురణలోని సంస్కరణమునకును అర్థావగతి లేదు. అయినను, హర్మ్యములు నగములు "సాఁచి" లేదా "సూచి" పూర్ణసరోవరములని వియచ్చరాంగనలు వచ్చి, అవి సరోవరములు కావని తిరిగిపోవుటను చూచి, మాడుపులందు రమించు దంపతులు నవ్వుదురట! మాడుపులన మేడలు. మేడలందు రమించు దంపతులు వాడలందు భ్రమించువారిని చూచుట చిత్రము. అథవా, వియచ్చరాంగనలు మేడలలోని పడకగదులలోనికి వచ్చిపోవుట విచిత్రము. 'పూర్ణసరోవరములని వచ్చి కావని తిరిగిపోవు వారిని చూచి నవ్వుదురు' అనగానే, "వెసఁ బాఱువానిఁ గని నవ్వున్ శాలిగోప్యోఘముల్" అను శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని

పంక్తి, పద్యము స్ఫురణకు వచ్చుట సహజము. అది పులిచార. ఇది నక్క-వాత. కనుక కుమారసంభవపద్యముకృతకము.

ఇది కాళిదాసు మేఘసందేశములోని "నేత్రా నీతాః సతతగతినా" అను శ్లోకమును, పినవీరభద్రుని "ఆపురి" అను పద్యమును, శ్రీకృష్ణదేవరాయల "తల పక్షచ్ఛటఁగ్రుచ్చి" అను పద్యమును కలిపి అనుకరించుట వలని అనర్థకము.

5. "అల పర్జన్యుఁడు కేకిపాత్రముల గుంపాడించుచో మేఘమం
డలపున్ మద్దెల గ్రుంగ లేవను మరున్మార్దంగికుం డర్థి నె
త్త లలి న్నేలకు వ్రాలుచు న్నెగయుచుం దారాడు న త్తెల్ల జ
ల్లులుఁ గెంగుచ్చులు నయ్యె ధారలును దల్లోలేంద్రగోపంబులున్."

92ప.4ఆ.

ఇది శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని పద్యమని కవిగారి సూచనమే[14]. ఇందు వర్షర్తువర్ణనము కలదు. మబ్బులు పట్టగానే మయూరము నాట్యము సేయును. మబ్బులు ఉఱుమును. వాయుదేవుడు, తోడువచ్చిన, మబ్బులు చెల్లా చెదరగును. దట్టమగును. వర్షించును. వానధారలు నేలమీద పడును. అటునిటు చిమ్మును. అవి తెల్లగ ఉండును. వర్షాకాలమున ఆరుద్రపురుగులు వ్యాపించును. అవి ఎఱ్ఱగ ఉండును. ఇది ప్రకృతిసహజము. ఇక నాట్యము చేయు నర్తకీమణులకు ఒక నాట్యాచార్యుడు ఉండును. నాట్యమునకు మద్దెల ప్రక్క వాద్యముగ ఉండును. మద్దెలకు తెల్లజాలరులు, ఎఱ్ఱకుచ్చులు ఉండవచ్చును. మద్దెల వాయించునపుడు మద్దెలకాడు ఉత్సాహము కొలది ఉఱ్ఱూతలూగును. అప్పుడు మద్దెల క్రిందికి వంగును. పైకి లేచును. ఇది లోకసహజము. ఇంద్రుడు అను నాట్యాచార్యుడు నెమళ్లు అను నర్తకీమణులచేత నాట్యము చేయింపగా, వాయుదేవుడు అను మార్దంగికుడు మేఘ మండలమను మద్దెలను క్రిందికి వంగునట్లు పైకి లేచునట్లు వాయించగా, (మద్దెల ధ్వని ఉఱుములధ్వని) వానధారలు అను తెల్లజాలరులు, ఆరుద్రపురుగులు అను ఎఱ్ఱకుచ్చులు తారాడినవని కల్పనము. సహజప్రకృతి, సహజలోకము సమ్యక్సమ్మిళితము. కనుక ఆముక్తమాల్యదపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

> "ఆ క్రౌక్కారసు రాజుమ్రోల నిజరావానంతగేయాభ్రనా
> దై కాతోద్యముఁ గూర్చి మ్రోయ సురగోపాంభోదరాగత్విషా
> నీకోద్యద్ధరిదశ్మకస్థలలసన్నృత్యోరురంగస్థలిం
> గేకీపాత్రములాడె భావముగ న(తి)క్షిప్తాగ్రపింఛంబులై." 760ప. 6ఆ.

ఇది కూడ వర్షర్తువర్ణనము. ఇందు స్పష్టార్థప్రతిపత్తి ఇసుమంతయు లేదు. సమాసాడంబరము సమృద్ధిగ కలదు. "నిజరావానంతగేయాభ్రనాదై కాతోద్యము" అను సమాసమునకు తమ కూత అను అనంతగేయమును, మేఘముల మ్రోతయును కలిసిన ఆతోద్యమని అర్థము వచ్చును. ఆతోద్యమన "వాదిత్రము; తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అనెడి వాద్యచతుష్టయ"మని సూర్యరాయాంధ్ర నిఘంట్వర్థము. "తతం (వీణాదికంవాద్య) మానద్ధం (మురజాదికమ్, వంశాదికంతు) సుషిరం (కాంస్యంతాలాదికం) ఘనమ్. చతుర్విధమిదం వాద్య వాదిత్రాతోద్య నామకమ్" అని అమరకోశము. అనగా వీణామృదంగవేణుతాళముల స్వర సమ్మేళనము ఆతోద్యము. నెమళ్ల కూత, మేఘముల మ్రోత కలిసి ఆతోద్యమట! అభ్రనాదము మృదంగనాదము, కాంస్యతాళమును. కేకీరావము వీణారావము, మురళీగానమును. కేకీరావము అనంతగేయమట! నెమలి కూత క్రేంకారము. అది గేయమా? రాగమా?- నెమళ్ల కూత మేఘముల మ్రోత ఏకమై, వాద్యచతుష్టయ మైన, "కూర్చి మ్రోయ" అను క్రియకు అన్వయమెట్లు? నెమళ్ల కూత, మేఘముల మ్రోత కలిసిన వాద్యచతుష్టయమును "కూర్చి"నదెవరు? "మ్రోయు"నదెవరు? "కూర్చిమ్రోయు"నదెవరు? కేకీపాత్రములా! గేయమునకు అనుగుణముగ పాత్రములు వాద్యమును కూర్చునా?- మొత్తముమీద "నిజరావానంతగేయాభ్రనాదై కాతోద్యముఁ గూర్చిమ్రోయ" అను పంక్తి అనన్వితము. అంతేకాదు. "సురగోపాంభోదరాగ త్విషానీకోద్యద్ధరిదశ్మకస్థలలసన్నృత్యోరురంగస్థలిన్" అను సమాసమునకు ఆరుద్ర పురుగుల, మబ్బుల అరుణకాంతుల సమూహము పైకిఁబోవుచున్న పచ్చని రాతి ప్రదేశము అను రంగస్థలమునందు అని అర్థము వచ్చును. ఆరుద్రపురుగులు ఎఱుపు. మబ్బులు నలుపు. మెఱుపుతీగలు ఎఱుపు. మబ్బులన మెఱుపుతీగలు కావు. అంభోదమన మేఘమనియే అర్థము. మేఘముల కాంతి నేలమీద ప్రసరింపదు. మెఱుపుతీగల కాంతి ప్రసరించును. మెఱుపుతీగలనుటకు మేఘములనుట సంగతము

కాదు. మొదటి సమాసమునందు గేయమునకు అనంతవిశేషణము గణమాత్ర ప్రయోజని. రెండవ సమాసమునందు రంగస్థలికి లసన్మృతోయ్యరువిశేషణము పాద పూరణమాత్రప్రయోజని. మొదటి సమాసము అన్వయక్లిష్టము. రెండవ సమాసము తాత్పర్యదుష్టము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

ఇట శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి అభిప్రాయమిది[15]

> "పైదానిలో "సురగోపాంభోదరాగత్విషానీక"అను భాగమున కర్థము సంగతముగాఁ గనఁబడలేదు. వ్రాఁతప్రతిలో సురగోపాంభోజరాగతృణా" అని కలదు. అది సమన్వయించును. వర్షాకాలమున రాజుప్రోలఁ గేకిపాత్రములు పింఛమునెత్తి భావద్యోతకముగా నాడినవి. అక్కడి నృత్యరంగస్థలమున ఆరుద్రపురుగులను పద్మరాగ మణులును, పచ్చికపట్టులను పచ్చరాళ్లు (హరిదశ్మములు)ను ప్రకాశించుచున్నవి అని భావము. దీనిలో "రాగతృణా" అను చోట "రాగత్రిణా" అని సవరణ చేసికొనవలె. లేకున్నచో ఛందోభంగము గలుగును. తృణశబ్దమునకు రూపాంతరమగు త్రిణశబ్దము వాచస్పత్యాదినిఘంటువులలోఁ గలదు."

కవిగారి ప్రథమభాగములోని అశుద్ధసూచికను సవరణ లేదు. ద్వితీయ భాగములోని ముఖ్యపాఠభేదములందు వివరణ లేదు. అయినను తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథమునందు "సురగోపాంభోజ రాగతృణా" అను పాఠము అర్థవంతముగ కలదు. కవిగారి అచ్చుప్రతిలో "సుర గోపాంభోదరాగత్విషా" అను పాఠము అర్థహీనముగ కలదు. అర్థవంతమైన పాఠమును అర్థహీనమైన పాఠమును చేయుట కంటె, అర్థహీనమైన పాఠమును అర్థవంతమైన పాఠమును చేయుట సహజము. అర్థహీనమైన పాఠమునందు గణ భంగము లేదు. అర్థవంతమైన పాఠమునందు గణభంగము కలదు. అందుకు తృణశబ్దమును త్రిణశబ్దముగ పరిష్కరించుట ఆవశ్యకము. తృణశబ్దమునకు రూపాంతరముగ త్రిణశబ్దము వాచస్పత్యాదినిఘంటుపఠితమైనను ప్రసిద్ధము కాదు. పూర్వకవిప్రయుక్తమును కాదు. అప్రయుక్తపూర్వమైన, అప్రసిద్ధమైన రూపాంతర మును అందలమెక్కించుట కూడ అంత సమంజసము కాదు. అందుకు తప్పొప్పుల పట్టికను, పాఠభేదపట్టికను మౌనముద్ర అపరిహార్యము. అప్రసిద్ధపదమునుబట్టి

"సురగోప .... రంగస్థలిన్" అను సమాసమునకు అర్థము కుదురును. "నిజరావ.... కూర్చిగ్రోయ" అను పంక్తికి అర్థము కుదురదు. ఇదియెల్ల శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని పద్యమును అనుకరించుట వలని అనర్థకము.

> 6. తలఁపఁ దడవ మనము దరికొనుఁ జూచిన
> తెప్పలెల్లఁ గమరి యొప్పు తఱుగు
> నరులఁ బేరుకొన్న నాలుక వొక్కని
> దాఘకాలతపనతాపమడరె."

ఇది విజయసేనములోని ఎత్తుగీతి అనికవిగారి నిర్దేశము.[16] ఇట "అముద్రిత గ్రంథములనుండి పూర్ణపద్యముల నుదాహరించెదము" అని కావ్యాదిని తెలిపిన[17] కవిగారు అసంపూర్ణపద్యమును ఉదాహరించుట గమనార్హము. తిక్కన విజయసేనమునుండి తొమ్మిదిపద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము నందు, రెండు పద్యములు ఉదాహరణపద్యములు అను గ్రంథమునందు ఉదాహరింపఁబడినవి.[18] కవిగారు సంఘటించిన ప్రబంధమణిభూషణమునందు రెండు పద్యములు కలవని వారి సూచనము.[19] మఱొక మూడు పద్యములును కలవని వారి సూచనమే[20]. ప్రబంధమణిభూషణములోని అయిదు పద్యములును ప్రబంధసారశిరోమణియందును, కలవు. ఆ యీ పద్యములందు పయి ఎత్తుగీతము కల సీసపద్యము లేదుగాని, అన్యథా, ప్రబంధమణిభూషణమునందు కలదు.[21] ప్రబంధసారశిరోమణియందును కలదు. ఆ పద్యమిది:

> "కలయంగ ధారుణీతల మగ్నితప్తమై
> నుప్పరిపెన మట్టు లుచ్చియుండఁ
> గులపర్వతంబులు కొలిమిలోఁ గ్రాఁగిన
> యినుపముద్దల క్రియ నెసఁగియుండ
> జలనిధులుజ్జ్వలానల దాహమునఁ గ్రాఁగి
> పొంగెడు తైలంబుఁ బోలియుండఁ
> దనరు నాకాశంబు దావపావకశిఖా
> మండలివిధమున మండుచుండఁ

దలఁపఁ దడవ మనము దరికొనుఁ జూచిన
ఱెప్పలెల్లఁ గములి యొప్పు దఱుఁగు
నరులఁ బేరికొన్న నాలుక వొక్కు ని
దాఘకాలతాపతపనమడరె."

ఇందు తలంపనెంచినంతనే మనస్సు దరికొనుటకు, చూచినంతమాత్రముననే కనుఱెప్పలు కములుటకు, ఎవరినైన పిలిచినంతనే నాలుక వొక్కుటకు కారణమైన నిదాఘకాలతాపతపనస్వరూపము పయి సీసపాదములందు కలదు. సమస్తభూతలము ఉప్పరిపెనము వలె, కులపర్వతములు కొలిమిలో కాలిన ఇనుపముద్దల వలె, సముద్రములు చలచల మఱుగు చమురు వలె, ఆకాశము దావాగ్నిజ్వాలనజ్వాలాతోరణము వలె నిదాఘకాలతాపతపన మడరినది. అందువలన తలంపనెంచినంతనే మనస్సు దరికొనుట, చూచినంతమాత్రముననే కనుఱెప్పలు కములుట, పిలిచినంతనే నాలుక వొక్కుట సంభవము. పద్యము మొత్తముమీద కార్యకారణసంబంధము సమర్థముగ కలదు. కనుక విజయసేనపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

తలఁచిన డెందము గందును
బలికిన నోరెల్లఁ బొక్కుఁ బ్రభ సూచిన ఱె
ప్పలు గమురు ననఁగఁ బటుతర
విలయానలఖాతి నెండ వేసవి గాఁచెన్."792ప.6ఆ.

ఇందు "తలచిన హృదయము కందును, పలికిన నోరెల్ల పొక్కును, సూర్యకిరణమును చూచిన కనుఱెప్పలు కమురును" అనునట్లు పటుతరమైన ప్రళయాగ్ని వలె ఎండ కాచెనని కలదు. ప్రళయాగ్నిసాదృశ్యమున్నను పయి సీసపద్యమునందు వలె కార్యకారణసంబంధము సమర్థముగ లేదు. అంతేకాదు. చూచిన కనుఱెప్పలు కమురును అనునట్లు ఎండ కాచిన దనిన చాలుదానికి, ప్రభ సూచిన అను వివక్ష అనావశ్యకము. అది కేవలము యతిమైత్రిమాత్రప్రయోజని. కనుక, కుమారసంభవ పద్యము కృతకము.

7. "వీనుల చేరగాఁ గడల వెల్వడు బాష్పపయస్సమృద్ధితోఁ
గానఁగనయ్యె గంధగజగామినికిం గనుపోయి కర్ణపా

తోనిధులందునుండి తటితోడుత వెల్వడి బొప్పనిమ్న గా
హీనతరంగరాజి కెదురెక్కిన వారిచరంబుల్ యనన్."

ఇది సూరన ఉదయనోదయములోని పద్యమని కవిగారి నిర్దేశము.[22] ఇందు చెవులవఱకు వ్యాపించిన కన్నుల తుదలనుండి వెలుపడు కన్నీరు నిండిన స్త్రీ కనుదోయి, చెవులను సముద్రములనుండి వెలువడి కన్నీటి ఏఱొకెరటాలకు ఎదురెక్కిన చేపలో అన్నట్లు కలదని కల్పనము. సముద్రమునకు పోటు వచ్చునపుడు సముద్రములోని చేపలు నదిలోనికి వచ్చుట, పాటు వచ్చునపుడు నదిలోని చేపలు సముద్రములోనికి పోవుట సంభవము. కనుక ఉదయనోదయపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

"సురనది ఝషములు డిగ్గఁగ
శరనిధి కా శరధిలోని ఝషకము లెక్కన్
సురనది కిల్లెడపడకయ
కురిసె మహావృష్టి గుండు గూల్చిన భంగిన్." 762ప.గిఆ

ఇందు ఆకాశగంగలోని చేపలు సముద్రములోనికి దిగునట్లు, సముద్రములోని చేపలు ఆకాశగంగలోనికి ఎక్కునట్లు మహావర్షము కురిసినదని కలదు. ఎంత మహావర్షము కురిసినను, ఆకాశగంగలోని చేపలు సముద్రములోనికి దిగుట సంభవమేమో కాని, సముద్రములోని చేపలు ఆకాశగంగలోనికి ఎక్కుట అసంభవము. అందుకు,

"అఖండవర్షాపాతమునఁ గొన్నియెడల మిద్దెలపై
నుండి నీరేకధారగా క్రిందికి జాఱునపుడు క్రింది పల్లమున
మత్స్యములుండఁ దటస్థించునేని యవి తద్ధారామార్గమునఁ
బైకి నెదురీదిపోవుట యనుభవసిద్ధము."

అని కవిగారి అథన్వాచనము[23]. ఎంత అఖండవర్షాపాతమైనను, ఎక్కడనైనను, ఎంత మిద్దెలపైనుండి నీరు ఏకధారగా జాఱినను, క్రింది పల్లములోని చేపలు వర్షధారామార్గమున ఎట్లు పైకి ఎదురీదుకొనిపోవును? అసలు మిద్దెల క్రింది పల్లమునందు చేపలు ఉండుట ఎట్లు తటస్థించును? వర్షధారామార్గమున పల్లములోని చేపలు మిద్దెలపైకి ఎదురీదుకొనిపోవుట ఎవరికి అనుభవసిద్ధము?

చెన్నమరాజు చారుచంద్రోదయమునందు ఇట్లు కలదు.

> "అగడిత నీటఁ దేలి యుడుపాళిఁ గరంగెడు లేఁతితాల్పురా
> నిగరపు వీటికోటడిగు నీటికి రేవెదురెక్కి వేల్పుటా
> పగ పగమీలఁ గూడుదురు పైకొని భోగవతిన్ నిజేశులన్
> బెగడక నిద్రపుచ్చి యల జేడెనకోడెమిటారిగుబ్బెతల్." 97వ.1ఆ.

ఇది కోటవర్ణనము. ఇందు అగడితలోని చేపలు ఆకాశగంగలోనికి పోవుట కలదు. ఎట్లు? చంద్రోదయము కాగానే చంద్రకాంతశిలలు కరిగి కోటగోడలనుండి అగడితలోనికి ప్రవహించు నీటికి రేవు ఎదురెక్కి! పైనుండి నీరు ప్రవహించిన అగడిత నీటిమట్టము పైకి పెరుగును. నీటిమట్టము పెరుగుకొలది చేపలు నీటిపైకి వచ్చుట సహజము. అది నిమిత్తముగ ఇది అతిశయోక్తి. కనుక చారుచంద్రోదయ పద్యము సమర్థనీయము. వర్షధారామార్గమున సముద్రములోని చేపలు ఆకాశగంగ లోనికి ఎదురీదుకొనిపోవుట అసంభవము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

ఇట కుమారసంభవపద్యమునకు ఇంచుకైన సాదృశ్యము కల చారు చంద్రోదయపద్యమును కాదని, కొంచెమైన సాదృశ్యము లేని ఉదయనోదయ పద్యమును ఉదాహరించుటకు హేతువు, కవిగారికి అప్పటికి చారుచంద్రోద యము దృష్టపూర్వము కాకపోవుటమాత్రమే కావచ్చును. కవిగారు ప్రబంధమణి భూషణములోని పద్యములను గుర్తించునెడఁగూడ చారుచంద్రోదయము ప్రసక్తి లేదు. కాని చారుచంద్రోదయపద్యము ప్రబంధమణిభూషణమునందు కలదు. తన్మూల మైన ప్రబంధసారశిరోమణియందును కలదు. అది చారుచంద్రోదయపద్యమని కవిగారు సూచింపలేదు. అసగా ప్రబంధమణిభూషణము ప్రకటించునాఁటికి, కవిగారికి చారుచంద్రో దయము దృష్టపూర్వము కాదని అవగాహనమగును. ప్రబంధమణిభూషణమును ప్రక టించుటకు ఏడాది ముందే కుమారసంభవము ప్రకటింపఁబడినది. కనుకనే, చారు చంద్రోదయపద్యమును కాదని ఉదయనోదయపద్యమును ఉదాహరించుట, చేపలు వర్ష ధారామార్గమున పైకి ఎదురీదిపోవుట అనుభవసిద్ధమని ఉగ్గాటించుట జరిగినదికాఁబోలు!

> 8. "వెన్నెలవెల్లి పొల్కుడలి ప్రేరణసంభవఁ దెక్కి విక్కులన్
> మిన్నును ముంప నం[illegible]
> త్వన్నగలల్పకల్పనము ఛంగిఁ [illegible]
> వెన్నుని భంగిఁ జూపట్టు [illegible]" 87ప.3ఆ.

ఇది ఎఱ్ఱన నృసింహపురాణములోని పద్యమని కవిగారి సూచనమే[24]. ఇందు చంద్రోదయవర్ణనము కలదు. వెన్నెలవెల్లి పాలకడలిగ, రజనీకరబింబము కుండలీభవత్పన్నగతల్పముగ, చంద్రబింబములోని కళంకము విష్ణువుగ కల్పనము. వెన్నెలవెల్లి పాలకడలి అనిపించుట, చంద్రబింబము కుండలీభవత్పన్నగతల్పముగ భాసించుట, చంద్రకళంకము విష్ణువుగ ద్యోతకమగుట సంభవము. కనుక నృసింహ పురాణపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"శ్వేతద్వీపము చంద్రబింబము మహాక్షీరాబ్ధి దత్ జ్యోత్స్న ద
ద్భాతిం గృష్ణుఁడు దన్మృగాంకము లసత్పద్మాలయాక్షీద్యుతుల్
ప్రీతిం జారుచకోరదంపతులు నాఁ బృథ్వీధరుం బోలి వి
ఖ్యాతిం బొల్పగు శారదాధినుతరాకారాత్రులత్యున్నతిన్." 774ప.6ఆ.

ఇందు క్షీరాబ్ధి చంద్రజ్యోత్స్న, మృగాంకము కృష్ణుడు, చకోరదంపతులు లక్ష్మిఅక్షిద్యుతులు అను సంభావనములు కలవు. శారదాధినుతరాకారాత్రులు అత్యున్నతిని పృథ్వీధరుని పోలునట! వచనవైపరీత్యముతోపాటు వ్యర్థపదములు బహుళము. కనుక, కుమారసంభవపద్యము కృతకము. ఇది మఱల విపరింతును.

9. "స్థిరపుణ్యోదయ మేదినీందువదనాసీమంతవీథిలస
ద్గురుముక్తాఫలసూత్రమో సురుచిరశ్రోణీపురంధ్రీసమా
దరధమ్మిల్లలతాంతమాలికయొ భూతస్వీకుచశ్రీమనో
హారసంవ్యానమొ నాఁగ నీవగు ప్రవాహంబొప్పు గోదావరీ."

ఇది ప్రెగ్గడపల్లి పోతయ్యగారి గోదావరీశతకములోని పద్యమని కవిగారి నిర్దేశము[25]. ఇంతవఱకు శతకవాఙ్మయపరిశోధకులకు సహితము గోదావరీశతకము లభింపలేదు. కవిగారికి అంకస్థితాస్థపేటి అయిన సర్వలక్షణసారమను లముద్రిత లక్షణగ్రంథమునందు మాత్రము ప్రెగ్గడపల్లి పోతయ్యగారి గోదావరీశతకమునుండి రెండు పద్యములు ఉదాహరింపఁబడినవి. అందు ప్రకృతపద్యమొకటి. ఇందు గోదావరీనది భూమి అను స్త్రీయొక్క సీమంతవీథిలోని ముత్యాలసరమో, ధమ్మిల్ల బంధములోని పుష్పమాలికయో, కుచసీమమీది ఉత్తరీయమో అన్నట్లు ఉత్ప్రేక్షకలదు.

మూడు సంభావనములును భూదేవిని మూదలించునవి. భూమిమీద ప్రవహించు గోదావరీనదిని వర్ణించునపుడు భూమికి సంబంధించునట్లు సంభావించుటసముచితము. కనుక గోదావరీశతకపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"కరమొప్పన్ వియదంగనాతరలము క్తాహారమో శంభున
త్యురుజూటాశ్రితసర్పకంచుకమొ హేమోర్వీధరగ్లౌసుధా
కరకాంతంబొ హిమాచలోపరిశరత్కాండంబొ భూస్త్రీసితాం
బరమో వారిధి దృష్టిఁ ద్రాగెడు సుధాపానంబొ నాఁగా మునుల్."

921ప.7ఆ.

ఇందు గంగానది ఆకాశము అను స్త్రీయొక్క ముత్యాల హారమో, ఈశ్వరుని జటాజూటమును ఆశ్రయించిన పాముకుబుసమో, మేరుపర్వతము మీది చంద్రుని చంద్రకాంతమో, హిమవత్పర్వతము మీది శరన్మేఘమో, భూమి అను స్త్రీయొక్క తెల్లని వస్త్రమో, సముద్రము త్రాగు సుధాపానమో అన్నట్లు ఉత్ప్రేక్ష కలదు. "హేమోర్వీధరగ్లౌసుధాకరకాంతంబొ" అను సంభావన అంత స్పష్టముగ లేదు. అంతేకాదు. "భూతన్వీకుచశ్రీపనోహరసంవ్యానము" లోని. సొగసు "భూస్త్రీసితాంబరము"నందు లేదు, ఉపరి, "వారిధిఁ దృష్టిఁ ద్రావెడు సుధాపానంబొ" అను పంక్తి ఆలోచనీయము. సుధాపానీయమని కవిహృదయము కాఁబోలు! పానబద్ధమునకు పానీయమను అర్థము కానరాదు. పాత్ర అను అర్థము కలదుగాని, ప్రకరణోచితము కాదు. పైగా హిమాలయపర్వతము సన్నిధిలోని గంగానదికి- శివజటాజూటమునకు, మేరుగిరికి, సముద్రమునకు సంబంధించిన సంభావనములందు సందర్భశుద్ధి లేదు. మీదుమిక్కిలి సప్తర్షును, "హేమపంకరుహరజః పిశంగరుచి గ్రాలు సురాపగఁ గాంచి"రని ముందుపద్యమునందలి ముచ్చట (920ప.7ఆ.) పిశంగరుచి అన ఎఱ్ఱనికాంతి. సప్తర్షులు చూచిన హిమాలయ పర్వతము సన్నిధిలోని గంగానది ఎఱ్ఱగా ఉన్నదని ప్రకరణము. తెల్లగా ఉన్నదని ప్రకల్పనము! పర్వతసంబంధమైన గైరికాదిధాతువుల సంసర్గమున పర్వతము సన్నిధి లోని ప్రవాహము ఎఱ్ఱగా ఉండుట సంభవము. ఎఱ్ఱగా ఉన్న గంగానదిని చూచిన సప్తర్షులు తెల్లగా ఉన్న గంగానదిని వర్ణించుట ప్రకరణవిరుద్ధము. కనుక, కుమార సంభవపద్యము కృతకము. [8]

ఇది ప్రెగడపల్లి పోతయ్య గోదావరీశరకపద్యమును అనుకరించుట వలని అనర్థకము.

10. "కమలాకరస్ఫూర్తి కాసారములయందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
గంభీరజీవనక్రమ మగణ్తలయందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
ధారావిహార ముత్తమతురంగములందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
సుమనోవికాసంబు ప్రమదవనములందుఁ
దమయందుఁ గలుగంగఁ దనరుచుండు
దానమహిమ సముత్తుంగదంతులందుఁ
దమకరమ్ములఁ గలుగంగఁ దనరుచుండు
సిరుల సంతోషమున ముఖ్యశీలవృత్తి
రణజయోదారతలఁ బురి రాజకులము."

ఇది "పేరయగారి పద్మినీవల్లభయ"లోని పద్యమని కవిగారి నిర్దేశము[26]. పేరయ అన బొడ్డపాటి పేరయ. అతని కృతులు అయిదు కలవు. 1. అనంత మహాత్త్వము. 2. పద్మినీవల్లభము. 3. మంగళగిరివిలాసము, 4. శంకరవిజయము, 5. సూర్యశతకము. ఒక్కటి కూడ ఉపలబ్ధము కాలేదు. అనంతమహాత్త్వము నుండి ఒక పద్యము, పద్మినీవల్లభము నుండి ఆరుపద్యములు, మంగళగిరివిలాసము నుండి ఒక పద్యము, శంకరవిజయమునుండి ఏడు పద్యములు, సూర్యశతకమునుండి ఒక పద్యము, చాటువులు మూడు పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు ఉదాహరింపఁబడినవి[27]. అందు పయి సీసపద్యము కలదు. ఇందు రాజవర్ణనము కలదు. సిరులందు కమలాకరస్ఫూర్తి (=లక్ష్మీస్ఫురణ) సంతోషమునందు గంభీరజీవనక్రమము, రణమునందు ధారావిహారము (=ఖడ్గచాలనము) జయమునందు సుమనోవికాసము, ఉదారతయందు దానమహిమ రాజులకు కలవని అర్థము. కమలాకరస్ఫూర్తి (=పద్మాలయస్ఫురణ) కాసారములందును, గంభీర జీవనక్రమము (=లోతువీరు) అగణ్తలయందును, ధారావిహారము (=వేగగమనము) తురంగములందును, దానమహిమ (సుహామదము) ఏనుగులయందును

మాత్రమే రాజులతోపాటు కలవనియు అర్థము. అది రాజులకు సహజము. ఇది పుష్పమునకు సహజము. అర్థద్వయమనుగమము. కనుక పద్మినీవల్లభపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

"వేదాదులగు మహావిద్యల కెల్లను
వనజాసనుఁడుఁ దాను నునికిపట్టు
శృంగారవతులగు నంగనావలికెల్ల
నమరావతియుఁ దాను నాలయంబు
లనుపమానర్ఘ్యరత్నానీకముల కెల్ల
నంభోనిధియుఁ దాను నాకరంబు
లక్షయంబగు నసంఖ్యార్థరాసులకెల్ల
నలకయుఁ దానును నిలయములనఁ
వఱలు పేర్మితో భారతవర్షమునకు
భూషణంబన నధికవిభూతిఁ దనరి
పరఁగు హిమనగాధీశ్వరు పురవరంబు
ప్రస్తుతంబగు నోషధీప్రస్థపురము." 92శీప.7ఆ.

ఇది ఓషధీప్రస్థపురవర్ణనము. ఇందు బ్రహ్మ, ఓషధీప్రస్థపురము వేదాదులగు మహావిద్యలకు ఉనికిపట్టు; అమరావతి? ఓషధీప్రస్థపురము శృంగారవతులగు అంగనాళికి ఆలయములు; అంభోనిధి, ఓషధీప్రస్థపురము అనర్ఘరత్నములకు ఆకరములు; అలకానగరము ఓషధీప్రస్థపురము అసంఖ్యార్థరాసులకు నిలయములు అని గలదు. పద్మినీవల్లభపద్యమునందు వలె శ్లేష మాత్రము లేదు. సమానత్వము కలదు. ఓషధీప్రస్థపురమునకు అమరావతిని, అలకానగరమును, అంభోనిధిని కూడ సమానము చేయుట సరసము. జడపదార్థమైన ఓషధీప్రస్థపురమునకు జంగమస్వరూపమైన బ్రహ్మను సమానము చేయుట సరసముగ లేదు. అంతేకాదు. మొదటి సీసపాదము నందు కడమ సీసపాదములందువలె బహువచనము లేదు. ఉపరి నాల్గవ సీసపాదము నందు నిలయములు అను నిర్దేశము లేదు. "అన" అని కలదు. ఎత్తుగీతమున రెండవ పాదమునందు మఱల "అన" కలదు. మొదటి "అన" వెనుకటి మూడు సీసపాదములకును అన్వయించిన, "వఱలు పేర్మితో" అనుసరికి వాక్యము పూర్తి అగును. "భారతవర్షమునకు భూషణంబన నధికవిభూతిఁ దనరి పరఁగు" అనునది మఱొకవాక్యమగును. రెండు వాక్యములకును పొంతన లేదు. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

11. "కువలయకమలాభినవమనోజ్ఞంబయ్యుఁ

బంకజీవనపరిప్లవము గాక
ఘనసాలిపున్నాగకమనీయమయ్యును
గితవదుష్కలికసంయుతము గాక
సాధుదానప్రౌఢయూధపంబయ్యును
విగ్రుతఖరసమన్వితము గాక
రాజితోత్తమజాతిరత్నాంకితంబయ్యు
శృంగారవిటవిదూషితము గాక
వరసరోవరచయమును వనచయంబు
నృపచయంబును దివ్యమంటపచయంబు
నెలమిఁ దనుఁ బోలుననఁ బొగడ్తలు వహించె
భువనసారంబు గల్యాణపురవరంబు"

ఇది ఎఱ్ఱన మల్హణచరిత్రములోని పద్యమని కవిగారి సూచనమే[28]. ఇందు కల్యాణపురవర్ణనము కలదు. సీసపాదములకు ఎత్తుగీతమునకు క్రమాన్వయము కలదు. కల్యాణపురములోని వరసరోవరచయము కలువలతోను తామరపువ్వులతోను సరికొత్తగ మనోజ్ఞమైనను బురదనీరు పాఱునది కాక, వనచయము కర్పూరములతోను పొన్నలతోను కమనీయమైనను పాడు ఉమ్మెత్తమొగ్గలు కలియునది కాక నృపచయము సాధుమదప్రౌఢగజరాజము కలదయ్యును గాడిదలతోకూడునది కాక, దివ్యమంటపచయము జాతిరత్నములు పొదిగినదయ్యును విటనిలయము కాక- తదితరపురములు- తన్ను పోలునను పొగడ్తలు భువనసారమైన కల్యాణపురము పొందెనని అర్థము. స్పష్టము. వ్యర్థపదములు లేవు. కనుక మల్హణచరిత్రపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"రాజకదంబవిరాజితంబగుఁ గాని
కంటకపార్థివోత్కరము గాదు
పద్మాలయాతిశోభనమనంజనుఁ గాని
కుముదోదయాదిసంకులము గాదు

శుద్ధసువర్ణప్రసిద్ధాత్మమగుఁ గాని
    వరచిత్రవర్ణసంకరము గాదు
పరమౌషధిప్రభాభాసురంబగుఁ గాని
    దుస్తృణద్యోతివిద్యుతము గాదు
వనకులంబును దత్సరోవరకులంబుఁ
జెలువమగు హర్మ్యకులము నక్షత్రకులముఁ
బోలయ నిన్నింటిలోఁ దాను బోలియున్న
ప్రస్తుతంబగు నోషధీప్రస్థపురము." 963ప.7ఆ.

ఇందు ఓషధీప్రస్థపురవర్ణనము కలదు. ఇది సీసపాదములందు మొల్ల రామాయణములోని పద్యమునకు, ఎత్తుగీతమునందు మల్హణచరిత్రపద్యమునకు సంవదించునది. సరోవరకులమునకు "తత్" అను నిర్దేశము గణమాత్రప్రయోజని. హర్మ్యకులమునకు "చెలువమగు" అను విశేషణము పాదపూరణమాత్రప్రయోజని. అంతేకాదు. మల్హణచరిత్రపద్యములోని సీసపాదములందు "కాక" అనుట వలన ఎత్తుగీతమునకు అన్వయము పొసగినది. కుమారసంభవములోని పద్యములోని సీసపాదములందు "కాదు" అనుట వలన ఎత్తుగీతమునకు అన్వయము సడలినది. ఉపరి, మల్హణచరిత్రపద్యమున "తనుఁబోలును" అనుట వలన కల్యాణపూరము ఆధిక్యము సువ్యక్తమగును. కుమారసంభవములోని పద్యమున "తానుబోలియున్న" అనుట వలన ఓసధీప్రస్థపురము ఆధిక్యము సువ్యక్తము కాదు. కనుక, కుమార సంభవములోని పద్యము కృతకము.

ఇది మొల్ల రామాయణములోని పద్యమును సీసపాదములందు, ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్రములోని పద్యమును ఎత్తుగీతమునందు అనుకరించుట వలని అనర్థకము.

12. "సరభసలీలఁ గేళిసితసౌధము లొక్కట నిర్గమించి చ
    ల్లిరి నరనాథుమీఁదఁ బురిలేమలు లాజలు దోయిలించి చె
    చ్చెర శరదంబువాహములు చించి బయల్వడు చంచలాలతల్
    పరిమితవృష్టిబిందువులఁ బర్వతరాజముఁ గప్పు నాకృతిన్."

ఇది ఉదయనోదయములోని పద్యమని కవిగారి నిర్దేశము[29]. ఇందు పౌరాంగనలు తొట్రుపాటుతో తెల్లని క్రీడాసౌధములనుండి ఒక్కుమ్మడిగ వచ్చి

రాజుమీద లాజలు దోయిలించి చల్లిరని, అది శరన్మేఘములను చీల్చుకొని వేగముగ బయల్వడు మెఱుపుతీగలు కొలది వానచినుకులతో పర్వతరాజమును కప్పునట్లు కలదని కలదు. తెల్లని క్రీడాసౌధములను శరన్మేఘములుగ, పౌరాంగనలను చంచలాలతలుగ, దోయిలించి చల్లిన లాజలను కొలది వానచినుకులుగ, రాజును పర్వతరాజుగ సంభావించిన తీరు సంగతము. ఉత్ప్రేక్ష ఉజ్జ్వలము. కనుక, ఉదయనోదయ పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

> "దళితసరోరుహాస్యలు సుధామయహర్మ్యము లెక్కి ప్రీతితోఁ
> జెలువగు పద్దముత్యముల సేసలు సల్లిరి పాండురాంగుపై
> నలి సతటిత్సితాంబుదగణంబు ఘనోపలవృష్టి రాజతా
> చలము పయిన్మొగిం గురియు చాడ్పున సద్రుచు లుల్లసిల్లఁగాన్."
>
> 52ప.8ఆ.

ఇందు దళితసరోరుహాస్యలు సుధామయహర్మ్యము లెక్కి పాండురాంగుని మీద పెద్ద ముత్యముల సేసలు చల్లిరని, అది మెఱుపుతీగలతో కూడిన తెల్లని మేఘముల సముదాయము పెద్ద వడగండ్లను వెండికొండమీద కురియునట్లు కలదని కలదు. ఇందు దళితసరోరుహాస్యలు ముత్యముల సేసలు చల్లినట్లు, మెఱుపుతీగలు వడగండ్లను వర్షించలేదు. మెఱుపుతీగలతో కూడిన తెల్లని మేఘములే వడగండ్లను వర్షించినవి. ముత్యముల సేసలు వడగండ్లయిన, దళితసరోరుహాస్యలు మెఱుపుతీగలతో కూడిన మేఘము లగుదురు. అట్లగుట అసంగతము. దళితసరోరుహాస్యలు ఎక్కిన సుధామయహర్మ్యములను మెఱుపు తీగలతో కూడెన తెల్లని మేఘములుగ సంభావించుట సంగతమేగాని, సుధామయహర్మ్యము లెక్కిన దళితసరోరుహాస్యలు ముత్యముల సేసలు చల్లుటను మెఱుపుతీగలతో కూడిన తెల్లని మేఘములు వడగండ్లు వర్షించినట్లు సంభావించుట సంగతము కాదు. ఉత్ప్రేక్ష ఉజ్జ్వలము కాదు. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

ఇది మెఱుపుతీగలు వానచినుకులను కురియుట వాస్తవము కాదని, మేఘములు వడగండ్లను కురియుట వాస్తవమని, ఉదయనోదయపద్యమును సంస్కరించుటకు, సరోరుహాస్యలు ఎక్కిన సుధామయహర్మ్యములను మెఱుపుతీగతోల

కూడిన మేఘములుగ మేళవించి, హర్మ్యములు సేసలు చల్లుట అసంగతమని, సరోరుహాస్యలు చల్లినట్లు సంఘటించుట వలని అనర్థకము. మెఱుపుతీగలు వాన చినుకులను కురియుట ఉదయనోదయపద్యమునందు ఊహామాత్రమే.

13. "నిజరూపరేఖల నెలఁతల వలపించు
చాతురి గల భద్రజాతివిటులు
వలసినధనము లవ్వారిగా నొసఁగుచుఁ
దరుణులఁ గరఁగించు దత్తవిటులు
మణిమంత్రములచేత నణుమధ్యలఁ గరంచు
మగటిమి గల కూచిమారవిటులు
వలరాజుకళలందు నెలవుల భేదించి
సతులఁ దేలించు పాంచాలవిటులు
వరుస నందఱు తమ జాతివారి వారి
జాతవదనలఁ గూడి సంజాతమదన
కదనకేళివిహారసంపదలఁ బొదలి
మెదలుదురు వీట నధికసమ్మదము లొదవ."

ఇది వేంకటకవి కృష్ణవిలాసములోని పద్యమని కవిగారి నిర్దేశము[30]. ఇందు భద్రజాతివిటులు, దత్తజాతివిటులు, కూచిమారజాతివిటులు, పాంచాలజాతివిటులు తమ తమ జాతిస్త్రీలను కూడిరని కలదు. కామశాస్త్రమునందు స్త్రీపురుషులు నాలుగేసి జాతులుగ వర్గీకరింపఁబడిరి. పద్మిని, చిత్తిని, శంఖిని, హస్తిని అని స్త్రీజాతులు నాలుగు. పాంచాలుడు, కూచిమారుడు, భద్రుడు, దత్తుడు అని పురుషజాతులు నాలుగు. పద్మినీపాంచాలురకు, చిత్తినీకూచిమారులకు, శంఖినీభద్రులకు, హస్తినీదత్తులకు ఆనుకూల్యము. అందువలన భద్రజాతివిటులు శంఖినీజాతిస్త్రీలను, దత్తజాతివిటులు హస్తినీజాతిస్త్రీలను, కూచిమారజాతివిటులు చిత్తినీజాతిస్త్రీలను, పాంచాలజాతివిటులు పద్మినీజాతిస్త్రీలను కూడిరని పద్యతాత్పర్యము. ఇది కామశాస్త్రానుగుణము. కనుక కృష్ణవిలాసపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"ష్ఠి యని లేని శృంగారాతిచేష్టలఁ
బచరించుచుండు నా భద్రునొల్ల

మృదురేఖ ననురక్తిఁ బొదలించి రసమెల్లఁ
గాలించుకొనునొ పాంచాలు నొల్ల
ధనమెక్క నీగియ తగులుగా రతి బెట్టి
దము సేయునట్టి దత్తకుని నొల్ల
మనసీక మంత్రుల మాయల మరగించి
కారించు నా కూచిమారు నొల్లఁ
గలిచి తాల్మి గల్లఁ గలిపించి వేటంబు
సలుపు నెదురుఁ దన్ను గలిచెనేనిఁ
దానుఁ గలిచెనేని దగనిచ్చు నయవిదుఁ
డని మనోజ్ఞు నొక్క వనిత గలిచె." 145ప.8ఆ.

ఇందు ఒక స్త్రీ భద్రజాతివిటుని ఒప్పుకొనలేదు. పాంచాలజాతివిటుని అంగీకరింపలేదు. దత్తజాతివిటుని చిత్తగించలేదు. కూచిమారజాతివిటుని కోరలేదు. పురుషజాతులు నాల్గింటికిని చెందని నయవిదుడైన మనోజ్ఞుని కూడినదని కలదు. నయవిదుడైన మనోజ్ఞుడు భద్రుడు కాడు. పాంచాలుడు కాడు. దత్తుడు కాడు. కూచిమారుడు కాడు. అనగా అతడు జాతిరహితుడు. ఆమె భద్రజాతివిటుని ఒప్పుకొనలేదు కనుక, శంఖిని కాదు. పాంచాలజాతివిటుని అంగీకరించలేదు కనుక, పద్మిని కాదు. దత్తజాతివిటుని చిత్తగించలేదు కనుక, హస్తిని కాదు. కూచిమారజాతివిటుని కోరలేదు కనుక చిత్తిని కాదు. అనగా ఆమె జాతిరహిత. జాతిరహితుడైన విటుని జాతిరహితయైన విటి జతకూడినదని తాత్పర్యము. జాతిరాహిత్యము కామశాస్త్రవిరుద్ధము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

ఇవి "పోల్చిచూడుఁడు" అని కవిగారు హెచ్చరించినవి. ఇట్టివి మఱి రెండు కలవు[31]. 14. ఉత్తరహరివంశము. 122ప.2ఆ; కుమారసంభవము. 694ప.6ఆ- ఈ రెండు పద్యములును ప్రకరణభిన్నములయ్యును పరస్పరనిరపేక్ష్యములు. కనుక పరిత్యక్తము. 15. కేతనకాదంబరి. "కడుపేఁడిపెల్లెండ ........ నిదాఘవేళ." కుమారసంభవము. "ఖేచరులంబరంబునవె........పర్వెనుర్వరన్."- ఇది కుమారసంభవమునందు లేదు. కుమారసంభవములోని దని ప్రబంధమణిభూషణమునందు కలదని కవిగారి ప్రతిపాదనము[32]. ప్రబంధమణిభూషణమునందు పద్యములకు ఆకరములు లేవని కూడ కవిగారి ప్రతిపాదనమే[33].

అసలు ప్రబంధమణిభూషణమునకు ఆధారమైన ప్రబంధసారశిరోమణియందు కుమార సంభవము ప్రసక్తి లేదు. అందువలన "భూచరులంబరంబుననె" అను పద్యము కుమారసంభవములోని పద్యము కావలసిన ఆవశ్యకము లేదు. కనుక పరిత్యక్తము.

ఇక "పోల్చిచూడుఁడు" అని హెచ్చరింపకపోయినను, కవిగారు ఉదాహరించిన సంవాదిపద్యములు కలవు. అవి :

16. "కలకల నవ్వునట్లు దెలికన్నుల ........ బోటియున్."

ఇది పింగళి సూరన ప్రభావతీప్రద్యుమ్నములోని పద్యము[34]. ప్రకరణోచితము. కనుక ప్రభావతీప్రద్యుమ్నపద్యము సహజము.

"కలకల నవ్వునట్లు దమకంబున ........ బ్రసన్నమై". 598ప.4ఆ.

ఇది కుమారసంభవములోని పద్యము. ప్రకరణోచితము కాదు. కనుక, కుమారసంభవపద్యము కృతకము. ఇది మఱల వివరింతును.

17. "లలితాస్యాంబురుహంబు నీలకచరోలంబంబు నేత్రాసితో
త్పల ముచ్చైః స్తనకోక మోష్ఠవిలసద్బంధూక ముద్యత్కటీ
పులినం బుద్గతచిత్తజాతరసవాఃపూరంబు ప్రాణేశ్వరీ
జలజావాసము సొచ్చి యాడక మనోజాతానలం బాఱునే."

ఇది తెనాలి రామలింగకవి కందర్పకేతువిలాసములోని పద్యమని కవిగారి నిర్దేశము[35]. ఇంతవఱకు తెనాలి రామలింగకవి కందర్పకేతువిలాసము ఉపలబ్ధము కాలేదు. కాని, పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు తెనాలి రామలింగయ్య కందర్పకేతువిలాసమునుండి అయిదు పద్యములు ఉదాహరింపఁబడినవి. అందు ప్రకృతపద్యమును కలదు. ఇది వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన ప్రబంధరత్నావళియందు లేదు[36]. ఇందు ప్రాణేశ్వరీజలజావాసము ప్రధానరూపకము. లలితాస్యాంబురుహాదులు ఉపస్కారరూపకములు. ప్రాణేశ్వరి విషయము. (ఉపమేయము) జలజావాసము విషయి. (ఉపమానము) ప్రాణేశ్వరీపరముగ లలితాస్యము, నీలకచము, నేత్రము, ఉచ్చైః స్తనము, ఓష్ఠము, ఉద్యత్కటి, ఉద్గతచిత్తజాతరసము విషయములు. జలజావాసపరముగ అంబురుహము, రోలంబము, అసితోత్పలము,

కోకము, బంధూకము, పులినము, వాఃపూరము విషయులు. ప్రధానోపస్కారవిష యములకు, ప్రధానోపస్కారవిషయులకు అభేదరంజనము సక్రమముగ కలదు. మనోజాతానలరూపకమును తదనుగుణము. కనుక, కందర్పకేతువిలాసపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"అలిధమ్మిల్ల మృణాళహస్తఁ గమనీయావర్తనాభిన్ మహో
త్పలగంధిం గలహంసయాన విలసద్బంధూకరక్తోష్ఠ ను
త్పలనేత్రిం గమలాస్య నంగజరసాంభఃపూరఁ దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చి యాడక మనోజాతానలం బాఱునే" 824ప.గ్రంథ.

ఇందు పార్వతీజలజావాసము ప్రధానరూపకము. అలిధమ్మిల్లాదులు ఉపస్కార రూపకములు. పార్వతి విషయము. జలజావాసము విషయి. పార్వతీపరముగ ధమ్మి ల్లము, హస్తములు, నాభి, గంధము, యానము, రక్తోష్ఠము, నేత్రము, ఆస్యము, అంగజరసము విషయములు. జలజావాసము పరముగ అలి, మృణాళము, కమనీయా వర్తము, మహోత్పలము, కలహంస, బంధూకము, ఉత్పలము, కమలము, అంభః పూరము విషయులు. ఇందు ఆవర్తనాభికి కమనీయ విశేషణము, ఉత్పలగంధికి మహా విశేషణము, బంధూకోష్ఠకు విలసత్, రక్త విశేషణములు, పార్వతికి తత్ అను నిర్దేశము గణమాత్రప్రయోజనములు. అంతేకాదు. ఉత్పలము పునరుక్తభూతము. ఉపరి, ప్రధానోపస్కారవిషయములకు, ప్రధానోపస్కారవిషయులకు అభేదరంజనము సక్రమముగ లేదు. మనోజాతానలరూపకమును తదనుగుణము కాదు. అలి మొదలు కమలము వఱకు విషయులు ముందు, ధమ్మిల్లము మొదలు ఆస్యము వఱకు విషయ ములు తర్వాతను కలవు. అంగజరసము, పార్వతి అను విషయములు ముందు; అంభఃపూరము జలజావాసము అను విషయులు తర్వాతను కలవు. మనోజాతవిష యము ముందు అనలవిషయి తర్వాత కలవు. క్రమభంగము. అంతేకాదు. అలి ధమ్మిల్లాదులు పార్వతీజలజావాసమునకు విశేషణములు కావు. పార్వతీజలజావాస విశేష్యములోని ఏకదేశమైన పార్వతికే విశేషణములు. ఉపరి, విశేషణములు స్త్రీ లింగములు. విశేష్యము నపుంసకలింగము. విశేషణ విశేష్యసంబంధమెల్ల విపరీతము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

ఇట మానవల్లి రామకృష్ణకవిగారి అభిప్రాయమిది[37]:

"ఉపమానోపమేయవిపర్యయమును విశేషణవిశేష్యలింగభేదమును దోషము లుగా గ్రహించి వానిఁ దొలగింపనని కాఁబోలును తెన్నాలి రామలింగకవి తన కందర్పకేతువిలాసములో నిట్లు మార్చి పద్యమును గూర్చుకొనెను."

ఇందు కుమారసంభవపద్యమునందు "ఉపమానోపమేయవిపర్యయము, విశేషణవిశేష్యలింగభేదము కలదని, కందర్పకేతువిలాసపద్యమునందు లేదని, ఇద మిత్థముగ కలదు. అవి "దోషములుగా గ్రహించి "అనుటలోనే "అవి దోషములు కావు గుణములు" అను కవిగారి ఆంతర్యము కాననగును. కాని, కుమారసంభవ పద్యములోని విషయీవిషయపర్యయము, విశేషణవిశేష్యలింగభేదము, ఏకదేశాన్వయ శ్లేశపాశము దోషములే. అవి కవిగారి దృష్టిలో గుణములు. గుణదృష్టి లేనిచో గణసృష్టి జరుగదు.

మానవల్లి రామకృష్ణకవి గారి మఱొక అభిప్రాయమిది[38]:

> ఇందు రూపకమున విశేషణవిన్యాసక్రమమున దోషము సంఘటిల్లె ననియు దానిని దొలగింపఁ గాఁబోలుఁ జోడని పద్యము సంస్కరించి భావనోద్భోధితసంవిచ్చమత్కారశూన్యుఁడగు తెనాలికవి యర్థచౌర్యము గావించె. రెండవపద్యమునఁ జతుర్థపాదమును మార్చుకుండుట సమస్యా పూరణ కౌశలప్రకాశనము కాఁబోలు"

తెనాలికవి "భావనోద్భోధితసంవిచ్చమత్కారశూన్యు"డట! అయినను "జోడని పద్యము" సంస్కరించెనట!! "చతుర్థపాదమును మార్చకుండుట సమస్యాపూరణ కౌశలప్రకాశనము కాఁబోలు" నట!!- చమత్కారశూన్యుడు కౌశలప్రకాశనము చేయును కాఁబోలు! దోషదూషితమైన పూర్వపద్యమును తర్వాతికవి గుణభూషితమైన పద్యమును సత్కరించుట ఎంత సంభవమో, గుణభూషితమైన పూర్వపద్యమును తర్వాతికవి దోషదూషితమైనపద్యముగ తస్కరించుట కూడ అంత సంభవము.

> 18. "కమలజు తోరపుం బుసుక కంచము పాదసరోరుహార్చనా
> కమలము వారిజోదరుని కన్ను కరంబున కాదిభోగిభో
> గము రవణంబు చంద్రుఁడు శిఖాకుసుమంబఁటె యెవ్వరీఁడు మా
> రమణునకుం గుమారగిరిరాజనివాసున కన్యదైవముల్".

ఇది రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణములోని పద్యమని కవి గారి సూచనమే.[39] ఇందు శివునికి బ్రహ్మకపాలము భిక్షాపాత్ర, విష్ణువుకన్ను పూజాపుష్పము, ఆదిశేషువుపడగ హస్తాభరణము, చంద్రుడు తలపూవు అని కలదు. అన్నియు ప్రసిద్ధవిషయములే. విష్ణువు "తన కన్నుపుచ్చి (శివుని) పదాంబుజములు పూజించి సుదర్శనచక్రమును పడసినట్లు" మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునందు కలదు. (392ప.) కుమారసంభవమునందును స్థలాంతరము నందు కలదు. (164వ.2ఆ.) కనుక, త్రిపురాంతకోదాహరణపద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"హరినేత్రాంబుజ మంఘ్రిపీఠ మజుమస్తాబ్జంబు సత్కేళిపం
కరుహం బాసితరోచి జూటలతికాకల్పంబు విశ్వంభరా
ధరవంశేశులు కర్ణకుండలము లుద్యద్దేవతానీకముల్
పరివారంబుగ నున్న శంభుఁ దనకుం బ్రాణేశుగాఁ బ్రీతితోన్."848ప.7ఆ

ఇందు బ్రహ్మ శిరఃకమలము శివుని లీలాకమలమని, విష్ణువు నేత్రకమలము శివుని పాదపీఠమని కలదు. శివుని లీలాకమలము లేటికొదమ అని శ్రీనాథుని హరవిలాసమునందు కలదు. (67ప.5ఆ.) భీమఖండమునందును కలదు. (123వచ. 4ఆ.) జానపదవాఙ్మయమునందును కలదు. బ్రహ్మ శిరఃకమలము శివుని లీలా కమలముగ ప్రసిద్ధము కాదు. విష్ణువు నేత్రకమలమును శివుని పాదపీఠముగ ప్రసిద్ధము కాదు. అంతేకాదు. కేళిపంకరుహమునకు "సత్" అను విశేషణము గణమాత్రప్రయోజని. ఉపరి, దేవతానీకములకు "ఉద్యత్" అను విశేషణము యతిమైత్రిమాత్రప్రయోజని. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

19. "నేలయు వింగియుఁ దాళముల్ గావించి" విరా-ఆ-2.

"నేలకు మింటికిన్ దొడరి నేర్పున సూత్రము వన్న మంచుఁ గుం
చాలను గొల్వఁ ద్రాక్షిసుకచాలునఁ బేనఁగఁ జుక్క నెన్నఁ జ
త్రాలను నార లొల్చి నెగడన్ వడగండ్లను గుబ్బ గట్టఁగాఁ
జోలిన మీకు నిచ్చఁగికి సంయమి దెప్పుట యేమి సోద్యమే."

ఇది రఘునాథరాయల రామాయణములోని పద్యమని కవిగారి సూచనమే[40]. ఇట్టి ఘట్టము పాలకురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమునందే కలదని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ప్రతిపాదనము[41]. ఆ ద్విపదఘట్టమిది :

"నెట్టన నేలకు నింగికి నూత్న
పట్ట మోఁకాళ్లకు బట్టతలలకు
ముడివెట్టఁ దననీడ గడవంగఁ బాఱ
పడి నెండమావుల కడగళ్ల కట్ట;
పాయక రెండుగాఁ బారెడు నీరు,
ప్రేయఁ బుట్టున్న గోరోయని యమ్మ;
బా నార యొలువఁ జట్టాతిపైఁ గ్రుంక
నేమంగు పురుడోయ నినుము త్రాడ్వేన;
లలిగొన దెసలు తాళములు వాయింపఁ
జెలఁగుచు రోఁకటఁ జిగురులు గోయ;
కలి వెన్న పుచ్చఁ గొండలు దొంతిఁ బేర్ప
నిల మంచుఁ గుంచానఁ గొలువ రేఁబవలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ వాయువుఁ బట్ట వడగళ్ల గుళ్ల
గట్ట వెన్నెల గుంపుగాఁ జేయ వచ్చి
పుట్టినప్పుడె నేర్చు బుద్ధుల ప్రోఁక."

తిక్కన పాదము, ద్రౌపదిని కీచకుడు "ఒడిచి తలపట్టి తిగిచి కూలఁదాచు"ట చూచిన భీముని క్రుద్ధత్వమును ఔద్ధత్యమును వ్యక్తము చేయునది. "నేలయు నింగియుఁ దాళములుగాఁ జేసి యేపున రేఁగి వాయించి యాడ ........ భీముఁ డతిభయంకరాకారత నతిశయిల్లె" నని అతిశయోక్తి. అది సందర్భోచితము. కనుక తిక్కన పాదము సహజము.

రఘునాథరాయల రామాయణపద్యము ఋష్యశృంగుని ఋష్యాశ్రమము నుండి రాజధానీనగరమునకు తీసికొని రాఁగలిగిన వేశ్యల వైదగ్ధ్యమును వ్యక్తము చేయునది.

నేలకు నింగికి సూత్రము పట్టుట, మంచును కుంచముతో కొలుచుట, ఇసుకతో త్రాళ్లు పేనుట, చుక్కలు లెక్కపెట్టుట, చట్రాతిని నారతీయుట, వడగడ్లతో గుడులు కట్టుట ఎంత అసాధ్యమో, ఋష్యశృంగుని తీసికొనిఁ రాగలుగుట కూడ అంత అసాధ్యము: అసాధ్యమును సాధ్యము చేసిరని ప్రశంస, కనుక రఘునాధరాయల రామాయణ పద్యమును సహజము,

పాలకుఱికి సోమనాధుని పండితారాధ్యచరిత్రద్విపదఘట్టము, వలచిన మల్లణుని వైదొలగఁజేసిన వేశ్యమాత వైయాత్యమును వ్యక్తముచేయునది. తుది ద్విపదను "వెన్నెల గుంపుగాఁ జేయఁ, జచ్చి పుట్ట, నప్పుడనేర్చు బుద్ధుల ప్రోక" అని గ్రంధమునందు కలదు. (పుట 359) నేలకు నింగికి సూత్రము పట్టుట, మోకాళ్లకు బట్టతలకు ముడిపేయుట. తన నీడను దాటి నడచుట, ఎండమావుల దప్పికతీర్చుకొనుట. ప్రవహించు నీటిని రెండుగా నఱకుట, పులిజున్ను అమ్ముట, రాతినుండి నారతీయుట, చట్రాతిపై మునుగుట, ఏనుగునకు పురుడు పోయుట, ఇసుకతో త్రాడును పేనుట, దిక్కులు తాళములు వాయించుట, చిగురులు రోకలితో కోయుట, కలినుండి వెన్నతీయుట, కొండలు వరుసగా పేర్చుట, మంచు కుంచముతో కొలుచుట, రాత్రిని పగలు చేయుట, ఆకాశమున చిత్రరూపములు వ్రాయుట గాలినిపట్టుట, వడగళ్లతో గుడులు కట్టుట, వెన్నెలను పోగుచేయుట, చచ్చి పుట్టుట వంటి అసంభవములను సుసంభవములు చేయుట వేశ్యమాతకు వేద్యమని అతిశయోక్తి. కనుక పాలకుఱికి సోమనాధుని పండితారాధ్యచరిత్రద్విపదఘట్టము కూడ సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

"నేలయు నింగియుఁ దాలముల్ వాయుంప
నెండమావులఁ బట్ట బండతలయు
మోఁకాలు ముడిపెట్ట రోఁకటఁ జిగుళులు
గోయఁ జట్రాతిపై గ్రుంగ నిడుపు
లేక చిత్రముvvాయ నాకాశమున దాప
రములిడ మంచుఁ గుంచములఁ గొలువ
నేనుంగు పురుడోమ రా నారఁగొన గాలి
గంటిడ నిసుమునఁ గట్టు దాల్పఁ

నీరి నడుము డెంప నేలఁ డెన్నుండి చే
వెల్పఁ గలియుఁ ద్రచ్చి వెన్న గొనఁగఁ
గడవ నేర్పుగలిగి కందువు మానెఁడై
కత్తిగొంటు లయిన యత్తగంతు" 135ప. 8ఆ.

ఇదికూడ వేశ్యమాతల వెడగు మాయలు వ్యక్తము చేయునది. కాని, కథా ప్రయోజనము కలది కాదు. విటీవిటవర్ణనమున కవి వివరణము. ఇందు "నేలయు నింగియుఁ దాలముల్ వాయించుట" తిక్కన భారతమునందు కలదు. "నేలఁదెన్నుండి చే వెల్చుట "వినా, కడపు విషయములెల్ల పండితారాధ్యచరిత్రమునందు కలవు. అట "ఎండమావుల కడగళ్ల కట్ట" అని కలదు. ఇట "ఎండమావులఁబట్ట" అని కలదు. కడగళ్ళు అన కష్టములు. అవి దప్పిక వలని అపస్థలు. ఎండమావుల నీరు త్రాగుట, ఎండమావుల వెంటఁబడుట అను పలుకుబడులు ప్రసిద్ధము. ఎండమావు లను పట్టుకొనుట అను పలుకుబడి అప్రసిద్ధము. అట "మ్రోఁకాళ్లకు బట్టతలకు ముడివెట్ట" అని కలదు. ఇట "బండతలయు మ్రోఁకాలు ముడివెట్ట" అని కలదు. మోకాలికి బట్టతలకు ముడివెట్టుట అను పలుకుబడి ప్రసిద్ధము. మోకాలికి బండతలకు ముడివెట్టుట అను పలుకుబడి అప్రసిద్ధము. అట "చట్రాతిపైఁ గ్రుంక" అని కలదు. ఇట "చట్రాతిపై గ్రుంగ" అని కలదు. పండితారాధ్యచరిత్ర ముద్రితగ్రంథమునందు "గ్రుంగ" అనియే కలదు[42]. కాని అర్థరహితము. కనుక అచ్చుతప్పు కావచ్చును. అది కుమారసంభవమునందు కలదు. అట "ఆకసమునఁ జిత్రరూపములు వ్రాయ" అని కలదు. ఇట "నిడుపు లేక చిత్రము వ్రాయ నాకాశమున దాపరము లిడ" అని కలదు. ఆకాశమున చిత్రరచన అసంభవము. నిడుపు లేక చిత్రరచన సుసంభవము. నిడుపన పొడవు. పొడవు లేక పొట్టి చిత్రము వ్రాయవచ్చును. దాపరమన "దాఁచి యుంచుటలు" అని కవిగారి లఘుటీక[43]. ఆకాశమున దాచుట అసంభవమే. అట "వాయువుఁ బట్ట" అని కలదు. ఇట "గాలి గంటిడ" అని కలదు. గాలిని పట్టు కొనుట అను పలుకుబడి ప్రసిద్ధము. గాలికి గంటుపెట్టుట అను పలుకుబడి అప్రసిద్ధము. అట "ఇసుము త్రాడ్పేన" అని కలదు. ఇట "ఇసుమునఁ గట్టుదాల్ప" అని కలదు. "కట్టుదాల్ప= కట్టుత్రాడు పేనుటకు" అని కవిగారి లఘుటీక[44]. కట్టు అనగా కట్టుత్రాడు, తాల్చుట అనగా పేనుట అను టీకాతాత్పర్యము సరళము కాదు. అంతేకాదు. ఇసుకతో త్రాడు పేనుట అను పలుకుబడియే ప్రసిద్ధము. ఇసుకతో

కట్టుగాల్చుట అను పలుకుబడి అప్రసిద్ధము. అట "పాయక రెండుగాఁ దారెడు నీరు గ్రేయ" అని కలదు. ఇట "నీరి నడుము వెంప" అని కలదు. ప్రవహించు నీటిని రెండు ముక్కలుగ నరుకుట అను పలుకుబడి ప్రసిద్ధము. నీటిని నడిమికి తెంచుట అను పలుకుబడి అప్రసిద్ధము. పండితారాధ్యచరిత్రములోని పలుకుబడులు ప్రసిద్ధ ములు. కుమారసంభవములోని పలుకుబడులు అప్రసిద్ధములు. అంతేకాదు. బట్టతలకు బండతల ప్రాసమాత్రప్రయోజని. త్రాడుపేనుటకు కట్టుతాల్చుట యతిమైత్రిమాత్ర ప్రయోజని. గాలిని పట్టుటకు గాలిని గంటుపెట్టుట గణమాత్రప్రయోజని. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

20. "అమృతంబులో లేని యనురాగగుణ మిందుఁ
గలదని విబుధయుగ్మములు గ్రోలఁ
జంద్రోదకం బింత చవి యగునే యని
సిద్ధకన్యకలు చేసేతఁ ద్రావ
వెలి రసాయన మింత వృష్యమే మీకని
యచ్చరల్ విటులకు నందియీయ
సోమలతాసిద్ధిఁ జొక్కనే లందిట్టి
మఱపు గల్గునె యని మఖులు సొక్క
వేడ్క లెలరార నొడళుల వీఁక దక్క
రతిపరిశ్రాంతమైన యౌవతము పెలఁగ
నిదియె సిద్ధౌషధము సద్యమిష్టవంబు
ననుచు సేవించి రోలి దివ్యాసవంబు."

ఇది ఏ కావ్యములోని పద్యమో కవిగారు తెలుపలేదు[45]. కాని, ఇది కవిగారి వసంతవిలాసములోని పద్యము (89ప.1ఆ) నగము పద్యము సరిసమానము. సగము పద్యము పాఠభిన్నము. ఇందు దేవతల జంటలు, సిద్ధకన్యకలు, అప్సరోవిటులు, సోమయాజులు దివ్యాసవమును సేవించిరని కలదు. దేవతలు సేవించునది అమృతము. అమృతములో అనురాగగుణము కలదని దేవతల జంటలు దివ్యాస వమును సేవించిరట: అనగా దివ్యాసవమది అమృతము కంటె భిన్నమని అర్థము. సిద్ధులు సేవించునది చంద్రోదకము. అది "సిద్ధతంత్రములఁ బ్రసిద్ధమగు రసాయన విశేషము" అని కవిగారి అర్థవివరణము[46]. అట్టి చంద్రోదకమునకు అంత

రుచిలేదని సిద్ధకన్యకలు దివ్యాసవమును సేవించిరట! అనగా దివ్యాసవమది చంద్రో దకముకంటె భిన్నమని అర్థము. అప్సరోవిటులు సేవించునది వెలి రసాయనము. రసాయనమన "దేహము నజరామరముగఁ జేయఁజాలిన దివ్యౌషధము" అని కవి గారి లఘుటీక.[47] అట్టి రసాయనమును అంత కామోద్దీపకము కాదని అప్సరోవిటులు దివ్యాసవమును సేవించిరట! అనగా దివ్యాసవమది రసాయనము కంటె భిన్నమని అర్థము. సోమయాజులు సేవించునది సోమరసము. సోమలతనుండి తీయునది. అట్టి సోమరసము ఎట్టి మైమఱపును కలిగింపదని సోమయాజులు దివ్యాసవమును సేవించిరట! అనగా దివ్యాసవమది సోమరసము కంటు భిన్నమని అర్థము. అనగా అమృతముకంటె, చంద్రోదకముకంటె, రసాయనముకంటె, సోమరసముకంటె భిన్న మైన దివ్యాసవమది మాదకద్రవ్యమని ఫలితార్థము. మాదకద్రవ్యమైన దివ్యాసవము అమృతముకాదు; చంద్రోదకముకాదు; రసాయనముకాదు; సోమరసము కాదు అని కవి హృదయము. కానిమాట నిజము. కనుక పయి పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

"అమరులు ద్రావుచో నమృతమందురు దీని నహిద్విజం బజ
స్రము గొని యానుచో నిది రసాయన మందురు భూసురౌఘమా
గమవిధి సోమపానమని గైకొని యానుదు రెందు జక్రియాం
గమునెడ వస్తువందురది కౌశికు లీ సుర పేర్మి వింతయే." 329ప.9ఆ.

ఇందు మూడు, నాల్గుపాదములందు "ఎందు జక్రియాంగమునెడ" అను పాఠము "ఎందు చక్రియాగమునెడ" అనియును కవిగారి 1914వ సంవత్సరము నందలి ముద్రణమునందు ప్రత్యంతరమునందు కలదు. అది తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథమునందు "ఎందు చక్రయాగమునెడ" అని కలదు. ఇటీవలి ముద్రణములందు "ఎందు జక్రియాగమునెడ" అని[48] కలదు. కాని, కవిగారి 1936వ సంవత్సరమునందలి వ్యాసమునందు "అర్హణక్రియాంగము నెడ" అను పాఠము కలదు. ఇది అర్థవంతము. ఇంతకు పద్యము మధుపానగోష్ఠి లోనిది. మానవులు సేవించు మద్యమును దేవతలు సేవించిన అమృతమని, భోగులు సేవించిన రసాయనమని అందురట! బ్రాహ్మణులు మద్యమును సోమరసమని త్రాగుదురట!! కౌశికులు అర్హణక్రియాంగము నెడ వస్తువు అందురట. ఇతరులు

సేవించు మద్యము, కౌళికులు భావించు వస్తువు ఒకటే. అదే, దేవతలు సేవించు అమృతము, భోగులు సేవించు రసాయనము, బ్రాహ్మణులు సేవించు సోమరసము అనుట విపరీతము. కనుక కుమారసంభవపద్యము కృతకము.

ఇది వసంతవిలాసములోని పద్యమును అన్యథాకరించుట వలని అనర్థకము.

ఇవి కవిగారు తెలిపినవి. ఇక నన్నయ, కేతన, తిక్కనల పద్యములకు కుమారసంభవపద్యములు అనుకరణములని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు తెలిపినవి కలవు, అవి:[49]

| | | | | |
|---|---|---|---|---|
| 21. | నన్నయ. | 38ప.3ఆ. | ఆ.ప. | - 104ప.1ఆ. కు.సం. |
| 22. | ,, | 63ప.6ఆ. | ,, | - 622ప.11ఆ ,, |
| 23. | కేతన | 94ప.6ఆ. | ద.కు.చ. | - 867ప.7ఆ. ,, |
| 24. | తిక్కన. | 49ప.1ఆ. | ఉ.రా | - 974ప.12ఆ. ,, |
| 25. | ,, | 61ప.4ఆ. | ,, | - 760ప.11ఆ. ,, |
| 26. | ,, | 112ప.5ఆ. | ,, | - 651ప. 5ఆ. ,, |
| 27-30. | ,, | 226ప.227వచ. | | - 698-702ప. |
| | | 51ప.3ఆ. | ద్రో.ప. | - 11ఆ. ,, |
| 31. | ,, | 158ప.3ఆ. | క ప. | - 726ప.11ఆ. ,, |
| 32. | ,, | 42ప.3ఆ. | ,, | - 917ప.12ఆ. ,, |
| 33. | ,, | 169ప.5ఆ. | శాం.ప | - 724ప.6ఆ. ,, |
| 34. | ,, | 31ప.2ఆ. | వి.ప. | - 520ప.5ఆ. ,, |
| 35. | ,, | 292,293ప.2ఆ. | ,, | - 524ప.5ఆ. ,, |
| 36. | ,, | 76ప.5ఆ. | ద్రో.ప. | - 824ప.12ఆ. ,, |
| 37. | ,, | 22ప.2ఆ. | స్త్రీ.ప. | - 752ప.11ఆ. ,, |
| 38. | ,, | 9ప.2ఆ. | ,, | - 759ప.11ఆ ,, |
| 39,40 | ,, | 215,216ప.2ఆ. | భీ.ప. | - 811,813ప.12ఆ. ,, |

ఇవిగాక నన్నయ, కొఱవిగోపరాజుల పద్యములకు, కుమారసంభవ పద్యములకు సంవాదము కల సందర్భములు దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు తెలిపినవికలవు. అవి[50] :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 41. | నన్నయ. | 58ప.1ఆ. | స.ప. | - 553ప.10ఆ. | కు.సం. |
| 42, | ,, | 175ప.8ఆ. | ఆ.ప. | - 702ప.6ఆ. | ,, |
| 43. | ,, | 392ప.2ఆ. | అర.ప. | - 715ప.11ఆ. | ,, |
| 44. | కొఱవిగోపరాజు. | 16ప.1ఆ. | సిం.ద్వా. | - 29ప.1ఆ. | ,, |

ఇవిగాక పాలకుఱికి సోమనాథుని ద్విపదపట్టములకు కుమారసంభవపద్యములకు సంవాదము కల సందర్భములు నిడుదవోలు వేంకటరావుగారు తెలిపినవి కలవు. అవి[51]:

| | | | | | |
|---|---|---|---|---|---|
| 45. | పాలకుఱికిసోమనాథుడు. | 7పు.అవ. | పంచ. | - 57ప.1ఆ. | కు.సం. |
| 46. | ,, | 90పు.పు.ప్ర. | ,, | - 351ప.3ఆ. | ,, |
| 47. | ,, | 232-4పు.ప.ప్ర. | ,, | - 248ప.3ఆ. | ,, |

ఇవిగాక నాచన సోమనాథుని, పోతన, భట్టుమూర్తి, చేమకూర వేంకటకవి పద్యములకు, కుమారసంభవపద్యములకు సంవాదము కల సందర్భములు వేదాల తిరువేంగళాచార్యులుగారు తెలిపినవి కలవు. అవి[52]:

| | | | | | |
|---|---|---|---|---|---|
| 48. | నాచనసోమనాథుడు. | 192ప.2ఆ. | ఉ.హ. | - 394ప.4ఆ. | కు.సం. |
| 49. | ,, | 141ప.5ఆ. | ,, | - 644ప.5ఆ. | .. |
| 50. | పోతన | 27ప.8స్కం. | భాగ | - 84ప.1ఆ. | ,, |
| 51. | భట్టుమూర్తి | 70ప.2ఆ. | వ.చ. | - 12ప.8ఆ. | ,, |
| 52. | చేమకూరవేంకటకవి | ? | | - 14ప.8ఆ. | ,, |

ఇవిగాక నన్నయ పద్యమునకు, కుమారసంభవపద్యమునకు సంవాదము కల సందర్భము చేకుమళ్ల కామేశ్వరరావుగారు తెలిపినది కలదు. అది[53]:

| | | | | | |
|---|---|---|---|---|---|
| 53. | నన్నయ | 97ప.2ఆ. | అర.ప. | - 737ప.6ఆ. | కు.సం. |

ఇవిగాక ఇంకను నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, చిమ్మపూడి అమరేశ్వరుని, శ్రీనాథుని, పోతన, నందితిమ్మన, అల్లసానిపెద్దన, చేమకూరవేంకటకవి పద్యములకు కుమారసంభవపద్యములకు సంవాదము కల సందర్భములు కలవు. అవి కూడ పోల్చి చూడవలసినవి.

54. "మంచిగ భూరిభూసురసమాజములెల్లను భక్తితోడఁ బూ
జించి యభీష్టదానములు సేసి ధనార్థులఁ దన్పి దిక్కులన్
నించె యశంబు బంధులకు నెయ్యురకున్ హృదయప్రియంబుగా
వించె విభూతి యేర్పడఁ బవిత్రుఁడు ధర్మసుతుండు నెమ్మితోన్."
16ప.1ఆ.స.ప.

ఇది నన్నయ పద్యము. ఇందు మయిసభాప్రవేశము చేసిన ధర్మరాజు ధర్మకార్యములు వర్ణింపఁబడినవి. అవి యశస్సంబంధులు. అందుకు "మంచిగ" అను ప్రాతిపదిక అర్థవంతము. కనుక, నన్నయ పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"మంచిగఁ బ్రీతిఁ బాయక సమస్తజనంబులుఁ దన్నుఁ గొల్వ జీ
వించిన ధన్యుఁ డా మహిమవీడిన జీవము మేననిల్ప నా
సించి విభుండు దానొకట సేవకుఁడై మనుకంటె ముందఱా
ర్జించిన కీర్తి నిల్వగతి సేకుఱఁగా నని చావు సేగియే." 562ప.10ఆ.

ఇందు తారకాసురుని మంత్రనిశ్చయము వర్ణింపఁబడినది. అది కూడ యశస్సంబంధి. అందుకు "మంచిగ" అను ప్రాతిపదిక తారకాసురుని పరముగ అర్థహీనము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

55. "పదతలంబుల కెంపు పరఁగిన తలము కుం
కుమలిప్తమైన చందము వహింప
నంగంబు సునుగాంతి యదరిన గోడలు
వేదులు మణిమయవిధము నొందఁ
గనుఁగవ మెఱుఁగులు గదిరిన ముందఱ
పుష్పోపహారంబు పొలుపు దాల్ప
వేనలి కప్పు పర్విన మీఁదు నీలదు
కూలంబు మేల్కట్టు కొమరు వడయఁ
దాను జొచ్చిన కతన మత్స్యకీతీశు
నింట నిమ్మెయిఁ గ్రొత్త యొప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ కల్ల నల్ల
పాండురాజతనూభవపత్ని యుండె."
303ప.1ఆ.వి.ప.

ఇది తిక్కన పద్యము. ఇందు సైరంధ్రీవేషమున సుదేష్ణసౌధము పయి భాగమును ఎక్కినప్పటి ద్రౌపది వర్ణనము కలదు. అది నఖశిఖపర్యంతము ప్రత్యంగవర్ణనము కాదు. కాంతివర్ణనము మాత్రమే. పాదారుణద్యుతి కుంకుమ లేపనముగ, శరీరకాంతి మణిమయవిధముగ, కటాక్షరోచిస్సులు పుష్పోపహారముగ, శిరోజనీలిమ నీలిదుకూలము మేల్కట్టుగ భాసించుట సంభావ్యము. కనుక, తిక్కన పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"అరుణాంఘ్రి తలదీప్తి నవనీతలంబెల్లఁ
పద్మరాగస్థలభాతి నొనర
వదనేందుకాంతి దిగ్వదనకైరవముల
కాలచంద్రాతపలీల నెఱయ
నధరారుణద్యుతి నారణ్యతరులతా
సమితి పల్లవితవిభ్రమముఁ బడయఁ
దనులత నుడియు నెత్తావి గైకొని సమీ
రుఁడు గంధవహుఁ డనురూఢిఁ దనర

వఱలు నయనరుచులు వనమయూరములు వి
ద్యుల్లతావలోకనోత్సవంబుఁ
బొరయ నరుగుదెంచెఁ దరువనస్థలి సువి
రాజితముగ శైలరాజతనయ." 690ప.6ఆ.

ఇది కుమారసంభవపద్యము. ఇందు చతురికాద్యాప్తసఖీజనపరివృతయై తపో వనమునందు తరుగుల్మ లతానదీనదసరసీపులినాంతరముల విహరించునప్పటి పార్వతి వర్ణనము కలదు. అది నఖశిఖపర్యంతము ప్రత్యంగవర్ణనము కాదు. కాంతివర్ణనము మాత్రమే. కాని, కాంతిప్రసారము క్రాంతముద్రాకమయినది. అరుణాంఘ్రితలదీప్తి అవనీతలమంతటను పద్మరాగస్థలభ్రాంతి కలిగించుట సంభవము కాదు. వదనేందు కాంతి ఆకాశమంతటను వ్యాపించుట సంగతము కాదు. తనులత నుడియు నెత్తావి అనగా మేని సువాసన కాంతి కాదు. అంతేకాదు. వనమయూరముల మేఘావ లోకనోత్సవము కవిసమయప్రసిద్ధము. నయనరుచుల కొఱకైన విద్యుల్లతావలోక

నోత్సవము కవిసమయవిరుద్ధము. ఉపరి, పాద,వదన,అధర,శరీర,నయనములందు క్రమము లేదు. కనుక, కుమారసంభవపద్యము కృతకము,

> 56. "పదపడి పూర్వదిశాసతి
> వదనంబునఁ దెల్పు మిగిలె వనజాహిత చూ
> లుదరంబున ధరియించిన
> గదిరిన పాండుకపోలకాంతివిధమునన్. 82ప.3ఆ.నృపు.
>
> రవిరాకకుఁ బూర్వదిశా
> యువతి గృహాంగణము కుంకుమోదకసేక
> ప్రవిఖాతమయ్యె ననఁగా
> నవారుణోదయవిజృంభణము విలసిల్లెన్.". 112ప.3ఆ:నృ.పు.

ఇవి ఎఱ్ఱన పద్యములు. ఇందు మొదటి పద్యమున సూర్యాస్తమయవర్ణనము రెండవ పద్యమున సూర్యోదయవర్ణనము కలవు. సూర్యుడు అస్తమించునప్పుడు తూర్పుదెస వెలవెలఁబోవుట సహజము. అది పూర్వదిశాసతి తెలుపు మిగులుట. ఆ తెలుపు చంద్రుని గర్భమునందు ధరించినందున తెల్లనైన ఆమె కపోలకాంతి వలె ఉన్నదని ఉత్ప్రేక్ష. గర్భవతి కపోలములు తెల్లనగుట సహజము. సూర్యోదయమునకు ముందు అరుణోదయమగుట సహజము. అది పూర్వదిశాసతి సూర్యుని రాకకు సుస్వాగతప్రాయముగ కుంకుమోదకమును కలయంపి వేసినట్లు కల్పన. అరుణోదయవేళ ఆకాశమంతట అరుణిమ వ్యాపించుట సహజము. అది కుంకుమోదకము తోడి కలయంపి అనిపించుట అంతకంటె సహజము. కనుక ఎఱ్ఱన పద్యద్వయము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

> "ఇనుఁ డొడఁగూడి రాక కుదధీశుదిగంగన రాగమొందెనో
> యన నెఱసంజపర్వె నమరాధిపదిక్సతి దానిఁజూచి వం
> దినఁ దనుకాంతి మాసెననఁ దెల్పఱఁ జీకటి గప్పె నంబుజా
> సనహరివిశ్వరూపయుగసంగమలీల నభంబు వొల్పుగాన్" 90ప.8ఆ

ఇందు సూర్యాస్తమయ వర్ణన కలదు. సూర్యుడు అస్తమించునపుడును ఆకాశమునందు అరుణిమ వ్యాపించును. అది పశ్చిమదిశాంగన రాగము. రాగమన అరుణిమ. అనురాగమును. పశ్చిమదిశాంగన అనురాగము పూర్వదిశాంగనకు బాధా కరము. కనుక దుఃఖించిన ఆమె తనుకాంతి మాసెనన తెలుపు నశించి చీకటి కప్పె నని, అది బ్రహ్మవిష్ణువుల విశ్వరూపములకలయిక వలె కలదని కల్పన, తెలుపు నశింప, చీకటి కప్పిన మిగులునది నలుపుమాత్రమే. తెలుపు ఉండదు. తెలుపు, నలుపు కలిసియున్నఁగాని బ్రహ్మవిష్ణువుల విశ్వరూపముల సంగమలీల సంగతము కాదు. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

57. "హరి యంభోనిధి సొచ్చె శంభుడు తుషారాద్రీంద్రముం బ్రాఁకె వా
గ్వరుఁ డుద్యన్మకరందదుర్దినసమగ్రంబైన యుత్ఫుల్లపం
కరుహాంబున్ భజియించె దీని మును గల్గంగాంచియే కాక యె
వ్వరి నింకేల సహించు గ్రీష్మమనఁగా వర్తిల్లెఁ దాపోద్ధతుల్".

31ప. 6ఆ. పూ.భా. హ.వం.

ఇది కూడ ఎత్తిన పద్యము. ఇందు గ్రీష్మర్తువర్ణనము కలదు. విష్ణువు నివాసము సముద్రము. శివుని విలాసము హిమాలయము. బ్రహ్మ ఆవాసము పద్మము. మకరందవృష్టిగల పద్మము, హిమాలయము, సముద్రము చల్లదనమునకు నిలయ ములు. భవిష్యత్తులో దుర్భరమైన గ్రీష్మతాపము సంభవించునని త్రిమూర్తులు ముందే శీతలప్రదేశములందు ప్రవేశము చేసిరని ఉత్ప్రేక్ష. విష్ణువు సముద్రమును చొచ్చుట, శివుడు హిమాలయమును చేరుట, బ్రహ్మ పద్మమును భజించుట సహజము. కనుక, ఎత్తిన పద్యము సహజము.

"ఏకార్ణవంబులఁ నిరవైన వటపత్ర
శయనంబు మదిఁగోరె శార్ఙ్గపాణి
యష్టమూర్తులలోన నంబురూపము నాత్మఁ
గాంక్షించె హరిణాంకఖండమౌళి
ప్రథమాంబుజప్రసూణఖావస్థితియ వేఁడి
యభిలషించెఁ బయోరుహాసనుండు
పేర్కొ గాకుండియు విలమోదకోవర
స్థితి యపేక్షించె ధాత్రీవధూటి

హేమరజతాచలాదిమహీధరములు
హిమగిరిత్వంబు మతుల నూహించుకొనియె
సకలలోకానివార్యదుస్సహ బహూష్ణ
భీష్మగతిమైన యమ్మహాగ్రీష్మవేళ." 6ప. 6ఆ.క.క.ర.

ఇది సంకుసాల నృసింహకవి పద్యము. ఇందును గ్రీష్మర్తువర్ణనము కలదు. అంతేకాదు. ఎత్తిన పద్యములోని బ్రహ్మవిష్ణుమహేశ్వరుల విషయము కలదు. భీష్మమైన గ్రీష్మమున విష్ణువు ఏకార్ణవములో వటపత్రశయనమును కోరె నని, శివుడు అష్టమూర్తులలోని అంబురూపమును కాంక్షించెనని, బ్రహ్మ ప్రథమ పద్మాఘ్రాణనభావస్థితి అభిలషించెనని కలదు. శేషతల్పశయనము కంటె వటపత్ర శయనము మఱింత శీతలము. అష్టతనువులలో ఆత్మరూపము కంటె జలరూపము గౌరవము. పయోరుహాసనముతోపాటు పద్మపరిమళమును శీతలోపచారము. త్రిమూర్తుల తోపాటు భూదేవి జలమయస్థితిని అపేక్షించుట దుస్సహతాపమును వ్యక్తము సేయును. కనుక, సంకుసాల నృసింహకవి పద్యము కూడ సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"హరి శరధి గ్రుంకె నభవుఁడు
సురనది దలఁదాల్చె నబ్జజుఁడు గ్రమ్మఱ నం
బురుహంబు సొచ్చె నతిదు
స్తరదుస్సహతీవ్రతరనిదాఘభయమునన్." 796ప,ఆ.

ఇందును గ్రీష్మర్తువర్ణనము కలదు. అంతేకాదు. బ్రహ్మవిష్ణుమహేశ్వరుల విషయము కలదు. విష్ణువు సముద్రమున గ్రుంకెనట! క్రుంకుట అనగా మునుగుట. విష్ణువు సముద్రమునందు మునుగుట సంభవము కాదు. శివుడు గంగానదిని తలఁ దాల్చెనట!! పార్వతి తపస్సు చేసినపుడు శివుడు గంగానదిని తలదాల్చిన, అంతకు ముందు శివుని తలమీద గంగానది లేకపోవుట సంగతము కాదు. పద్మమునందు పుట్టిన బ్రహ్మ మఱల పద్మమును చొచ్చెనట!!! బ్రహ్మ పద్మమునందు పుట్టుటయే కాని మఱల పద్మమునందు ప్రవేశించుట ప్రసిద్ధము కాదు. కనుక, కుమారసంభవ పద్యము కృతకము.

58. "సుదతి! నీ మదిలోని సొరదోఁకి మదనుండు
తన కొండుచో టింకఁ దడవుఁ గాక
కాంత! నీ పలుకులు గరజాణ చిలుకల
వెదకి నాలుకముల్లు విఱుచుఁ గాక
పడఁతి! నీ చూపు లుప్పనఁబట్టె లాడించి
చెలుల వక్త్రములఁ బూజించుఁ గాక
మెలుత! నీ యడుగులు మెలఁగ నేర్చుట చూచి
యందెలతో మాట లార్తుఁ గాక
నా కతంబున వచ్చిన నవ్వుఁబాటు
మాటువడఁజేసి నీ కూర్మిమగనిఁ దెత్తు
నిత్తు నీ చిత్రపటము నం దెవ్వఁడైన
మెత్తుగాక నీ చెలికత్తె మేటి నేర్పు." 141ప.5ఆ.

ఇది నాచన సోమనాథుని పద్యము. ఇందు విరహవిహ్వల అయిన ఉషను చెలికత్తె ఓదార్చుట కలదు. కూర్మిమగని తెచ్చి ఇచ్చిన ఉష మనస్సులోని మన్మథుడు మడొక చోటికి పోవునని, శారికారావములు కాలెంపవని, చెలికత్తెలను బాధింపవని, స్థాణువుగ పడియుండవని చిత్రలేఖ అభయహస్తము. కూర్మిమగడు లభించిన విరహవేదన తొలగిపోవుట సహజము. కనుక, నాచన సోమనాథుని పద్యము సహజము.

"ఏపునఁ జెలరేఁగి యేయు మనోజన్ము
చెఱకువిల్ రెండుగా విఱిచివైతుఁ
బలువలై పలుకు చిల్కల నాలుకల ముల్లు
విఱిచి యూరములలో వెడల నడఁతు
మదమున మ్రోయు తుమ్మెదలఁ జంపకలతాం
తములలో మునుగంగ నిమిరింతుఁ(?)
దగులమై వీతెంచు దక్షిణాశాగంధ
వహు మహాహీంద్రుని వాతఁ ద్రోతు

నేటి కులికెదు నా యట్టి బోటి కలుగ
వెలఁది! నీ మది లోపల వెఱవకుండు
మమ్మ! ధైర్యంబు వదలకు మమ్మ! యెందుఁ
గత్తలము గల్గు మేనికిఁ గలదె బాధ?"

ఇది చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనములోని పద్యము. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు ఉదాహరింపఁబడినది[54]. ఇందును విరహ విహ్వాల అయిన నాయికను చెలికత్తె ఓదార్చుట కలదు. కవచము కల శరీరమునకు బాధ కలుగదు కావున, కవచము వంటి తాను నాయిక విరహబాధ తప్పింతునని చెలికత్తె అభయహస్తము. అందుకు మన్మథుని చెఱకువిల్లు రెండు ముక్కలుగ విఱిచివైతునని, చిలుకల నాలుకలముల్లు విఱిచి పొదలలోనికి పోనడతునని, తుమ్మెదలను సంపెంగపువ్వులలో మునుగఁజేతునని, మలయమారుతమును పాములనోట పడవైతునని ప్రగల్భవాక్కులు. చెఱకుగడ రెండుముక్కలగుట, చిలుకలు పొదల లోనికిపోవుట, తుమ్మెదలు సంపెంగపువ్వులకు సంకటపడుట, మలయమారుతమును పాములు భక్షించుట సహజము. కనుక, చిమ్మపూడి అమరేశ్వరుని పద్యము కూడ సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

"బాల! నీ వేనలి కాలోరగం బని
మలయానిలంబు నీ పలన రాదు
కమలాస్య! నీ కనుఁగవ చకోరము లని
వెన్నెల సోరదు నీ యున్నయెడకు
నబల! నీ యెలుఁగు పికారావమని నీకుఁ
జూతమ్ము గొమ్ములు సూప వెఱచుఁ
జపలాక్షి! నీ ముక్కు చంపకమను భీతి
నలులు నీ పొడ గని యలయఁబాఱు
వనిత! నీకుఁ బ్రాణవల్లభుండై మది
నొలసె శివుఁడు వాయకుండు ననియ
పేద మరుశరములు నీదెస రానోడు
వీని కేల నీవు వెఱచెదమ్మ."

ఇందు విరహ విహ్వాల అయిన పార్వతిని చెలికత్తెలు ఓదార్చుట కలదు. కూర్మిమగని కూర్తుమనికాదు. విరహబాధ తప్పింపనేర్తుమనియును కాదు. మఱి? పార్వతికి స్వయంరక్ష కలదని సముదాయింపు. అందుకు పార్వతి వేనలి కాలోరగమని మలయానిలము, కనుగవ చకోరములని వెన్నెల, ముక్కు చంపకమని తుమ్మెదలు సమీపింపవనుట సంగతము. కంఠస్వరము పికారవమని చూతము కొమ్మలు చూప వెఱచుననుట సంగతముకాదు. "కొమ్మలు చూపు= ఎదిరించు" అని కవిగారి అర్ధవివరణము.[55] కొమ్మలు చూప వెఱచుననుటయు కుదురునది కాదు. మామిడి చెట్టు కోయిలను ఎదురించుటకు భయపడదు. కోయిలకు కొమ్మలను చూపుటకును భయపడదు. చిగురాకులను చూపుటకు భయపడవచ్చును. కోయిల ఆరగించును గనుక. అంతేకాదు. మలయానిలచంద్రికాభ్రమరముల వలె పికములు సమీపింపవనుట సంగతము. ఉపరి, శివుడు మన్మథుని భస్మము చేసిన తదుపరి విరహవిహ్వాల అయిన పార్వతి హృదయమున శివుడు పాయకుండుటకు, పేదవైనను గొప్పవైనను, భస్మసాత్కృతుడైన మన్మథుని శరముల ప్రసక్తియు సంగతముకాదు. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

59. "దానానేకపబృంహితస్వనము గంధర్వావళీపోషిత
ధ్యానంబున్ మృదువేదనాదమును గాంతానూపురారావమున్
గానానూనరవంబుఁ దూర్యబహుశంఖస్ఫారరావంబుఁ జె
ల్లైనీరాకరఘోషమో యనఁగ నిత్యంబుం జెలంగుం బురిన్.

ఇది చిమ్మపూడి అమరేశ్వరుని పద్యము. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు ఉదాహరింపబడినది.[56] ఇందు పురవర్ణనము కలదు. ఏనుగుల ఘీంకారము, గుఱ్ఱముల సకిలింపు, వేదస్వరము, స్త్రీల అందెల మ్రోత, గానరవము, తూర్యనాదము, శంఖారావము అత్యధికమై, పురమునందు నిత్యము సముద్రఘోష అన్నట్లు ఒప్పునని అర్థము. వివిధధ్వనుల సంకీర్ణధ్వానము సముద్రఘోష అనిపించుట సహజము. కనుక చిమ్మపూడి అమరేశ్వరుని పద్యము సహజము.

మఱి కుమార సంభవములోని పద్యమిది:

"సమదానేకపబృంహితంబు హయఘోషాఘోషముల్ గీతవా
ద్యమృదుధ్వానము వేదరావము భటోద్దండోక్తులుం భూరిపం
చమహాశబ్దరవంబుఁ గూడి సుమహోత్సంక్షోభితాంభోధినా
దమొ నా దిగ్బధిరీకృతంబగుచు నిక్కంబుం జెలగుం బురిన్" ౧౬౨ప.౭ఆ.

ఇంక ఓషధీప్రస్థపురవర్ణనము కలదు. విక్రమసేనపద్యములోని విషయములే గాక, శబ్దములును ప్రతిధ్వనించినవి. "కాంతానూపురారావముల్" బదులు "ఛందోద్ధంగోక్తులు" కలవు. "దిగ్బధిరీకృతంబగుచు"- మెఱుగు. తఱుగు "అంభోధి"కి "సుమహత్సంక్షోభిత" విశేషణము. సుమహచ్ఛబ్దము సుష్ఠుప్రయోగము కాదు. "సంక్షోభిత" శబ్దమును సాధురూపము కాదు. పెద్దలు సంక్షోభింపఁజేసిన సముద్రము కాదు. మిక్కిలి సంక్షోభము చెందిన సముద్రము. సుమహాసంక్షుబ్ధాంభోధి అనుటకు, "సుమహత్సంక్షోభితాంభోధి" అనుట మఱి అపప్రయోగము. ఇట్టి అపప్రయోగములు కుమారసంభవమునందు ఇంకను కలవు. పంచమహాశబ్దములు ప్రసిద్ధము, పంచ వాద్యరవములని అర్థము. రవార్థకశబ్దముకంటె రవశబ్దప్రయోగము పునరుక్త భూతము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

60. "శిలికంధరునకు నెచ్చెలికాఁడు గాఁడొకో
యలమటీఁడైన యీ యక్షభర్త?
యహికంకణునకు మూఁడవ కన్ను గాఁడొకో
పాల్మాలినట్టి యీ పావకుండు?
పురవైరి కవతంసపుష్పంబు గాఁడొకో
నిర్భాగ్యుఁడైన యీ నీరజారి?
గంగాధరునకు వెంకలవెంక గాఁడొకో
పెనుగూళయైన యీ యనిమిషేంద్రుఁ
డేమి గుడువంగ వచ్చి నారెండ్లు విడిచి
హరుని వెలివెట్టి నట్టి యీ యాగమునకుఁ?
బంచవదనుని కను జేవుఱించెనేని
తత్క్షణంబున లమహేంద్ర త్రాళ్ల దెగవె?" 60ప.7ఆ.కా.ఖం.

ఇది శ్రీనాథుని పద్యము. ఇందు కుబేరుడు, అగ్నిదేవుడు, చంద్రుడు, ఇంద్రుడు శివుని కంటె తక్కువవారైనను శివుని వెలివేసిన యజ్ఞమునకు వచ్చి నందుకు దధీచి మందలించుట కలదు. శివునికి కుబేరుడు స్నేహితుడు. అగ్నిదేవుడు మూడవకన్ను. చంద్రుడు తలపువ్వు. ఇంద్రుడు పరమవిధేయుడు. అంతేకాదు. శివుని కన్ను జేవురించిన ఇంద్రాదులు భస్మమగుట సంభవము. కనుక శ్రీనాథుని పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"నీ కంటె హరి బుద్ధిలేకయె నిజనేత్ర
కమలంబు పూన్చి చక్రంబు వడసెఁ
బరమేష్ఠి నీ కంటెఁ బరవిడియే శిర
మొప్పించి నిత్యుఁడై యున్నవాఁడు
మఘవుండు నీ కంటె మరులైయె క్రతుతతి
నర్చించి దేవేంద్రుఁడై వెలింగె
నిఖిలదేవాలియు నీ కంటె నవివేకు
లయియె సేవించి భోగాత్ములైరి
వీరలిందరకంటెను వెరవు మిగుల
నెఱుక నీ కిప్పు డెందుండి దొఱకిపడియె
నగణితైశ్వర్యు శివుఁ బరమాత్ము నెఱిఁగి
యెఱిఁగి దూషింప నీకు నోరెట్టు లాడె."      164ప.2ఆ.

ఇందు విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు, దేవతలు శివుని కంటె ఎక్కువవారని ఎత్తి పొడిచిన దక్షుని సతీదేవి మందలించుట కలదు. విష్ణువు నేత్రకమలమున శివుని పూజించి సుదర్శనచక్రమును పడయుట ప్రసిద్ధము. పూర్వోక్తము. శివుడు బ్రహ్మ శిరస్సును ఛేదించినట్లు వినా, బ్రహ్మ తన శిరస్సును స్వయముగ శివునికి సమర్పించినట్లు ప్రసిద్ధము కాదు. ఇంద్రుడు యజ్ఞములందు శివుని అర్చించి దేవేంద్రుడయినట్లును ప్రసిద్ధము కాదు. అంతేకాదు. ఇంద్రుడు, దేవేంద్రుడు భిన్నులు కారు. దేవతలు శివుని సేవించి భోగాత్ములయినట్లు కూడ ప్రసిద్ధము కాదు. ఉపరి, "మరులైయె" అనుచోట "మరులయ్యె" అని ఇటీవలి ముద్రణములందు కలదు[57]. అది కేవలము అర్థరహితము. "అవివేకులయియె" అను ప్రయోగము వంటిది "మరులైయె" అను ప్రయోగము. అయి + ఎ = అయియె = ఐయె. "మరులయియె" అను ప్రయోగము స్పష్టము. "మరులైయె" అను ప్రయోగము క్లిష్టము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

61. "రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్ నిండుచోన్.
623ప.8స్కం.

ఇది బమ్మెర పోతన పద్యము. ఇందు బ్రహ్మాండాంతసంవర్ధియైన వామనుడు బ్రహ్మాండమును నిండుట వర్ణింపఁబడినది. వామనుడు బ్రహ్మాండమును నిండునెడ సూర్యబింబము క్రమముగ గొడుగు, శిరోమణి, కర్ణాభరణము, కంఠాభరణము, కేయూరము, కంకణము, కింకిణి, అందె, పాదపీఠి వలె అయినదని కల్పనము. క్రమవికాసము కల లోకోత్తరమైన చమత్కారకల్పనము. "ఇంతింతై వటుఁ డింతయై" తదుపరి బ్రహ్మాండమును నిండిన తీరు కన్నులకు కట్టించు భావచిత్రము. కనుక, పోతన పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది :

"ధ్రువమండలము సముత్తుంగశృంగంబుల
సంధిల్లి రత్నభూషణము గాఁగ
నక్షత్రలోకంబు నయమొందు వర లలా
టమున మాణిక్యపట్టంబు గాఁగఁ
గనకాచలేంద్రంబు గళమునఁ గట్టిన
కమనీయమగు పైఁడిగంట గాఁగఁ
గులపర్వతంబులు బలసి తద్దయు రమ్య
మగు సురగజ్జెల పగిది గాఁగ
ముదముతోఁ జతుస్సముద్రముల్ గాళ్లల
ఘర్ఘరముల పగిదిఁ గలసి మ్రోయఁ
జెలువమెసఁగి వచ్చి నిలిచె సురాసురా
ధీశునెదుర నా గవేశ్వరుండు." 22వ. 8ఆ.

ఇందు ప్రయాణభేరి మ్రోగించిన శివుని సన్నిధికి నంది వచ్చుట వర్ణింపఁ బడినది. నంది కొమ్ములకు ధ్రువమండలము రత్నభూషణము, లలాటమునకు నక్షత్రమండలము మాణిక్యపట్టము, కంఠమునకు మేరుపర్వతము పైడిగంట, ? కుల పర్వతములు గజ్జెలు, కాళ్లకు నాల్గుసముద్రములు ఘర్ఘరములు వలె అయినవని జల్ప నము. శివుని వాహనమైన నంది శివునితోపాటు కైలాసమునందే ఉండును. కైలా సమునందు గాక, ధ్రువమండలము ఆవలనున్నను, అది ఆసముద్ర ధ్రువమండలమును అతిశయించి బ్రహ్మాండమును నిండవలసిన అవశ్యకము లేదు. అంతేకాదు. నంది వాహనము స్వరూపము. విరాట్స్వరూపము కాదు. ఉపరి, విశ్వరూపప్రదర్శనము

నందికి విషయము కాదు. నంది "వరలలాటమునకు నయమొందు" అను విశేషణము గణయతిమైత్రిమాత్రప్రయోజని. కులపర్వతములు "బలసి" అనుట కూడ అంతే. అవి "సురగజ్జెల పగిది" అయిన నంది అవయవము లేదు. చతుస్సముద్రములు "ముదముతోకలసి మ్రోయ"వలసిన అవసరములేదు. నందివాహనము నాలుగు కాళ్ళందు నాలుగు సముద్రములు ఘర్ఘరముల వలె మ్రోసినవట! "సురగజ్జెలు=మ్రోయుచున్న మువ్వలు.ఘర్ఘరములు=గజ్జెలు" అని కవిగారి లఘుటీక[58]. నంది కాళ్లకు నాలుగు సముద్రములు నాలుగు గజ్జెలు, కొమ్ములకు ధ్రువమండలము రత్నభూషణము అయిన,అది సముద్రములో నుండి ధ్రువమండలము పైవఱకు కలదని అర్థము. అట్లుండుట అసంభవము. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

62. "కోపన పదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడువఁగ ను
ద్దీపితమన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలు పడంగన్". 122ప.1ఆ.

ఇది నంది తిమ్మన పద్యము. ఇందు సత్యభామ, "శిర మచ్చోవామపాదంబునం దొలఁగంద్రోచిన లతాంతాయుధుఁ గన్నతండ్రి" అవస్థ వర్ణింపఁబడినది. కోపము వచ్చిన సత్యభామ కాలితాపునకు, కుహనాగోపాలుడైన కృష్ణుని శరీరము పులకరించినది. శృంగారము ఉద్దీపించినది. అనురాగము ప్రకాశించినది. అనునయ వాక్కులు ఆరంభమయినవి. "యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధా త్సోఽఙ్గీకృతో భగవతా మకరధ్వజేన" అని అమరుకావ్యప్రవచనము. కనుక, నంది తిమ్మన పద్యము సహజము.

"మన్నించి యట్లు నన్నుం
దన్ని యశోకుఁడుగఁ జేయు తలఁపిది యొప్పున్
నన్నుఁ దయఁజూచి యిఁక నో
కన్నియ, వెసఁ దిలకితాత్ముగాఁ జేయఁగదే." 155ప.4ఆ.

ఇది సంకుసాల నృశింహకవి పద్యము. విటీవిటవర్ణనములోనిది. ఇందు తన్నిన విటినీ తప్పుకాదని విటుడు సమర్థించుట కలదు. అశోకు డనిన అశోకవృక్షమని ఒక అర్థము. అది కన్నియ తన్నిన పుష్పించునని దోహదప్రక్రియలందు

ప్రసిద్ధము. అశోకుడనిన శోకము లేని వాడని మఱొక అర్థము. విటి మన్నించి తన్నుట, శోకము లేనివానిగ చేయు తలంపని-తాడనము శృంగారరసోద్దీపకము-విటుని సమర్థనము. ఇట అశోకశబ్దశ్లేష హృదయంగమము. ఇట్లు "తిలకితాత్మగా" అనునెడ శ్లేషయు హృదయంగమము. కన్నియ అను సంబుద్ధి అర్థవంతము. కనుక, సంకుసాల నృశింహకవి పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యము:

> "తరుణి పదాహతిఁ బతియై
> సురుతరపులకాంకురంబు లొగి నెగసెం ద
> చ్చరణస్పర్శన సుఖని
> స్ఫురణ నశోకాత్ముఁ డగుట సూచించు క్రియన్."　　174ప.8ఆ.

ఇది కూడ విటీవిటవర్ణనములోనిది. ఇందు విటి పదాహతికి విటుడు పులకరించుట కలదు. పులకరించుటలేదు. కాని, విటుడు అశోకాత్ముడగుట సూచించునని కలదు. విటి పాదతాడనమున పులకాంకురములు పొటమరించుట వలన విటుడు శోకము లేని వాడగును. పదహతిని పులకోద్గమము. ఫలితముగ అశోకాత్మస్థితి సహజము. విటీవిటులకు తరుణీపతుల వివక్ష విలక్షణము. విటి తరుణి అగును. కాని, విటుడు పతి కాలేడు. పతి శబ్దప్రయోగమునందు పదౌచిత్యము లేదు. కనుక, కుమారసంభవ పద్యము కృతకము.

63. "ఇనుఁడస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేరఁ దద్గీప్తి నం
జనసంబంధజబాంధవంబున రతిక్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల దాఁచి తద్దవళిమం దాఁ బూనెనో చొప్పుమా
ర్ప ననన్ వెల్వెలఁదాఁచె దీపకళికావ్రాతంబులాతోదరీ!"　　56ప 3ఆ

ఇది అల్లసాని పెద్దన పద్యము. ఇందు తెల్లవాఱునప్పటి దీపముల ధవళకాంతి వర్ణింపఁబడినది. "కామినీనేత్రధామురరోచుల్ దము నేఁడు ద్రుంచు కరదీప్ సుస్నిగ్ధరాగంబులై పరఁగంగా వెలవెల్లనయ్యె గృహదీపవ్రాతముల్ చూడవన్" అను ఎఱ్ఱన వర్ణనము (114ప.3ఆ నృ.పు.) బీజప్రాయముగ పెద్దన వర్ణనము పుష్పించె వల్లి. సూర్యుడు అస్తమింపగా సూర్యుని అరుణకాంతిని అపహరించి వెలుగు దీపములు, సూర్యుడు ఉదయించి అరుణకాంతిని గైకొనునని తెలియక, రతిక్రాంతలైన స

అంగనల నేత్రకోణములందు దాచి, అచటి ధవళకాంతిని గ్రహించినవో అను నట్లు తెల్లబడినవని కల్పనము. సూర్యాస్తమయానంతరము దీపములు అరుణకాంతిని ప్రసరించుట, రతిశ్రాంతలైన అంగనల నేత్రకోణములందును అరుణకాంతి ప్రతి ఫలించుట, సూర్యోదయానంతరము దీపములు ధవళకాంతిని ప్రసరించుట సహజము. అందుకు రతిశ్రాంతలైన అంగనల నేత్రకోణములందు అరుణకాంతిని దాచినట్లు సంభావించుట సరసము. కనుక, అల్లసాని పెద్దన పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

"ఇనుఁడు దన దీప్తిఁ దన చేత నిచ్చిపోయి
మఱవ కేతెంచి నిజరుచి మగుడఁ గొనినఁ
దెలివి చెడి తెల్లనై రను పలుకు జగతి
నిలుపుగతి దీపకళికలు వెలరు వాఱె." 186ప.8ఆ.

ఇందు తెల్లవాఱునప్పటి దీపముల ధవళకాంతి వర్ణింపఁబడినది. సూర్యుడు తన కాంతిని తన చేతితోనే ఇచ్చిపోయి, మఱచిపోకుండ మఱలవచ్చి తన కాంతిని తాను తీసికొనిన, తెలివి చెడి తెల్లనైరను మాట జగతి నిల్చునట్లు దీపకళికలు తెల్లఁబడెనని కల్పనము. ఇచ్చిన వస్తువును ఎవరైన తిరిగి తీసికొనవచ్చును. అంత మాత్రమున పుచ్చుకొన్నవారి తెలివి చెడవలసిన ఆవశ్యకము లేదు. అది శాశ్వతముగ ఇచ్చినట్లు ఆశించినయెడల, ఆశాభంగము కలుగును. అందువలన తెల్లఁబోవచ్చును. తెల్లఁబోయినంతమాత్రమున తెలివి చెడినట్లు కాదు. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

64. "భ్రమరకమనోహరంబౌటఁ బద్మమగును
తారకాహృద్య మగుట సుధానిధియగు
రెంటి జగడాలు మోమున నంటియుంట
నబ్జముఖి యంట లెస్స యీ యలరుఁబోడి." 105ప.2ఆ.వి.వి.

ఇది చేమకూర వేంకటకవి పద్యము. ఇందు సుభద్ర ముఖవర్ణనము కలదు. ముఖమును పద్మముతోను, చంద్రబింబముతోను పోల్చుట ప్రసిద్ధము. సుభద్ర

ముఖము భ్రమరకమనోహరము. భ్రమరకములన ముంగురులు. తుమ్మెదలును. ముంగురులతో అందమైన సుభద్ర ముఖము, తుమ్మెదలచే అందమైన పద్మమగును. అంతేకాదు. సుభద్ర ముఖము తారకాహృద్యము. తారక అన కనుపాపలు. నక్షత్రములును. కనుపాపలచే రమణీయమైన సుభద్ర ముఖము నక్షత్రములకు కమనీయమైన చంద్రబింబమగును. పద్మసాదృశ్యమునుబట్టి పద్మముఖి అనిన చంద్రవదన కాదు. చంద్రసాదృశ్యమునుబట్టి చంద్రవదన అనిన పద్మముఖి కాదు. పద్మమునకు చంద్రునికి పరస్పరవైరము. అయినను పద్మవికాసము, చంద్రప్రకాశము సుభద్రముఖమునందు కలదు. కనుక సుభద్రను అబ్జముఖి అనుట లెస్స. అబ్జమన పద్మము. అబ్జుడన చంద్రుడు. పద్మచంద్రుల పరస్పరవైరము అర్థభేదమున పరిష్కృతము. తన్నిమిత్తమైన శ్లేష సుగమము. చమత్కారము సరసము. కనుక చేమకూర వేంకటకవి పద్యము సహజము.

మఱి కుమారసంభవములోని పద్యమిది:

"అమృతోద్భవులగు మీలో<br>
నమరదు పగయని సుధాకరాబ్జములకుఁ గూ<br>
టము దనముఖమునఁ జేసెనొ<br>
యుమ యన వదనాంశుగండయుగగతి వొల్చున్." 304ప.3ఆ.

ఇందు పార్వతి ముఖవర్ణనము కలదు. పద్మచంద్రుల పరస్పరవైరమునకు పరిష్కారమును కలదు. చంద్రుడు, పద్మము అమృతోద్భవులగుట వలన పగ అమరదని పార్వతి తన ముఖమున కూటము చేసెనో అనునట్లు వదనకాంతి, గండయుగగతి పొల్చునట! వదనకాంతికి చంద్రసాదృశ్యము ప్రసిద్ధము. గండయుగగతికి పద్మసాదృశ్యము ప్రసిద్ధము కాదు. చంద్రసాదృశ్యమును ప్రసిద్ధము కాదు. అంతే కాదు. ప్రసిద్ధార్థమున సుధాకరాబ్జములు అమృతోద్భవులు కావు. అమృతమునకు తోఁబుట్టువులు. అమృతమునకు నీరు అను అర్థమును ఆశ్రయింపవలయును. అబ్జములు అమహద్వాచకము. అమృతోద్భవులు మహద్వాచకము. విశేషణవిశేష్యవాచకభేదము విపరీతము. పగ తగదనుట పలుకుబడి. పగ అమరదనుట ప్రాసమాత్రప్రయోజని. కనుక, కుమారసంభవపద్యము కృతకము.

ఇట్టి వింకను గలవు. మొత్తముమీద ఆదికవి నన్నయ మొదలు అర్వాచీన కవి వెన్నెలకంటి వేంకటాచలము వఱకు పెక్కుమంది కవుల పెక్కు పద్యములను

సంవదించు పద్యములు కుమారసంభవమునందు కలవు. అంతేకాదు. పెక్కుమంది కవుల పెక్కు పద్యములును సహజములు. అవి సంవదించు కుమారసంభవ పద్యములు కృతకములు. సహజములైన పద్యములు స్వతసిద్ధములు. కృతకములైన పద్యములు అనుకరణసాధ్యములు. అయినను, కృతకములైన పద్యములనే అనంతరకవులు సహజములుగ తీర్చిదిద్దిరని అనవచ్చును. అనిన, "నన్నెచోడుని కుమారసంభవము" తిక్కన కంటె మాత్రమే గాక, నన్నయ కంటెను పూర్వగ్రంథమని అనవలయును. కుమారసంభవము నన్నయ భారతము కంటె పూర్వగ్రంథమనియే కద ప్రారంభమైనది కథ! అది నిజమే అనవలయును. నిజముగ 1. నన్నయ, 2. మల్లికార్జునపండితుడు, 3. పాలకురికి సోమనాథుడు, 4. కేతన, 5. తిక్కన, 6. రావిపాటిత్రిపురాంతకుడు, 7. చిమ్మపూడి అమరేశ్వరుడు, 8. ఎఱ్ఱన, 9. నాచన సోమనాథుడు, 10. శ్రీనాథుడు, 11. జక్కన, 12. బమ్మెరపోతన, 13. పిల్లలమఱ్ఱిపినవీరభద్రుడు, 14. కొఱవి గోపరాజు, 15. మొల్ల, 16. కృష్ణదేవరాయలు 17. నంది తిమ్మన, 18. అల్లసాని పెద్దన, 19. సంకుసాల నృసింహుడు. 20. తెనాలి రామకృష్ణుడు, 21. పింగళి సూరన, 22. భట్టుమూర్తి, 23. నారన సూరన, 24. ఎడపాటి ఎఱ్ఱన, 25. పెదపాటి సోమయ, 26. బొడ్డపాటి పేరయ, 27. రఘునాథరాయలు, 28. చేమకూర వెంకన్న, 29. ప్రెగ్గడపల్లి పోతయ్య, 30. వెన్నెలకంటి వెంకటాచలము ప్రభృతులు అనుకరించిన కుమారసంభవము ఆంధ్రదేశమునందు అదృశ్యమగుట అసంభవము. అంతేకాదు. అందఱు కవులు అనుకరించియు, ఒక్కకవియును పూర్వకవిస్తుతిలో "నన్నెచోడుని" పేర్కొనక పోవుట అసంగతము. శివకవి కనుక పేర్కొనలేదనుటకు "నన్నెచోడుడు" శివకవి కాడు. శివకవులను పేర్కొన్న కవులును "నన్నెచోడుని" పేర్కొనలేదు. రాజకవి కనుక- అతని పద్యములను అనుకరించినను- బ్రాహ్మణకవులు స్తుతించుట అపచారము కావున పేర్కొనలేదనుటకును "మహిమున్ వాగనుశాసనుండుసృజియింపన్" అని నన్నయను ఆదికవిగ నిర్ధరించిన భట్టుమూర్తి బ్రాహ్మణకవికాడు. భట్టుమూర్తి పూర్వకవిస్తుతియందును "నన్నెచోడుని" పేర్కొనలేదు.[59] రాజకవి అయిన రఘునాథరాయలును పూర్వకవిస్తుతియందు రాజకవి అను "నన్నెచోడుని" పేర్కొనలేదు.[60] కనుక, "నన్నెచోడుని కుమారసంభవము" లోని పద్యములను ఆదికవి నన్నయ మొదలు, అర్వాచీనకవి వెన్నెలకంటి వేంకటాచలము వఱకు ముప్పదిమంది కవులు అనుకరించుటకంటె, ఆదికవి నన్నయ మొదలు అర్వాచీనకవి వెన్నెలకంటి

వేంకటాచలము వఱకు ముప్పదిమంది కవుల పద్యములను కుమారసంభవకర్త అనుక రించుటయే సంభవము.

పయి ముప్పదిమంది కవుల గ్రంథములలోను 1. కేతన కాదంబరి, 2. తిక్కన విజయసేనము, 3. చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము, 4. తెనాలి రామలింగయ్య కందర్పకేతువిలాసము, 5. పెదపాటి సోమయ కేదారఖండము, 6. బొడ్డపాటి పేరయ పద్మినీవల్లభము. 7. ప్రెగ్గడపల్లి పోతయ్య గోదావరీశతకము, 8. వెన్నెలకంటి వెంకటాచలము కృష్ణవిలాసము ఇంతవఱకును అనుపలబ్దములు. అందలి పద్యములు సంకలనగ్రంథములందు, లక్షణగ్రంథములందును ఉదాహరింపఁ బడినవి. అవియెల్ల మానవల్లి రామకృష్ణకవిగారికి మాత్రమే ఆనాడు పరిచితము. ఇదికూడ గమనార్హమైన విశేషము.

# 3

# కుటిల శృంగారము

కుమారసంభవము కుటిలశృంగారసంభరితము. శృంగారము ఎంత రసరాజమైనను, అది ధర్మబద్ధము కావలయునని ఆలంకారికుల ఆశయము. అంతేకాదు. అధర్మపరాయణము, అసభ్యతామూలకము, అశ్లీలతాజంబాలము, అనౌచిత్య దూషితము అయిన శృంగారము తుచ్ఛశృంగారమనియు, అదికేవలము అనుపాదేయమనియును ఆలంకారికుల ఆదేశము. ఉపరి, ఉత్తమప్రకృతులైన నాయికానాయకుల గ్రామ్యశృంగారము అవర్ణనీయమని కూడ ఆలంకారికుల అనుశాసనము. గ్రామ్య శృంగారమన సంభోగ శృంగారము. కుమారసంభవమునందు నాయికానాయకులైన పార్వతీ పరమేశ్వరులు ఉత్తమ ప్రకృతులు మాత్రమేకాదు: జగన్మాతృపితలు. ఎట్టి మూర్ఖుడును లోకమునందు తల్లిదండ్రుల సంభోగశృంగారమును వాకొనడు. అట్టిది లోకమునకే తల్లిదండ్రులయిన పార్వతీపరమేశ్వరుల సంభోగశృంగారమును కావ్యమునందు వర్ణించుట అనుచితము. సంస్కృతకుమారసంభవమునందు అష్టమసర్గమునందు పార్వతీపరమేశ్వరుల సంభోగశృంగారమును మహాకవి కాళిదాసు సకృన్మాత్రము వర్ణించినను అనౌచిత్యమనియే ఆలంకారికుల నిష్కర్ష. కాళిదాసు కుమారసంభవములోని శృంగారమును మించిపోయిన కుటిలశృంగారము "నన్నెచోడుని కుమారసంభవము"నందు అంతట కలదు.

కాళిదాసు కుమారసంభవమునందు పార్వతి వర్ణనము నఖశిఖపర్యంతము కలదు. అది పాదనఖ, గమన, జంఘోరు, కటి, నాభి, వళి, స్తన, బాహు, కంఠ. వద, నోష్ఠ, కంఠస్వర, నేత్ర, భ్రూ, కేశ, సర్వసౌందర్యముల వర్ణనము. పదునేడు శ్లోకముల ఘట్టము. (33-49 శ్లో. 1స.) ఒక్క శ్లోకమునందును అసభ్యతాశంక లేదు. అశ్లీలతాలీల లేదు. అనౌచిత్యస్పర్శ లేదు. మఱి "నన్నెచోడుని కుమారసంభవము" నందును పార్వతి వర్ణనము నఖశిఖపర్యంతమును కలదు. అది పాదతల, లాంగుష్ఠ, పదనఖ, జాను, పార్ష్ణి -ఊరు, జఘన, నాభి, మధ్య, రోమావళి, వళి, కుచ, బాహుమూల, బాహు, కరతల, కరాంగుళి, కరనఖ, కంఠ, రద, నోష్ఠ, దశన, కపోల, నాశికా, వదన, శ్రవో, భ్రూ, నిటల, శిరోజ, కేశ, కచముల వర్ణనము.

ముప్పదియొక్క పద్యముల ఘట్టము. (285-315 ప.3ఆ.) అందు అసభ్యతాశ్లీలతా నౌచిత్యములు అనేకము. ఊరు వర్ణనమునందు అసభ్యత, అశ్లీలత, అనౌచిత్యము ముప్పిరి గొన్నట్లు పార్వతి స్మరమందిరస్మరణము కలదు. (291ప.) స్తనవర్ణనము నందు "ఆంధ్రీ స్తనాపహాసులు" అని కలదు. (297ప.) ఇట,

"రాజశేఖరుని పూర్ణచాటువు

కర్ణాటేదశనాంకితః స్మితమహారాష్ట్రీకటాక్షాహతః
ప్రౌఢాంధ్రీ స్తనపీడితః ప్రణయినీభ్రూభంగవిత్రాసితః
లాటీబాహువిపేష్టిత శ్చ మలయస్త్రీతర్జనీతర్జితః
సోయం సంప్రతి రాజశేఖరకవి ర్వారాణసీం వాంఛతి."

అని కవిగారి అనుబంధము. కర్ణాటీదశనాంకితుడు, మహారాష్ట్రీకటాక్షాహతుడు ఆంధ్రీ స్తనపీడితుడు, ప్రణయినీభ్రూభంగవిత్రాసితుడు, లాటీబాహువిపేష్టితుడు,, మలయస్త్రీతర్జనీతర్జితుడు అయిన రాజశేఖరకవి వారాణసీవనితను వాంఛించుట శ్లోక విషయము. పార్వతి కుచములు ప్రౌఢాంధ్రీస్తనములను అపహసించునని కుమార సంభవ పద్యవిషయము. పార్వతి స్తనప్రౌఢిమను ప్రదర్శించుటకు ఆంధ్రీస్తనాప హాసమును ఆంధ్రకవియే చేయుట ఆశ్చర్యజనకము. ఆంధ్రపరమైన అవహేళనము, ఆంధ్రీకరిచు సంస్కృతగ్రంథములందున్నను పరిహరించుట ప్రాచీనాంధ్రకవుల పద్ధతి. సంస్కృతకుమారసంభవమునందు లేకపోయినను, చాటుశ్లోకమును పట్టుకొని చాటుకొనుట కుమారసంభవకర్త ప్రత్యేకత. ఇక పార్వతి బాహుమూలములు "రతి కేళిసదనంబులనఁగ ........అమరు"నట! (298ప.) మఱి, పార్వతి కేశపాశమనెడి తమాలతరులతల ఉగ్రాటవిలో చమరీమృగములు, నెమళ్లు రమించునట!

"చమరీతతియుఁ గలాపులు
సుమకేశతమాలతరలతోగ్రాటవిలో
రమియింపఁగఁ దగుననఁ దగి
సమమగు హరి నవ్యనీలచలదలిసమమై" 314ప. 3ఆ.

ఇందు "తరల" అచ్చుతప్పు. "తరుల" అని ఉండవలయును. ఇంతకు, "సమమగును" అన్నది సమాపకక్రియ. ఏది సమమగును? అనగా సమాపకక్రియ

అన్వయించు కర్త ఏది ? "ఉమకేశతమాలతరులతోఁగ్రాలవి" అను రూపకములోని "ఉమ కేశ"మా? అన్వయమెట్లు? అంతేకాదు. "ఉమ కేశము, హరినవ్యలీలచలదలి సమమై సమమగును" అను వాక్యమునకు అర్థమేమి? ఉమకు, పార్వతి కేశపాశమును తమాలతరులతోఁగ్రాలవని రూపకము చేయుటకు చమరీతతులు, కలాపులు రమియించుటకు తగుట ఎందుకు? చమరీమృగములు, నెమళ్లు రమించుకొనుటకు తగిన కాఱడవి యంత పెద్దజుట్టు అని కాఁబోలు కవిహృదయము! కేశసంపదను వర్ణించుటకు చమరీమృగవాలము, మయూరపింఛము కవి సమయప్రసిద్ధములు కాని, చమరీమృగ సంభోగము, మయూరసంభోగము కాదుకద!! మీదుమిక్కిలి పార్వతికేశసంపదను వర్ణించుటకుఁగాను చమరీమృగముల, నెమళ్ల సంభోగము కుమారసంభవకర్త కుతూహలము!!! పద్యము జటిలము. భావము కుటిలము.

రతిద్వితీయుడై, వసంతసమేతుడై మన్మథుడు స్థాణ్వాశ్రమమునందు ప్రవేశించును. అకాల వసంతోదయమగును. అప్సరోగీతములు ఆలకించినను శివుడు ఆత్మానుసంధానమునందే ఆసక్తుడగును దేవదారుద్రుమవేదిక మీద వ్యాఘ్రాజిన మధ్యమున సమాధిబద్ధుడైన ముక్కంటిని మన్మథుడు చూచును. చూచుచునే మన్మథుని చేతులు వణకును. చేతిలోని విల్లమ్ములు జాఱిపడినను తెలియదు. అంతలో పార్వతివచ్చును. పార్వతిని చూచి మన్మథుడు జితేంద్రియుడైన శివుని జయించుటకు ధైర్యము నందును. నంది శివుని సన్నిధిని పార్వతిని ప్రవేశపెట్టును. సఖీసమేతముగ పార్వతి శివునికి పాదపూజ చేయును. ప్రణామము చేయును. శివుడు పార్వతిని ఆశీర్వదించును, సమయముకొఱకు కనిపెట్టుకొనియున్న మన్మథుడు బాణమును గుఱిపెట్టి నారిని మాటిమాటికి స్పృశించును. పార్వతి తామరపూసల తావళమును తనచేతితో శివునికి సమర్పించును. స్వీకరించుటకు శివుడు సిద్ధపడును. అదే సమయమని మన్మథుడు సమ్మోహనాస్త్రమును సంధించును. శివుడు ఇంచుక ధైర్యము సడలి, పార్వతి ముఖమును పరికించును. పార్వతి ఒడలు పులకరించి ఓరమోమిడును. వెంటనే శివుడు నిగ్రహించుకొని, తన చిత్తవికారమునకు నిమిత్తమేమని నల్దెసల దృష్టి ప్రసరించును. బాణమును ప్రయోగించుటకు సంసిద్ధమయిన మన్మథుడు కనిపించును. వెన్వెంటనే మూడవకన్ను తెఱచును. అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లును. మన్మథుని భస్మము చేయును. శివుడు ప్రమథగణసమేతముగ అంతర్ధానమగును. పార్వతి ఇంటిముఖము పట్టును. ఇది కాళిదాస కుమారసంభవములోని సన్నివేశము. ఉదాత్తరసాన్వితము. అంతేకాదు. కవికులతిలకుడు, కనిష్ఠికాధిష్ఠితుడు

అయిన కాళిదాసునకు అనుగుణమైన కవిత్వము. ఉపరి, సంస్కృత వాఙ్మయచరిత్ర లోని స్వర్ణయుగమునకు తగిన రచనము.

ఇది తెలుగుకుమారసంభవమునందు ఇట్లు కలదు:

సమాధిబద్ధుడైన శివుని చూచి ఉలికిపడిన మన్మథుడు పార్వతిరాకకు ఎదురు చూచును, అది ఎఱిగి రతి ఇట్లు తలచును.

"కామినులు లేక లోకులఁ
గాముని కెట్లగు మనోవికారులఁ జేయన్
గామవికారము లేకయుఁ
గామినులకు జనులనెట్లు గనిపింపవగున్" 497ప. 5ఆ.

ఇది అధిక ప్రసంగము. అంతేకాదు. "కాముక కామినీజనంబు లితరేతరా శ్రయంబుల కా భావించు"ను. (498వచ,) ఇక పార్వతి వచ్చును. ఎట్లు? "మరు దీపము"వలె. (24ప.) పార్వతి పరమేశ్వరుని పాదారవిందములకు పుష్పాంజలి ఘటించి, కృతాంజలియై మహేశు ముంచట నిలుచును. ఎట్లు?

"మరునభివృద్ధి పుష్పకరమండన మంగజరాజ్యలీల శం
బరరిపుశక్తి చిత్తభవుపట్టము మారుమదేభ మిందిరా
వరసుతునాజ్ఞ కాముకరవా లసమాయుధుదర్ప మా రతీ
శ్వరజయలక్ష్మి నాఁ బొలిచి శైలజ నిల్చె మహేశుముందటన్." 507ప. 5ఆ.

ఇందు మొదటిపాదమున "కర" అచ్చు తప్పు. "శర" అని ఉండవలయును. ఇంతకు- ఇది వాచాలత. పులుముడు. పరమేశ్వరుని సన్నిధి పార్వతి అనిపించదు. విశ్వామిత్రుని సన్నిధి మేనక అనిపించును. ఆ స్థితికి దిగజాఱిన పార్వతికి అప్పుడు మన్మథుడు "కామాధికారము" సేయును. (508 వచ.) అంతేకాదు. పార్వతి హృదయమును మదనాస్త్రమున భేదించును. (508 వచ.) భేదించిన వెంటనే పార్వతి ముఖము వికసించును, ఆత్మ అనురాగమునందును. (509 ప.) "ఇట్లు మదనప్రేరితయైన" పార్వతి "ప్రణుతాపాంగవిలోలేక్షణ దీప్తుల" పరమేశ్వరుని "కలయఁగప్పు"ను. (511 ప.) అంతేకాదు.

"ఆ లలితస్మితాస్య లలితామలకోమలచంచలాలసా
లోలవిశాలసంస్ఫురితలోచనదృష్టిరసప్రవాహమున్
దోలిన పర్వె వెల్లిగొని యొక్కటఁ గ్రక్కున ముంచి మీఁదికిం
దేలఁగనెత్తెఁ జుట్టి హరుఁద్రిప్పులఁ బెట్టె మనోజుఁ డుబ్బగాన్."
513ప. 5ఆ.

మన్మథుడు ఉబ్బిపోవునట్లు పార్వతి- లలితమైన, అమలమైన, కోమలమైన, చంచలమైన, అలసమైన, ఆలోలమైన, విశాలమైన, సంస్ఫురితమైన లోచనముల దృష్టిరసప్రవాహమును మిక్కిలి వ్యాపింపఁజేసి, వెల్లువ కట్టించి ఒక్కుమ్మడిగ హఠాత్తుగ పరమేశ్వరుని ముంచి, తేల్చి, చుట్టి(?) ముప్పతిప్పలు పెట్టునట! ఇంకను "త్రినయనుని తన నయనవాగురలకు లోపు సేయు"నట! (35వచ.) ఇది మన్మథుడు పార్వతిని గంగిరెద్దాట ఆడించినట్లు కలదు. ఇట్లు సేయుచు,

"నగరాజతనయ పన్నగరాజధరు మోఁిల
నిలువుడు మదనుఁ డేటలవి నిలిచె
నెలనాగ గఱిచొమల్ వాలయింప నెత్తుడు
జిత్తజుఁ డింపువి ల్లెత్తు కొనియె
హరిణాక్షి లసదపాంగాలోకనము నూలు
కొలుపుడు నమ్మరిఁగొలిపె మరుఁడు
పతినెలనూరఁ బార్వతి సూచు సుఖచూడ్కు-
లాడుడు నలరమ్ములాడె నీశుఁ
గంతుఁడేయఁదొఁడగె నంత నీశ్వరునకు
నచలవృత్తిఁ బలుపు నాత్మవిమల
యోగభావ మెడపి రాగోత్కటంబున
గౌరియందు నిలిపెఁ గన్ను మనము."
515ప.5ఆ.

ఇది తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యములోని పద్యమునకు అనుకరణమని పూర్వోక్తము. అదటుంచి, పార్వతి "ప్రణుతాపాంగవిలోలేక్షణ దీప్తుల" పరమేశ్వరుని "కలయఁగప్పి"వను, దృష్టిరసప్రవాహమును వెల్లువ

కట్టించి ముంచి, లేవదీసి, ముప్పుతిప్పలు పెట్టి"నను, "నయనవాగురలకు లోఁపు సేసినఁ"గాని, మన్మథునికి "ఏటలవినిలుచు"టకైన సమయము కలిసిరాలేదురద! అంతే కాదు. ఇంత జరిగినను, ఈశ్వరుని అలరమ్ములాడినను, ఇంకను "కంతుఁదేఁచుఁ దొడగె"నట! ఉపరి, పరమేశ్వరుడు యోగసమాధికి స్వస్తిచెప్పి రాగసమాధికి స్వాగతము పలుకును. పార్వతియందు కన్నే కాదు; మనస్సును నిలుపును. ఈ స్థితికి పరమేశ్వరుడు దిగజాఱెను! ఆ స్థితికి పార్వతి దిగజాఱెను! అంతేకాదు. పార్వతి లలితాంగములు చూచి చూచి సొగసిన పరమేశ్వరుని మనస్సు ఇసుకబొమ్మలు నీరు తెరలిన విరిసినట్లు వికలమగును. (37ప.) ఇక పార్వతి—

"ఎలరారు కనుఁగవ వాలయించుఁ గ్రేవల
నెఱిఁగొని మెఱుఁగులు దుఱఁగలింపఁ
గ్రొవ్విరి చిఱునవ్వు నవ్వు వాతెఱకాంతి
రంగిల్లి సితరుచుల్ దొంగలింపఁ
గుదుటఁ గ్రక్కదరిన నుడువిల్లు గదియించు
నుడిసి ముత్తరగలుఁ గడలుకొనఁగ
సోలంబు నెఱనూరు సొగియు నుంజెమటపై
వదలి మేఁదీఁగ మవ్వంబు మిగుల
నొత్తలించుఁ దఱుచు నూకించుఁ దాలిమి
కగ్గలించు నెఱయ నప్పలించు
మదనశరవిభిన్న హృదయాబ్జయై మహా
దేవుఁ జూచి గౌరిదేవి తివుట." 520ప.5ఆ.

ఇందు "గుదుటఁ గ్రక్కదరిన నుడువిల్లు గదియించు" అచ్చుతప్పు. పదములు అటునిటు మాఱినవి. ఫలితము యతిభంగము. "గుదుటఁ గ్రక్కదరినఁ గదియించు నుడువిల్లు" అని ఉండవలయును.

ఇది తిక్కన విరాటపర్వములోని పద్యమునకు అనుకరణమని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి అభిప్రాయము[2]. అది కీచకశృంగారము. ఇది పార్వతి శృంగారము. మన్మథుని బాణముచే బద్ధలైన హృదయము కల పార్వతి పరమేశ్వరుని చూచి, కటాక్షవీక్షణములు ప్రసరించుచు, మందహాసములు ప్రకటించుచు, భ్రుకుటి

విరియుచు, సాత్త్వికస్వేదము కురియుచు సమీపింపఁజూచునట! కవయఁగోరునట! సహనము వీడునట! నిండుతమకము చెందునట! ఎంత వివేకభ్రష్టసంపాతము! అంతేకాదు. "ఇట్లు మదనపరవశయగుచున్న పార్వతి ముఖాలంకారంబు గనుంగొని సొగిసి యాక్షణంబ. (521వచ.)

> ఆ రుచిరాననాబ్జదరహాసవిలాసవికాసభాసినీ
> హారకరాతిభాతి నమలాంగశరీరతుషారదీప్తికాం
> తోరునగంబు సమ్మదరసోత్కటఘర్మజలంబు పర్వి పొ
> ల్పారె హిమాచలంబు నమరాధిపవాహిని గట్టినట్టిపై ".522ప.5ఆ.

పార్వతి దరహాసవిలాసవికాసము భాసింపఁజేయు వెన్నెలచేత పరమేశ్వరుని శరీరమనెడి తెల్లని పర్వతము సాత్త్వికస్వేదము వ్యాపించి, హిమాలయపర్వతము మీద గంగానది ప్రవహించునట్లు ప్రకాశించెనట! అనగా పరమేశ్వరుని శరీరము నిండ సాత్త్వికస్వేదము మహాప్రవాహమయ్యెనని అర్థము. అంతగా పరమేశ్వరుడు మదనపరవశుడగుసు. ఉపరి, "కనుబేటంబైనఁ దావఁగొనక." (523వచ.)

> "పులకాంకురంబులు దలలెత్తి మేనుగం
> పింపఁ గోమలిఁ గౌఁగలింపఁదలఁచు
> రాగోత్కటమున నైరణలేక మానినిఁ
> గాయ్మున బైపడి కవయఁదలఁచు
> లలితాంగి యవయవములు సూచి మదిఁదని
> వోవక చూడ్కులఁ ద్రావఁదలఁచు
> నదరోష్ఠమదరంగ నంతఃస్మితాంశులు
> దలుకొత్త నేమేనిఁ బలుకఁదలఁచుఁ
> దన మహత్త్వంబు దలఁపక తరుణి పొందు
> వడయఁ గిడ్పడి తేఁకువ వాఁపఁదలఁచు
> భావజాస్త్రాభిహతి మహాదేవుఁ డొక్క
> ప్రేలిమిడిఁ జెంపుసెడి కడు విరలిగొనియె." 524ప.5ఆ.

ఇది కూడ తిక్కన విరాటపర్వములోని పద్యములకు అనుకరణమని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి అభిప్రాయము[3]. అది కీచకశృంగారము. ఇది పరమేశ్వర

శృంగారము! "స్ఫురదాధారసరోజపీఠహృదయాంభోజాతరంధ్రాప్తితస్స్వరసాయత్త సముత్థితోజ్జ్వలతరాత్మజ్యోతిరుద్ధాంగరుక్స్ఫరసస్ఫాటికహర్మ్యమధ్యకనకస్తంభంబో నాఁ బర్వు" (495ప.5అ.) పరమేశ్వరుని శృంగారము!! పరమేశ్వరుడు పులకాంకురములు పొటమరించి మేను కంపింప, పార్వతిని కౌగిలింపఁదలచునట! అంతేకాదు. రాగాతిశయమున నిగ్రహము కోల్పోయి కాయ్యున (=స్థాయిభావ రసాతిరేకమున అని కవిగారి లఘుటీక.) పార్వతి మీదపడి కవయఁదలచునట! ఉపరి, పార్వతి అవయవములు చూచి మనస్సు తనివోవక చూడ్కులతో త్రాగఁదలచునట! మీదు మిక్కిలి క్రిందిపెదవి అదరగ, అంతఃస్మితాంశులు తళుకొత్త, ఏమైన పలుకఁబోవుచునట! పైగా తన గొప్పదనమును తలపోయక పార్వతి పొందు పడయుటకు లోకువయి తేకువ పోఁగొట్టుకొనఁదలచునట! పయిపెచ్చు మన్మథాస్త్రము దెబ్బకు మహాదేవుడు త్రుటిలో పెంపుచెడి విరహావస్థ చెందెనట! ఇట్టి విరహవర్ణన కీచకుని పరముగ ఏమైన ఉచితమేమో కాని, పరమేశ్వరుని పరముగ పరమానుచితము. సన్నివేశపరముగ సందర్భశుద్ధిరహితము. సంస్కృతకుమారసంభవములోని సాహిత్యస్థాయి ఎంత గౌరీశంకరశిఖరమో, తెలుగుకుమారసంభవములోని సాహిత్యస్థాయి అంత నేలసపాటమైన వింధ్యశిఖరము. అది స్వర్ణయుగమునకు పతాక. ఇది క్షీణయుగమునకు ప్రతీక.

ఇక పార్వతి ఇంటిముఖము పట్టి, శివుని వలన భగ్నమనోరథ అయినందుకు తన చక్కదనమును తానే నిందించుకొని, తపస్సమాధి వలన అవంధ్యభావము పొందుటకు సిద్ధపడునని సంస్కృతకుమారసంభవమునందు కలదు. మరి తెలుగు కుమారసంభవమునందు మరల విరహఘట్టము. పార్వతి విరహభారమున దుర పిల్లును. (585వచ.) కామవేదనవేళ తుమ్మెదలకు ఉలికిపడును. మంచుపలుకులూ నిలుడన్న భయపడును. కోయిలలకు బెగ్గలించును. చిగురించిన మామిడిచెట్లను చూడనోడును. రాచిలుకలకు ఉలికిపడును. కాముడని చెప్పిన చాలును తల్లడమందును. నిండువెన్నెలను చూచి మూర్ఛపోవును. (586ప.) అంతేకాదు. పార్వతి చిత్తము వగచును. కనుగవ మొగిడును. నుదుట కేలు మోపును. ఎంతయు వెక్కును. నిశ్వాసతతి నెగయును. (587ప.) నిట్టూర్పులకు కదలియాడు నెమ్మొగి చనుదోయి ఎగురఁబోవు జక్కవలందోపలనిన, పార్వతి దగ్గఱ జలజల బాష్పజలము జాఱును. (588ప.) పార్వతి ముఖాంభోజము అలరును; వంది కంపించు. పార్వతి కనుగవ వికసించును; కన్నీరు నించును. ఒడలు పులకరించును; మూర్ఛమునుగును.

మేన పెంజెమటలు పట్టును; కామాగ్ని ప్రజ్వరిల్లును. పార్వతి మనస్సులో పరమేశ్వరుని కూడును. పొడగానక సొమ్మసిల్లిపోవును. (589ప.) ఇది హర్ష నైషధప్రభావము. మన్మథుని బాణము దెబ్బతగిలి పార్వతి జీవము పైకెగరిపోవును. పరమేశ్వరుని ఎదలో భావించుటవలన మరల తిరిగివచ్చును. (590ప.) "ఇట్లసాధారణంబైన రణరణకవ్యథకబ్బగింపక సొలయుచు" (591వచ.) పార్వతి వియోగ తాపమనేమియో తెలిసి; కాముని, కౌముదిని, తుమ్మెదను, చిలుకను, గండుఁగోయిలను ఉపాలంభించి, (592ప.) "కళవళించి పరమేశ్వరుం దలఁచి మనంబున మున్ముఁ గ్లారుచు తలపోసిన విధము తారస్థాయినందినది.

"సురనది సురవులు జూటాంతరంబునఁ
 గ్రొవ్విరిజాదుల కొమరు గాఁగఁ
బావకాంబకరుచి ఫాలతటంబునఁ
 గాశ్మీరమయతిలకంబు గాఁగఁ
గరళాసితప్రభ గళమున వ్రాసిన
 కస్తూరిపత్రభంగంబు గాఁగ
భాసురంబగు నిజపాండురాంగద్యుతి
 సదములచందనచర్చ గాఁగఁ
జారుతరమైన సహజశృంగారరూప
విభవసౌభాగ్యసంపద విస్తరిల్లు
నా మహాదేవుతోఁ జిత్తమార వెలసి
కలసి రమియింప నెన్నఁడు గాంతునొక్కొ" 594ప.5ఆ.

ఇందు శివుని శృంగారరూపము కాళిదాసు శ్లోకములను (32-35శ్లో.7ప.) శ్రీనాథుని హరవిలాసములోని పద్యమును (91ప 4ఆ.) ఉపజీవించునది. పార్వతి "చిత్తమార వెలసి కలిసి రమియింప నెన్నఁడుగాంతునొక్కొ అని గద్దించు"ట మాత్రము కుమారసంభవకర్త సొంత కవిత్వము. కన్యాంతఃపురావర్తి అగు (583వచ.) పార్వతి అట్లు తలచుట అంతఃపురమర్యాదకు మాత్రమేకాదు; ఆమె అంతరంగమర్యాదకును భంగకరము. అంతేకాదు కావ్యరంగమర్యాదకును కళంకము. ఇది కేవలము క్షీణదక్షిణాంధ్రయుగలక్షణలక్షితము.

ఇట్లు "గద్దించి" పార్వతి నిలుకడ లేక, "లీలోద్యానంబున కేకాంతంబునఁ జని విరహదహనదాహంబు సహింపనోపక" (595వచ.), చంద్రకాంతశిలలు పేర్చిన సరస్సున దిగును. పార్వతి శరీరోష్ణమునకు సరస్సులోని నీరెల్ల ఇంకిపోవును. కాని, పార్వతి ముఖచంద్రకాంతికి చంద్రకాంతశిలలు కరిగి సరస్సు మరల నిండి పోవును. (596ప.) అయినను శరీరతాపమది అణగక పార్వతి పరమేశ్వరుని రూపమును చిత్రించును. దానికి రంగులు వేయును. అమాంతము పరమేశ్వరుడు "కలకల నవ్వునట్లు దమకంబునఁ గన్గవ విచ్చి ప్రేమలతల్ వొలయఁగఁ జూచునట్లు" పార్వతికి కనిపించును. అంతేకాదు. "తనివోవఁగఁ దెల్వియుఁ గౌఁగిలింపఁ జేతులు పచరించునట్లు" కూడ పార్వతికి కనిపించును. ఉపరి, "అవటుతో రతికేళికి నవ్వళించునట్లెలమి నటించునట్లు" సహితము పరమేశ్వరుని రూపము పార్వతికి ప్రసన్నమగును. (598ప.) ఇది దక్షిణాంధ్రయుగలక్షణలక్షితము. ఇంకను పార్వతి అది "అంతయు నిక్కమంబ కాఁ దలంచి లజ్జించి మే యోసరించుచు నపాంగావ లోకనంబు సురంగంబై వెలయం దదాసక్తి యగుచుండు"ను. (120వచ.) ఇది పార్వతీపాత్రచిత్రణమును పాతాళమునకు దిగజార్చిన సందర్భము.

ఇట్లు పార్వతి లీలోద్యానవనమున ఇబ్బందిపడుచుండ, చతురిక అను ప్రియ వయస్య కన్యాంతఃపురమున పార్వతిని కానక వెదకుచు లీలోద్యానవనమునకు వచ్చును. (599వచ.) వచ్చి, సరోజదళములు దరహాసరుచి, వెన్నెల సుధాపూర్ణ కాంతి, మలయమారుతము చల్లదనము, రాజకీరములు రసవంతమగుమాటలు, మదనవేదన మైమఱచిన పార్వతినుండి అపహరించినవని (600ప.) ఇంకను పర మేశ్వరుని సుందరాకారమును చిత్రించుచున్న పార్వతిని సమీపించును. (601వచ.) వనసీమకు వచ్చుటయేగాక, "చిత్తమునకుఁ గన్నుఁగవ కూఁతగా నిహికటకు రూపు చిత్రమని చూచెదిదియేమి చిత్రమబలి! (602ప.) ఇదియంతయు హరు వలని విరహ వ్యంజకంబగుచున్నయది" (603వచ.) అని పార్వతిని పరామర్శించును. "నాఁ డాదిగఁ బాయ కీవుఁదెద నప్పటికప్పటి కొక్కభంగి నన్నాదటఁ గూడియుండవిరహ వ్యథ నాదెసఁ బొంద నేర్చునే (604ప.) అని పార్వతి "కప్పి బల్కఁబోయి బయల్పడఁబల్కి వెలవెలఁ బాఱుచుఁ దన బహిఃప్రాణమైన ప్రియవయస్యపై నల్లన వ్రాలి"పోవును. (605వచ.) "వలరసం బొక్కపెట్ట తటిమి కుక్కిదము గాఁగ నిండి తాల్మి కట్టువిసెనోయన" కన్నీరు వరదలు కట్టును. (606వచ.) "అంత చతురిక చతురోక్తుల నగజ ననునయించు"ను. (607వచ.) "సర్వాత్మ సర్వగతుం

చిత్తమునందుఁ గోరుడిది సద్వంద్యంబు బనింద్యం బిలన్" అని సంబోధించును. (608ప.) పార్వతి "విరహం బతిక్రాంతం బగుటెంచు టెఱిఁగి "చతురిక "నిపుణికాది సఖీజనంబులఁ దోడ్తెంచి శిశిరోపచారంబులు సేయించి విరహపరితాపంబు పుచ్చి పైచెద నోడకుండుమని పోవ నిశ్చయించి." [609వచ.]

"ఆడెడు నమ్మిఁ గన్గొనకుమమ్మ బయల్పడనాడు చిల్కతో
నాడకుమమ్మ తేఁటిగెడ నాలతి సేయకుమమ్మ వెన్నెలం
జూడకుమమ్మ తెమ్మెరలఁ జోఁకుమమ్మ తలిర్చు మావిక్రీ
నీడకుఁ బోకుమమ్మ యని నెచ్చెలికత్తెకుఁ జెప్పె సమ్మతిన్. "610ప5ఆ.

ఇట్లు చెప్పి చతురిక "చని నిపుణికాదిసఖీజనంబులకుం దద్వృత్తాంతంబెఱింగించిన నుదరిపడి యందఱుం జనుదెంచి మదనవేదనం బరవశయై యున్న యగ్గిరి నందనం గని లగ్గెగ్గిల్లి" [611వచ.] "నిజమింత గోమలి మరుప్రసవాస్త్రహతిం జలింపదే" [612ప.] "అని మెత్తమెత్తన తడుముచు" [613వచ.] "ఏల వలరాజు చలము సాధ్యమ్ముసేసెదమ్మ" [614ప.] అని పార్వతిని హెచ్చరించి, "అందఱు నొండొరులం గని" [615వచ.]

"తలిరులు మొగ్గలున్ వికసితప్రసవంబులు దెండు మీరు శీ
తలికలుఁ బిక్కమూలములు తామరతూఁడులు దెండు మీరు చెం
గలువలుఁ దోపకాములనుఁ గంజదళంబులు దెండు మీర లీ
చెలువకు శీతలక్రియలు సేయుద మింకెడసేయ నేటికిన్." 616ప.5ఆ.

"అని అందఱు నొండొరులకు మీఱి నట్లనేకశిశిరోపకరణద్రవ్యంబులు తత్క్షణంబ కొనివచ్చి తమలోన" [617వచ.] కూడఁబలుకుకొని [618ప.] "అవి అన్నియు నవయవంబులుగా నమర్చి శిశిరవీర్యమంత్రంబుల నభిమంత్రించి" [619వచ.], "శీతలోపకరణంబుల నేర్చి" [620ప.] "విరహాగ్నిదాహంబునఁ దల్లడిల్లుచున్న గౌరింగనుంగొని" [621వచ] విధిని తిట్టుచు [622ప.] పార్వతికి శశికాంతజలముల జలకమార్చి, గైరికాంబరములు గట్టనిచ్చి, మలయజపంకము కలయనలది, కర్పూరహారములు పెట్టి, పువ్వులు తుఱిమి, కమ్మలిడి, విదాహము పోఁగొట్టి, శరీర మలమి, నవక మెసగఁజేసిరి. [624ప.] ఉపరి, మన్మథుని ప్రణుతించి, మందపవమానుని స్మరించి, వసంతుని కొలిచి, చంద్రుని మ్రొక్కి, గోరు

వంకలకు, కోయిలలకు, తుమ్మెదలకు, చిలుకలకు, నెమళ్లకు మేతపెట్టి, విరహాధి దేవతలను భక్తితో కొనియాడి [626వ.], ధారాగృహములో శశికాంతవేదిపై పూలపాన్పు మీద పార్వతిని పవళింపఁజేసి, ధాతుజలముల ఒడలు తడిపి, తామరాకుల తోను, అరటియాకులతోను విసిరి [627వ.] కొలఁకులు, ఎలదూడులు, ఆకులు మంచునీట తడిపి, పార్వతి మేన నొత్తిరి. [628వ.] "అంత నొక్కించుక యుల్లంబు సల్లనై గిరిజ కన్నులు మూసినం గని సఖు లొండొరులం బదరికొని కోసరించిరి." [629వచ.] అప్పుడు,

> "ఉదరెడు మోవి ముత్పులకలొత్తెడు నూరులుఁ గేలుఁ జన్నులం
> గదలెడు మేనఁ బెంజెమటగ్రమ్మెడు నూర్పులు నీల్గెడున్ మదం
> బొదవఁ బ్రియుం గలం గవయుచున్నది యిత్తఱి నేలనిద్ర దె
> ల్పెదవని యంతరంగగతిభేదము దెల్పె విదగ్ధ ముగ్ధలన్." 630ప.5ఆ.

పార్వతి కన్నులు మూసెనంతనే, పార్వతి సఖీజనములోని విదగ్ధ ఒకతె ముగ్ధలకు చెప్పుచున్నది. ఏమని? "మోవి అదరినది. మోదపులకలు పొదలినవి. ఊరులు, చేతులు, వక్షోజములు కదిలినవి. మేన పెంజెమట పట్టినది. నిట్టూర్పులు వెలువడినవి. కారణము- ముదమార పార్వతి కలలో పరమేశ్వరుని కవయుచున్నది. ఏల నిద్రలేపెదవు?" అని. అది విదగ్ధ కనుక ఇది అబద్ధము కాదు. నిబద్ధము. "అంత నగజ కల నిక్కువంబుగా భావించి బెదరి లేచి పతిం గానక." [631వచ.]

> "ఉమ్మలికమ్మునన్ సొలసి యుస్సని మెల్లన వ్రాలుఁ బాన్పుపై
> గ్రమ్మన లేచి నిల్చి పతిఁ గానక విభ్రమమంది చిత్తతా
> పమ్మున నేలమీదఁబడి ప్రాణము నిల్పక తల్లడంబునన్
> సొమ్మలుపోవుఁ దన్ సఖులు చూచి భయంపడఁ గామపేదనన్."
>
> 632ప.5ఆ.

నిజముగ పార్వతి కలలో పరమేశ్వరుని కవిసెను. కల నిజమని తలపోసి బెదరి లేచెను. కల కరిగిపోయెను. పరమేశ్వరుడు కనిపించకపోయెను. అందుచే పార్వతి ఉమ్మలికమున సొగసి ఉస్సురని పాన్పుమీద వ్రాలును. అంతలోనే లేచును. పరమేశ్వరుని కానక విభ్రమమందును. చిత్తతాపమున నేలమీద పడి పోవును. ప్రాణము నిలువక తల్లడమంది సొమ్మసిల్లిపోవును. కారణము?

కామవేదన! భయపడిన సఖీజనములును తల్లడిల్లి [633వచ.] "పరముఁ డెన్నఁడొక్కొ ప్రత్యక్షమై తన రూపు శైలసుతకుఁ జూపు నెలమి" [634ప.] అని నేలమీద పడిపోయిన పార్వతిని లేవనెత్తి శిశిరతల్పమున పరుండఁబెట్టుదురు. [635వచ.] పార్వతి మఱల మూర్ఛపోవును. [636ప.] అంత [637వచ.] చెలికత్తెలు మఱల శిశిరోపచారములు చేయుదురు. [638ప.] "ఇట్లందఱు నక్కౌత్తికొనక చేయు శిశిరోపచారం బగజ కుష్ణోపచారంబులై నం దన సఖులం బదురుచుఁ దను వానపడి దిశలు గలయం గనుంగొని యెందు నుపాశ్రయంబు గానక కలవలించు"ను. [639వచ.] చంద్రునిపై, శుకపికాములపై అక్షతలు వేయును. [640,641ప.] మన్మథుని బలమునకు మథనపడును. [642ప.] "భయాకులహృదయ యగుచున్న గిరిరాజనందనం బ్రియసఖులు" [643వచ.] అనేకవిధముల [644ప.] బుజ్జగింతురు. అయినను పార్వతి "విరహతాప మతిక్రాంతమగుట గని భయస్థలై యిది మన చేతం దెగదింతయు హిమవంతున కెఱింగింప వలయునని" విన్నపము సేయుదురు. [645ప.] ఆ విన్నపము ఆరు పద్యములు. [646-651ప.] అందు "మారుని దొనయమ్ము లొక్కమొగి రోమము రోమము దప్పకుండ నాటిన క్రియనుండు" ననియును గలదు. [647ప.] ఆరు పద్యములు విని హిమవంతుడు అదిరిపడి సతీ సమేతముగ వచ్చుసరికి [652వచ.] పార్వతి "పరమేశ్వరుం దపోమహిమ నర్చించి మెచ్చించి నిజాధీశ్వరుఁడుగాఁ బడయుదునని తపోవనంబునకుం బోవ నిశ్చయించు" కొనును. [659వచ.6ఆ.] అంత విరహముతోను ఇంత నిశ్చయము! ఏవంవిధమైన పార్వతీవిరహవర్ణనము సంస్కృతాంధ్రనైషధములలోని దమయంతీ విరహ వర్ణనమునకు దాస్యముచేయునది. అంతేకాదు పార్వతీ విరహవర్ణనములోని పార్వతీస్వప్నసమాగమము ఉత్తరదక్షిణాంధ్రయుగప్రబంధవిరహవర్ణనములను మించి లాస్యము చేయునది. ప్రుతిమించిన శృంగారమునకు శృంగగ్రాహిక.

ఇక పరమేశ్వరుని విరహము- మన్మథుని దహించినను, అగసుతపై రాగము, మన్మథునిపై ద్వేషము కలిగి, తపముడిగి రజతగిరికి అరిగిన [55,56వచ.5ఆ.] "కృతాంతాంతకుండు కంతులతాంతాస్త్రహతాంతరంగుండై దురపిల్లు"ను. [159వచ. 6ఆ.] శివుడు కృతాంతాంతకుడు మాత్రమే కాదు; అప్పటికి మన్మథాంతకుడు కూడ! అయినను కంటిమంటను భస్మము చేసిన మన్మథుని పూలబాణములకు పరమేశ్వరుని అంతరంగము దెబ్బతిన్నదట! అంతరంగము హతమై, పరమేశ్వరుడు దురపిల్లుచు తలపోసినవిధమిది :

"హిమవంతుఁ డింతి నాకీఁ దెచ్చుదెఱిగియు
నామాట లేనేల యాడనైతి
నతఁ డొండునా నోడి యతివ నా కడనుంచి
యేఁగిన కన్నేల యెఱుఁగనైతి
నాబాల నన్నుఁగూడ నాసించుచున్నచో
మిన్నక తపమేల పన్నికొంటి
నెలనాగ నామీఁద నెలయింపవచ్చిన
భావజుతో నేల పగయుఁగొంటిఁ

దరుణి వలరసంబు దఱిమి పైఁబడనున్న
నెఱ నెఱింగి కూడ నేరకేల
బేలనైతి ననుచు బాలేందుధరుఁ డాత్మ
చింతవిడిచి విరహచింతఁ దగిలె." 819ప.6ఆ.

హిమవంతుడు పార్వతిని సపర్యలు చేయుటకు నియోగించుటలోని ఆంత ర్యము గమనింపనైతినని, పార్వతి తన్ను కోరుచున్నచో తపమేల చేసితినని, పార్వతిని తనమీద ప్రయోగింపవచ్చిన మన్మథుని ఏల దహించితినని, పార్వతి ప్రణ యాతిరేకమున మీదపడనున్న కిటుకు తెలిసికూడ నేరక ఏల బేలనైతినని, పాపము, పరమేశ్వరుడు పశ్చాత్తాపము చెంది ఆత్మచింత వదలి, విరహచింతను తగిలెనట! ఇట పరమేశ్వరుడు ఆత్మచింతను వదలుటకంటె, కవి కావ్యాత్మచింతను వదలుట కరతలామలకము. ఇంత దీనస్థితికి పరమేశ్వరుని పాత్రను దిగజార్చిన సందర్భము ప్రాచీనకావ్యములందు ఇతరత్ర మృగ్యము.

విరహచింతను తగిలిన పరమేశ్వరుని వికారమిది:

"బొమ లల్లార్చుచు లోచనద్యుతులఁ బైఁ బూరించుచున్ మందహా
సమరీచుల్ దళుకొత్తఁ బల్కనొలపుల్ సంధించుచున్ లోలభా
వము సూచించుచు నీళు మోల నెలమిన్ వర్తింపఁ జొచ్చెన్ మనో
రమణం బార్వతిరూపవిభ్రమ మహోరాత్రంబు సాన్నిధ్యమై."

820 ప. 6ఆ.

పరమేశ్వరునికి అహోరాత్రములు పార్వతి రూపము కనుబొమలు కదలిం చుచు, కటాక్షవీక్షణములు ప్రసరించుచు, మందహాసమరీచులు ప్రకటించుచు,

పలుకునట్లు కులుకువోవుచు, లౌల్యము సూచించుచు, సాన్నిధ్యమునందుచు కనిపించునట! అంతేకాదు.

"హరునకుఁ జూడఁగా మహిఁ జరాచరరూపములెల్ల సమ్మతిన్
గిరిసుతరూపమై విరహఖేదముఁ జెప్పఁదొడంగునట్లు కా
కరయఁగ నాదిశక్తి సచరాచరరూపము కావునన్ మహా
పురుషులకన్న కాన్కి యనపోహము కావుడిదేమి చోద్యమో" 821ప.6ఆ.

పరమేశ్వరునికి భూమండలములోని చరాచరరూపములెల్ల పార్వతీరూపమై విరహఖేదము చెప్పసాగినట్లనిపించినదట! పార్వతి ఆదిశక్తి. ఆదిశక్తి సచరాచర రూపము. కావున పరమేశ్వరునికి అనిపించినది అపోహ కాదని కవిసమర్థనము. పార్వతి ఆదిశక్తి అయిన, పరమేశ్వరుడు ఊహాశీలి కాఁబోలు! ఉపరి, [822వచ.]

"ఉరుకపర్దారుణతరదీప్తులను మృదు
నవసహకారపల్లవవిభాతి
నీలకంఠప్రభాజాలంబులను సమ
దాలోలరోలంబమాలికలును
బాండురాంగాదుల బహుళశీధీధితులను
పూర్ణచంద్రాతపాకీర్ణరుచులు
గంగాంబుశీకరోత్కలితాహినిశ్వాస
ముల మందపవనంబుఁ బొందుచేసి
కాముఁ జంపినపగఁ దీర్పఁగడఁగి సూక్ష్మ
భావమునఁ జొచ్చి చిత్తతాపావహంబు
లయ్యెనొకో నాఁగ శివుఁ డంగజాపహారి
యయ్యు విరహాగ్నిఁ బడి వేఁగు నలసి సొలసి" 823ప.6ఆ.

శివుడు అంగజాపహారి అయినను విరహాగ్నిలో పడి వేగిపోవునట! ఎట్లు? జటాజూటముయొక్క ఎఱ్ఱని కాంతుల మావిక్రొంజివురాకులు, కంఠముయొక్క నీలప్రభల తుమ్మెదలపిండు, మేని ధవళకాంతుల వెన్నెల, శిరసుమీది గంగ శీకరము లకు జలదరించిన పాముల నిట్టూర్పుల పిల్లగాలులు- మన్మథుని చంపినపగ తీర్చు కొనుటకు చేరి, చిత్తతాపము కలిగించెనో అన్నట్లు! కల్పన బాగున్నది. కాని,

పరమేశ్వరుడు మన్మథుని చంపినవాడయ్యును విరహాగ్నిలోపడి అలసి, సొలసి వేగిపోవుననుట పాత్రౌచిత్యమును పాటించని ప్రబంధానుకరణపారవశ్యమునకు మూదల. తదుపరి "అలిధమ్మిల్ల" అను తెనాలి రామలింగని కందర్పకేతువిలాసము లోని పద్యమును అనుకరించుటవలని అనర్థకమని పూర్వోక్తము. "పార్వతీజలజా వాసముఁ జొచ్చి యాడక మనోజాతానలంబాఱునే" అని [824ప.] విహ్వలించిన పరమేశ్వరుని మన్మథావస్థకు మకుటమిది :

"అత్తనుమధ్య రూపు గడునందముగాఁ గుసుమాయుధుండు నా
చిత్తమునందు రేఖగొని చిత్రము వ్రాసెనొ పోలుపొంద న
చ్చొత్తెనొ నేర్పుమం గలయనూన్చెనొ గాకిది తన్మనోభవో
న్మత్తవికారమో మదనుమాయయొ నిక్కువమో తలంపఁగాన్"
825ప.6ఆ.

ఇది పరమేశ్వరుని సందేహడోల! పరమేశ్వరుడు తన సృష్టిస్థితిలయశక్తులను మఱచిపోయెను కాఁబోలు! ముల్లోకములకు సమస్య పరమేశ్వరుని మాయ. అట్టి పరమేశ్వరునికి సమస్య మన్మథుని మాయ!- ప్రబంధనాయకుని పరమైన విరహ వర్ణనమును, పరమేశ్వరుని పరమైన విరహవర్ణనమును చేయుట వలని చేటు. ఇంత హీనస్థితికి పరమేశ్వరుని పాత్రను దిగజార్చిన సందర్భము ప్రాచీనకావ్యము లందు ఇతరత్ర మృగ్యము.

ఇది ఉత్తమప్రకృతులైన, జగన్మాతృపితలైన, పార్వతీపరమేశ్వరుల పరోక్ష శృంగారము. ఇక ప్రత్యక్షశృంగారము- "అనేకప్రకారంబులం ద్రిలోచనుండు రణరణకవ్యథాకులితహృదయుండగుచుండె నంత నగజ తపఃప్రభావం బీశాను బలా త్కారంబున నాకర్షింపంబోడంగు"ను. [826వచ.6ఆ.] "పరమేశ్వరుండు నిజ మనోరథంబు సిద్ధిపొందం బార్వతికిం బ్రత్యక్షంబుగాఁ దలఁచి తదీయాంతర్గతం బారయ వేడి నిజరూపంబు చూపనొల్లక" [834వచ.7ఆ.] కపటవటురూపమున [835ప.7ఆ.] పార్వతి కడకు వచ్చును. సర్వాంతర్యామికి పార్వతి ఆంతర్యము తెలిసికొనుటకు ప్రచ్ఛన్నరూపమున రావలసివచ్చినది. సరే. కపటవటుసంవాదము కడముట్ట కండపట్టుగ సాగును. [835-887వచ.7ఆ.] పార్వతి "వీనిం బరికి పరమేశ్వరుం బలికించి వినుటేమి యని కోపావేశంబునం బరాఙ్ముఖియై చననున్న

కన్నెఱింగి వరదుండు గౌరి నిశ్చలభక్తియుక్తికి ననురక్తుండై యాక్షణంబ ప్రత్యక్షంబై నిజస్వరూపంబు చూపు"ను. (888వచ.7ఆ.) "మునికుమారుం డాక్షణంబ పరమేశ్వరుండైనం బార్వతి బట్టులికి యెదురుకొని తన్నోసరించుచు" (895వచ.)

"తన మనమున సంభ్రమమును
దనువున ఘర్మోదకములుఁ దనరఁగ శంభుం
గని సతి నివ్వెఱఁగై ని
ల్చెను వడఁకుచు నీరమునిఁగి లేచిన భంగిన్." 896ప.7ఆ.

పరమేశ్వరుని సాక్షాత్కారము హఠాత్సంభూతము కనుక, పార్వతికి సంభ్ర మము కలుగుట సహజము. చెమట పట్టుట కూడ సహజము. కాని, నీటిలో మునిగి లేచినట్లు కనిపించునంత చెమట పట్టుట అతిశయోక్తియే కాదు; పార్వతి పరముగ అనుచితోక్తి. అది సాధ్వసస్వేదము కాదు. సాత్త్వికస్వేదము. "తత్క్షణంబ గౌరి కాశ్మీరుఁడగు నీశుఁ గనుచుఁ బ్రీతి నెలమిఁ దొల్లింటి కంటెనుఁ జెలువమెసఁగె" అని తదనంతరపద్యము. (897ప.) అంతేకాదు. "ఆనందాశ్రు ముక్తాతతల్ దనరారం బతిఁ బ్రీతిఁ జూచె మెఱుఁగుల్ దలోక్కత్తెఁ గ్రీగన్నులన్." (899ప.) పరమేశ్వరుని ప్రీతితో చూచి, సిగ్గుపడి, తలవంచుకొని పార్వతి పరమే శ్వరుని మీద కటాక్షవీక్షణములు ప్రసరించును. (901ప.) "అంత నంతకాంతకుం డచలసుత చంచలాపాంగావలోకనసుధారసప్రవాహనిమగ్నుండై సొగియు" ను. (902వచ.) పార్వతి అపాంగావలోకనవిలాసమును, ముఖారవిందవికాసమును, వచనమాధుర్యమును మాత్రమేగాక, పార్వతి ఉరుకచబంధమును కూడ పరమేశ్వరుడు కీర్తించును. (903ప.) అంతేకాదు. "ఇట్లు హరగిరిజ లధికప్రణయరసాపూర్ణ సాగరంబులను నభిమానశీలంబులను నతిక్రమింపనున్న కన్నెఱింగి పరమేశ్వరునకుం జయవిక కృతాంజలియై." (904వచ.)

"గిరిసుతకన్యాగుణ మా
దరమున మును సుప్రతిష్ఠితము సేసి లస
త్పరిణయపూర్వకమున నీ
శ్వర! సుదతిఁ బరిగ్రహింపు సన్మార్గమునన్." 906ప.7ఆ.

అని హితబోధ సేయును. పార్వతీపరమేశ్వరులు అభిమానశీలములను అతిక్రమించుటకు ఆయత్తమయిరట! సఖుల సన్నిధిలోనే! పార్వతిని సన్మార్గమున పరిగ్రహింపుమని చతురిక హితబోధ. అనగా పార్వతీపరమేశ్వరులు ఆయత్తమయినది దుర్మార్గమని ఆంతర్యము. చతురిక హితబోధ చేసినది సన్మార్గము. కనుక పార్వతీపరమేశ్వరుల కంటె చతురిక వివేకవతి! ఆమె "హిమవంతు నఖిలజగద్వినుతుం జేసి కృతార్థుం జేయవలయుననిన వరదుండు దాని కోరిన వరంబు దయసేసి." (907వచ.)

"తమకంబున నరుగు మరా
ళము లంబుదరవము విని చలాచలమతి సం
గము వాసినట్లు నవసం
గమ మిరువురు వదలి చతురికావచనగతిన్." 908ప.7ఆ.

"హరగిరిజ లొండొరుల చిత్తంబులు విడుజట్లు గొని తారనీహారాచలంబులకు" అరుగుదురు. (909వచ.) చతురిక హితబోధ వలననే, పార్వతీపరమేశ్వరులు నవసంగమము వదలిరట! ఇట పార్వతీపరమేశ్వరుల పాత్రచిత్రణ సామాన్యశృంగార నాయికానాయకుల స్థాయికి దిగజారినది. ఇది కాళిదాసు కుమారసంభవములోని సన్నివేశమునకు ఇసుంతయు సన్నిహితము కాదు. క్షీణదక్షిణాంధ్రయుగ ప్రబంధములలోని సన్నివేశములకు మాత్రమే అత్యంతసన్నిహితము.

పార్వతీపరమేశ్వరుల పరిణయమునకు పెండ్లిపెద్దలైన సప్తర్షులు హిమవంతునితో సంబంధము మాటాడి, ముహూర్తము నిశ్చయించి, పరమేశ్వరుని సన్నిధికి వచ్చి ఫలసిద్ధిని చెప్పి వెళ్ళిపోయినట్లు సంస్కృతకుమారసంభవమునందు కలదు. (94శ్లో.6స.) ఇది తెలుగు కుమారసంభవమునందు ఇట్లు కలదు. "ముని గణంబు మగిడివచ్చి తదాస్థానరంగంబుఁ జొచ్చి (2వచ.8ఆ.) "-తమపోయివచ్చిన కార్యసిద్ధిక్రమంబును సవిస్తరంబుగా విన్నపంబుసేసిన నయనకర్ణకుండలుం దత్కన్యారూపవర్ణనాకర్ణనదత్తకర్ణుండైనఁ గన్నెఱింగి హరిపరమేష్ఠిమునిపురందరాధీశ్వరుండైన పరమేశ్వరునకు నగజ సమస్తప్రశస్తలక్షణలక్షితాంగోపాంగవిశేషంబులు వర్ణించి వెండియు" (4వచ.) పార్వతిని పదమూడు పద్యములందు వర్ణింతురు. వక్తలు పెండ్లిపెద్దలు. వారు అరుంధతీసమేతులైన సప్తర్షులు. శ్రోత పెండ్లికొడుకు. ఆయన "హరిపరమేష్ఠిమునిపురందరాధీశ్వరు"డైన పరమేశ్వరుడు. అయినను,

అరుంధతీసమేతులైన సప్తర్షులు పార్వతి కచకుచజఘనోరుజంఘలను అదేపనిగ అభివర్ణింతురు. అది "హరినీలోపమమధ్యకేశి .... సింధురబంధురకుంభాలసమాన పూర్ణకుచ" అను చిత్రకవిత్వమే కాదు; అనౌచిత్యకవిత్వమును. అందలి కొన్ని అంశములివి :

1. "నెఱి గలుగు నాఁడునాఁటికి
గుఱి గడవఁగఁ బెరుఁగు జఘనకుచకచభరముల్
సిఱుఁదొడలు నడుము నణ్ణును
విఱుగక తక్కఁదని గిరిజ వెఱచుచు నడచున్." 7ప.8ఆ.

2. "వీఁగారు చనుఁగవ్రేఁగునఁ గౌఁదీఁగ
వడు వసివాళులు వాడుచుండు 9ప.8ఆ.

3. "ప్రణయాతిశయమునఁ బాయని జక్కవ
కవయు నెవ్వలి నన్నుఁగవయుఁ గవయొ
వలకోటఁ బెరిఁగిన వలరాజు హస్తిహ
స్తంబునుఁ గేశపాశంబు నెనయొ" 12ప.8ఆ.

4. "త్ర్యంబక! నగసుత నిబిడకు
చంబుల పొలుపెన్న మాకు శక్యమె నీదెం
దంబునకు వచ్చునట్టె భ్రు
వంబుగ వేఱొండు దగిన వర్ణన గలదే." 14ప.8ఆ.

5. "పరమానందుని నిను సుఖ
పరవశుఁ గావించనోపుఁ బరమార్థమునన్
ధరణీధరవరనందన
గురుజఘనవిశేష మొరుల కొలఁదియె పొగడన్." 15ప.8ఆ.

6. "నడుమన డింతి చన్నుల తనర్పున...." 16ప.8ఆ.

7. "తనుమధ్య యోప దీ గురు
ఘనకుచభారంబు దాల్పఁగా నని యజుఁడి
మ్మున నీలమణికడిక గీ
ర్చిన క్రియ నూఁగారుదీఁగ చెలువకు నమరున్" 17ప.

8. "కంబుకంధర గ్రీహిగర్భాభజంఘలు
బిసహస్త రంభోరులసితరుచియుఁ
బూర్ణకుంభస్తన పులిననితంబంబు
హరిమధ్య వేదిమధ్యాభినుతియుఁ
గుంభికుంభ నితంబకోకస్తనంబులు
కరభేరు మృదులతాకరయుగంబు" (18ప. 8ఆ.)

ఇట్లు సప్తర్షులు ఇంకను "అనేకప్రకారంబు నగజ రూపవిభ్రమసౌందర్య విలాసంబును నారోహిణ్యవరోహిణుల వర్ణింతురు. (19పద్య.) మొత్తముమీద ముమ్మాటికి. ఎంత ముమ్మాటికి పార్వతి జగదేకసుందరి అయినను, పరమేశ్వరుని ఎదుట, అరుంధతి సమక్షమున సప్తర్షులు యిట్లు "ఆరోహిణ్యవరోహిణుల" వర్ణించుట సప్తర్షుల పరముగనేకాదు; పరమేశ్వరుని పరముగను, పార్వతిపరముగను అనుచితము. పార్వతి జఘనోరుజంఘలను సప్తర్షులు పరిశీలించుట, సర్వేశ్వరుడు అనుశీలించుట విపరీతము. ఇది రఘునాథరాయల వాల్మీకి చరిత్రములోని సప్తర్షులు తంజాపురస్త్రీలు "నటించు నగలెల్లఁగనుంగొని పొంగి"పోవుట కంటె జఘన్యము.

వరుడు, పరమేశ్వరుడు ఓషధీప్రస్థపురప్రవేశము చేయునపుడు నారీలోకమునకు నాడీవేగము కలుగుట ఇరువది పద్యములందు కలదు.(50-71ప. 8ఆ.) ఇందు పురసతులు దరహాసామృతమున స్మరహరుని స్నపనమార్చుట, అద్దగోడల మీద వ్రాలి కుచములపై ముఖసరసిజములు నిలుపుట, విటమత్స్యవ్రాతమును దిప్పుచు వచ్చుట, రతిశ్రమాకులిత అయ్యును ధూర్జటిని చూచుచు, నఖక్షతచుంబనసంజితాంగముల వచ్చుట, కాసె విప్పి కప్పుట మఱచి పొదివి పట్టుకొనివచ్చుట, కట్టిన చీర విడిపడగ వచ్చుట, కాటుక కన్నుల నిడఁబోయి కంఠమున పూసికొనివచ్చుట, విటమండలి శివుని మఱచి తన్ను చూచునట్లు వచ్చుట, హరుని చూచుచు ప్రాణేశ్వరునిచూచి ప్రాణేశ్వరుని చూచుచు హరుని చూచి వచ్చుట, ప్రియుని నఖాంకములు కుచద్వయము మీద విచ్చి చూచుచు, కప్పుచు, విప్పి చూచుట మొదలైన ముచ్చటలు బహుళము. అవియెల్ల పరమేశ్వరుని భక్తితోఁగాక రక్తితో చూచు పౌరాంగనల పారవశ్యములు. అంతేకాదు, కుబేరుని, ఇంద్రుని, బ్రహ్మను, విష్ణువును, నందిని, శివుని ప్రౌఢాంగనలు పరికించుట "మనోనురాగ"మహిమయే. (72-79పద్య.) ఆ రాత్రి చీకటిలో జారచోరాదిగూఢచారుల కామకేళీవిలాసము (100-104పద్య.), వెన్నెలలో విటీవిటుల విశృంఖలవీథీవిహారము (120-131పద్య.) అరవైరెండు పద్యగద్యముల అపూర్వ

ఘట్టము! కన్నడకావ్యమైన గిరిజాకల్యాణమునందును విటీవిటవ్యవహారము కలదట[4]. కర్ణాటాంధ్రకావ్యపరిజ్ఞాతలు పరిశీలింతురుగాక!

పార్వతీపరమేశ్వరుల పరిణయమునకు ముందు విటీవిటశృంగారము మాత్రమే కాదు: పార్వతీపరమేశ్వరుల పరిణయము తర్వాతను విటీవిటుల వ్యవహారము కలదు. "హరగిరిజ లఖిలాదురపరివృతులై" (249ప.9ఆ.) అవలోకించిన జలక్రీడ విటీవిటుల జలక్రీడయే. (257-270వచ;277-292ప.) సుమారు ముప్పది పద్యముల ముడుపు. అందు విటీవిటులు బ్రహ్మ పితామహుడనియైన మన్నింపక పట్టుకొని ఒడలెల్ల మంచిగంధము పూయుదురు. మంచిదేకాని, "హరుడు గనుగీట" విటీమణులైన "సురసతు లావనీరు ఇంద్రుపైఁ జల్లు"దురు. ఇంద్రుని వేయికన్నుల "జెప్పలు వ్రాలి" పోవును. ఇక వనక్రీడలోని ఎలనాగలును కామినీమణులే. (311-325వచ.) తదుపరి మధుపానగోష్ఠి (327-334ప.)- అది మతౌకప్రపంచము. పంచమకారప్రపంచము. ఇవియెల్ల అష్టాదశవర్ణనల అనుసరణము వలని, కౌలాచారముల అవతరణము వలని అనుగ్రహము మాత్రమే కాదు; అర్వాచీనప్రబంధముల అనుకరణము వలని అవగ్రహము కూడ.

అన్నిటికంటె అత్యనుచితమైన వర్ణనమిది :

> "ఉరుకుచాగ్రంబు లొండొంటి నొత్తుదేర
> నెదురు కౌఁగిలింపఁగ ననువెట్టుఁ గాక
> కెలని కొఱఁగుచుఁ గుచతటుల్ బలిమినొత్త
> నంది కేళ్లెటకేనియు నందికొనిరి."                342ప.9ఆ.

ఇది కాళ్లుకడిగి, కన్యాదానము చేసి, కన్నకూతురిని అత్తవారింటికి పంపునపుడు కన్నతల్లి కన్నప్రేమ కొలది కన్నకూతురిని కౌగిలించుకొను సందర్భము. ఇట కన్నకూతురు పార్వతి. ఆమె జగన్మాత. కన్నతల్లి మేనక. ఈమె జగన్మాత మాత. ఇట్టి మేనక అట్టి పార్వతిని పెండ్లిచేసి అత్తవారింటికి పంపునపుడు ఆప్యాయనము కొలది పరిష్వంగము చేయుటకు, ఇద్దటి కుచాగ్రములు ఒకదానికొకటి ఒత్తుకొని, కౌగిలించుకొనుటకు ఏవిధముగను అనువు కాక, ఒకప్రక్కకు ఒరుగుచు, కుచతటములు బలముకొలది అణచుచు- అప్పుడును వీలుగాక- ఎట్టకేలకు ఒకరిచేతులు

ఒకరు అంచుకొనిరట! ఇట్టి కల్పనము పార్వతీమేనకల పరముగ రంచుకొగదా-కాదు- 'సెర్చిలైటు' వేసి వెదకినను, ప్రాచీనకావ్యములందు కానరాదు. అంతేకాదు. ఇట్టి సందర్భములందు లోకములోని ఏ తల్లికూతుళ్ల నడుమనైన వక్షోజసన్నివేశమును 'ఫొటో'తీసినచో, ఆ 'ఫొటోగ్రాఫరు' మనస్తత్వమెట్టిదో, ఈ కవిగారి మనస్తత్వమును అట్టిదే కదా! మహాకుటిలము.

ఇక పార్వతీపరమేశ్వరుల సంభోగశృంగారము. ఇది మహాకవి కాళిదాసు కుమారసంభవమునందే అనౌచిత్యమని ఆలంకారికుల శాస్త్రవిచికిత్స. అది శస్త్ర చికిత్స. అట్టిది తెలుగుకుమారసంభవమునందు తెగులుమీఱినది.

> "నాభిదేశనిహితః సకమ్పయా శంకరస్య రురుధే తయా కరః
> దుకూల మథ చా భవత్స్వయం దూరముచ్ఛ్వసితనీవీబన్ధనమ్."
>
> 4శ్లో. 8స.

[పార్వతి కంపించుచు- నాభిదేశమునందుంచిన పరమేశ్వరుని చేతిని తొలగించినను, ఆమె దుకూలము దానంతటదే నీవీబంధమును జార్చివైచెను.]

ఇది కాళిదాసు శ్లోకము. మఱి కుమారసంభవములోని పద్యమిది:

> "నయమున భీతి వాపి మది నమ్ముసఁ దేఁకువ వాపి మాటలం
> బ్రియమొనరించి పొంతనల బేటము పెంచుచు సమ్మదంబునం
> బయిపడి గుహ్యముల్ బయలుపర్పుచుఁ జెయ్వుల లజ్జవాపుచున్
> మొయిపడి గౌరి నీశ్వరుఁడు మేకొలిపెన్ రతికిం గ్రమంబునన్."
>
> 345ప. 9ఆ.

> "వాసరాణి కతిచిత్కథంచన స్థాణునా పదమకార్యత ప్రియా
> జ్ఞాతమన్మథరసా శనైః శనైః సా ముమోచ రతిదుఃఖశీలతామ్.
>
> 13శ్లో. 8స.

[మొదటిరాత్రి సిగ్గుపడిన పార్వతిని కొన్నిదినములకు పరమేశ్వరుడు కష్టముమీద ఉన్ముఖురాలిని చేసెను. అనుభూతశృంగార అయిన పార్వతి క్రమముగ ప్రాతికూల్యమును వదలెను.]

ఇది కాళిదాసు శ్లోకము. మఱి కుమారసంభవములోని పద్యములివి :

"విడువాలుఁ జూడ్కులు నిగిడించు మగిడించుఁ
బతి కన్నుఁగవ పొలపంబు తెలిపిఁ
బొరిఁబొరి మైఁదీఁగ పొందించు నెడలించుఁ
జోఁకానఁ బ్రియు మేను సుడియునెడల
వెడఁదొక్కులు బలుకుల వినుపించుఁ గొదలించుఁ
గలయ వల్లభుపల్కు పలుకు పొంత
దరహాసరుచి మోవిఁ దలకించుఁ దళుకించు
విభు పరిహాసోక్తి వెరవుఁ బొరవు
నెరవు సేయు కథపు చెయ్వుల మెయివడి
నదరుఁదాన గాని యదియ పోలెఁ
దరుణి నెమ్మనమునఁ దపకంబు లజ్జయు
నలఁతి కగ్గలింప నాఁక గొనక.

తరతర పంజలు దళుకఁగఁ
బరువడి మృదుతరరతములఁ బరిణతులై యా
హరగిరితనయలు సురతా
తురు లగుచుం గాయ్వు మిగిలి తోడ్తోన పదిన్." 346,347ప.8ఆ.

"భావసూచిత మదృష్టవిప్రియం చాటుమత్ క్షణవియోగకాతరమ్
కైశ్చిదేవ దివసై రథూత్తయోః ప్రేమ రూఢమితరేతరాశ్రయమ్."
14శ్లో.8స.

[కతిపయదివసములకు పార్వతీపరమేశ్వరుల ప్రేమ ఇతరేతరాశ్రయమై, భావసూచితమై, అప్రియరహితమై, ప్రియోక్తిసహితమై, క్షణవియోగకాతరమై అభివృద్ధినందెను.]

ఇది కాళిదాసు శ్లోకము. మఱి కుమారసంభవములోని పద్యములివి :

"కరలతలందంద కామపాశంబుల
నదిమి బంధించుచున్నట్లు బిగియ
నొదవఁ బేర్చిందులఁ బదనైన పూఁతలం
గమునకు వజ్రలేపములు గాఁగఁ

పులక లొంగొరుల మేనుల నుచ్చిపోయి డ
గ్గఱ మొలిచ్చిన కరణి గాఁగఁ
గనకంపుఁబ్రతిమలు గాఁచి యంటించిన
క్లోఁడఁగూడి తనువు లొంటొంటఁ గదియఁ
వగఁగ నొక్కటలకు మొగములు రెంటైన
పగిది దలలు మాఱు మొగము వడఁగ
గీఱి మేను మేను దూఱ గాఢాలింగ
నంబు సేసె రంగనయుఁ బ్రియుండు."
అనవరతము నపకరణా
సనచుంబనభూషణాదిసంగమగతులో
లిన నూఱొక్కనఁ బెనఁగిరి కా
య్యువ బహుతరగతుల నింపు వొంపిరిపోవన్.    348,349ప.9ఆ.

"శిష్యతాం |నిధువనోపదేశినః శంకరస్య రహసి ప్రపన్నయా
శిక్షితం |యువతినైపుణం తయా యత్తదేవ గురుదక్షిణీకృతమ్."
17శ్లో.9స.

[సురతవిద్యాగురువైన పరమేశ్వరునికి శిష్యురాలైన పార్వతి, యువతీఉ
చితమైన నైపుణ్యమును పరమేశ్వరునికి గురుదక్షిణగా సమర్పించెను.]

ఇది కాళిదాసు శ్లోకము. మఱి కుమారసంభవములోని పద్యమిది :

"రతిలోలురై బాహ్యరతియు నాభ్యంతర
రతియు నుత్తమసమరతియు నీచ
రతియు సలలితోచ్చరతియుఁ నొప్పగు చిత్ర
రతియు సన్నుతముల రతియు నుపరి
రతియు నింపగు మృదురతియుఁ బ్రచండోరు
రతియు నెంతయు గూఢరతియుఁ బ్రకట
రతియును నాఁ బెక్కురతములు వరుసడి
రతిపతిశాస్త్రచోదితము గాఁగ

సతికిఁ దెలియఁ జూపెఁ బతి వాని నన్నియు
మగువ వరుసఁ బతికి మగుడఁ జూపె
సతియుఁ బతియు నేర్పు రతిభక్తి దలపోయ
రతులు నవములయ్యెఁ బ్రతిదినంబు."  351ప.9ఆ.

పయి కుమారసంభవపద్యములు కాళిదాసు శ్లోకములకు ప్రతిసృష్టి. అందు కామశాస్త్రపాండిత్యప్రకర్ష శ్రీహర్షుని శ్లోకములకు అనుసృష్టి. మొత్తము మీద సంస్కృతకుమారసంభవములోని అనౌచిత్యము సకృన్మాత్రము. తెలుగుకుమార సంభవములోని అనౌచిత్యము సమృద్ధిప్రాయము.

సంస్కృత కుమారసంభవమునందు నవమసర్గాది సప్తదశసర్గపర్యంతము (9-17స.) గ్రంథము కాళిదాసకృతము కాదు. మల్లినాథసూరి మాత్రమేగాక, తత్పూర్వుడైన అరుణాచలనాథుడును వ్యాఖ్యానము వ్రాయలేదనియు, అతడు తారకా సురవధాంతకథ కవిచికీర్షితము కాదని నిర్ణయించెననియు, అతని వ్యాఖ్యానమునకు వివరణకర్త అయిన నారాయణపండితుడు కాళిదాసచికీర్షిత మష్టమసర్గకథాంతమే అని సిద్ధాంతము చేసెననియు, నవమసర్గాదిగ్రంథము మహారాష్ట్రుడు రచించినట్లు కీత్ పండితుడు వ్రాసెననియు, మహారాష్ట్రకవికృతమనుటకు కారణాంతరములును కలవనియు, అష్టమసర్గానంతరభాగమున గల ప్రయోగములను పరిశీలించినయెడల కాళిదాసకృతమనుటకు అవకాశము కనబడదనియు, ఆంధ్రదేశమునను, దక్షిణదేశము నను ఇతరప్రాంతములందును ఎనిమిది సర్గల గ్రంథమే సుప్రసిద్ధమనియు, పదునేడు సర్గలగ్రంథము కాశీసంస్కృత(సీరీస్)పుస్తకమాలలో 14వసంపుటముగా, మదరాసులో వావిళ్లముద్రణాలయమున ముద్రింపఁబడెననియు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారుఅందిచ్చిన సమాచారము[5]. అట్టి నవమసర్గాదిగ్రంథమునకు, తెలుగుకుమారసంభవమునకును భేదసాదృశ్యములు కలవని కూడ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి వివరణము[6]. అందు

"అగ్ని యింద్రప్రేరితుఁడయి కపోతరూపమునఁ బార్వతీపర మేశ్వరుల కేళీగృహమునఁ బ్రవేశించెను. కపోతమును జూచి క్రోధ మందిన శివునకు నగ్ని నిజస్వరూపమెఱిఁగించి యింద్రసందేశము తెలిపి తన్ను క్షమింపఁ వేడుకొనెను"

అని సంస్కృతగ్రంథమునందు కలదు. కపోతరూపము వినా తెలుగుకుమార సంభవమునందు ఇట్లు కలదు.

"...దహనుండు సంచలించుచు గైలాసపర్వతంబునకుం జను దెంచి (2వచ.10ఆ.)

పరమేశ్వరు రతిక్రీడాప్రదేశంబునకుం జనుదెంచి నిజరూపంబుఁ జూపిన నయ్యుమామహేశ్వరులు గని లజ్జాకలితసంచలితహృదయులై పరిధానంబులు సవరించుచు రతివిఘ్నంబగుటకు విభావసుండు గోపించి చూచుడు." 870వచ.10ఆ.

ఇందు రతివిఘ్నము కలిగిన పార్వతీపరమేశ్వరులు "లజ్జాకలితవిచలితహృదయులై, పరిధానములు సవరించు"కొనుట కూడ సంతరింపఁబడినది. ఎంత జాగరూకత! ఏమి వాస్తవికత!! పార్వతీపరమేశ్వరులకు మానసంరక్షణము మానవీయమే కాని, పాత్రౌచితీసభ్యతలకు అగ్నిసంధుక్షణము శోచనీయము.

ఇదియెల్ల శ్రీశైలమల్లికార్జునస్వామికి మాత్రమేగాక; మనుజాకారమహేశుడు (66ప. 1ఆ.), పరమహంసస్వరూపుడు (58వచ. 1ఆ.), మహాయోగిముఖ్యుడు (570ప.10ఆ.) శ్రీపీఠంబున తన శ్రీపాదుకలిడు (14ప.1ఆ.) జగద్గురువు(60ప.1ఆ.) నిజగురువు (50ప.1ఆ.) వినుతబ్రహ్మర్షి (66ప.1ఆ.) సంసారపరవియుక్తుడు (1008ప.12ఆ.) శృంగారభవాని (352ప.3ఆ.) అయిన జంగమమల్లికార్జునమునికి (66ప.1ఆ.) సహితమును అంకితమైన కుమారసంభవములోని కుటిలశృంగారము! అంతేకాదు. "నింగిముట్టియున్న జంగమయ్య వరమునందుఁ గవిన, వగిరి వారియంత నిగిడిం"చిన "వస్తుకవిత''లోని (49ప.1ఆ.) క్షుద్రశృంగారము!! ఉపరి, "సద్రసబంధురంబుగాన్ విస్తరిం"చిన "ప్రబంధము"లోని (48ప.1ఆ) పచ్చిశృంగారము!!! ఏవంవిధమైన శృంగారము సద్రసబంధురమైన ప్రబంధములకు నాందీవాచకము కాదుగాని, అసద్రసబంధురమైన ప్రబంధములకు భరతవాక్యము.

కుమారసంభవకథ ప్రసక్తమైన తెలుగు కావ్యములు మూడు కలవు. 1. శ్రీనాథునిహరవిలాసము. 2. పోతనవీరభద్రవిజయము. 3. కోటిరఘునాథతొండమాన్ పార్వతీపరిణయము. ఇందు పార్వతీపరమేశ్వరుల పాత్రచిత్రణము హరవిలాసములోని గౌరీకల్యాణమునందు అనౌచిత్యమునకు పాల్పడలేదు. వీరభద్రవిజయమునందు, పార్వతీపరిణయమునందు పాల్పడినది. వీరభద్రవిజయము కంటె పార్వతీ

పరిణయము, పార్వతీపరిణయము కంటె కుమారసంభవము జగన్మాతృపితల స్థాయిని జంబాలమునకు దిగజార్చినవి. అంతేకాదు. వీరభద్రవిజయమునందు ఉదాత్తములైన ఘట్టములు కుమారసంభవమునందు అనుదాత్తములైనవి. ఇందుకు శివునిమీదికి దండయాత్రకు బయలుదేఱిన మన్మథుని వలదని రతిదేవి వారించు ఘట్టమే ప్రథమోదాహరణము కాళిదాసు కుమారసంభవమునందుగాని, శివపురాణమునందుగాని లేని అపూర్వఘట్టమిది. వీరభద్రవిజయమునందు ప్రాచీనతాద్యోతకము. కుమారసంభవమునందు అర్వాచీనతాస్ఫోరకము.

ఇంద్రుని కొలువునుండి ఇంటికి వచ్చిన మన్మథుని చూచి రతి సంశయించి "ఎట్టిపనికిఁ దలఁచె నేమని పంపెనో భూధరారి విన్ను బుజ్జగించి, విబుధులెల్లఁ బంప వెట్టిపై యేపనుల్ సేయ నియ్యకొంటి చెప్పవయ్య" అని ప్రశ్నించును. "వనిత పంపు పూని వచ్చితి నింక దండెత్తిపోవవలయు నీశు మీఁద" అని మన్మథుడు అనగానే రతి "విస్మయాకులచిత్తయై మూర్ఛిల్లి తెలివొంది వగపును గోపంబును దైన్యంబును నుడివడుచుండ, త్రిపురారిఁ జేర వశమే కందర్ప నీ కోటికిన్" అని శివుని ఆధిక్యమును ఎనిమిది పద్యములందు వివరించును. ఇట్లు వీరభద్రవిజయమునందు కలదు. (67-83ప.2ఆ.) ఇక కుమారసంభవమునందు ఇట్లు కలదు. (411-433ప.4ఆ.) ఇంద్రుని కొలువునుండి మన్మథుడు ఇంటికి రాకుండగనే "రతి మతిఁ దల్లడిల్లి పతి రాకయ వార్చును." "అంతకంత కద్భుతములు దుర్నిమిత్తములు పుట్టు"ను. "అశుభచేష్టల కెంతయు వెగ్గలించు"ను. దుఃఖించును. దుఃఖించు నెడ మన్మథుడు వచ్చును. వచ్చిన మన్మథుని చూచి మనస్సులోని ఖేదమును "మఱుపుగానిడి" నిశ్చింతగ కుశలప్రశ్నలు వేసి నెమ్మదిగ ఇంద్రుడు పిలిచిన పని అడుగును. అయినను, "మదినింత తల్లడముకలుగుటకు హేతువేమి?" అని మన్మథుడు ఎదురుప్రశ్న వేయును. "దివ్యాంతరిక్షభౌమాంగికాద్యనేకదుర్నిమిత్తములు నిర్నిమిత్తముగ పుట్టుట" తెలిపి రతి "దీనానన" అగుచు పోయివచ్చిన కార్యమును తెలుపుమని మఱలకోరును. "ఉమామహేశ్వరుల తపోభంగము సేయుమనిన" (?) ఒప్పుకొని వచ్చితినని మన్మథుడు చెప్పగానే రతి అదిరిపడి మఱల తల్లడిల్లుచు శివుని ఆధిక్యమును ఒక సీసపద్యమున చెప్పి, "ఇంద్రుడు ఒక ఏలినవాడా? నీవు కూడ ఒక పోటరిమూటవ?" అని ఇద్దఱిని హేళన చేయును. అంతేకాదు. ఇంద్రుడు మన్మథునికి ఇట్టి పని చెప్పుటకు హేతువును రతి గొప్పగ కనిపెట్టినది. స్వర్గలోకములోని స్త్రీలందఱు మన్మథుని మీద మనసుపడిరట! అది సహించలేక ఇంద్రుడు

మన్మథుని చంపఁదలచి ఈ పని చెప్పెనట!! మన్మథుని చూచిన కన్నుల అప్సరసలు ఇంద్రుని చూడకపోవుటవలన, అలుక వహించినఇంద్రుడు మన్మథుని చావఁ బంపె నట! ఇంద్రుని వంచన ఫలించునట్లు మన్మథుడు చావఁదోరాదట!! ఇంత తెలివి ఉపయోగించిన రతి మన్మథుని మఱి మూడుపద్యములందు మంచలించును. అయినను మన్మథుడు అతిశయమును ప్రకటించును. రతి మఱల శివుని ఆధిక్యమును నాలుగు పద్యములందు వివరించును. నడుమ తన ఆధిక్యమును నవరించును.

ఇందు రతి ఇంద్రమన్మథులను హేళన చేయుట, ఇంద్రునికి లేనిపోని ఈర్ష్యను ఆపాదించుట అనుదాత్తము. అంతేకాదు. శివుని బలమునకు మన్మథుని బలమునకు గల తారతమ్యమును రతి వివరించునెడ వీరభద్రవిజయములోని పద్యము సముచితము. కుమారసంభవములోని పద్యము అనుచితము.

"భూకాంత తేరను బూవుల తేరను  
నిర్జరసుభటులు స్గిరభటులు  
కనకాచలము విల్లు కడు తియ్యనగు విల్లు  
మేటి నందిపడగ మీను పడగ  
బహుమంత్రవాజులు పచ్చని వాజులు  
పెక్కుదలల నారి భృంగనారి  
నలుమొగంబుం యంత నవవసంతుఁడు యంత  
పురుషోత్తముం దమ్మి పూవుటమ్ము  
వెలయు చేయుఁ బగలు వెలిఁగించు కన్నులు  
తమ్మికండ్లు త్రిపురదైత్యకోటి  
గురి విటవ్రజంబు గురి యతనికి నీకు  
నేమి సెప్పవచ్చు నెంత కెంత." 81ప.2ఆ.

ఇది వీరభద్రవిజయములోని పద్యము. ఇక కుమారసంభవములోని పద్యమిది :

"అతని శరాసనంబు గనకాచల మిక్షుశరాసనంబు నీ  
కతనికి నమ్ము పాశుపత మందిరఁ గంచెడు పువ్వు లమ్ము నీ  
కతఁడు పురాపహారి విరహాతురపాంథజనాపహారి వీ  
వతనికి నీకు హస్తిమశకాంతర మెమ్మెయి నెన్ని చూచినన్."  
428ప.4ఆ.

ఇందు "పువ్వులు అమ్ము" అనునెడ వచనభేదము కలదు. అంతేకాదు. "అతనికి నీకు నేమి సెప్పవచ్చు నెంత కెంత" అనునెడ రతికి దేవునియెడల గౌరవముతోపాటు పతిదేవునియెడల విధేయత కలదు. "అతనికి నీకు హస్తిమశ కాంతరము" అనునెడ రతికి దేవునియెడల గౌరవము కంటె పతిదేవునియెడల నిరసనము కలదు. భర్తను దోమను చేసినది. శివుడు ఏనుగైన, మన్మథుడు దోమ అగుమాట నిజమేగాని, అది మన్మథుని భార్య రతి అనవలసిన మాట కాదు. "నన్నెచోడుని కుమారసంభవము" లోని రతి మాత్రమే అనఁగలదు. కారణము ఆమె దృష్టిలో మన్మథుడు ఆమె కంటెను అల్పుడు.

"ఆఁడదాన నబలనైన నే యించుక
యలిగి చూచుడును భయమున దలరు
దుగ్రు నుగ్రలోచనోద్భూతవహ్నికి
నెదిరి నిలువ నీకు నెంత కొలఁది." 430 ప. 4ఆ.

ఇందు ఆడది, అబల అయిన తాను ఇంచుక అలిగిచూచిన మన్మథుడు భయపడి వణికిపోవునని రతి అనగలిగినది. అది నిజమైనను ఆవిషయమును రతి ఎవ్వరితోనోకాదు, ఎందుకైనను, మన్మథునితోనే అనుట పూర్వపద్యములోని అవిధేయతను మించిన అహంకారము. కుమారసంభవములోని రతి నందితిమ్మన పారిజాతాపహరణములోని సత్యభామ దగ్గఱ పాఠము నేర్చుకొన్నట్లు కలదు. విచిత్రము.

"కొని బాలురైనను దిని పిప్పి యుమిసెడు
చెఱకు విల్లని నమ్మి చేతఁబట్టి
మెలఁతల తలవెంట్రుకలఁ బొంది కందెడు
నలరుపుష్పము లమ్ములని తలంచి
తలిరాకులైన గదల్పనోపని మంద
పవనుండు నౌక పెనుప్రాపుగాఁగ
నబలలు నోఁపిన నాకాశమునఁ బాఱు
నలిశుకములు మూలబలము గాఁగ
నెంత వేసవి ముట్టిన నెండఁ గమరు
నను వసంతుఁడు దగు సహాయంబు గాఁగఁ
గాకిపిల్లల కోడు పికములఁ బోటు
మగలుగా నుగ్రుపైఁ బోవఁదగునె మదన." 481ప. 4ఆ.

ఇది కూడ కుమారసంభవములోని రతి హెచ్చరిక. ఇందు మన్మథుని విల్లు "కొని బాలురైనను దివి పిప్పి యుమిసెడు చెఱకు" అనుట, అమ్ములు "మెలఁతల తలవెంట్రుకలబొంది కందెడు నలరు పుష్పము" లనుట హృద్యము కాదు. అంతే కాదు. అలరుపుష్పము లనుట అగ్గినిప్పులనుట. ఉపరి, మందపవనుడు "తలిరాకు లైనఁ గదల్పనోపఁ" డనుట తర్కసహముకాదు. మొత్తముమీద పద్యము మోతాదును మించినది.

ఇక మన్మథుడు తనశక్తిని ఇట్లు ప్రకటించును.

"అదిమి పట్టినఁ గరులైనఁ జదియునట్టి
కడిఁది బలులగు మగలొత్తి కౌఁగిలింపఁ
గుసుమకోమలులగు సతు ల్కొసరుచునికి
గనియు నెఱఁగవె విపరీతకామశక్తి." 438ప; 4ఆ.

ఇందు కామశక్తియే కాదు: కావ్యశక్తియు విపరీతము. శృంగారలౌల్యమునకు శృంగగ్రాహిక.

మన్మథుని పూలరథము వీరభద్రవిజయమునందు ఇట్లు కలదు.

"కమలషండము నుస్నఁగాఁజేసి యిరుసుగాఁ
గావించి కెందమ్మి కండ్లఁగూర్చి
తగనించు మోసుల నొగలుగాఁ గావించి
కరమొప్పఁ గేవఁగి కొడివెట్టి
సంపెంగమొగ్గల చనుగొయ్య లొనరించి
పల్లవంబులమీఁదఁ బఱపుఁ జేసి
చెలువైన పొగడదండలచేత బిగియించి
మెలవీఁగె పలుపులు లలినిజొనిపి
తెఱఁగు లరసి పువ్వుతేనెఁ గందెనవెట్టి
గండు రాజకీర(గ?)ములఁ గట్టి
మెఱయ చిగురుగొడుగు మీనుటెక్కెము గ్రాలఁ
దేరుఁబన్ని సురభి తెచ్చెనపుడు." 94ప. 2ఆ.

ఇది కుమారసంభవమునందు ఇట్లు కలదు.

"పంకరుహంబులు బండికన్నులా చంప
కంబులు నొగ లుత్పలంబు లిరుసు
గరవీరములు పలుగాఁడి జాదులు సనుఁ
గొయ్య లశోకముల్ గోడిపింట
సింధువారంబులు సీలలు గేతకుల్
మెట్టులు మొల్లలు మెట్టు గుదెలు
పొగడలు పలుపులు పున్నాగములు పగ్గ
ములు సహకారముల్ పూనుగాఁడి
కురవకానీక మాలంపుఁగోల కై ర
వములు మునుకోల కోకము లా్వహనములు
గా వసంతుండు సూతుఁడై పూవుఁదేర
నెరయఁ గుసుమాయుధంబులు నీని తెచ్చి."          439ప.4ఆ.

ఇందు వీరభద్రవిజయములోని తేరిఇరుసు తామరతూడు, చనుగొయ్యలు సంపెంగ మొగ్గలు, ఎలదీఁగెలు పలుపులు అను భావములు అన్యోన్యసాంగత్యము కలవి. కుమారసంభవములోని తేరిఇరుసు కలువలు, కోడిపీట అశోకములు, పూను గాడి సహకారములు, మునుకోల కై రవములు అను భావములు ఏకవచనబహువచన సాంకర్యము కలవి. అంతేకాదు. మన్మథుని తేరికి వాహనములు చిలుకలు ప్రసి ద్ధము. అది వీరభద్రవిజయమునందు కలదు. చక్రవాకములు అప్రసిద్ధము. ఇది కుమారసంభవమునందు కలదు. వీరభద్రవిజయములోని పూలరథము సలక్షణము. కుమారసంభవములోని పూలరథము విలక్షణము.

ఇంత విలక్షణము, విపరీతము, విచిత్రము, అనుచితము, అనుదాత్తము, అయిన కుమారసంభవములోని అపూర్వఘట్టమునకు, వీరభద్రవిజయములోని అపూర్వ ఘట్టము అనుకరణమగుట కంటె, వీరభద్రవిజయములోని అపూర్వ ఘట్టమునకు, కుమారసంభవములోని అపూర్వఘట్టమే అనుకరణమగుట సుకరము.

వీరభద్రవిజయములోని రతిప్రబోధము పార్వతీపరిణయమునందును కలదు. ప్రకరణము భిన్నము. హరుని చూచి అధైర్యమునందిన మన్మథుని రతి ప్రబోధించును.

"మనకేల దుష్కరంబగుపనిఁ బూనుటజీతు ..................... కామ! యోజించి చూడు మకారబుండు కార్యసుఖదుఃఖములఁ బెందగాఁ గలండె?" అని పతివిధేయగ వలి పలుకును. కపటవటుసంవాదఘట్టమునందు వీరభద్రవిజయమున లేని, పరమేశ్వరుని గాంధర్వవివాహప్రతిపాదనము పార్వతీపరిణయమునందు కలదు. పార్వతి చెలికత్తెలు "చెంతఁ జెలులుండ నొక్కింత సిగ్గు పూనఁ డిట్టివాఁ డింకఁ జేపట్టి యీడ్వఁ కున్నె" అని తలచిరేగాని పరమేశ్వరుడు పార్వతీపరిణయమునందు అంతపని చేయలేదు. కుమారసంభవమునందు అంతకు మించిన పని చేయఁబోయెను!. పార్వతీపరమేశ్వరుల విరహతాపము పార్వతీపరిణయమునందు బీజప్రాయము. కుమారసంభవమునందు వృక్షసదృశము. పార్వతీపరిణయమునందు శ్రీమహావిష్ణువు శివుని పరియాచకమాడుట పరిధిని అతిక్రమించినది.

"పెటిలు పెఠిల్లన వ్రయిక పెట్లు నొయారపు జిల్గుపైఁటలోఁ
బిటములు ద్రొక్కి నబ్బలితపుం జిగిగుబ్బలతోడఁ జేడె ముం
దటఁ దమకంబునన్నిలిచినప్పుడు పొమ్మని వెన్క నాత్మ న
క్కటయని కుందు వెంగలివి గాకుము నీకు సలాము చేసెదన్."

ఇది కుమారసంభవమునందు శివుడు కుందిన విషయము. ఇక పార్వతీపరిణయములోని పార్వతీపరమేశ్వరుల సంభోగశృంగారము కుమారసంభవములోని సంభోగశృంగారమునకు పథనిర్దేశకము.

"చంద్రాదుల జయించి సరిలేని కన్గవ
నిఁకనేల యంచుఁ గంచుకము విప్పి
కదనోద్యతానంగకరకృపాణిని నీవు
కట్టేమి యంచు మేఖలము మీటి
నిలుచునిట్టిది గామినేగదా యీ పేరు
పొందె నంచని పోకముడి సడల్చి
నే కట్టినదొ లేక నీ కట్టు వర్గమో
పరికింపుమనుచు నంబరము నాఁచి
శక్తిమచ్ఛక్తులన్న సంయుక్తి లేక
వేఱువేఱుగ నుండుట మేలుగాదు
కదలకు మటంచు గుప్పని కౌఁగిలించె
సతిని గడువేగమగు బాళి చంద్రమౌళి."

మఱి, పార్వతీపరిణయమునందు "సకలబంధముల" ప్రసక్తి కలదుగాని, కుమారసంభవమునందు సకలబంధముల ప్రదర్శనము కలదు. మొత్తముమీద వీరభద్రవిజయములోని విరసశృంగారమును మించునది పార్వతీపరిణయములోని వికటశృంగారము. పార్వతీపరిణయములోని వికటశృంగారమును మించునది కుమారసంభవములోని కుటిలశృంగారము.

వీరభద్రవిజయమునందు, పార్వతీపరిణయమందును లేని, కుమారసంభవములోని అమోఘవిశేషము విటీవిటశృంగారము. అందు జారకామినులు "కుచంబులు సూపు"ట (101ప.8ఆ.) "విటేంద్రసంఘముం మిగిలి చనంగనీక యొకమెత్తుక యాసయ చూపి చూపి ప్రీతిగ నెలయించు"ట (130ప.8ఆ.) "మాయలన్ లలనలఁ దేర్పఁజూచు మగలంజియలం గని వారిపొంతఁ బోవలవ"దనుట (143ప.8ఆ.) "భావజుకేళి నచ్చుపడి పైపడి తద్విటు విచ్చఁగూడి రాఁగా వివిధోపచారములఁ గామసుఖంబులు సల్పి పుచ్చి తా రోవెల నీగి వేఁటొకనిరోయు''ట (149ప.8ఆ.) "కాముఁడన్నటికుఁ దొజ్జంగూడ నాడింపఁగా లలనాపాత్రము లా''డుట (180ప.8ఆ.) మొదలైన ముచ్చటలు ముమ్మరముగ కలవు. అవియెల్ల జగన్మాతృపితరులైన పార్వతీపరమేశ్వరుల పరిణయఘట్టమునకు నేపథ్యవాతావరణనీరాజనములు!.

ఏవంవిధమైన కుమారసంభవము సద్రసబంధురములైన స్వర్ణయుగప్రబంధములకు గురుస్థానీయము కాదు. అసద్రసబంధురములైన క్షీణదక్షిణాంధ్రయుగప్రబంధములకు శిష్యస్థానీయము.

## ౪

# కూడలిస్థలము

నన్నెచోడుని కాలము గుఱించి నానావాదములు కలవు. స్థలము గుఱించి అంతగా లేవు. అసలు లేకపోలేదు. 1909వ సంవత్సరమునందు మానవల్లి రామ కృష్ణకవిగారి ప్రతిపాదనమిది[1]:

> "ఇతఁడు కావేరీతీరమున నొరయూరను పట్టణము రాజధానిగా గోదావరీసింహాళమధ్యదేశము నేలెను."

ఇందుకు వారు ఎట్టి ప్రమాణమును చూపలేదు. కుమారసంభవములోని "కలు పొన్న విరుల" అను పద్యమునందు (54ప.1ఆ.) "ఒరయూరి కధిపతిని" అని కలదుగావున ఒరయూరు రాజధాని అనుటకు ఒకపాటి ప్రమాణము ఉన్నట్లే. కాని, "గోదావరీసింహాళమధ్యదేశము నేలెను" అనుటకు మఱి ఆపాటి ప్రమాణమును లేదు. అంతేకాదు. నన్నెచోడుని ఒరయూరి పరిపాలకత్వమును అప్రమాణమని 1912 వ సంవత్సరమునందు చిలుకూరి వీరభద్రరావుగారి వివరణము. ఆ విషయమిది[2]:

> "పొత్తపినాటిని, పాకనాటిని, కమ్మనాటిని బరిపాలించిన తెలుఁగు చోడులెల్లరు నొరయూరుపురవరాధీశ్వరులమని తమశాసనములందుఁ బేర్కొనియున్నారు. "అవశ్యం పితురాచార"మ్మనునటులఁ బెద్దల యాచారము నవలంబించి ఘనతకొఱకు నొరయూరుపురవరాధీశ్వరుల మను బిరుదము వాడుకొనుచుండిరే కాని వారెన్నఁడు నొరయూరును బాలించినవారు కాకపోవుట మాత్రమేగాక, కన్నులతోఁ జూచిన వారుగాఁ గూడనుండరు. కావున నన్నెచోడుఁడు తన కుమారసంభవ ములో "క.కలుపొన్న విరుల........" అని చెప్పి కొన్నది పితరుల యాచారమును బట్టి గాని నిజముగ నొరయూరును బరిపాలించుచున్న హేతువుచేతనని యెంతమాత్రమును దలఁపరాదు."

ఇది చారిత్రికసత్యము అయినను 1914వ సంవత్సరమునందు మానవల్లి రామకృష్ణకవిగారి పునరుద్ఘాటనమిది[3]:

"ఆంధ్రచోడులు కారితకావేరీతీరకరికాలచోడవంశజులగుటయు
నొరయూరిపురవరాధీశ్వరులగుటయుఁ జోడశాసనవిఖ్యాతాంశములు.
అయినను నన్నెచోడుని వర్ణనము నించుక చక్కఁగా నాలోచించినచో
నతఁడొరయూరికే పరిపాలకుఁడనియుఁ గేవలకులక్రమాగతబిరుదమును
జేకొన్నవాఁడు గాఁడనియుఁ దోచకమానదు."

ఇది చరిత్రకు విరుద్ధము. తెలుగుచోడుల శాసనములందు "కారితకావేరీతీర కరికాల కులరత్న, ఒరయూరిపురవరాధీశ్వర" అను విశేషణములు ఉన్నమాట నిజము. అవి నిజములు కావు; బిరుదములు. అన్వర్థములు కావు; అలంకారప్రాయములు. ఆంధ్రచోడులు కరికాలవంశజులు కావచ్చునుగాని, ఒరయూరి పరిపాలకులు కారు. కాఁజాలరు. అయినను కవిగారు అన్నట్లు కుమారసంభవములోని నన్నెచోడుని వర్ణనమును సరిగా పరిశీలించిన, నన్నెచోడుడు ఒరయూరిపరిపాలకుడని తోఁచుట సహజము. ఆ వర్ణనమిది :

"కుతలంబు నడుకొనఁ గొలకొండగా నిల్పి
శరనిధి గ్రొచ్చిరి సగరసుతులు
మిన్నులపైఁ బాఱుచున్న యేఱిలఁ దెచ్చి
వారాశి నించె భగీరథుండు
గోత్రాచలము లెత్తికొనివచ్చి కడచన్న
రత్నాకరము గట్టె రాఘవుండు
జలధిమహీసతి మొలనూలుగాఁ జుట్టి
పాలించెఁ గలిఁ గరికాలచోడు
వరుస నిట్లు సూర్యవంశాధిపతు లంబు
నిధియ మేర గాఁగ నిఖిలజగము
నేలి చనిన వారి కెనవచ్చు సుశ్లాఘ
ధనుఁడ నన్నెచోడ జనవిభుండ. ౫౨

అవనిపాలమౌళిదళితాంఘ్రియుగుండయి పాకనాఁటియం
దిరువదియొక్కవేయిటి కధీశుఁడు నాఁజను చోడబల్లికిం
జిరతరకీర్తి కగ్రమహిషీతిలకంబన హైహయాన్వయాం
బరశశిరేఖయైన గుణభాసిని శ్రీసతికిం దనూజుఁడన్. 53

కలుపొన్న విరులఁ బెరుగం
గలుకోడి రవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
దొలుచు నొరయూరి కధిపతి
నలఘుపరాక్రముఁడ టెంకణాదిత్యుండన్ 54

పాత్రుఁడ నసదృశకాశ్యప
గోత్రుఁడ సచ్చరితనుభయకులశుద్ధుండన్
మిత్రాన్వయశేఖరుఁడ, బ
విత్రీకృతదేహుఁడను వివిధయజ్ఞములన్.'' 55

ఇందు మొదటి పద్యమున మొదట సగరసుతులు, భగీరథుడు, రాఘవుడు, కరికాలచోడుడు నన్నెచోడుని వంశమూలపురుషులని కలదు. తదుపరి నన్నెచోడుడు జనవిభుడని కలదు. జనవిభుడన జనులకు ప్రభువు. అనగా పరిపాలకుడు. రెండవ పద్యమున నన్నెచోడుని తండ్రి చోడబల్లి "పాకనాటియం దిరువదియొక్కవేయిటికి" అధీశుడని కలదు. అధీశుడన పరిపాలకుడు. అనగా చోడబల్లి పాకనాటిపరిపాలకుడు. ఈ పద్యమునందే నన్నెచోడుని తల్లి శ్రీసతి హైహయవంశజ అని కలదు. హైహయులు పలనాటి పరిపాలకులు. పాకనాటి పరిపాలకులైన తెలుగుచోళులకు, పలనాటి పరిపాలకులైన హైహయులకు బంధుసంబంధము సంభవము. మూడవ పద్యమున నన్నెచోడుడు "ఒరయూరి కధిపతి" అని ఇదమిత్థముగ కలదు. అంతేకాదు. ఒరయూరునందు కలుపొన్నలు పూయునని, కలుకోడులు కూయునని కలదు. నన్నెచోడుడు ఒరయూరు వాడు కానిచో, ఒరయూరిలోని కలుపొన్నల, కలుకోడుల సంగతి తెలియదు. కనుక నన్నెచోడుడు ఒరయూరిపరిపాలకుడు కావలయును. అంతేకాదు. ఒరయూరిపురవరాధీశ్వర" అను బిరుదమునకు, "ఒరయూరి కధిపతిని" అను స్పష్ట ప్రతిపాదనమునకు అంతరము కలదు. కనుక నన్నెచోడుడు ఒరయూరి పరిపాలకుడే కావలయును. ఈ పద్యమునందు నన్నెచోడుడు టెంకణాదిత్యుడు అనియును కలదు. అది బిరుదము కావచ్చును. "ఒరయూరి కధిపతిని" అన్నది మాత్రము బిరుదముకాదు.

ఇదమిత్థము. నాల్గవ పద్యమున నన్నెచోడుడు కాశ్యపగోత్రుడు, సూర్యవంశీయుడు అని కలదు. అంతేకాదు. వివిధయజ్ఞముల పవిత్రీకృతదేహుడనియును గలదు. వివిధయజ్ఞముల నిర్వహణము రాజులకు విహితకృత్యము. కనుక నన్నెచోడుని వర్ణనమును సరిగా పరిశీలించిన, కవిగారు అన్నట్లు నన్నెచోడుడు "ఒరయూరి పరిపాలకుడే" అని తోచుట సహజము. ఇది నిజమేని చరిత్ర తలక్రిందు లగును.

చోడబల్లి పాకనాటి పరిపాలకుడైనచో, తెలుగుచోళుడగును. నన్నెచోడుడు ఒరయూరి పరిపాలకుడైనచో, తమిళచోళుడగును. తెలుగుచోళుడైన చోడబల్లి కొడుకు నన్నెచోడుడు తమిళచోళుడయ్యెననుటకు ప్రమాణము లేదు. అంతేకాదు. పాకనాటి తెలుగుచోళులకు, పలనాటి హైహయులకు బంధుసంబంధము కలదనుటకును ప్రమాణము లేదు. ఉపరి, చోడబల్లి అగ్రమహిషి శ్రీసతి, ఆమె కొడుకు నన్నెచోడుడు అనుటకు కూడ ప్రమాణము లేదు. వంశమూలపురుషులకు, బిరుదములకు మాత్రము శాసనప్రమాణములు కలవు. అందు ఓపిలిసిద్ధనదేవచోడుని కొణిదెనశాసనము అగ్రేసరభాసమానము. అందలి చోడవంశమూలమిది[4]:

> "ఇట్టి మనువంశంబున నిక్ష్వాకు వుట్టె నిక్ష్వాకు వంశంబునం
> గకుస్థుండు వుట్టె నాతనికిం బ్రిథివి దనపేరం జేసినం బ్రిథుండు
> వుట్టెం బ్రిథువంశంబున మాంధాతృండు వుట్టె మాంధాతవంశంబునం
> బురుకుత్సుండు వుట్టెం బురుకుత్సవంశంబున సాగరంబు దనపేరం
> జేసిన సగరుండు వుట్టె సగరవంశంబున దిలీపుండు వుట్టె దిలీపవం
> శంబున భాగీరథి దనపేరుగాం దెచ్చిన భగీరథుండు వుట్టె భగీరథ
> వంశంబున నతీతానాగతవంశకర్త యైన శ్రీరాముండు వుట్టె శ్రీరామ
> వంశంబున నలుచక్రవర్త్తి వుట్టె నతనికిం బుండరీకుండు వుట్టె
> పుండరీకవంశానుక్రమంబున నాదిరాజుల కంట్టెం బ్రసిద్ధుండై కరికాల
> చోడచక్రవర్త్తి వుట్టె భానువంశంబు గరికాలవంశంబు నాం జేరుకొని
> చతుస్సాగరపర్యంత్త మహీచక్రంబు నిర్వ్వక్రంబుగా వాలి వాతం
> బాలించ్చి—"

ఇందలి సగరవంశము, దిలీపవంశము, భగీరథవంశము, కరికాలచోడవంశము కుమారసంభవపద్యమునందు కలదు. అంతేకాదు. ప్రకృతశాసనమున తెలుగు బిజ్జన

మనుమడు మల్లిదేవుడు పొత్తపి రాజధానిగ పాకనాడిరువదియొక్కవేయి పరిపాలించినట్లు కలదు. ఆ పద్యమిది[5] :

"బిరుదనం జన్న యా తెలుంగు బిజ్జన మనుమండు మల్లిదేవండ
చ్చెరువగుచున్న పొత్తపియ చెన్నగు వీడుగ వాలి పాకనాం
డిరువదియొక్కవేయిం జనవేలుచు బల్లహుదండ్లు గెల్చి త
త్కరివరకుంభమౌక్తికలతాతతిం బూచె నిజాసిపుత్రికను." 12.

ఇందు "పాకనాఁడిరువదియొక్కవేయి" అని కలదు. కుమారసంభవ పద్యమునందు "పాకనాఁటియందిరువదియొక్కవేయి" అని కలదు. అనగాపాకనాడులోని ఇరువదియొక్కవేయి అని మాత్రమే అర్థము వచ్చును. అది పాకనాడు మొత్తము కాదు. ఏకదేశము. పాకనాడు మొత్తము ఇరువదియొక్కవేయి అని శాసనపాఠమునకు అర్థము. కుమారసంభవపద్యమునందును "జయి మేటి పాకనాఁడిరువది"అను పాఠభేదము కలదని ద్వితీయభాగమున కవిగారి ప్రకటనము[6]. ప్రథమభాగములోని సుమారు వేయిపద్యగద్యములకు (989) ద్వితీయభాగమున ఆరు పాఠభేదములు మాత్రమే కలవు. అందు రెండు చరిత్రకు సంబంధించినవి. ఇది రెండవది. "పాకనాఁటియందిరువది" అను పాఠము కంటె, "పాకనాఁడిరువది" అను పాఠాంతరము అర్థవంతము. కాని, దానికి "మేటి" అను విశేషణము అర్థవిహీనము. గణమాత్ర ప్రయోజని. అది తాళపత్రగ్రంథమునందు లేదు. కనుక పరిష్కృతపాఠము కావలయును. ఇంతకు మల్లిదేవుడు పాకనాడిరువదియొక్కవేయిని పరిపాలించినట్లు శాసన పద్యమునందు స్పష్టముగ కలదు. (ఏలుచు). చోడబల్లి పరిపాలించినట్లు కుమార సంభవపద్యమునందు లేదు. "పాకనాఁడిరువదియొక్కవేయికి నధీశుఁడు నాఁ జను-" అని కలదు. అనగా చోడబల్లి పాకనాడిరువదియొక్కవేయిటికి అధీశుడు అన నొప్పును-- లేదా- అనఁజెల్లును అని మాత్రమే అర్థము. అనగా కాడని తాత్పర్యము. పెదచెఱుకూరు శాసనమునందు "పాకనాంటివిషయ ఏకవింశతిసహస్రగ్రామావనీవల్లభ" అను నామము కలదు[7]. నామమన బిరుదము. కుమారసంభవపద్యమునందు బిరుదార్థము కలదు. కనుక చోడబల్లి పాకనాటి విషయైకవింశతిసహస్రగ్రామావనీవల్లభ బిరుదాంకితుడు మాత్రమే.

నిజముగ పాకనాడిరువదియొక్కవేయిని పరిపాలించిన మల్లిదేవుని ముని మనుమడు ఓపిలిసిద్ధనదేవచోడుని గురించి కొణిదెనశాసనమునందు ఇట్లు కలదు[8].

స్వస్తిచరణసరోరుహవిహితవిలోచనత్రిలోచన ప్రముఖాఖిల ప్రిథ్వీశ్వర కారితకావేరీతీరకరికాలకులరత్నప్రదీ పాహితకుమారగజాం కుశ యొఱయూరి పురవరాధీశ్వర సూయ్యవంశోద్భవ కాశ్యపగోత్ర తేంక్గణాదిత్య జగదొబ్బగండ్డ కీర్తినారాయణ సమస్తప్రశస్తిసహితంబు శ్రీమనుమండలేశ్వర యొపిలిసిద్ధనదేవచోడమహారాజులు-"

ఇందు "ఒరయూరి పురవరాధీశ్వర, తేంకణాదిత్య" అను విశేషణములు బిరుదములు. "సూర్యవంశోద్భవ, కాశ్యపగోత్ర" అను విశేషణములు వంశ గోత్రములు. కుమారసంభవపద్యములందును తేంకణాదిత్యబిరుదము, సూర్యకాశ్యప వంశగోత్రములు కలవు. ఒరయూరిపురవరాధీశ్వరత్వము బిరుదముగకాక, ఇదమిత్థ ముగ కలదు. ఒరయూరు తమిళచోళుల రాజధాని.[9] అగి కూడ రెండవ శతాబ్ది నుండి ఏడవశతాబ్దివఱకు మాత్రమే[10]. అనంతరము తమిళచోళుల రాజధాని కుంభ కోణము.[11] అంతేకాదు. పాకనాటివిషయైకవింశతిసహస్రగ్రామావనీవల్లభవిరుదాంకితు డైన చోడబల్లికొడుకు నన్నెచోడుడు "ఒరయూరికధిపతి" అగుట దుర్ఘటము. అనగా కాదని తాత్పర్యము. ఇదికూడ బిరుదార్థము కావలయును. అయిన, ఒరయూరు లోని కలుపొన్నలు, కలుకోడులు ఎట్లు తెలియును? అను సందేహము కలుగును. కాని, పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరిత్రములోని మహిమప్రకరణమునందు ఇట్లు కలదు.

"అక్కజంబుగఁ జూచెనంతఁ గల్పొన్న
గుక్కురో కుఱ్ఱని కూసెఁ గల్కోడి" పుట 197.

ఇది మల్లికార్జునపండితుడు ఉదయావనీశుని శపించి, అతని రాజధాని పాన గల్లును విడిచివెళ్లినప్పటి స్థితి. కలుపొన్న పూయుట, కలుకోడి కూయుట, మహో త్పాతములుగ పండితారాధ్యచరిత్రమునందు కలదు. మహోల్లాసములుగ కుమార సంభవమునందు కలదు. జాతిపొన్నలు పూయుట, జాతికోడులు కూయుట అసం భవము కనుక అట్లు జరిగిన అవి మహోత్పాతములగుట సుసంగతము. మహో ల్లాసములగుట అసంగతము. అదటుంచి, తెలుగుదేశములోని పానగల్లునందు కలు పొన్నలు, కలుకోడులు కలవుగావున, తమిళదేశములోని ఒరయూరునందు కలుపొన్నలు కలుకోడులు కల్పించుట సుకరము. అందుకు "ఒరయూరికధిపతి'' కావలసిన ఆవశ్యకము లేదు. కనుక నన్నెచోడుడు ఒరయూరిపురవరాధీశ్వర బిరుదాంకితుడు మాత్రమే.

కొణిదెన శాసనములోని చోడవంశమూలము, బిరుదావళి నన్నెచోడుని వర్ణనమున కలదు. అంతేకాదు. కవిత్వమును కుమారసంభవమునందు కలదు. పూర్వోదాహృతశాసనపద్యమునందు మల్లిదేవుడు "బల్లహుందండ్లు గెల్చి తత్కరివరకుంభమౌక్తికలతాతతిఁ బూచె నిజాసిపుత్త్రికన్" అని కలదు. తన ఖడ్గమునందు శత్రువుల కుంభికుంభములలోని ముత్యాల తీవగుంపులను పూయించెనని తాత్పర్యము. కుమారసంభవమునందు "కరిశిరమాడ షణ్ముఖుఁడు గైపున ప్రేయుడుఁ గుంభమౌక్తికోత్కరమసిధారఁ బొల్పెసఁగె ........ విస్ఫురదవదాతఖడ్గలతపూచెనో నా —" అని కలదు. (182ప.12ఆ.) అదే తాత్పర్యము. అలతి సంస్కరణ అదనము. మౌక్తికలత కంటె ఖడ్గలత మెఱుగు. ఇది కుమారసంభవకర్తకు 1225వ సంవత్సరము నాటి కొణిదెనశాసనముతోడి పరిచయమును పగటును.

ఇంతకు, చోడబల్లి పాకనాటివిషయైకవింశతిసహస్రగ్రామావనీవల్లభ బిరుదాంకితుడు. నన్నెచోడుడు ఒరయూరిపురవరాధీశ్వర బిరుదాంకితుడు. ఇద్దఱు తండ్రికొడుకులు. ఏవంవిధబిరుదాంకితులు, తల్లి నటుంచి తండ్రికొడుకులు అయిన చోడబల్లి, నన్నెచోడుడు కల శాసనము కానరాదు. పెదచెఱుకూరి శాసనములోని చోడబల్లి, నన్నెచోడుడు తండ్రికొడుకులు కాని తద్బిరుదాంకితులు కారు. ఇది గమనార్హమైన విశేషము. నన్నెచోడుని నన్నయ, తిక్కనల నడిమికాలమున నిలఁబెట్టిన పెదచెఱుకూరుశాసనమునందు మల్లిదేవుని గుఱించి ఇట్లు కలదు[12].

> "స్వస్తి చరణసరోరుహవిహితవిలోచనత్రిలోచనప్రముఖాఖిలపృథివీశ్వర కారితకావేరీతీరకరికాలకులరత్నప్రదీపాహితకుమారగజాంకుశ కంధుకూరిపురవరేశ్వర కాశ్యపగోత్ర పాకనాంటివిషయఏకవింశతిసహస్రగ్రామావనీవల్లభ భయలోభదుర్లభసత్యరత్నాకరనామాదిసమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వరమల్లిదేవచోడమహారాజ్ఞా—"

ఇందు మల్లిదేవునికి పాకనాటివిషయైకవింశతిసహస్రగ్రామావనీవల్లభ, కంధుకూరిపురవరేశ్వర అను బిరుదములు కలవు. అవి మల్లిదేవునికి అయిదారుతరముల పూర్వులైన చోడబల్లికి, నన్నెచోడునికి ఆపాదించిన— చోడబల్లి పాకనాటివిషయైకవింశతిసహస్రగ్రామావనీవల్లభ బిరుదాంకితుడు, నన్నెచోడుడు కంధుకూరిపురవరేశ్వర బిరుదాంకితుడు అగుదురు. మల్లిదేవుని పూర్వుడైన నన్నెచోడుడు ఒరయూరిపురవరాధీశ్వరబిరుదాంకితుడు కాలేడు. కనుక పెదచెఱుకూరు శాసనములోని చోడబల్లి కొడుకు నన్నెచోడుడు కుమారసంభవములోని చోడబల్లికొడుకు నన్నెచోడుడు

కొటని కరతలామలకము. కాదనియే కవిగారి అభిప్రాయము కూడ.

ఇంతకు, ''పాకనాఁడిరువదియొక్క-వేయిటికధీశుఁడు నాఁ జను చోడబల్లి''
కొడుకైన నన్నెచోడుడు "ఒరయూరి కధిపతి" అగుట దుర్ఘటము. పాకనాటి విష
యైకవింశతిసహస్రగ్రామావనీవల్లభబిరుదాంకితుడైన చోడబల్లి కొడుకు, ఒరయూరి
పురవరాధీశ్వరబిరుదాంకితుడైన నన్నెచోడుడు దొరుకుట దుర్లభము. అనగా కుమార
సంభవములోని నన్నెచోడుని వర్ణనము కూహకమని అవగాహనమగును.

ఇక దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారి అభిప్రాయమిది[13]:

"కథలో కథేతరముగా వ్యంగ్యకవి 'ఉదయాద్రిప్రభుశృంగంబు'ను
తన ప్రభుత్వరాజధాని యని సూచించియున్నాడు. కాబట్టి ఆ వ్యంగ్య
పాఠ మీ పద్యమున నిముడునో? లేదో? పరిశీలించిన సత్యము కొంతకు
కొంత బోధపడును.

'కలుపొన్న విరులఁ బెరుగం
గలుకోడి రవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
దొలుచు నుదయాద్రి కధిపతి
నలఘుపరాక్రముఁడఁ దెంకణాదిత్యుండన్.'

ఇప్పుడీ పాఠాంతరము సార్థకమై 'ఒరయూరి కధిపతి', లేక 'ఉదయ
గిరి కధిపతి' అను పాకనాటి చోడకవి సత్యచరిత్ర నెరిగించుచున్నది.
పైన వివరించిన గణితచరిత్ర కిది విరోధించదు. 'ఆదిత్య ఉదయాద్రి'
నిత్యసంబంధమీ 'దెంకణాదిత్య– అయ్యుదయగిరి' రాజ్యసంబంధ
మును బలపరుచుచున్నది.

కవి వస్తుకవితయందలి 'ఉదయాద్రిప్రభుశృంగంబు' కొండశిఖ
రము కాక, 'ఉదయగిరిప్రభువుయొక్క ప్రభుత్వము'గా మారుచున్నది.
చోళశాసనములలో పురాతన– నూతనబిరుదములు రెండు కలిపి చెప్పు
కొను నిదర్శనములు కొన్ని కనబడుచున్నవి.

'ఒరయూరి పురవరాధీశ్వర సూర్యవంశోద్భవ కాశ్యప
గోత్రతేంకణాదిత్య .... కమ్మనాంటి– కొట్టియదొన–
నిజరాజధా (నీశ్వర) అనుట.

ఇది క్రీ.శ. 1224-1225 తేదీ నాటి నూతనచరిత్రమైనను, తత్పూ ర్వమీ సంప్రదాయమున్నట్లు కవిగణితచరిత్రాదులు సాక్ష్యమిచ్చు చున్నవి."

ఇది ప్రథమతః చరిత్రకు విరుద్ధము. తదుపరి కవిగారి పాఠమునకు కంఠ పాశము. కుమారసంభవములోని భారవిస్తుతియందు రవి కొఱకు ఉదయపర్వతశిఖ రము కలదు. [20ప.1ఆ.] కుమారస్వామి పట్టాభిషేకసందర్భమునందు రవి కొఱకే "ఉదయాద్రిప్రభుశృంగము" కలదు. (110ప.10ఆ.) నన్నెచోడుని వర్ణనమునందు టెంకణాదిత్యబిరుదము కలదు. (54ప.1ఆ.) ఆదిత్యశబ్దార్థము రవి. కనుక నన్నె చోడుడు ఉదయగిరిప్రభువు అని రెడ్డిగారి అభిప్రాయము. అందుకు "ఒరయూరి కధి పతి" అను చోట "ఉదయాద్రికధిపతి" అను పాఠాంతరకల్పనము! అంతేకాదు. కొణిదెన శాసనములోని "నిజరాజధానియైన కొట్టియదొన" అను శాసనపాఠమునకును "నిజరాజధా(నీశ్వర)" అను పాఠాంతరప్రకల్పనము!! "ఉదయాద్రి కధిపతి" అను పాఠాంతరమును కల్పించిన పద్యమునకు గణభంగము ఘటిల్లదు గాని, "నిజరాజధా (నీశ్వర)" అను పాఠాంతరమును ప్రకల్పించిన శాసనమునకు అర్థభంగము కలుగును. ఓపిలిసిద్ధనచోడదేవుని రాజధాని కొట్టియదొన అనగా కొణిదెన అని శాసనపాఠమునకు అర్థము. "నిజరాజధా(నీశ్వర)" అను పాఠాంతరము ప్రకల్పించినను "ఉదయగిరి పురవరాధీశ్వర" అనుఅర్థము రాదు. అంతేకాదు. తెలుగుచోళుల శాసనములందు "ఓరయూరిపురవరాధీశ్వర, కాంచీపురవరాధీశ్వర, కందుకూరిపురవరేశ్వర" అను బిరుదములు వినా "ఉదయగిరిపురవరాధీశ్వర" అను బిరుదము కానరాదు. కనుక నన్నెచోడుని దేశము ఉదయగిరిరాజ్యమనుట కేవలము కల్పనాగౌరవమునకు తావలము.

కుమారసంభవము జంగమమల్లికార్జుననామాంకితము. జంగమమల్లికార్జునుడు గురువు, ఇష్టదైవము, ప్రభువును. (50ప.1ఆ.) గురువైన జంగమమల్లికార్జునుడు మహాపండితుడు (58వచ.1ఆ.) అంతేకాదు. "కవీంద్రు"డు. (165ప. 6ఆ.) ఉపరి, పీఠాధిపతి, "శ్రీపీఠమున తన శ్రీపాదుకలిడు" నంత పీఠాధిపతి. (14ప.1ఆ.) అంత పీఠాధిపతిఅయిన జంగమమల్లికార్జునుడు ఎవరు? ప్రతి మల్లికార్జునశబ్దవాచ్యుడు మహాపండితుడు కావచ్చును; మహాకవియును కావచ్చును. మహాపీఠాధిపతి మాత్రము కాలేడు. కొప్పరపు శాసనమున- "ధృతకాలాముఖవ్రతమ్ మల్లికార్జునమభ్యర్థ్య తస్మై తత్సార్థభావినే సోమేశ్వరవరం స్థానం ప్రాదా దాచంద్రతారకమ్" అని కలదు.[14]

కాలాముఖవ్రతధారి, తత్త్వార్థభావుకుడు, మల్లికార్జునుడు అయినంతమాత్రమున అతడు "శ్రీపీఠమున తన శ్రీపాదుకలిడు"నంత పీఠాధిపతి అగునా? అయినట్లు ఆధారము లేదు. శ్రీపీఠమున తన శ్రీపాదుకలిడు జంగమమల్లికార్జునుడు కాలాముఖమతాధిపతి కావచ్చును. కాలాముఖమతాధిపతుల గురించి మానవల్లిరామకృష్ణకవిగారు మాత్రమే అందిచ్చిన సమాచారమిది:[15]

"ప్రాచీనులలోఁ బ్రఖ్యాతులగు మల్లికార్జునులు మూవురు గలరు. .......తపోరాశి శిష్యుడై చోళరాజులచేఁ బూజితుఁడై కాలాముఖమత స్థాపనమున కాదికారణమనఁబడిన మల్లికార్జునమహాముని మూఁడవవాడు. కాలాముఖమతాచార్యులెల్లరు బ్రహ్మచారులు. ఈమతము ప్రారంభ మున నెచ్చటనుండెనో కాని క్రీ.శ. 1050లోనుండి వనవాసిదేశమున బలిగ్రామమను పురమున నెలకొన్నది........... (అలంపురము)లో ననేకశాసనములలో సూర్యరాశి, తపోరాశి, తేజోరాశి, కాశిరాశి మొద లగు లాకుల కాలాముఖాచార్యులకుఁ బాశ్చాత్యచాళుక్యరాజులు బహు విధసమ్మానము లొనర్చినట్లున్నది. వారి విగ్రహములు సహితము మూలస్థానములో వారివారి పేరులతోఁగలవు........... .

కాలాముఖులకు మహావ్రతులను నామము నాసికబలిగ్రామా లంపురశాసనములలోఁ గలవు.......బలిగ్రామశాసనములోన "వర కాలాముఖచక్రవర్తి ముని దివ్యజ్ఞాని"........"వామశక్తిదేవరతపఃప్రభా వముమం నోడి యా మహానుభావర యమనియమస్వాధ్యాయధ్యాన ధారణమౌనానుష్ఠానజపసమాధిశీలసంపన్నరుం యష్టాంగయోగనిష్ఠా ప్రతిష్ఠితనైష్ఠికచ్ఛాత్రసంఛన్నరుం..........కవిగమకివాదివాగ్మిప్రముఖ వివిధవిద్వజ్జనానందకారణజంగమకల్పభూజరుం వేదాంతసిద్ధాంతాగమ షట్కర్తృసకలవ్యాకరణనిర్మలశాస్త్రాద్యనేకశాస్త్రార్థనిర్ణయనిర్ణికర్తృం.... శ్లో॥ యః పర్వతావళివిలాసితపుణ్యకీర్తికాంతాసఖోపి2 బుధవృందను తాన్వితో2పి నీతిప్రియో2పి యతిరిత్యభిధీయమానః శ్రీగౌతమో ముని రభూద్భువనేవిచిత్రం" అని యొకానొక కాలాముఖాచార్యుని వర్ణ నము కలదు. ఈలక్షణములు కృతిపతియగు మల్లికార్జునునకును గలవు........ .

బలిగ్రామకాలాముఖమతగురుపరంపర చూడఁ బర్వతావళి గౌతము
ముని శిష్యవంశమనియు నిందు శ్రీశైలవాసిగురులగు కాలాముఖులకుఁ
బర్వతావళులను నామము కాకతీయశాసనములలో త్రిభువనమల్ల రుద్ర
దేవశాసనములఁ గలసివచ్చుటయు నూహింపఁగాఁ గాలాముఖగురు
వులు మొదట శ్రీగిరి, యలంపురము ప్రాంతములనుండి చోళరాజ
ధాటుల కుల్కిన చాళుక్యరాజుల నాశ్రయించుటచే దక్షిణ కేదారమగు
బలిగ్రామమున నెలకొనినట్లు నాకుఁదోచుచున్నది.''

ఇందు కాలాముఖశైవశాఖ గుఱించి కవిగారు తెలిపినది. చాలవఱకు చారి త్రికసత్యము. ఆంధ్రదేశమునందు కాలాముఖశైవము తొమ్మిదవశతాబ్దినుండి పద కొండవశతాబ్దివఱకు ప్రసిద్ధమని బి.యస్.యల్.హనుమంతరావుగారి సప్రమాణనిరూ పణము[16]. పదకొండవశతాబ్ది అనగా నన్నయయుగము. ఆకాలమున శ్రీశైలము లోని కాలాముఖశిలామతాధిపతి రామేశ్వరపండితుడు[17]. అలంపురములోని కాలా ముఖమహాస్థానాధిపతులు పంచరాశి, సోమేశ్వరరాశి, బ్రహ్మరాశి, సోమరాశి, ధర ణీంద్రరాశిప్రభృతులు[18]. అలంపురమునందుగాని, శ్రీశైలమునందుగాని, అన్యథా కాని, జంగమమల్లికార్జునుడు కాలాముఖమతాధిపతిగ కలడనుటకు ప్రమాణము కాన రాదు. "కాలాముఖమతస్థాపనమున కాదికారణమనఁబడిన మల్లికార్జునముని" అను కవిగారి ప్రతిపాదనమునకును ప్రమాణము కానరాదు. కాని, బలిగ్రామకాలాముఖ గురుపరంపరకు గురువైన గౌతమమునిని వర్ణించిన బలిగ్రామశాసనములోని అంశ ములు కుమారసంభవములోని జంగమమల్లికార్జునముని వర్ణనమునందు కలవు. కనుక జంగమమల్లికార్జునుడు బలిగ్రామకాలాముఖమతాధిపతి కావచ్చును. జంగమమల్లికార్జు నుడు నన్నెచోడునికి మతగురువు మాత్రమే కాదు; కవితాగురువు కూడ. కనుక నన్నెచోడుని స్థలము బలిగ్రామము కావలయును. బలిగ్రామము కన్నడదేశమునందు కలదు. కనుక గురుశిష్యులు కన్నడిగులు కావలయును. అయిన జంగమమల్లికార్జు నుడు కన్నడకవీంద్రుడు. నన్నెచోడుడు కన్నడకవిరాజశిఖామణి అగుదురు. కాని, నన్నెచోడుడు ఆంధ్రకవిరాజశిఖామణి కద!— ఆంధ్రదేశమునందు బెజవాడలోని సమస్తభువనాశ్రయదేవాలయమునకు సంబంధించి కాలాముఖమతము పదవశతాబ్ది ఉత్తరార్థమునందే కలదు[19]. ఒకానొక మల్లికార్జునముని కాలాముఖమతమును స్థాపించి నచో, ఆతని కాలము తత్పూర్వమగును. కాలాముఖమతస్థాపకుడైన మల్లికార్జున

మునియే జంగమమల్లికార్జునుడైనచో, ఆతని శిష్యుడు నన్నెచోడుని కాలమును అదే అగును. నన్నెచోడునికాలము పదవశతాబ్ది పూర్వార్ధమని కవిగారి కాలనిర్ణయము[20]. ఇది తదనుగుణము. అనగా జంగమమల్లికార్జునముని వర్ణనమును చరిత్రానుగుణము కాదని అవగాహనమగును.

కుమారసంభవమునందలి శైవము తెలుగుశైవము కాదు. కన్నడశైవమును కాదు-మఱి? తమిళశైవము!— ఇది కూడ మానవల్లి రామకృష్ణకవిగారు మాత్రమే అందిచ్చిన సమాచారము. ఆ విషయమిది[21]:

> "—శాక్తేయరసవాదశైవాచార్యులెల్లరు మధుర, యానమలై, అగస్త్యాశ్రమము, శ్రీశైలము, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములలో నుండి తమ సిద్ధాంతముల నెలకొల్పుచు దేశాటనము సేయుచు రసరసాయనశాస్త్రముల మహోన్నతికిఁ దెచ్చిరి. ఈ శాస్త్రములు శోధింపఁగా నగస్త్యుఁడు, భోగర్, కొంకణర్, సట్టముని మొదలగు ద్రవిడులు రసరసాయనశాస్త్రములఁ జూపిన మార్గములు చరక, సుశ్రుత, వాగ్భట శార్ఙ్గధరాదిప్రోక్తరసోపయోగపద్ధతుల కంటెఁ జాల భిన్నములై యున్నవి. శాంకరమతవ్యాపనమునకుఁ బూర్వము ద్రవిడ దేశమున బౌద్ధజైనసంఘములఁ బ్రతిపక్షము వహించి పోరాడుచుండినది శైవమతము. దీనిలోఁ బెక్కు-తెఱఁగు లుప్పతిల్లి కాపాలిక మతము కంటె భిన్నమై రసవాదశక్తుల నమ్మి శివైక్యము పరమార్థ మనెడు శైవభేదము కలదు. దీని నగస్త్యుడు పన్నిరాయిరములో, భోగరు ఏడ్జాయిరములో, కొంకణరు మువ్వాయిరములోను రససిద్ధులగుటకు మార్గోపదేశము సేయుచు శివైక్యము పరమముగాఁ బ్రసాదించిరి ........
>
> కుమారసంభవమున ........ శివాద్వైతసిద్ధాంతము సూచింపఁబడియె........
>
> కుంభజుఁడు తిరుకుత్తాలక్షేత్రమగు త్రికూటగిరిలో నింక నున్నాఁడనుటయు నతని పన్నిరాయిరమను రసవాదశైవాగమగ్రంథము మంథానభైరవాదిమహాసిద్ధులకు మూలమగుటయు సుప్రసిద్ధము.

మల్లికార్జునుఁడు "కుంభజతత్త్వజ్ఞుఁడట. నన్నెచోడుఁడు రసవాదశాస్త్రమునఁ జూపిన పాండిత్యము రసరత్నసముచ్చయాదికృతులలోనిది కాక కేవల తచ్ఛాస్త్రాంతర్గతమైనది."

ఇందు "మల్లికార్జునుఁడు కుంభజతత్త్వజ్ఞుఁడట" అని కలదు. ఇది గమనార్హమైన విశేషము. కుమారసంభవమునందు కృతిభర్త జంగమమల్లికార్జునుడు కుంభజతత్త్వజ్ఞుడని కలదు. ఆ పద్యమిది :

"త్రిజగద్వంద్యుఁ డనింద్యుఁ డిష్టజనవర్ధిష్ణుండు విష్ణుండు వా
రిజపత్రాక్షుఁడు దక్షుఁ డాదిమునిచారిత్రుండు పాత్రుండు గుం
భజతత్త్వజ్ఞుఁడు ప్రాజ్ఞుఁ డీశ్వరపదాసక్తుండు ముక్తుండు జ
న్మజరాదూరుఁడు ధీరుఁ డాత్మవిదుఁ డానందుండ మందుం డెదన్,"

1005ప. 12ఆ.

ఇది కుమారసంభవమునకు ఇతిశ్రీ పలుకు సందర్భములోని పద్యము. ఇందు జంగమమల్లికార్జునుడు విష్ణువు, కమలాక్షుడు అని మాత్రమేగాక, కుంభజతత్త్వజ్ఞుడు అని కూడ కలదు. కుంభజుడన అగస్త్యుడు. కుంభజతత్త్వమన అగస్త్యుని తత్త్వము. అగస్త్యుని తత్త్వమన అగస్త్యుడు ప్రతిపాదించిన తత్త్వము. అనగా అగస్త్యుడు రచించిన పన్నీరాయిరములోని శైవభేదము. అది భోగర్ ఏళ్ళాయిరములోను, కొంకణర్ ముప్పాయిరములోను కలదట. పన్నీరాయిరము రసవాదశైవాగమగ్రంథమట. అది తమిళశైవాగమగ్రంథము. అందలి శైవభేదము తమిళశైవము. అది తెలిసినవాడు జంగమ మల్లికార్జునుడు. ఇది తెలిసినవారు మానవల్లి రామకృష్ణకవిగారు మాత్రమే.

నన్నెచోడుడు "ద్రావిడశైవాగమకక్ష్యకు చెందినవాఁడని" వేదము వేంకటరాయశాస్త్రిగారికి తోచినది.[22] కాని జంగమమల్లికార్జుని కుంభజతత్త్వజ్ఞతను గుర్తించినట్లు లేదు. గుర్తించినచో శాస్త్రిగారు కుమారసంభవములోని కుంభజతత్త్వమును సోదాహరణనిరూపణము చేసియుందురు. ఇప్పుడైనను మించిపోయినది లేదు. కుమారసంభవములోని కుంభజతత్త్వము పరిశోధనీయము.

కుమారసంభవమునందు తమిళశైవము తోపాటు తమిళపురాణమును కలదు. అది విఘ్నేశ్వరజన్మవృత్తాంతము. ఇది నిశ్శంక కొమ్మన శివలీలావిలాసమునందు రేఖామాత్రముగ కలదు. సంస్కృతగ్రంథములందు సుప్రభేదాగమమునందు, తమిళ

గ్రంథములందు తేవారమునందు కలదని సుప్రసిద్ధము.

సుప్రభేదాగమములోని వృత్తాంతమిది[22];

"అథాత స్సంప్రవక్ష్యామి విఘ్నేశస్థాపనం పరమ్
ఆదౌ త్వహముమా సార్ధం క్రీడార్థం హేమవద్వనే
కరేణుశ్చ గజేంద్రేణ సంభోగ మకరోత్తతః
యదృచ్ఛయా తు తం దృష్ట్వా తదాకార మాశామహమ్
కరేణోరాకృతిం చోమా తదా క్రీడ మహర్నిశమ్
తస్యాంతు గర్భమదధా త్తస్మిన్ కాలే తతోద్భవః
ఫలం దక్షిణహస్తేన వామహస్తే స్వశృంగకమ్
పాశాంకుశోర్ధ్వ హస్తేతు గజహస్తేతు లష్టకమ్
కరండమకుటం ప్రోక్తం సర్వాభరణభూషితమ్
శిరశ్చక్రప్రభాం కృత్వా నర్మపేఠోపరిస్థితమ్
దాడిమీపుష్పసంకాశం సర్వాభరణభూషితమ్
ఆసనం స్థానకం వాపి కారయే ద్విఘ్ననాయకమ్." 43ప.

ఇది శివుడు విఘ్నేశ్వరునికి తెలిపిన విఘ్నేశ్వరవృత్తాంతము. ఇందు హిమాలయపర్వతవనమునందు కరికరేణుసంభోగమును యాదృచ్ఛికముగ చూచి, తదాకారమును కాంక్షించి, పార్వతి కరేణురూపము ధరింప, పరమేశ్వరుడు (కరి రూపము ధరించి) అహర్నిశము క్రీడింప, పార్వతి గర్భవతి అయ్యెనని, అప్పుడే విఘ్నేశ్వరుడు జన్మించెనని కలదు.

తేవారములోని వృత్తాంతమిది[23]:

"పిడియదన్ ఉరుఉమై కొళమిగు కరిగదు
వడి కొడు తన దడి వళిపడుం అవరిడర్
కడి గణపతివరం అరుళివన్ మిగుకొడై
వడి వినర్ పయిల్ వలివల ముఱై ఇఱై యే.

సతిదేవి యాఁడేనుఁగు రూపము దాల్పఁగా శివుఁడు మగయేనుఁగు రూపము ధరించి క్రీడించినప్పుడు పుట్టినట్టివాఁడును; వలివలంగ్రామ

మున వసించినట్టివాఁడును నగు గణపతి దానశీలురగు జనుల కష్ట ములఁ దొలఁగించి రక్షించుఁగాక అని దాని తాత్పర్యము."

"ఇక శివలీలావిలాసములోని వృత్తాంతమిది:

"......................................గండూషితస్వచ్ఛవా
శ్ఛట నించుం దగఁ బుష్కరంబున యదృచ్ఛాసల్లకీపల్లవో
త్కటదానంబు లొనర్చుఁ దుండమున నా దంతివ్రజస్వామి ద
త్కటకక్షోణులయందు నాత్మసతికిం గౌతూహలారూఢుఁడై 226

... ... ...

మఱియుం బెక్కుతెఱంగులం గలుగు విహారణంబులం దగిలి
మెలంగు నమ్మిధునంబులంజూచి శంకరుండు సతీవదనంబు సస్పృ
హంబుగా నిరీక్షించు సమయంబున 229

సతి గాంచెం బ్రతిశుద్ధవర్ణకనకచ్ఛాయాచ్ఛటాభాసురో
ద్గతపాశాంకుశమోదకాభయ సమగ్ర శ్రీసముల్లాసు ను
న్నతదంతాగ్రశోభమానఘనఘంటాలక్షణీయున్న గో
ద్యతకాయుం జగదేకరక్షణమహత్త్వాలంబు హేరంబునిన్"
230వ.1ఆ"

మఱి కుమారసంభవములోని వృత్తాంతమిది:

"హృదయాహ్లాదముతోడఁ బాయక సదానేకప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న విలసన్మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణి సూచి కౌతుకరతై కాలీనభావాభిలా
షదృగత్యుజ్జ్వలదీధితుల్ పఱపె నీశానాననాబ్జంబుపైన్. 101

తదవసరంబునం బరమేశ్వరుండు నిజజీవితేశ్వరి
కన్నెఱింగి దానికి సమ్మతించినం గని సంతోషించి 102

నతి గరిణి యగుడుఁ ద్రిజగ
త్పతి గరియై కూడె -

... ... ...

ఇట్లు పరమేశ్వరుండును సతీదేవియు సామజకేళీ
లాలసులై విహరించినంత సద్యోగర్భంబున 106
పురుషాకారముఁ బటుమద
కరివదనముఁ గుబ్జపాదకరములు లంబో
దరము హరినీలవర్ణముఁ
గరమొప్పఁగఁ దాల్చి విఘ్నకరుడుధయించెన్." 107ప. 1ఆ.

పయి నాలుగు వృత్తాంతములను సరిగా పరిశీలించిన, సుప్రభేదాగమములోని వృత్తాంతము, తేవారములోని వృత్తాంతము కలిసి కుమారసంభవములోని వృత్తాంతమునకు సదృశమని,ఇవి మూడును కలిసినను శివలీలావిలాసములోని వృత్తాంతమునకు సదృశము కాదని స్పష్టమగును. శివలీలావిలాసమునందు సతీపరమేశ్వరుల కరికరేణురూపధారణము లేదు. కరికరేణురూపసమాగమము లేదు. సతీదేవి సద్యోగర్భము లేదు. సాధారణగర్భమును లేదు. సంకల్పమాత్రమున హేరంబసంభవము. కుమారసంభవమునందు సతీదేవి సాభిలాష కలదు. సతీపరమేశ్వరుల కరికరేణురూపధారణము కలదు. కరికరేణురూపసమాగమము కలదు. సతీదేవి సద్యోగర్భము కలదు. ఇవి సుప్రభేదాగమమునందు, తేవారమునందును కలవు. ఇంకను తమిళ వినాయకపురాణమునందు, మలయాళరామచరితమునందును ఇట్లు కలదని తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు అందిచ్చిన సమాచారము[24]. కనుక, కుమారసంభవములోని విఘ్నేశ్వరజన్మవృత్తాంతము తమిళపురాణము.

కుమారసంభవమునందు తమిళశైవము, తమిళపురాణము మాత్రమే కాదు; తమిళదేశాచారమును కలదు. పార్వతీపరమేశ్వరుల పరిణయఘట్టమునందు వివాహమండపము కలదు. (3ప.9ఆ.) హోమకుండముకలదు. (4) పార్వతి శృంగారనైపథ్యము కలదు. (5-18) శృంగారనైపథ్యము కాఁగానే హిమవంతుడు పార్వతిని వివాహమండపమునకు రావించును. (19-23) పార్వతి పెండ్లిపీట మీద కూర్చుండును. (23) అప్పుడు పరమేశ్వరుని శృంగారనైపథ్యము. (23-26) వెంటనే బృహస్పతి లగ్నము సమీపించినదని పరమేశ్వరుని ఆహ్వానించును. (27) పరమేశ్వరుడు వచ్చును. (28) పార్వతి ప్రక్కను కూర్చుండును. (29) అనంతరము పార్వతి పరమేశ్వరుని చూచును (29) పరమేశ్వరుడు పార్వతిని వివాహమాడును. (31) వేదఘోషలు, మంగళనాదములు, వాద్యములు, జయఘోషలు చెలరేగును.

(32) అందఱికిని అభివాంచితవస్తువులు లభించును. (33) అంతే. పార్వతీపర మేశ్వరుల వివాహమైపోవును. ఇది తెలుగుదేశములోని వివాహవిధానముగ లేదు. పెండ్లిపీటల మీద వధూవరుల మధ్య తెర పట్టలేదు. కన్యాదానము జరుగలేదు. అన్నిటి కంటె అగ్రేసరమైనది వధూవరులు తలంబ్రాలు పోసికొనలేదు. సంస్కృత భారతమునందు లేకపోయినను, తిక్కన భారతమున ఉత్తరాభిమన్యుల వివాహఘట్టము నందు 'తలంబ్రాల తతంగము' కలదు. (398ప.5ఆ.వి.ప.) అది మొదలు ప్రాచీ నాంధ్రకావ్యములలో వివాహఘట్టములందు 'తలంబ్రాల తతంగము' తప్పనిసరి వర్ణన మయినది. అంతేకాదు. శ్రీనాథుని హరవిలాసమున గౌరీకల్యాణమునందు కన్యా దానము, 'తలంబ్రాలతతంగము'ను కలదు. పోతన వీరభద్రవిజయమునందును కలదు. తలంబ్రాలు పోసికొనుట తెలుగుదేశాచారము. తదభావము తమిళదేశాచారము. కనుక కుమారసంభవములోని తలంబ్రాల అభావము తమిళదేశాచారము.

కుమారసంభవమునందు తమిళశైవము. తమిళపురాణము, తమిళదేశాచారము మాత్రమే కాదు; తమిళరోదనమును కలదు. పతిదేవుని గుఱించి రతిదేవి విలపించిన ఘట్టములోని పద్యమిది :

> "అనిశముఁ గ్రమ్ము పుష్పమధు వశ్రుజలంబుగఁ గొమ్మలెక్కి ఘో
> రనఁ జెలరేఁగు పక్షిరవ మార్తరవంబుగ మీఁద నోలి మూఁ
> గిన యలిమాలికల్ విభృతకేశభరంబుగఁ జుట్టునుండి పే
> ర్చిన రతితోడి సంబెరము చూపు విధంబునఁ బొల్చె భూజముల్."

ఇది రతిదేవి "అనాథవృత్తి దీనాననయగుచు భీతిం గాంతారాంతరంబు గనుం గొనునప్పుడు" (81) చుట్టునున్న చెట్లు కనిపించిన విధము. నిరంతరముగ స్రవించు మకరందము అశ్రుజలముగ, కొమ్మలమీద వ్రాలి ఒక్కపెట్టున చెలరేగిన పక్షుల కిలకిలారావము ఆర్తారావముగ, కలయమూగిన తుమ్మెదలపిండు విరఁబోసిన జుట్టుగ, చుట్టును చెట్టులు రతితోడి సంబెరము చూపునట్లు కలవట. ఇట సంబెరమన "పరుల భావవికృతులకు మనస్సునఁ గారుణ్యము కలిగి తుల్యానుభావము నెంచుట" అని కవిగారి అర్థవివరణము[25]. రతిదేవి కన్నీరు కార్చుచు, గగ్గోలు పెట్టుచు, జుట్టు విరఁ బోసికొని ఉన్నట్లు, ఆమె చుట్టును అట్లుండు వారివలె చెట్టులు కలవని ఆంతర్యము.

ఇట పేదము వేంకటరాయశాస్త్రిగారి వివరణమిది[26]:

"ఇట్లు వలయాకారముగ గుమిగూడి మృతుని భార్య చుట్టు జేరి ఏడ్చుట ద్రవిడదేశమందు బ్రాహ్మణేతరులలో ఆచారము. ఆ భయంకరదృశ్యమును, స్త్రీలు చప్పట్లు కొట్టుచు, రొమ్ములు బాదు కొనుచు, వికారరాగములలో పాటగా తమ దుఃఖమును వెలిబుచ్చుచు, తిరుగుట— సంబెరము (=సంభ్రమము) చూపుటను— చూచిన వారికి తెలియును. ఇది చేతగాని వారు కూలికి ఏడ్చువారిని ఏర్పాటు చేసి కొందురు. గణపతి జననవిషయమై ద్రావిడపురాణకథను, తలం బ్రాలను బాసికములను తెరలను మాని ద్రావిడాచారమును ఇచ్చట ద్రావిడరోదనమును ఈతడు ప్రవేశపెట్టుటయు వింతగా నున్నది. వీనికి తోడు 'నాయి' 'కట్టాయము' 'నడనడనడంగి' యను తమిళశబ్దములు."

ఇందు "వింతగానున్నది" అను మాట విలువైనది.

కుమారసంభవమునందు తమిళశైవము, తమిళపురాణము, తమిళదేశాచారము, తమిళరోదనము, తమిళపదజాలము మాత్రమే కాదు; తమిళకవిత్వమును కలదు.

కళింగత్తుపరణి అను తమిళకావ్యములోని పద్యమిది[27]:

"ఆదవం పరుగుం ఎన్రు నిన్ర నిఴల్
అంగుం నిన్రు కుడిపోనదు
అప్పాదవం పునల్ పెరాదు వుఱుంగువన
పరుగుం నమ్మె ఎన వెరువియే?"

కుమారసంభవములోని పద్యమిది:

"ఆతపభీతి నీడలు రయంబున మ్రాఁకుల క్రిందు దూఱెనో
యాతరులుం దృషాభిహతులై తమనీడలు దార ద్రాగెనో
ధాతి ననంగ నీడ లురుపాదపమూలములం దడంగె గ్రీ
ష్మాతతమధ్యవాసరములందుఁ జలింపకయుండు నెండలన్." 141ప.6ఆ.

ఇట్టి వింకను కలవు[28]. తమిళాంధ్రకావ్యపరిజ్ఞాతలు తఱచిచూచిన, కుమార సంభవములోని తమిళకవిత్వానుసరణములు తలమున్కలు కావచ్చును.

కుమారసంభవమునందు తమిళకవిత్వము మాత్రమే కాదు; కన్నడకవిత్వమును కావలసినంత కలదు. కాని, "నన్నెచోడని యత్యపూర్వభావములు మల్లినాథపురాణ జగన్నాథవిజయాది కర్ణాటకకావ్యములలోమార్పులేకయున్నవి." అని కవిగారి ప్రకటనము[29]. దీనిపై,

కందుకూరి వీరేశలింగముగారి అభిప్రాయమిది[30];

"ఇందుఁ జేర్కొనఁబడిన మల్లినాథపురాణము 1105వ సంవత్సరప్రాంతములందున్న నాగచంద్రునిచే రచియింపఁబడినది. కుమారసంభవములోని భావములు తద్గ్రంథకర్తయగు నన్నెచోడునితో సమకాలికులును పూర్వకాలికులును నగు తెలుఁగురాని కన్నడకవులచేఁ జేకొనఁబడినవని చెప్పుటే యుచితమో, ఆ కవుల కాలపువాఁడును తరువాతి కాలపువాఁడునునై కన్నడము వచ్చిన నన్నెచోడుడే వారి కర్ణాటకకావ్యములనుండి కైకొనియెనని చెప్పుటయే యుచితమో, చదువరులే తెలిసికోఁగలరు."

కోరాడ రామకృష్ణయ్యగారి అభిప్రాయమిది[31];

"నన్నయ తిక్కనాదులగు ననేకప్రసిద్ధకవులుండఁగా, ఒక్క నన్నెచోడుని గ్రంథమునుండియే, ఒకరు కాదు— ఇద్దరు కాదు— పలువురు- అందును రత్నత్రయమని ప్రసిద్ధిఁగాంచిన నన్నయకు పూర్వమునందలి కవిత్రయము తోపాటు నన్నయకు తరువాతివారగు మల్లినాథపురాణజగన్నాథవిజయాదిగ్రంథరచయితలగు కర్ణాటకకవులనేకులుగూడ భావగ్రహణము చేసియుందురనుట వింతగాఁ గనఁబడకపోదు......... నన్నయ ప్రసిద్ధుడైన వెనుకగూడ నాతని కాలపు కన్నడదేశకవులైనను నాతని జాడలను బోఁవలంపక ఒక్క నన్నిచోడుని జాడలనే బోవవలంచిరనుట సంభావ్యముగా లేదు. శైవమతాభిమానముచేతను, కన్నడదేశము వీరశైవమతమునకు ప్రాతిపదికయగుటచేతను, సోమనాథుని బసవపురాణ మాభాషలోనికి బరివర్తనమేయైనను గూడ అతని భావములను— నన్నిచోడుని భావములను గ్రహించినరీతిని— ఇతర కన్నడకవులేవరు గ్రహించి నట్లగపడదు ........... నన్నిచోడుని గ్రంథమునకును కన్నడకవులగ్రంథములకును గల పోలికలు కొన్ని

భావముల విషయమునమాత్రమే కాదు. రచనాపద్ధతివిషయమునఁగూడ
వీనిలో పెక్కుపోలికలు గలవు. వీనినిగూడపలువురు కన్నడకవులు
ఒక్క తెనుగుకవినుండియే గ్రహించిరనుట సంభావ్యముగా లేదు.
........నన్నిచోడుని కన్నడపోలికలు ఆ కన్నడకవులకంటె నీతఁడు
ప్రాచీనుఁడను విషయమును స్థాపించుట కంటె నీతనియార్వాచీన
తను సూచించుటకే యెక్కువ తోడ్పడఁగలవని తోచుచున్నది.''

సమన్వయములివి సమంజసములు. కనుక "మల్లినాథపురాణజగన్నాథవిజ
యాదికర్ణాటకకావ్యములలోని అత్యపూర్వభావములు కుమారసంభవమునందు మార్పు
లేక యున్నవని'' ఫలితాంశము. అంతేకాదు. కుంభజతత్త్వజ్ఞుడైన జంగమమల్లి
కార్జునుడు గురువుగ, శ్రీశైలమల్లికార్జునస్వామి దైవముగ, కుమారసంభవమునందు
అభేదాధ్యవసాయికల్పనము అంతటకలదు. అది కన్నడసాహిత్యములోని అంకిత
సంప్రదాయము. ఆదిపంపని భారతమునందు అర్జునునికి, అరికేసరికి అభేదాధ్యవసాయి
కల్పనము కలదను విషయము ప్రసిద్ధము. గుణవర్మ పుష్పదంతపురాణమునందును
అభేదాధ్యవసాయికల్పనము కలదట. ఉపరి, పుష్పదంతపురాణములోని అభేదాధ్యవ
సాయి కల్పనము కల కన్నడపద్యమునకు, కుమారసంభవములోని అభేదాధ్యవసాయి
కల్పనము కల తెలుగు పద్యమునకు అవినాభావసంబంధము కలదు. ఆ కర్ణాటాంధ్ర
పద్యములివి :

''మదగజదంతకాంతముసళం బిడి దెత్తువతోళ్ నుణ్బొగర్
మదననబాళ నుణ్బొగరనేటిసె గారవదింపు వల్లకీ
మృదురవ దింపనీయె బిదిరక్కిగళం చళిసుత్తె పాడిదర్
మదవతియర్ కిరాతసతియర్ ప్రభుమేరువలీలెయేశ్గెయం.'' 92ప.5ఆ.

"పటికపుగోలముల్ వెదురుఁబ్రాలొగిఁ బోయుచు గౌరుకొమ్మురో
కటఁగొని దంచుచున్ శబరకామిని పెక్కులు రాగముల్ మదో
త్కటముగఁ బాడెఁ బుట్టిన మృగంబులు సోమమనుష్యరూపధూ
ర్జటిమునిముఖ్యలోకగురుజంగమలింగము మల్లికార్జునున్.'' 47ప.6ఆ.

ఇది గుర్తించిన వేదము వేంకటరాయశాస్త్రిగారి అభిప్రాయమిది[32]:

''ఏనుఁగుకొమ్ము రోఁకళ్లతో వెదురుబియ్యమును దంచుచు ఆటవిక
వనితలు కథానాయకునికిని కృతిభర్తకును కలిపి ధ్వనించునట్టి గీతి
కలు పాడుట రెంటియందును సాక్షాత్తుగా ఒకదానికి ఇంకొకటి

ప్రతిబింబమనునట్లున్నవి. గుణవర్మను చూచి నన్నెచోడుఁడో లేక చోడుని చూచి గుణవర్మయో తన పద్యములను వ్రాసెయుండవలయును. అట్లు తద్రూపములుగా నున్నవీ పద్యములు. గుణవర్మ రీతులు నన్నెచోడునిలో ఎన్నియో కనఁబడుచుండుటచే ఆ కావ్యము నీతఁడు పఠించియే యుండును.''

ఇది గుణవర్మ పుష్పదంతపురాణమును కుమారసంభవకర్త పుక్కిలించెననుటకు నిదర్శనము. ఇట ''గౌరుకొమ్ము= ఏనుఁగుకొమ్ముతోఁ జేసినవి. మల్లికార్జునుడు- కృతిపతి శివున కభేదముగాఁ జెప్పఁబడినది" అని వివరించిరేగాని, అన్యస్థలములందు కన్నడపద్యములను పుంఖానుపుంఖముగ ఉదాహరించినకవిగారు పుష్పదంతపురాణమును ఉదాహరింపలేదు[33]. అంతేకాదు. కవిగారిపీఠికానుబంధలఘుటీకాథసూచికలందు కన్నడవాఙ్మయములోని పంపకవి భారతము, పొన్నకవి ఆదిపురాణము, రన్నకవి అజితపురాణగదాయుద్ధములు, అభినవపంపకవి రామాయణము, మల్లినాథపురాణము, అన్యకర్తృకములైన చంద్రప్రభపురాణము, అర్ధనేమిపురాణము, శూద్రకము, శృంగారరత్నాకరము, గిరిజాకల్యాణము, లీలా(వతీప్రబంధము), జగన్నాథవిజయము పేర్కొనఁబడినవి కాని, పుష్పదంతపురాణము పేర్కొనఁబడలేదు. పేర్కొనఁబడని కన్నడకావ్యములు మఱెన్ని కలవో:— పేర్కొనఁబడిన కన్నడకావ్యములందు గిరిజాకల్యాణము కుమారసంభవమునకు సమానేతివృత్తము కల కావ్యమని పేరునుబట్టియే సువిశదము. కన్నడగిరిజాకల్యాణమునకు, తెలుగుకుమారసంభవమునకు తారతమ్యపరిశీలనము పరిశోధనము జరుగుచున్నట్లు వినికిడి. కర్ణాటాంధ్రకావ్యపరిజ్ఞాతలు కనిపెట్టిన, కుమారసంభవములోని కన్నడకవిత్వానుకరణములు క్రాంతముద్రాకము కావచ్చును.

ఇంతగా కన్నడసంబంధము, అంతగా తమిళసంపర్కము మేళవించి మేళమాడునది తెలుగు కుమారసంభవము. అంతేకాదు. ఇంతకు మించిన సంస్కృతకవిత్వము, అంతకు అతిక్రమించిన తెలుగుకవిత్వము సంవదించి సరసమాడునది కూడ తెలుగు కుమారసంభవము. సంస్కృతాంధ్రకర్ణాటతమిళకవిత్వసంవాదము లేని సహజకవిత్వము కుమారసంభవమునందు నక్కన్మాత్రమే.

తమిళకర్ణాటాంధ్రకవిత్వబంధురమైన కుమారసంభవము నన్నెచోడకృతమయిన, మఱి నన్నెచోడుని జన్మస్థలము తమిళకర్ణాటాంధ్రసంగమస్థలము కావలయును. నన్నెచోడుడు "ఒరయూరి కధిపతి" అయినను ఒరయూరు తమిళకర్ణాటాంధ్రసంగమస్థలము కాదు. తమిళస్థలము. పెదచెఱుకూరుశాసనములోని చోడబల్లికొడుకు

నన్నెచోడుడు కుమారసంభవకర్త అయినను, పెదచెఱుకూరుతమిళకర్ణాటాంధ్రసంగమ స్థలము కాదు. ఆంధ్రస్థలము. అసలు నన్నెచోడుడు ఒరయూరికి అధిపతి కాడు. పెదచెఱుకూరు శాసనములోని చోడబల్లి కొడుకు నన్నెచోడుడు కుమారసంభవకర్త కాడు. నన్నెచోడుడు ఒరయూరిపురవరాధీశ్వరవిరుదాంకితుడు మాత్రమే. చోడబల్లి పాకనాటివిషయైకవింశతిసహస్రగ్రామావనీవల్లభవిరుదాంకితుడు మాత్రమే. ఇది పూర్వోక్తము. ఇక "నన్నెచోడుని" ఉనికి ఎక్కడ?

వేదము వేంకటరాయశాస్త్రిగారి అభిప్రాయమిది[34]:

> "ఈ మహాకవి ఆంధ్రకర్ణాటకద్రావిడదేశముల సంధిప్రదేశము వాఁడని తోఁచుచున్నది. పేంకణమును పాకనాడును కలసిన ఇటు నెల్లూరు కడపలను అటు తాడిపర్తి గుత్తిరాజ్యములను తాకుచు రాయచూరునుండి ద్రావిడదేశమునకు పోవు మహామార్గమున నున్నవి. మీర్జాఫరు మొదలైన వారేగాక ప్రాచీనచోళపల్లవులు కంచినుండి గుత్తి మీఁదుగానే వచ్చి అటు కర్ణాటకమును రాయచూరుదేశమును ప్రవేశించి కృష్ణను దాఁటి వేంగిదేశమునకు పోవుచుండినది చరిత్రప్రసిద్ధము. ఇతఁడు శివభక్తుఁడు గాన శ్రీశైలమందు భక్తులు బహుభాషాకోవిదులు వచ్చుచుండేయుందురు. (చూ. పండితారాధ్యచరిత్ర—పరషలు బహుభాషలలో మాటలాడుట) కాన రాయల వారివలెనే ఈయనయు మఱియొక 'బాసాడి' గావలయు."

ఇది ఊహామాత్రశరణ్యము. రాయలవారు పరిపాలకు డనుటకు చారిత్రికాధారము సమృద్ధిగ కలదు, నన్నెచోడుడు పరిపాలకు డనుటకు చారిత్రికాధారము సక్కన్మాత్రమును లేదు. కనుక "మఱియొక బాసాడి" అను మాట నిరవకాశము. బహుభాషాకోవిదులైన భక్తులు శ్రీశైలమునకు వచ్చినట్లు పండితారాధ్యచరిత్రమునందు కలదుగాని, బహుభాషాకోవిదుడైన నన్నెచోడుడు శ్రీశైలమునకు వచ్చినట్లుకుమారసంభవమునందు లేదు. "కావునం బరమశ్రీనగోత్తుంగమణిశ్రీసంగతమల్లికార్జునదేవతాకంబై-" (5ఆవ.1ఆ.) అను వచనమునందు శ్రీశైలప్రసక్తి వినా, కుమారసంభవమునందు శ్రీశైలవిషయము లేదు. కనుక నన్నెచోడుని శ్రీశైలయాత్రయు నిరాధారము. "ప్రాచీనచోళపల్లవులు కంచినుండి గుత్తిమీదుగా కర్ణాటకమును రాయచూరును ప్రవేశించి కృష్ణను దాటి వేంగిదేశమునకు వేంచేయుట చరిత్రప్రసిద్ధ"మే గాని, అది తీర్థయాత్రావిశేషము కాదు. దండయాత్రావిషయము. కంచినుండి బయలు దేరుటకు హేతువు ప్రాచీనచోళపల్లవరాజుల రాజధాని కంచి అగుటయే. మఱి కంచి

రాజధాని అయిన ప్రాచీనచోళులందు చోడబల్లి కొడుకు నన్నెచోడుడు లేడు. కుమార సంభవమునందు "కంచికధిపతిని" అని లేదు. కనుక నన్నెచోడుడు కంచి నుండి కర్ణాటాంధ్రరాజుల మీదికి దండయాత్ర సాగించెననుట నిరాలంబనృత్యము. దండ యాత్ర, తీర్థయాత్ర సాగించినంతమాత్రమున తమిళకర్ణాటాంధ్రవాఙ్మయకోవిదుడగుట ఊహాగానము. "టేంకణమును పాకనాడును కలసిన ఇటు నెల్లూరు కడపలసు అటు తాడిపత్రి గుత్తిరాజ్యములను తాకుచు" అది "ఆంధ్రకర్ణాటకద్రావిడదేశముల సంధి ప్రదేశ"మైనను, నన్నెచోడుడు తత్పరిపాలకుడు కాలేడు. చోడబల్లి "పాకనాటివిష యైకవింశతిసహస్రగ్రామావనీవల్లభ"బిరుదాంకితుడు మాత్రమే. నన్నెచోడుడు టేంక ణాదిత్యబిరుదాంకితుడు మాత్రమే. ఇది పూర్వోక్తము. కనుక నన్నెచోడుని దేశము టేంకణము, పాకనాడు కలసిన ఆంధ్రకర్ణాటకద్రావిడదేశముల సంధిప్రదేశమనుట ఆకాశచిత్రలేఖనము.

కుమారసంభవము వెలువడి డెబ్బదిసంవత్సరములు దాటినది. ఎవరెన్ని విధముల ఎంత వెదకినను కుమారసంభవములోని నన్నెచోడుని గుఱించి శాసన ప్రమాణము కానరాదు. నాణకప్రమాణమును కానరాదు. సరియైన వాఙ్మయప్రమా ణము కూడ కానరాదు. అంతేకాదు. కుమారసంభవములోని నన్నెచోడుని చరిత్రము నిర్ధారకముగ పొసగదు. కాలము నిర్వివాదముగ కుదురదు. దేశము నిష్కర్షగా తెలి యదు. అనగా కుమారసంభవములోని నన్నెచోడుడు దేశ, కాల, చరిత్రములకు అతీతుడైన అపూర్వపురుషుడని అవగాహనమగును. తలమున్కలైన తమిళసంప ర్కము, క్రాంతముద్రాకమైన కన్నడసంబంధము కల గ్రంథము తెలుగు కుమార సంభవము. కనుక తత్కర్త జన్మస్థలము తమిళకర్ణాటాంధ్రసంగమస్థలమగుట తథ్యము. అది దేశకాలచరిత్రములకు అతీతుడైన నన్నెచోడుని పరముగ అంతు పట్టని విషయము. కుమారసంభవమును ప్రకటించిన మానవల్లి రామకృష్ణకవిగారి పరముగ చిక్కుపెట్టని విషయము. వారి జన్మస్థలము మద్రాసు[35]. అది ఉమ్మడి మద్రాసురాష్ట్రమునందు తమిళకర్ణాటాంధ్రసంగమస్థలము.

కుమారసంభవములోని తమిళసంపర్కము, కన్నడసంబంధము, తెలుగు సంవా దము, సంస్కృతానువాదము గమనించిన, కుమారసంభవకర్త తమిళకర్ణాటాంధ్ర సంస్కృతవాఙ్మయకోవిదుడని విశదమగును. మానవల్లి రామకృష్ణకవిగారు తమిళ కర్ణాటాంధ్రసంస్కృతవాఙ్మయకోవిదులు. ఒక తమిళకర్ణాటాంధ్రసంస్కృతవాఙ్మయ కోవిదుని కుమారసంభవము మఱొక తమిళకర్ణాటాంధ్రసంస్కృతవాఙ్మయకోవిదుడు లభించువఱకు అజ్ఞాతవాసము చేయుట అసంగతము.

౫

# కృత్రిమపాఠము

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమున
జన సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్." 23ప.1అ

ఇది 1909వ సంవత్సరమునందు మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవము ప్రథమభాగములోని పద్యము. ఇందు "లోకమునందు పూర్వము మార్గకవిత ఉండగా, ఆంధ్రదేశమునందు సత్యాశ్రయుడు మొదలుగ చాళుక్యరాజులు దేశికవితను పుట్టించి తెనుగును నిలిపిరి" అని కలదు. ఇక 1912వ సంవత్సరము నందు మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన త్రిపురాంతకోదాహరణము పీఠిక యందు ఇట్లు కలదు[1].

"దీనిలో మూఁడవ నాల్గవ చరణములకే నా కిటీవల లభించిన ప్రతిలో

గును నిలిపి రంధ్రవిషయం
బున జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్

అను పాఠాంతరము గానవచ్చుచున్నది."

ఇందు "సత్యాశ్రయుని"కి స్వస్తివాచకము కలదు. ఇది గమనార్హమైన విశేషము. మఱి 1914వ సంవత్సరమునందు మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవము ద్వితీయభాగములోని "ముఖ్యపాఠభేదములు" అను శీర్షికను "ఆంధ్రవిషయమున జన సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్" అను పాఠమునకు "ఆంధ్రవిషయంబునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అను పాఠాంతరము కలదు. దీనిపై,

వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయమిది[2]:

"—తంజాపురపు సరస్వతీపుస్తకభాండాగారమునఁ దాటియాకులపై వ్రాయఁబడిన కుమారసంభవపుఁబ్రతి యున్నది. అక్కడఁదక్క

నింతవఱకుఁ బ్రత్యంతరమెక్కడను మనకుఁ గనరాదు. వినరాదు. ఆ పుస్తకములోఁ బై పద్యమిట్లున్నది.

"క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

కవిగారికి "చన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్" అన్న పాఠ మెక్కడనుండి వచ్చినదో! వారింక నెక్కడి ప్రతి సంపాదించినారో! ప్రథమభాగమును ముద్రించునప్పటికి వారీ తంజావూరు ప్రతి నెఱుఁగనే యెఱుఁగరు గావలయు. ఎఱ్ఱిఁగియుండురేని యనర్ఘమగు నీ పాఠమును జూపకుండుట కేమి కారణము? తంజావూరు పుస్తక శాలలో కుమారసంభవమున్నదని యెల్లరు నెఱిఁగిన తర్వాత క్రీ. 1914 లో వీరు ప్రచురించిన కుమారసంభవపు రెండవభాగమున "చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అను పాఠాంతరమున్నట్లు తెలిపిరి. కాని యిప్పుడయినను దంజాపురపుఁ బుస్తకమును వీరు చూచినట్లు వ్రాయలేదు. కావున నీ పాఠము మఱియొక ప్రతిలోఁ జూచినారేమో? అత్యూహలెందులకు? తంజావూరు పుస్తకపాఠము మాత్రమే మనకిప్పుడు గ్రాహ్యము. శ్రీకవిగారి పాఠము గల మాతృక బయల్పడు వఱకును. అట్టి ప్రత్యంతరము బయల్పడెనా యది పాఠాంతరముగాఁ గూర్చుకొందము."

ఇది 1918వ సంవత్సరమునందు తెలిపిన సంగతి. 1981వ సంవత్సరము నందును ఇంతే సంగతి. అంతేకాదు. తంజావూరి ప్రతియు, కవిగారి అచ్చుప్రతియు "పాఠభేదములు లేకయు సమానగ్రంథపాతములు గలిగి"యున్నవని ప్రభాకరశాస్త్రి గారి ప్రతిపాదనమే కాదు. "కవిగారికిని తంజావూరుప్రతి యొక్కటి మాత్రమే లభించియుండు"నని జయంతి రామయ్యపంతులుగారి అభిప్రాయము[3]. "తంజావూరి వ్రాఁతప్రతిలో లుప్తములై యున్న భాగములే ముద్రితపుస్తకమునందును గానరాక, ఆ యా స్థలములఁ జుక్కలు పొడువఁబడియున్నవి" అని నడకుదుటి వీరరాజు

పంతులుగారి వివరణము[4]. "తంజావూరిప్రతినుండియే మూలము గ్రహింపఁబడి నట్లున్నగి." అని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి వివరీకరణము[5]. కనుక తంజావూరి ప్రతి, కవిగారి అచ్చుప్రతి అవినాభావసంబంధము కలవి.

కవిగారు కుమారసంభవము ద్వితీయభాగమునందు ప్రకటించిన ప్రథమభాగము పాఠభేదములు ఆరు కలవు. అందు రెండు చరిత్రకు సంబంధించినవి. రెండవది పూర్వోక్తము. ఇది మొదటిది. సర్వసాధారణమైన సాధుత్వాసాధుత్వములకు సంబంధించిన పాఠాంతరవిషయము కాదు. చరిత్రకు సంబంధించిన పాఠాంతరవిశేషము. "సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్" అను పాఠములోని సత్యాశ్రయపదబంధము ఒక చాళుక్యరాజు పేరు. "చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అను పాఠభేదమునందు చాళుక్యరాజు పేరు లేదు. పేరు కల చాళుక్యరాజునకు స్వస్తివాచకము పలికి, పేరు లేని చాళుక్యరాజునకు స్వాగతవాక్యము పలుకవలసిన ఆవశ్యకము పాఠకునకు రాదు. లేఖకునికి లేదు. మఱి ఎవ్వరికి కలదు? ఎందుకు కలదు?— ఇందుకు ప్రథమతః చూడవలసినది కవిగారి నన్నెచోడుని కాలనిర్ణయము. తదుపరి మార్గకవిత, దేశికవితల అర్థము. ఆమీద సత్యాశ్రయచాళుక్యరాజుల చరిత్ర.

కవిగారి నన్నెచోడుని కాలనిర్ణయము: కుమారసంభవము ప్రథమభాగమును 1909వ సంవత్సరమున ప్రకటించినను, 1908వ సంవత్సరమునందే కవిగారు రచించిన పీఠికయందు ఇట్లు కలదు[6].

> "ఈ మహాకావ్యమును రచించిన కవి నన్నెచోడదేవుఁడు ....
> ఇతఁడు క్రీ.శ. 940లోఁ బాశ్చాత్యచాళుక్యులతో యుద్ధము చేసి రణరంగమున నిహతుఁడయ్యెను."

ఇందు నన్నెచోడుని చరమకాలము 940వ సంవత్సరమని ఇదమిత్థముగ కలదు. కుమారసంభవము ద్వితీయభాగమును 1914వ సంవత్సరమునందు ప్రకటించినపుడు 1914వ సంవత్సరమునందే కవిగారు రచించిన పీఠికయందు ఇట్లు కలదు[7].

> "పుదుకోట సంస్థానమున నుండు కొడుంబాలూరు గ్రామమున
> నుండు మూర్కోవిలు శాసనములో విక్రమకేసరి యను చోళరాజు
> తపోరాశిశిష్యుఁడగు మల్లికార్జునమహాముని నత్యధికముగా సంభావించి

నట్లున్నది. ........ ఈ విక్రమకేసరి వీరపాండ్యుని జయించియున్నం దున, క్రీ.శ.పదియవశతాబ్దపు బూర్వార్ధములో నుండెనని శాసనపరి శోధకుల సాంవత్సరికప్రకటనములో రాయబహద్దరు వెంకయ్యగారు లిఖించియున్నారు. కృష్ణాతీరమున బీచుపల్లి గ్రామశాసనములోఁ జోడ బల్లిదేవుఁడు విజయయాత్రలోఁ గృష్ణాతటమున నుత్తరాయణపుణ్య కాలమున విశ్వనాథదేవునకు క్రీ.శ.902లో భూదాన మిచ్చినట్లున్నది ........ నన్నెచోడుఁడు........క్రీ.శ.902లోఁ బేర్కొనఁబడిన చోడ బల్లి కుమారుఁడని........నా మనస్సున కుద్బోధన మగుచున్నది.''

ఇందు 902లో చోడబల్లి, పదవశతాబ్ది పూర్వార్ధమునందు మల్లికార్జునముని కలరనుటకు శాసనప్రమాణములు కలవు. కనుక నన్నెచోడుని కాలము పదవశతాబ్ది పూర్వార్ధమని కవిగారి నిర్ణయము.

ఇక మార్గకవిత, దేశికవితల అర్థము—.

మానవల్లి రామకృష్ణకవిగారి అర్థమిది[8]:

"మార్గకవిత=సంస్కృతకవిత, దేశికవిత=భాషాకవిత్వము, ద్రవిడాంధ్రకర్ణాటాదికవిత."

కందుకూరి వీరేశలింగముగారి వివరణమిది[9].

"మార్గకవిత యనఁగా సంస్కృతకవిత్వమని యర్థము.

శ్లో. మార్గదేశివిభాగేన సంగీతం ద్వివిధం మతమ్
ద్రుహిణేన యదుద్దిష్టం యదుక్తం భరతేన చ
తద్దేశీహి యయారీత్యా యత్స్యాల్లోకానురంజనమ్
దేశే దేశేను సంగీతం తద్దేశీత్యభిధీయతే ॥

అని సంగీతదర్పణమునం దుదాహరింపఁబడినది. బ్రహ్మచేతను భరతునిచేతను సంస్కృతమున విధింపఁబడినది మార్గకవితయనియు, కర్ణాటాదిదేశములయందు నాయాదేశభాషలలో నేర్పఱుపఁబడినది దేశకవితయనియు, పయిదాని(కుమారసంభవపద్యము)తాత్పర్యము....

సంగీతరత్నాకరములోని యీక్రింది శ్లోకము లీ యర్థమును స్పష్టపఱుచుచున్నవి—

శ్లో॥ గీతం వాద్యం కథా నృత్తం త్రయం సంగీతముచ్యతే
మార్గో దేశీతి తద్ద్వేధా తత్ర మార్గ స్స ఉచ్యతే.
యో మార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః
దేవస్య పురతశ్శంభోః నియతోభ్యుదయప్రదః
దేశే దేశే జనానాం యద్రుచ్యా హృదయరంజకం
గీతం చ వాదనం నృత్తం తద్దేశీత్యభిధీయతే.''

ఇందు సంగీతము మార్గదేశివిభాగమున ద్వివిధమని, బ్రహ్మ ఉద్దేశించినది, భరతుడు ఉపదేశించినది మార్గసంగీతమని; దేశదేశములందు ప్రజారంజకమగునది దేశిసంగీతమని కలదు. ఇట్లు సంగీతశాస్త్రగ్రంథములందు మాత్రమే గాక, సాహిత్య శాస్త్రగ్రంథమునందును కలదు.

"అన్య ద్భావాశ్రయం నృత్యమ్ నృత్తమ్ తాళలయాశ్రయం
ఆద్యమ్ పదార్థాభినయో మార్గో దేశీ తథాపరమ్."

ఇందు నృత్యము భావాశ్రయమని, నృత్తము తాళలయాశ్రయమని, ఈరెండిటి యందు మొదటిది పదార్థాభినయమైన మార్గమని, రెండవది దేశి అని కలదు. ఇది ధనంజయుని దశరూపకములోని శ్లోకము. ఇది 1912వ సంవత్సరమునందు కొలంబియావిశ్వవిద్యాలయము సంఘటించిన ఆంగ్లటీకయందు "high Style (marga), Popular Style (Desi)" అని కలదు[10]. అనగా ఉన్నతమైనది మార్గ, ప్రచురమైనది దేశి అని అర్థము. బ్రహ్మ ఉద్దేశించినది, భరతుడు ఉపదేశించినది ఉన్నతము. దేశదేశములందు ప్రజారంజకమగునది ప్రచురము. అంతేకాదు. బ్రహ్మ ఉద్దేశించిన, భరతుడు ఉపదేశించిన, ఉన్నతమైన మార్గసంగీతమునకు సంబంధించిన భాష దేవభాష. దేశదేశములందు ప్రజారంజకము, ప్రచురమునగు దేశసంగీతమునకు సంబంధించిన భాష దేశభాష. కనుక మార్గకవిత అనగా సంస్కృతభాషాకవిత్వము, దేశికవిత అనగా దేశభాషాకవిత్వము కాఁగలదు. అంతేకాదు. సంస్కృతభాషా కవిత్వము కంటె ప్రఖ్యాతమైనది దేశభాషాకవిత్వము. సంస్కృతభాషాకవిత్వము శాస్త్రీయము. దేశభాషాకవిత్వము దేశీయము.

కోరాడ రామకృష్ణయ్యగారి అభిప్రాయమిది[11].

"ఈ రెండును దేశభాషలోఁ జేయఁబడిన రచనను లక్ష్యముగాఁ జేసికొని చెప్పినవని తలంపవలసినదేగాని సంస్కృతభాషావిరచిత కవితావిషయమున కిందుఁ బ్రసక్తి యేమున్నది ........

ఈ విషయమును దెనుఁగుభాషలో నెత్తుకొనినవాఁడు శాసన రచయితయగు నృపధూర్జటిపండడు మఱియొక్కఁడె యింతవఱకుఁ గానవచ్చుచున్నాఁడు. అతఁడు దేశిమార్గములు మట్టువడఁ జెప్పవలయు ననుటలోఁగూడ సంస్కృతకవితాస్వరూపము స్ఫురింపదు. వీరీవిష యమున కన్నడకవుల ననుకరించిరనుటకు సందేహము లేదు. "దేసి యొళ్ పుగువుదు పొక్కు మార్గదొళె తళ్వదు" అని పంపకవియు, "నెగల్దురసం మనంగొళిసె, మార్గమొడంబాడె, దేశికబ్బమంబగె గొళెలింత పేల్దుదు" అని రన్నకవియు చెప్పినపుడు కన్నడభాషా రచనలో దేశిమార్గపద్ధతులు రెండును అనుసరింపఁబడి కావ్యమునకు సొబగు కూర్పవలయు నను భావ మే వ్యక్తమగుచున్నదిగాని, సంస్కృత కవిత్వమును గూర్చి వారు చెప్పుటలేదు. కాని సంస్కృత సాహి త్యమునందతి దోషగుణాలంకారరీత్యాదిలక్షణముల నిందుపాటింప వలసిన పద్ధతిని గూర్చి మాత్ర మే వారు తెల్పుచుండిరని గ్రహింప వలయును. ఇట్లు మార్గకవిత సంస్కృతసాహిత్యలక్షణానుసారముగ దేశభాషయందు రచింపఁబడిన రచన యనియు దేశికవిత యనఁగా దేశీయచ్ఛందములో రచింపఁబడినదై దేశీయసాంప్రదాయానుసారియై తత్తద్దేశీయులకు మనోహరంబగు కవిత యనియు నిర్ణయింపవలసి నట్లేర్పడుచున్నది."

ఇందు "నిర్ణయింపవలసి నట్లేర్పడుచున్నది" అను వాక్యవిన్యాసమే అనిశ్చిత స్థితికి నిదర్శనము. అందుకు హేతువు కుమారసంభవము నన్నయ, తిక్కనల నడిమి కాలములోని గ్రంథమను నమ్మకము. దేశికవిత అనగా "దేశీయచ్ఛందములో రచింపఁబడినదై దేశీయసాంప్రదాయానుసారియై తత్తద్దేశీయులకు మనోహరంబగు కవిత" అగునుగాని, మార్గకవిత అనగా "సంస్కృతసాహిత్యలక్షణానుసార ముగ దేశభాషయందు రచింపఁబడిన రచన" కాఁజాలదు. కవులు, ఆలంకారికులు,

లాక్షణికులు మార్గదేశికవితాభేదముల మాట ఎత్తలేదు. కన్నడకవులు మార్గదేశిపదము లను వాడిన మాట వాస్తవము. కన్నడకవిత్వము కుమారసంభవకర్తకు కొంగు బంగారము. పంప, రన్నకవుల ప్రయోగములనుబట్టి "కన్నడభాషారచనలో దేశి మార్గపద్ధతులు రెండును ననునచింపఁబడి కావ్యమునకు సొబగు గూర్పవలయుననుభావమే వ్యక్తమగుచున్న" పక్షమున పంప, రన్నకవుల కావ్యములందు మార్గదేశి పద్ధతులు రెండును కలవనియే కదా అర్థము. అప్పుడు "సంస్కృతసాహిత్యలక్షణానుసారముగ దేశభాషయందు రచింపఁబడిన రచన" మార్గపద్ధతి అగును. మార్గ కవిత కాదు. మార్గపద్ధతి, మార్గకవిత అను మాటలకు అంతరము కలదు. మార్గ కవిత అనగా సంస్కృతకవిత్వమని అర్థము కానిచో, మార్గపద్ధతి అను మాటకే అవకాశము లేదు. కనుక మార్గకవిత అనగా సంస్కృతభాషాకవిత్వమే. దేశికవిత అనగా సంస్కృతభాషాకవిత్వము కంటె పృథగ్భూతమైన దేశభాషాకవిత్వమే. నృపధూర్జటి భీమయపండని చేబ్రోలు శాసనములోని పద్యమిది[12]: ఇప్పటి లేఖనపద్ధతిని.

"తలఁపు సదర్థభావమునఁ దద్గతసూక్తులఁ గూడ వర్ణనల్
గొలుసుగొనంగఁ బ్రావడులు గోరిన భంగిక వచ్చి ముట్టఁ గో
మలగతి దేశిమార్గములు మట్టుపడన్ ఘటనంబు లొప్ప నా
ద్యుల క్రియఁ జెప్ప నేర్చె నృపధూర్జటి భీమయపండఁ డిమ్మహిన్." 8.

ఇందు "దేశిమార్గములు" అని మాత్రమే కలదు. దేశికవిత, మార్గకవిత అని లేదు. అంతేకాదు. నృపధూర్జటి భీమయపండడు "దేశిమార్గములు మట్టుపడన్ ఘటనంబు లొప్ప నాద్యుల క్రియఁ జెప్ప నేర్చె"ననియును కలదు. ఆద్యు లెవరు? శాసనకాలము 1145వ సంవత్సరము[13]. కనుక ఆద్యులు నన్నయాదులు కాకతప్పదు. నన్నయగారి భారతమునందు వలె, భీమయపండని శాసనమునందు శార్దూలము, స్రగ్ధర, ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము కలవు[14]. అవి దేశీయచ్ఛందములు కావు. సంస్కృతచ్ఛందములు. ఆంధ్రభాషలోని సంస్కృతచ్ఛందోగానము సంస్కృత పద్ధతి. అనగా మార్గపద్ధతి. అందు అక్షరమైత్రియతిప్రాసలు కలవు. అవి సంస్కృత చ్ఛందోలక్షణములు కావు. దేశీయచ్ఛందోలక్షణములు. సంస్కృతచ్ఛందోగానము లోని దేశీయచ్ఛందోలక్షణము దేశీయపద్ధతి. అనగా దేశిపద్ధతి, ఇట్లు భీమయపండని శాసనమునందు దేశిమార్గములు మట్టుపడినవి. దేశిమార్గములు మట్టుపడిన రచన

కేవలము దేశికవిత కాదు. ఏకముగ మార్గకవిత కాదు. దేశిమార్గోభయకవిత అగును. భీమయపండని చేబ్రోలు శాసనము దేశిమార్గోభయకవిత. కనుక మార్గకవిత అనగా సంస్కృతభాషాకవిత్వము. దేశికవిత అనగా సంస్కృతభాషాకవిత్వము కంటె పృథగ్భూతమైన దేశీకవిత్వము. అనగా దేశీయకవిత్వము.

తెలుగు కవిత్వము ద్వివిధము. ఒకటి దేశీయము. మఱొకటి సంస్కృతీయము. దేశీయమైన కవిత దేశికవిత. సంస్కృతీయమైన కవిత దేశిమార్గోభయకవిత. రెండును ఆంధ్రభాషాకవిత్వములే. కనుక దేశికవిత అనగా ఆంధ్రభాషాకవిత్వమని కవిగారి అర్థము కావచ్చును. అందు దేశీయమైన దేశికవిత ఉద్దిష్టమో, సంస్కృతీయమైన దేశిమార్గోభయకవిత ఉద్దిష్టమో అస్పష్టము.

మఱి సత్యాశ్రయ, చాళుక్యరాజుల చరిత్ర—

ఆంధ్రావనిలో వేంగిదేశమును ఏడవశతాబ్ది నుండి పదమూడవశతాబ్దివఱకు పరిపాలించిన రాజులు చాళుక్యులు. చాళుక్యరాజులలో చరిత్రప్రసిద్ధుడు రాజరాజ నరేంద్రుడు. రాజరాజనరేంద్రుని గుఱించి నన్నయగారి భారతమున అనేకవిశేషములు కలవు. అందు ఒక విశేషమిది :

> "సత్యాశ్రయకులశేఖర
> నిత్యోదయ రాజరాజనృప సుకవిజన
> స్తుత్య మహోగుణ విమలా
> దిత్యాగ్రతనూజ విమలధీరమణీయా"   273ప.4ఆ.ఆ.ప.

ఇందు రాజరాజనరేంద్రుడు సత్యాశ్రయకులశేఖరుడని ఇదమిత్థముగ కలదు. సత్యాశ్రయుని వంశమునందు రాజరాజనరేంద్రుడు శేఖరుడని అర్థము. రాజరాజ నరేంద్రుని వంశము చాళుక్యవంశము. కనుక సత్యాశ్రయుడు చాళుక్యవంశమునకు మూలపురుషుడు కావచ్చును. అయిన, సత్యాశ్రయుని కాలము ఏడవశతాబ్ది అగును.

కవిగారి నిర్ణయమున నన్నెచోడునికాలము పదవశతాబ్ది పూర్వార్ధము. కవిగారి అర్థమున మార్గకవిత అనగా సంస్కృతకవిత, దేశికవిత అనగా ఆంధ్రకవిత. కవి గారి పాఠమున సత్యాశ్రయుడు కలడు. సత్యాశ్రయునికాలము ఏడవశతాబ్దిఅగును. అయిన, "మును మార్గకవిత" అను పద్యమునకు, ఏడవశతాబ్దికి పూర్వము భారత దేశమునందు సంస్కృతకవిత ఉండగా, ఏడవశతాబ్ది సత్యాశ్రయుడు మొదలు

చాళుక్యరాజులు ఆంధ్రకవితను ఆదరించి, ఆంధ్రదేశమునందు తెనుగును నిలిపిరని అర్థము వచ్చును. అంధ్రవిషయమన ఆంధ్రదేశము. లోకమన ఆంధ్రదేశేతరమును. అనగా భారతదేశము. భారతదేశమునందు సంస్కృత కవితవెలయుట, ఆంధ్రదేశము నందు తెనుగును నిలుపుట సహజము. అందుకు సత్యాశ్రయుడు మొదలు అందఱు చాళుక్యరాజులును ఆదరించిన ఆంధ్రకవిత, దేశీయమైన దేశికవిత అయినను, సంస్కృతీయమైన దేశిమార్గోభయకవిత అయినను, పదవశతాబ్ది పూర్వార్ధమునందు కుమారసంభవము కుదురుకొనుట సుకరము. కుమారసంభవము దేశిమార్గోభయకవిత. ఏడవశతాబ్ది దేశికవిత పదవశతాబ్దికి దేశిమార్గోభయకవితగ పరిణమించుటయు సుల భము. కవిగారి పాఠములోని సత్యాశ్రయుని కలిమి, కవిగారి నన్నెచోడుని కాలనిర్ణ యమునకు అనుకూలము. పాఠభేదములోని చాళుక్యరాజు సత్యాశ్రయుడు కావలసిన ఆవశ్యకము లేదు. ఏడవశతాబ్ది మొదలు పదమూడవశతాబ్దివఱకు పరిపాలించిన చాళుక్యరాజులలో ఎవరైనను కావచ్చును. కాని, ఆ చాళుక్యరాజు పదవశతాబ్దికి పూర్వుడు కాక, అనంతరుడైనచో, కవిగారి నన్నెచోడుని కాలమునకు భంగము కలు గును. అంతేకాదు. ''ముసు మార్గకవిత'' అను పద్యమునకును అర్థభంగము కలుగును.

పేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయమిది[15]:

> "ఇఁకఁ జాళుక్యరాజు మొదలుగ" నన్నప్పుడు రాజరాజనరేం
> ద్రుఁడే యేల కారాదు?"

ఇందు "చాళుక్యరాజు మొదలుగఁ బలుపుర్" అను పాఠభేదములోని చాళుక్య రాజు రాజరాజనరేంద్రుడు కావచ్చునను సూచనము కలదు. కాని, ఆ చాళుక్యరాజు రాజరాజనరేంద్రుడే అయిన, రాజరాజనరేంద్రుడు పుట్టించిన దేశికవిత నన్నయగారి భారతమే అగును. అయిన నన్నయ్యగారి భారతము దేశికవిత అగును. కాని, నన్నయగారి భారతము దేశికవిత కాదు. దేశిమార్గోభయకవిత. అదే దేశికవిత అని నచో, అంతకు పూర్వము దేశికవిత లేదని అర్థము వచ్చును. కాని నన్నయకు పూర్వము దేశికవిత కలదు. అంతేకాదు. దేశిమార్గోభయకవితయును కలదు. ఎనిమిదవశతాబ్ది గుణకవిజయాదిత్యుని అద్దంకిశాసనమునందు తరువోజ పద్యము[16], కందుకూరి శాసనమునందు సీసపద్యము[17]; చాళుక్యభీమరాజు ధర్మవరపు శాసనమునందు సీసపద్యము[18]; తొమ్మిదవశతాబ్ది యుద్ధమల్లుని బెజవాడశాసనమునందు

మధ్యాక్కరపద్యము[19] కలవు. తరువోజ, సీసము, మధ్యాక్కఱ సంస్కృతచ్ఛంద స్సుల కంటె భిన్నమైన దేశీయచ్ఛందస్సులు. దేశీయచ్ఛందోగానము దేశికవిత. మఱి విరియాలమల్లని గూడూరుదానుబంధశాసనమునందు ఉత్పలమాల, చంపకమాల పద్యములు కలవు[20]. ఇవి దేశీయచ్ఛందస్సుల కంటె భిన్నమైన సంస్కృతచ్ఛందస్సులు. ఇందు అక్షరమైత్రియతిప్రాసలు కలవు. అవి దేశీయచ్ఛందోలక్షణములు. ఆంధ్రభాషలోని సంస్కృతచ్ఛందోగానము మార్గపద్ధతి. సంస్కృతచ్ఛందోగానములోని దేశీయచ్ఛందోలక్షణము దేశిపద్ధతి. కనుక దేశిమార్గోభయకవిత. శాసనకాలము 1124వ సంవత్సరమైనను పద్యముల రచనాకాలములు 1005-1045 సంవత్సరములు[21]. రాజరాజనరేంద్రుని కాలము 1022-1063సంవత్సరముల మధ్యకాలము[22]. రాజరాజనరేంద్రునికి పూర్వము దేశికవిత, దేశిమార్గోభయకవిత శాసనములందు కలదు. అనగా దేశమునందు కలదని అవగాహనమగును. దేశికవిత, దేశిమార్గోభయకవిత దేశమునందు దేదీప్యమానముగా ఉండగా దేశికవితను రాజరాజనరేంద్రుడు పుట్టించవలసిన అవశ్యకము లేదు. కనుక పాఠభేదములోని చాళుక్యరాజు రాజరాజనరేంద్రుడు కారాదు. గుణకవిజయాదిత్యుడు కావచ్చును. అయిన "మునుమార్గకవిత" అను పద్యమునకు అర్థభంగము కలుగదు. అంతేకాదు. కవిగారి నన్నెచోడుని కాలమునకును భంగము కలుగదు.

గుణకవిజయాదిత్యుని అద్దంకిశాసనము ప్రథమతః 1905వ సంవత్సరమునందు ప్రకటితము[23]. అది కవిగారికి అందనిఫలము కాదు. 1909వ సంవత్సరమునందు సత్యాశ్రయుని పాఠమును సాధించిన కవిగారు 1912వ సంవత్సరమునందు సత్యాశ్రయుని బాధించిన పాఠభేదమును బోధించినవారు, ప్రత్యంతరమును శోధించినవారు ఏల కావలసివచ్చెను?— "చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అను పాఠభేదము తోపాటు, "సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్" అను పాఠమును కవిగారి నన్నెచోడుని కాలనిర్ణయమునకు సాధకము, కాని,

చిలుకూరి వీరభద్రరావుగారి నన్నెచోడుని కాలనిర్ణయమిది[24]:

> "బేటవిజయాదిత్యుఁడు తన తండ్రియైన అమ్మరాజవిష్ణువర్ధనునకు వెనుక క్రీ.శ.925దవ సంవత్సరమున రాజ్యభారము వహించియు, యుద్ధమల్లుని కొడుకయిన తాళరాజుచేఁ బదభ్రష్టుఁడయ్యెను. ఇతని కొడుకు సత్యాశ్రయుఁడు. ఇతఁడు చక్రవర్తిపదముఁ బడయక

పోయినను, మహామండలేశ్వరుఁడుగ నుండి వేంగీదేశములోఁ గొంత భాగమును బరిపాలించుచుండెను. 925-40 సంవత్సరముల ప్రాంత మున నున్న యీ సత్యాశ్రయుని నన్నెచోడమహాకవి తన కుమార సంభవకావ్యమున నీ క్రిందిపద్యములోఁ బేర్కొనియున్నాఁడు. "క. మును మార్గకవిత—" దీనింబట్టి నన్నయభట్టారకునకు నూఱేండ్లకుఁ బూర్వమే యాంధ్రకవితానది పర్ధిల్లుచున్నదని స్పష్టమగుచున్నది. ఈ పై పద్యమునందుఁ జెప్పఁబడిన సత్యాశ్రయునకుఁ దరువాతనే నన్నెచోడుఁ డున్నవాఁడని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును."

ఇది చరిత్ర. ఇందు సత్యాశ్రయుడు చేతవిజయాదిత్యుని కొడుకని కలదు. చేతవిజయాదిత్యుడు అమ్మరాజవిష్ణువర్ధనుని కొడుకు. అనగా సత్యాశ్రయుడు చాళుక్య వంశమూలపురుషుడు కాడని అవగాహనమగును. సత్యాశ్రయుడు చక్రవర్తి కాక పోయినను మహామండలేశ్వరుడు. వేంగిదేశమును కొంతభాగమును పరిపాలించినను పూర్తిభాగమును పోగొట్టుకొన్న తండ్రి కంటె ఘనుడు. అనగా చాళుక్యవంశముఖ్య పురుషుడని అవగాహనమగును. కనుక రాజరాజనరేంద్రుడు సత్యాశ్రయకులశేఖరు డను నన్నయ వర్ణనము ఎట్లును సానుకూలము. అంతేకాదు. ఇందు సత్యాశ్ర యుని కాలము 925-940 సంవత్సరముల ప్రాంతమని ఇదమిత్థముగ కలదు. కనుక సత్యాశ్రయునిపేర్కొన్న నన్నెచోడుడు 940వ సంవత్సరము కంటె తర్వాతివాడగుట తథ్యము. కాని 940లోనే నన్నెచోడుడు రణరంగమున నిహతుడయ్యెనని కవిగారి నిర్ణయము! అంతేకాదు. ఆ నన్నెచోడుని తండ్రి అనిన చోడబల్లి శాసనకాలము 902వ సంవత్సరము. ఉపరి, మల్లికార్జునమహామునిని అత్యధికముగా సంభావించిన విక్రమకేసరి కాలము పదవశతాబ్ది పూర్వార్ధము. ఈ త్రిపుటి 940వ సంవత్సరమునకు పూర్వమే కాని, తర్వాత సంపుటి కాదు. కనుక "సత్యాశ్రయుని తొట్టి చాళుక్య నృపుల్" అను కవిగారి పాఠము, చిలుకూరి వీరభద్రరావుగారి నన్నెచోడుని కాల నిర్ణయము వలన, కవిగారి నన్నెచోడుని కాలనిర్ణయమునకు బాధకము.

కవిగారి నన్నెచోడుని కాలనిర్ణయము 20-12-1908వ తేదీని లిఖితము[25]. 1909వ సంవత్సరమునందు ప్రకటితము. చిలుకూరి వీరభద్రరావుగారి నన్నెచోడుని కాలనిర్ణయము 30-5-1912వ తేదీని లిఖితము.[26]. 1912వ సంవత్సరమునందు ప్రక టితము. సత్యాశ్రయుడను పేరు కల చాళుక్యరాజునకు స్వస్తివాచకము పలికి, సత్యాశ్రయుడను పేరులేని చాళుక్యరాజునకు స్వాగతముపలికిన పాఠభేదము ప్రథమతః

1912వ సంవత్సరమునందు ప్రకటితము. లిఖితమైన తేడీలేదు.[27] తదుపరి 1914వ సంవత్సరమునందు ప్రకటితము. చిలుకూరి వీరభద్రరావుగారి నన్నెచోడుని కాల నిర్ణయమును బట్టి, కవిగారి నన్నెచోడుని కాలనిర్ణయమునకు, సత్యాశ్రయుడని పేరు గల చాళుక్యరాజు వలన 1912వ సంవత్సరమునందు ప్రతిబంధకము సంభవించినది. 1912వ సంవత్సరమునందే సత్యాశ్రయుడను పేరులేని చాళుక్య రాజువలన పరిహారము తటస్థించినది. "సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్" అను పాఠమునందు కవిత్వలోపము లేదు. చరిత్రలోపము కలదు. కనుక పాఠ భేదము కవిత్వార్థము కాదు. మఱి? చరిత్రార్థము! అది కవిగారి నన్నెచోడుని కాల నిర్ణయమునకు మాత్రమే చరితార్థము. పాఠకునకు రాని, లేఖకునకు లేని, పేరు కల చాళుక్యరాజునకు స్వస్తివాచకము పలికి, పేరులేని చాళుక్యరాజునకు స్వాగతవాక్యము పలుకవలసిన ఆవశ్యకము మానవల్లి రామకృష్ణకవిగారికి మాత్రమే కలదు. అనగా "చాళుక్యరాజు మొదలుగ బలువుర్" అను పాఠభేదము కవిగారి కల్పనమని అవగాహనమగును. ఇట్లు పాఠభేదముతోపాటు, కవిగారు కల్పించిన అర్థభేదమునుకలదు[28].

> "ఈ పద్యమున మార్గ, దేశిపదములకు నా యభిప్రాయమున, ప్రాచీన, నవీనరీతులను నర్థములు గలవు. ఈ యర్థమున సంస్కృత, కర్ణాటభాషలలో నీ పదములకు బహుప్రయోగములు లభించుచున్నవి. పూర్వము మార్గకవిత లోకమున వెలసె ననగా ద్రవిడకర్ణాటములఁ బ్రాచీనరీతులగు రగడ ద్విపదాదులే యాంధ్రభాషలోను వెలసెనని యూహించెదను. ద్రవిడమున మణిమేఖల రగడలతో నిండినది. జీవకచింతామణిలో వృత్తములఁ బ్రోచినటో నింద్రాదిగణములు గల పద్యము లగపడును. కర్ణాటకమున బహుప్రాచీనకృతియగు కవిరాజ మార్గములను అక్కఱలు గీతులు విస్తారముగా లభించును. ద్రవిడ కర్ణాటాంధ్రభాషలలో మార్గరీతి యింద్రచంద్రాది గణబద్ధ పద్యమయ మైనది.... నన్నయకుఁ బూర్వపు శిలాశాసనము లక్కఱ తరుచోజాది మార్గపద్యములచే నిండినవి. చూడుఁడు. యుద్ధమల్ల పాండురంగాది శాసనములు. పూర్వమిట్టి క్షుద్రకావ్యములకుఁ జాల ప్రసిద్ధి గలిగి యుండెను."

ఇందు 1909వ సంవత్సరమునాటి మార్గకవిత=సంస్కృతకవిత అను అర్థము పోయి, మార్గకవిత=ప్రాచీనకవిత అను మఱొక అర్థము వచ్చినది.

దేశకవిత=భాషాకవిత్వము, ద్రవిడాంధ్రకర్ణాటాది కవిత" అను 1909వ సంవత్సరము నాటి అర్ధమును పోయి దేశికవిత=నవీనకవిత అను వేఱొక అర్థము వచ్చినది. అంతేకాదు, తమిళ కర్ణాటములలోవిరగడ, ద్విపదాదులు; తెలుగులోని అక్కఱ తరువోజాదులు మార్గకవిత, మార్గపద్యములు అని తలక్రిందులుగ మాఱిపోయినది! కారణము?-"చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అనుపాఠములోని చాళుక్యరాజు రాజరాజనరేంద్రుడే అనిన, మార్గకవిత అనగా సంస్కృతకవిత అని అర్థముచెప్పిన, నన్నెచోడుడు నన్నయకు తర్వాతివాడును కావచ్చును. ప్రాచీనకవిత అనగా అక్కఱ తరువోజాదిపద్యములు అని అర్థము చెప్పిన, నన్నెచోడుడు నన్నయకు తర్వాతివాడు కావలసిన ఆవశ్యకము రాదు. నన్నయకు పూర్వుడుకాఁగలడు. అది కవిగారి ప్రధాన ప్రయోజనము. కనుక పాఠభేదముతోపాటు అర్థభేదమునుతమ నన్నెచోడుని కాల నిర్ణయమునకు అనుగుణముగ కవిగారిచేత మాత్రమే కల్పితము.

కవిగారి నన్నెచోడుని కాలనిర్ణయము అనగా నన్నయకు పూర్వము "నన్నెచోడుని కుమారసంభవము"ను ప్రతిష్ఠించుట. అందుకు 1914వ సంవత్సరమునందు కవిగారు సంతరించిన అన్యసాధనములును కలవు. అవి కూడ పరిశీలనార్హములు.

1. "అన్యతారకవితతుల నాదరించి
వెలయ సత్కవిబుధగురుబలము వడసి
యొనర దైవజ్ఞు నట్ల శుభోదయమున
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాఁగ" 34ప.1ఆ.

ఇది ప్రథమభాగములోని పద్యము. ఇట అథస్సూచికనుగాని, అనుబంధము నందుగాని 1909వ సంవత్సరమునందు ఏ విశేషమును లేదు. 1914వ సంవత్సరము నందు మాత్రము ఈ విశేషము కలదు.[29]

"అన్యతారక అనఁగా శుభేతరగ్రహములు వితతులనుటకు వికృతులనియుంట యొప్పు. "అశుభగ్రహముల ననాదరించి" యని యర్థము. అర్థాంతరమున, అన్యుఁడగు తారుఁడను కవియొక్క కృతు లనని యర్థము ద్యోతకము, ఇట్లే తారకవి నామము 518వ పద్యమున మఱల శ్లేషార్థమున వచ్చుచున్నది. వీఁడెవ్వఁడో యెఱుఁగరాదు."

దీనిపై శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి విమర్శమిది:[30]

"ఇందు 'వితతులు' అనుదానికి 'వికృతులు' అను మార్పు కావించుట యొక విశేషము. తారకశబ్దము నక్షత్రపర్యాయముగా ప్రసిద్ధము కాని గ్రహపర్యాయముగా ప్రసిద్ధము గాదు. 'అర్థాంతర మునఅన్యుఁడగు తారుఁడను కవియొక్క కృతులనని యర్థము ద్యోతకము' అనిరి. ఆ యర్థము దేనికి ద్యోతకము? పదములు తెగఁగొట్టి అర్థాంతరము చెప్పుచున్నప్పుడు ద్యోతకమేమి? ఇవి పొసఁగుట లేదు....ఇందుఁ గవికిని దైవజ్ఞునకును సమానధర్మములతో దివ్య సుకృతి ప్రతిష్ఠాపనము చెప్పఁబడినది. దైవజ్ఞుఁడు దివ్యమగు శుభ కార్యమును స్థిరపఱచును. కవి దివ్యమగు కావ్యమును స్థిరముగా నుండునట్లు రచించును. (దైవజ్ఞపక్షమున) అన్య + తారక + వితతులన్=ఇతరనక్షత్రసముదాయములను, ఆదరించి=గౌరవించి, అనగా నక్షత్రబలము చూచికొని అని భావము. సత్ + కవి + బుధ + గురు బలము వడసి=శుభగ్రహములయిన శుక్ర, బుధ, బృహస్పతుల బల మును బొంది, దివ్యసుకృతిఁ బ్రతిష్ఠించును. (కావ్యపక్షమున) అన్య + తార + కవి + తతులను=ఇతరులను తరింపఁజేయు కవుల సముదాయములను, (దీని చేత శైవకవులు సూచితులయిరనియు నన వచ్చును.) ఆదరించి = సన్మానించి, సత్కవి + బుధ + గురుబలము వడసి = సత్కవియుఁబండితుఁడు నగు గురుని బలమును బొంది, దివ్యమగు కావ్యము రచింతునని భావము. ఈపక్షమున 'తారకవి' సంబంధము లేనేలేదు."

ఇది సమంజసము. "వితతులనుటకు వికృతు లని యుంట యొప్పు." అను సవరణ అనావశ్యకము. "వితతుల నాదరించి" అనునెడ, "వితతులు + అనాదరించి" అని ద్వితీయకు ప్రథమను అతిదేశించుట కంటె, "వితతులన్ + ఆదరించి" అని ద్వితీయను ఉపదేశించుటయే సరళము. జ్యోతిష్కునికి గ్రహబలముతోపాటు తారా బలమును సాపేక్ష్యము. శుభోదయము శుభముహూర్త విషయము. శుభముహూర్త మును నిర్ణయించుటకు జన్మనక్షత్రములేక నామనక్షత్రము మొదలు తత్కాలనక్షత్రము వఱకు ఇతర నక్షత్రములను లెక్కించుట, బుధగురుశుక్రబలమును పడయుట సహజము విశేషణమైన తారశబ్దమునకు మంచి, గొప్ప మొదలైన అర్థములును కలవు[31]. ఒక

శుభముహూర్తమున ఒకానొక మహాకావ్యమును రచించు కవి, అన్య = ఇతర, తార కవి = సుకవి, తతులన్ = సమూహములను ఆదరించుట అనగా పూర్వసుకవిస్తుతి చేయుట, వర్తమానకవిపండితగురుబలమును పడయుట కూడ సహజము. "వెలయ" అను చోట "వెలయు" అని తాళపత్రగ్రంథమునందు కలదు. ఇట్లు అర్థద్వయము చెప్పిన పద్యమునకు అన్వయము సుగమము. కాని "తారుఁ డను కవి'' ప్రత్యక్షము కాఁడు. అయినను తారకవి నామము మఱల శ్లేషార్థమున వచ్చుచున్నదన్న పద్యమిది:

2, "తారకవిరచితకృతియుం
దారకవిరచితసుకృతియుఁ దానడఁగు సదా
చారకవిబుధాలికి సువి
చారకవిబుధాధినాథు షణ్ముఖుఁగనిసన్." 518ప. 10ఆ.

ఇది ద్వితీయభాగములోని పద్యము. ఇట లఘుటీకను 1914వ సంవత్సరము నందు ఇట్లు కలదు[32].

"తార, కవి, రచిత. ఇందుఁ గవి యనఁగా శుక్రుఁడని గ్రహిం చినను శబ్దశ్లేష పనుపడదు. నన్నెచోడునికాలమున ప్రఖ్యాతులగు తార కవియుం షణ్ముఖకవియు నుండిరని తోచుచున్నది."

దీనిపై శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి అభిప్రాయమిది:[33]

"తారక = నక్షత్రములచేత, విరచిత = చేయఁబడిన, కృతి = పని (అనగాఁ బ్రకాశించుట)యు, తారక =తారకాసురునిచే, విరచిత=చేయఁ బడిన (అనఁగా సంపాదింపఁబడిన) సుకృతి=సుకృతము, తపస్సుచే బ్రహ్మను సంతోషపెట్టి సంపాదించిన పుణ్యము, లేక పుణ్యఫలమగు శక్తి (క్రమముగా), సువిచారక = మంచి ధర్మరక్షణ విచారము గల, విబుధాధినాథున్ = సురోత్తముని అనగా సూర్యుని, "సురోత్తమో దిన మణిః పద్మినీవల్లభో హరిః" అని యమరశేషము, లేక కవిశబ్దము సూర్యపర్యాయముగాఁ గొన్ని నిఘంటువులలోఁ గలదు గాన, సువిచార కవిన్ = ధర్మరక్షణాలోచనగల సూర్యుని అని చెప్పవచ్చును. అప్పుడు బుధాధినాథున్ అనునది విశేషణముగా నన్వయింపవచ్చును. షణ్ము ఖున్ = కుమారస్వామిని, కనినన్—చూడఁగా-చూచినంతనే అభిభావము

సదాహారక + విబుధాళికి = సదాచారము గల పండితాళికిని (తారకా సురపక్షమున) మంచిప్రవ ర్తనగల దేవతలసమూహమునకును, అడఁగున్—అదృశ్యమగును-అనగా నక్షత్రకాంతి సూర్యుని జూచినంతను, తారకాసురుని పుణ్యఫలము కుమారస్వామిని జూచినంతను అంతరించునని భావము. ఇది కవి యుద్దేశము అని తోఁచెడిని. ఈ యర్థమున తారకవికి సంబంధము లేదు."

ఇందు విబుధాధినాథుడు—సురోత్తముడు—సూర్యుడు అను ఫలితార్థము బలవదాకృష్టము. విబుధాధినాథుడు అనగా దేవతలకు అధిపతి అనియేగాని, దేవతలలో శ్రేష్ఠుడు అను అర్థమురాదు. అంతేకాదు. సుకృతి అనగా పుణ్యము లేక పుణ్యఫలమగు శక్తి అను ఫలితార్థమును బలవదాకృష్టమే. తారకాసురుడు బ్రహ్మను సంతోషపెట్టి సంపాదించినది వరముకాని పుణ్యము కాదు. ఉపరి, "సదాచారకవిబుధాళికి సువిచారక విబుధాధినాథు(డైన) షణ్ముఖుని గనిన, తారకవిరచితకృతియును, తారకవిరచితసుకృతియును తానడగును" అని పద్యమునకు అన్వయము.

సదాచారక + విబుధాళికి = సదాచారకులైన దేవతలసమూహమునకు, సువిచారక + విబుధాధినాథు(డైన) = సువిచారకులైన దేవతలకు అధిపతి అయినటువంటి షణ్ముఖున్ = కుమారస్వామిని చూచిన, తారక + విరచిత + కృతియున్ = తారకాసురుడు చేసిన పని(హాని)అయినను అణగిపోవునని ఒక అర్థము. సదాచార + కవి + బుధాళికి = సదాచారులైన కవిపండితులసమూహమునకు, సువిచార + కవి + బుధాధినాథు(డైన) = సువిచారులైన కవిపండితులకు అధిపతి అయినటువంటి షణ్ముఖున్ = కుమారస్వామిని చూచిన, తారకవి = సుకవి, రచిత = రచించిన, సుకృతియు = సత్కావ్యమైనను అణగిపోవునని మరొక అర్థము. రెండు అర్థములందును షణ్ముఖుడు కుమారస్వామియే. కుమారస్వామి కవిపండితులకును అధిపతియే. కుమారస్వామికృత వ్యాకరణము కథాసరిత్సాగరశాతవాహనకథాప్రసిద్ధము. అగి పండితులకు అధిపతి అనుటకు చాలు. "పుట్టంబుట్టశరంబునన్ మొలవ నంభోయాన పాత్రంబునన్ నెట్టన్ గల్గను గాళిఁ గొల్వను బురాణింపం దొరంకొంటి" అని పోతన భాగవతమునందు కలదు. (7ప. 1స్క-ం.) వాల్మీకి వ్యాసకాళిదాసులతోపాటు కుమారస్వామి కవి. ఇది కవులకు అధిపతి అనుటకు వీలు. అట్టి కుమారస్వామిని చూచిన అనగా కుమారస్వామి కృతిని చూచిన, సుకవి రచించిన సత్కావ్యమైనను

అణగిపోవును. తారకాసురుని బలముకంటె కుమారస్వామి బలము, సుకవి సత్కావ్యముకంటె కుమారస్వామి కావ్యము అధికమని సారాంశము. ఇట్లు అర్థద్వయము చెప్పిన పద్యమునకు తాత్పర్యము సులభము. కాని "తారకవి, షణ్ముఖకవి" ప్రత్యక్షము కారు.

3. "శ్రీరామేశకవీశ్వరాదు లెడ్డ★ నీ శ్రీపాదముల్ భక్తితో
నారాధించి సమస్తలోకసముదాయాధీశులై రన్న సం
సారుల్ దుఃఖనివారణార్థమభవున్ సర్వేశు లోకత్రయా
ధారున్ నిన్ మదిఁ గొల్వకున్కి యబసే దారిద్ర్యవిద్రావణా."

455 ప. 10 ఆ.

(★ ఇందు 'డ' కారమును దేలఁబలుకవలయును.)

ఇది కూడ ద్వితీయభాగములోని పద్యము. ఇట లఘుటీకను 1914వ సంవత్సరము నందు ఇట్లు కలదు. [34]

"రామేశకవియను నతఁడు నన్నెచోడుని కాలమునకుఁ బ్రఖ్యాతుఁడై యుండునని ధ్వనితము ........ ఈ పద్యదశకము కవి బాల్యముననో యెప్పుడో తెనిఁగించియుండి తరువాత దీనిలో నెక్కించుకొన్నట్లు తోచుచున్నది."

దీనిపై శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారి అభిప్రాయమిది[35].

తంజావూరి ప్రతిలో "శ్రీరామేశగవీశ్వరాదులెడ్డ" అని యున్నది. శ్రీరామేశ = విష్ణువు, గవీశ్వర = బ్రహ్మ అని యర్థము. ఈ కవి యితరస్థలములందుఁగూడ గవేశశబ్ద ముపయోగించుట గలదు. కావున ఇట (గవేశ్వర) అని కవ్యుద్దిష్టమేమో ! రెండును సాధువులే కదా. బ్రహ్మ విష్ణువులు మొదలగు వారందఱు ఈశ్వరానుగ్రహముననే సమస్తలోకాధీశులయినట్లు కవి వర్ణించినాఁడు. అందు కవీశ్వరశబ్దమే లేదు. 'గవీశ్వర' అనియే యుండుటచేత రామేశ్వరుఁడను నాంధ్రకవి నన్నిచోడునకు సమకాలమువాఁడున్నాఁడనుట భ్రాంతిజనితము. సంపాదకుల ప్రతిలో 'కవీశ' అని యున్నదేమో ! ఉన్నను అది బ్రహ్మ పర్యాయమే కావచ్చును. ఇందు ఎడ, అనుటకు 'ఎడ్డ' అని

యున్నది. సంపాదకుల పాఠమున 'ఎడ్డ' అనియే కలదు. వారు, ఇందు 'డ' కారమును దేలపలుకవలయును అని యథోజ్జ్వాపికలో వ్రాసిరి. 'ఎడ్డ' అను చోట నంత యక్షర సామ్యము గల ప్రతిలో నేక పజ్క్తిలోనే 'గవీశ' అన్నది 'కవీశ' అని మాఱుట యొక విశేషమే కదా."

కుమారసంభవము ద్వితీయభాగము ప్రకటింపఁబడుటకు ముందు తంజావూరు గ్రంథాలయమునందున్న తాళపత్రగ్రంథమునందు "శ్రీరామేగవీశ్వరాదులు" అను పాఠము కలదు. ద్వితీయభాగమును ప్రకటించునెడ "శ్రీరామేశకవీశ్వరాదులు" అను పాఠము అవతరించినది. అది కేవలము "రామేశకవి యను నతఁడు నన్నెచోడుని కాలమునకుఁ బ్రఖ్యాతుఁడై యుండు" ననుటకు మాత్రమే ఉపయోగించును. పద్యమునకు తాత్పర్యమును బోధించుటకు మాత్రము కాదు. బృహస్పతి స్తుతియందు పరమేశ్వరుని శ్రీపాదములు కొలిచి సమస్తలోక సముదాయాధీశ్వరులైరని పద్యమునందు కలదు. వారు కవీశ్వరులా ? కాదు బ్రహ్మ విష్ణువులే. కనుక "శ్రీరామగవీశ్వరాదులు" అను పాఠమే అర్థవంతము. అదటుంచి, ఈ పద్యముతో ప్రారంభమైన దారిద్ర్య విద్రావణ దశకమును "కవి బాల్యముననో యెప్పుడో తెనిగించె"నని కవిగారి ప్రతిపాదనమే కద. అది నిజమేని, దారిద్ర్యవిద్రావణదశకమునందు రామేశకవి కలడేని, అతడు "నన్నెచోడుని కాలమునకు" గాక, తన్మూల గ్రంథకర్త కాలముననే ప్రఖ్యాతుడు కావలెనుకదా ! అయినను రామేశకవి నన్నెచోడుని కాలమునకు ప్రఖ్యాతుడని కవిగారి ప్రతిపాదనము ! మూలపద్యమునందు, అనువాదపద్యమునందు "గవీశ్వర" అను పాఠమే సందర్భోచితము. ఇటీవలి కుమారసంభవముద్రణములందు "శ్రీరామేశ గవీశ్వరాదు" లనియే కలదు. అట్లున్న పద్యమునకు అర్థము సుగమము. కాని "రామేశకవి" ప్రత్యక్షము కాడు.

అయినను, మఱి "అన్యతారకవితతుల, తారకవిరచితకృతియుం దారకవి రచిత సుకృతియు" అను సమాసములందు అంతర్లీనముగ తారకవి, "షణ్ముఖు" అను నామమునందు అంతరంగమున షణ్ముఖకవి, "శ్రీరామేశగవీశ్వరాదు" లను సమాసమునందును అంతర్గర్భితముగ రామేశకవి కలరని అనవచ్చును. అనిన, "సదాచార కవి బుధాళికి, సువిచారకవిబుధాధినాథు" అను సమాసములందు కూడ అంతర్లీనముగ "చారకవి" కలడని కూడ అనవలయును. కాని కవిగారు అనలేదు.

పద్యమునకు ఒక్క కవిని మాత్రమే ప్రత్యేకించిన ముగ్గురు కవుల ముచ్చట తీరును. తార, షణ్ముఖ, రామేశకవులు అపూర్వకవిత్రయము ! కవిగారి నన్నెచోడుని కాలమున ప్రసిద్ధకవిత్రయము !! సంస్కృతకవిత్రయమో, తెలుగుకవిత్రయమో కవిగారు తెలుపలేదుగాని, సంస్కృతకవి కాళిదాసు మేఘసందేశములోని నిచుళ, దిఙ్నాగ కవులు సంస్కృతకవులు వలె, తెలుగుకవి నన్నెచోడుని కుమారసంభవములోని తార, షణ్ముఖ, రామేశకవులు తెలుగు కవులు కావలయును. అంతేకాదు. వారు కవిగారి నన్నిచోడుని కాలమునందు ఉండవలయును. ఆ కాలము పదవశతాబ్ది పూర్వార్థము. పదకొండవశతాబ్ది మొదలు తెలుగుకవుల ఉనికి తెలియుటకు సాధనసంపత్తి సమృద్ధిగ కలదు. కాని తార, షణ్ముఖ, రామేశకవుల జాడ కానరాదు. మఱి పదకొండవశతాబ్దికి పూర్వము తెలుగుకవుల ఉనికి తెలియుటకు సాధనసంపత్తి సకృత్తుగ కలదు. కనుక తార, షణ్ముఖ, రామేశకవులు పదకొండవశతాబ్దికి పూర్వము కలరనుట సావకాశము. పదకొండవశతాబ్దికి తర్వాత కలరనుట నిరవకాశము. కనుక తార, షణ్ముఖ, రామేశకవుల కాలము పదకొండవశతాబ్దికి పూర్వమగును. అయిన వారి సమకాలికుడైన నన్నెచోడుని కాలమును అదే అగును. అనగా నన్నెచోడుని కాలము నన్నయకు పూర్వము. అది కవిగారినన్నెచోడుని కాలనిర్ణయము. ఇది తదనుగుణము. అంతేకాదు. 1914వ సంవత్సరమునందలి తార, షణ్ముఖ, రామేశకవుల ప్రతిష్ఠాపనము, 1912వ సంవత్సరమునందలి "చాళుక్యరాజు మొదలుగఁ బలుపుర్" అను పాఠభేదకల్పనమునకు; "మార్గకవిత = ప్రాచీనకవిత, దేశికవిత = నవీనకవిత" అను అర్థభేదకల్పనమునకు అనుగుణము.

ఇంతకు కవిగారు 1909వ సంవత్సరమునందు ప్రకటించిన "సత్యాశ్రయు తొట్టి చాళుక్యనృపుల్"అను పాఠమునకు, కవిగారే 1912వ సంవత్సరమునందు ప్రబోధించిన "చాళుక్యరాజు మొదలుగఁ బలుపుర్" అను పాఠాంతరము, 1914వ సంవత్సరమునకు ముందు పలువురికి తెలిసిన, తంజావూరి సరస్వతీమహాలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథమునందు కలదు. ఆ తాళపత్రగ్రంథమునకు కవిగారు ప్రకటించిన కుమారసంభవముద్రితగ్రంథమునకు అవినాభావ సంబంధము కలదు. తంజావూరి ప్రతికి కవిగారి అచ్చుప్రతి అనుసరణమైనచో, అందు "చాళుక్యరాజు మొదలుగఁ బలుపుర్" అనుచోట, "సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్" అని కవిగారి అచ్చుప్రతియందు అమరవలసిన ఆవశ్యకము లేదు. అనగా కవిగారు కల్పించవలసిన ఆవశ్యకము లేదు. కవిగారి అచ్చుప్రతికి తంజావూరి ప్రతి అనుసరణమైనచో, "సత్యాశ్ర

యుని తొట్టి చాళుక్యనృపుల్" అనుచోట "చాళుక్యరాజా మొదలుగ బలుపుర్" అని తంజావూరిప్రతియందు తలదాచుకొనవలసిన అవశ్యకము కలదు. అనగా కవిగారు కల్పించవలసిన ఆవశ్యకము కలదు. అది కూడ- 1912వ సంవత్సరమునందు చిలుకూరి వీరభద్రరావుగారు నిర్ణయించిన సత్యాశ్రయుని కాలము, 1909వ సంవత్సరమునందు కవిగారు నిర్ణయించిన వన్నెచోడుని కాలమునకు ప్రతిబంధమగుటవలన- 1912వ సంవత్సరమునందే కలదు. అనగా, తంజావూరిప్రతికి అచ్చుప్రతి అనుసరణము కాక, కవిగారి అచ్చుప్రతికి తంజావూరి ప్రతియే అనుసరణమని అవగాహనమగును.

కవిగారి అచ్చుప్రతి ద్వివిధము. ఒకటి 1909వ సంవత్సరమునందు ప్రకటించిన ప్రథమభాగము. రెండవది 1914వ సంవత్సరమునందు ప్రకటించిన ద్వితీయభాగము. తంజావూరిప్రతి 1912వ సంవత్సరమునందు కలదు. కనుక తంజావూరి ప్రతి 1909వ సంవత్సరమునందు కవిగారు ప్రకటించిన ప్రథమభాగము అచ్చుప్రతికి, 1912వ సంవత్సరమునాటికి కవిగారు ప్రకటించని ద్వితీయభాగము కాగితపుప్రతికి అనుసరణము కావలయును.

కవిగారి అచ్చుప్రతికి, కాగితపుప్రతికి- తంజావూరి ప్రతి అనుసరణమైనను అతిక్రమణమును కలదు. అది కూడ పరిశీలనార్హము.

> నడకుదుటి వీరరాజుపంతులుగారి అభిప్రాయమిది. [36]
>
> "వ్రాతప్రతిలోఁ గానవచ్చుచు, ముద్రితగ్రంథమునఁ గానరాక జారిపోయిన పద్యములు కొన్ని గలవు ;— 1. ప్రథమభాగము 943 (పరువడి....అను) పద్యము తరువాత, క. కులగిరులు....అను పద్యమును, 2. ద్వితీయభాగము. 620 (క. వీండేమిసేయు....అను) పద్యము తరువాత, "వ. అదియునుంగాక, క. గురులను....అను వచన పద్యములును 3. ద్వి. భా. 684 (అంత నొంకొంటి....అను) వచనము తరువాత- తే. గీ. ఉభయబలభట....వ. ఇట్లతిభయంకరంబైన నంకులయుద్ధంబున, అను పద్యవచనములును ముద్రితపుస్తకమున లేవు."

ఇందు వ్రాతప్రతి అన తంజావూరి ప్రతి. ముద్రితపుస్తకమున కవిగారు ప్రకటించిన ప్రథమ ద్వితీయభాగములు. అందు పైవి లేని మాట నిజము. కవిగారు

ప్రకటించిన ప్రథమభాగమును పరికించిన, "కులగిరులు" అను పద్యము లేని లోటు కనిపించదు. ద్వితీయభాగమును తిలకించిన, "గురులను", "ఉభయబలభట" అను పద్యములు వచనములును లేని లోటు కనిపించదు. వాని కలిమి ప్రకరణమును ఉద్ధరించునది కాదు. లేమి భంగపఱుచునది కాదు. అవి ముద్రితగ్రంథములందు జారను వచ్చును. తాళపత్రగ్రంథమునందు చేరను వచ్చును. ఉభయకుశలము.

నడకుదుటి వీరరాజుపంతులుగారి మఱొక అభిప్రాయమిది[37].

"పంచమాశ్వాసము 549 పద్యము (సీసము) లోని 3, 4 పాదములును, ఎత్తుగీతిలోని 1, 2 పాదములును, 580 ప. సీ. మొదటి పా. 2 దళమును, సప్తమాశ్వాసము మూఁడవపద్యము సీసము నెత్తుగీతి రెండవ పాదమును వ్రాఁతప్రతియందు లేవు. ఇట్టి వింకను అందందు కొన్ని గలవు. వీనిఁగూర్చి యనేకు లనేకవిధములుగఁ జెప్పుదురు. ఎవరేమి చెప్పిన నేమి ? ఎవరేమన్న నేమి ? ఏదియెట్లున్న నేమి?-"

ఇందు "అనేకు లనేకవిధములుగఁ జెప్పుదురు. ఎవరేమి చెప్పిననేమి ? ఎవరేమన్న నేమి ?" అను మాటలు అవశ్యగమనార్హములైనవి. ఎవరెవరు ఏమేమి అనిరో ? ఎవరెవరు ఏమేమి చెప్పిరో ? అనేకులు చెప్పిన అనేకవిధము లేమిటో ?

పయి మూడు పద్యములందును పంచమాశ్వాసములోని 549వ పద్యము ప్రధానమైనది.

"పొలయు నిట్టూర్పుల కలకలంబుల తోన
యార్తరవంబు మిన్నుద్రువఁ జెలఁగ
దండడి దొరుగు వేర్చిందుల తోడన
కన్నీరు తారలఁ గడలు కొనఁగ-
భిట్టు వెసఁ దాఁకు చిచ్చుల పిడుగు వోలె
నడలు రతిఁ దాఁకు మెయి ముచ్చముడిఁగి పడఁగ"

ఇట్లు తంజావూరి ప్రతియందు కలదు. ఇందు రెండు సీసపాదములు, రెండు గీతపాదములు లేవు. అవి, పై రెండవ సీసపాదము తర్వాత కవిగారి అచ్చుప్రతియందు ఇట్లు కలవు.

"-నిరుగడఁ బొదివిచ్చి విరియు వేసలి తోన
మోహాంధ తమసంబు ముంచుకొనఁగ
పెడ బీటవారి నెవ్వడవడు మోవితో
ముడిఁగి వాడినమొల్లు పడఁకు చూప
తలములెద మోఁదఁ బెరఁగిన తారహార
ఛాతితో మోము వెన్నెల పలకఁబాఱ"

ఇది తంజావూరిప్రతికి కవిగారి అచ్చుప్రతి అనుసరణమైన పరిష్కర్తృ వ్యాపారము కావలయును. కవిగారి అచ్చుప్రతికి తంజావూరిప్రతి అనుసరణమైన లేఖకస్ఖాలిత్యము కావలయును. ఇంత పరిష్కర్తృవ్యాపార మగుట కంటె, లేఖక స్ఖాలిత్యమగుట సహజము.

ఇట్టిదే మతొక ఇతోధికవిశేషము. ఇటీవలి ముద్రణములందు ఇట్లు కలదు.[38]

"వ. ఇట్లనంత విభవైశ్వ ★ [ర్యాబ్ధిఁ దనరుచు గౌరీసమన్వితుండై చనుదెంచి హరిపరమేష్ఠిపురందరాద్యఖిలభువనభవనాధీశ్వరమునీశ్వరాదుల కభిమతంబు లొసంగి హిమవంతున కజరామరత్వాఖిలనగ చక్రవర్తిత్వానంతవిభవైశ్వ] ర్యంబుల తోన దయసేసి వీడు కొలిపెనట మేనకయు సుమాదేవియును. 142 వచ. 9 ఆ.

[ ★ ] ఈ గుర్తు కలది మూలప్రతిలో లేవు."

ఇందు మూలప్రతి అన తంజావూరిప్రతి. అందు లేని కుండలీకృతభాగము కుండలీకరణము లేకుండ కవిగారి అచ్చుప్రతిలోను కలదు. తన్మూలమైన కాగితపు ప్రతిలోను ఉండును. పయి వచనమునందు కుండలీకృతభాగము లేనియెడల, "ఇట్ల నంత విభవైశ్వర్యంబుల తోన దయసేసి వీడుకొలిపెను" అని ఏర్పడు వాక్యము అర్థరహితమగును. అర్థవంతమగుటకు కుండలీకృతభాగము తప్పనిసరిగ ఉండవలయును. తంజావూరిప్రతియందు లేకపోవుటకు హేతువు లేఖకస్ఖాలిత్యము మాత్రమే. కుండలీకృతభాగముతోడి వచనమునందు "అనంతవిభవైశ్వర్య" అను పదబంధము రెండుచోట్ల కలదు. మొదటి చోటును రెండవ చోటుగ లేఖకుడు భ్రమపడవచ్చును. లేఖకుని భ్రమవలన లేఖనస్ఖాలిత్యము ప్రమాదపతితమగును. ఇట్టి ప్రమాదపతిత

ములు ముద్రితగ్రంథములందును ముద్రాలేఖితగ్రంథములందును, చూచివ్రాతలందును ఇప్పటికిని కలవు. ఈ భ్రమప్రమాదభరితమైన లేఖకస్ఖాలిత్యము తంజావూరిప్రతికి కవిగారి కాగితపుప్రతి అనుసరణమగుటకుగాక, కవిగారి కాగితపుప్రతికి తంజావూరి ప్రతియే అనుసరణమగుటకు ప్రబలనిదర్శనము.

ఇవియెల్ల కవిగారు పూరించినవి అని ఒక పూర్వపక్షము కల్పింపవచ్చును. అది నిజమేని అన్యస్థలములందు చుక్కలు పొడువవలసిన ఆవశ్యకము లేదు. కవిగారికి పూరించు కౌశలము కలదు. పూరించిన సందర్భములును కలవు. పూరణశక్తి కొన్ని స్థలములందు ప్రత్యక్షమై, కొన్ని స్థలములందు అంతర్ధానము కావలసిన ఆవశ్యకమును లేదు. అంతేకాదు. కవిగారు 1909వ సంవత్సరమునందు ప్రకటించిన ప్రథమభాగమునందు చుక్కలు పొడిచిన స్థలము ఒక్కటి కూడ లేదు. 1914వ సంవత్సరమునందు ప్రకటించిన ద్వితీయభాగమునందు చుక్కలు పొడిచిన స్థలములు పెక్కులుకలవు. అవికూడ పరిశీలనార్హములు.

1. "మఱియు ననేకాశ్వరథకరికరేణుశిబికాందోలమృగ....ద
విమానారోహకులై" 33 వచ. 8 ఆ.

ఇది తంజావూరిప్రతిని సంప్రదించినచో, కవిగారు పూరింపలేనిది కాదు. అంతేకాదు. తంజావూరిప్రతి నకలు కాగితపుప్రతిని సంప్రదించిన కోరాడ రామకృష్ణయ్యగారు "మృగఖగవిమానారోహకులై" అని పూరించినది. [39] తంజావూరిప్రతియందు "మృగ" తర్వాత ఒక్క అక్షరము మాత్రమే శిథిలమయినట్లు కలదు. తదుపరి "ద" వర్ణము "ర" వర్ణమువలె కలదు. అది "గ" వర్ణమునకు లేఖకదోషమని గ్రహించి, "ఖగ" అని పూరించుట కవిగారికి అసాధ్యముకాదు.

2. "స్తనములు సకుంతలాస్యము
వనములపైఁ దోప వికచవనజంబులు.....
చే
కొను క్రియ వెల్లిఁత యీడెఁ గోమలి కొలనన్." 28సీప. 9 ఆ.

ఇది తంజావూరిప్రతియందు "వికచవనజంబులు చెకొను క్రియ" అని కలిసిపోయి ఏక పంక్తిగ కలదు. తాళపత్రము క్రిమికీటకదష్టము కాదు. కనుక లేఖకస్ఖాలిత్యము. ఇట "వికచవనజంబు (ను మూగునళులఁ గవచక్కవచే) కొనుక్రియ"

అని కోరాడ రామకృష్ణయ్యగారి పూరణము.[40] ఈ పాటి పూరణము కవిగారికి అశక్యము కాదు.

3. "దనుజేంద్రుఁ జెఱలు విడుమని
పెనఁగెదు పులిగొన్న మగ్గము పెట్టునఁ బడు నే
చను బాలుం .... డది వెనుక
యని వెలువిడి జక్కఁ ద్రోవ నలవియె నీకున్ ( ? )" 536 ప. 10 ఆ.

ఇది తంజావూరిప్రతియందు "బాలుండని వెనుక యని కెలువిడిం జక్కం" అని ఏకపంక్తిగ కలదు. తాళపత్రము క్రిమికీటకదష్టముకాదు. కనుక లేఖకస్ఖాలిత్యము. ఇట "చనుఁ (ద్రావు బాలుఁడవు నీవని కలవడి చ) క్కఁద్రోవ నలవియె నీకున్" అని కోరాడ రామకృష్ణయ్యగారి పూరణము[41]. ఏకాక్షరలోపమునకు, లేఖకదోషము లకు ఇంత మార్పుతోడి పూరణము సమంజసము కాదు. "చను బాలుఁడ వని వేడుక యని గెలువడిఁ జక్కఁ ద్రోవ నలవియె నీకున్" అను సంస్కరణము చాలును. "తారకుడు చెఱఁబెట్టిన వారిని విడిపించుమని దెబ్బలాడెదవు, పులినోటఁ బడ్డ లేడి విడువఁబడునా ? చంటిబాలుడవు. యుద్ధము వినోదమని జయమును పొంద నీకు సాధ్యమా ?" అని పద్య తాత్పర్యము. ఈ పాటి సంస్కరణము కవిగారికి అవశము కాదు.

4. "తానేలవచ్చు భూసతి
మానవపతిచరిత నీతిమార్గంబైనన్
.... .... .... ...." 545 ప. 10 ఆ.

ఇది తంజావూరిప్రతియందు ఇంతవఱకు, "ఆయతమతి" అను తరువాతి పద్యముతో కలిసిపోయి ఏకపంక్తిగ కలదు. తాళపత్రము క్రిమికీటకదష్టము కాదు. కనుక లేఖక స్ఖాలిత్యము. ఇట అవే పాదములను ఆవృత్తము చేయుట కోరాడ రామకృష్ణయ్య గారి పరిష్కరణము[42].

"తా నేలవచ్చు భూసతి
మానవపతిచరిత నీతిమార్గంబైనన్
(తానేల వచ్చు భూసతి
మానవపతి చరిత నీతిమార్గంబైనన్) " 181 ప. 10 ఆ.

ఇందు పూర్వార్ధము స్పష్టము, ఉత్తరార్థముక్లిష్టము. రాజు ప్రవర్తనన్యాయపరణి అయినచో, భూపతి తాను రాదను తాత్పర్యము విపరీతము. రాజు ప్రవర్తన అన్యాయపరణి అయినచో, భూపతి తాను రావను తాత్పర్యము సమంజసము. కనుక ఉత్తరార్ధమునందు "నీత్యమార్గంబైనన్" అని ఉండవలయును. ఇట్లు పరిష్కరించుట కవిగారికి చేతకాని విషయముకాదు.

> 5. "ఏనుఁగు పంపు వారువము రీఁదగు నిందువేసరిం ( ? )
> గానరె సోపటంబునకుఁ గందలమెత్తు రథంబు పూన్చు పం
> చాననుఁ డిప్పు డెత్తికొనుఁ డందల మందపు మట్టు వారికిన్
> రానపు లిచ్చినన్ సడగరంబవు లెమ్మొగి....విశెత్తఁగాన్"
> 576 ప. 11 ఆ.

ఇది తంజావూరిప్రతియందు "నిందువేసరిం" వలె, "లెమ్మొగివిశెత్తగాన్" అని కలిసిపోయి ఏకపంక్తిగ కలదు. తాళపత్రము క్రిమికీటకదష్టము కాదు. కనుక లేఖకస్ఖాలిత్యము. ఇట "నింద (ల సేన ? ) వేసరెన్, లెమ్మొగి పీ (ఠ) లెత్తఁ గాన్" అని కోరాడ రామకృష్ణయ్యగారి పూరణము. [43] ఈపాటి పూరణము కవిగారికి తోచని విషయము కాదు.

> 6. "తన కని దాఁప కర్థికి సుధామయపక్వఫలంబు లిచ్చు నో
> లిన కొను గాలి వహ్నికిఁ జలింపక మాన్కాని నిల్చి కాలు నీ
> మనుజులు కొందఱా యడవిమ్రాఁకుల కంటెను గష్ట మర్థి వెం
> .... .... .... .... .... ....
> .... .... చుఁ జాగియు
> నేననియ తలఁచు లోభి యెప్పుడు ననికిన్
> జానవియె తలఁచు వీరుఁడు
> జానవియ తలంచుఁ బంద సరెనెట్లగునో." 617 ప. 11 ఆ.

ఇది తంజావూరిప్రతియందు "గష్ట మర్థి వెంచుఁ ఖాగియు" అని కలిసిపోయి ఏకపంక్తిగ కలదు. తాళపత్రము క్రిమికీటకదష్టము కాదు. కనుక లేఖకస్ఖాలిత్యము. ఇట మొదటి పద్యమునందు "గష్టమర్థి (వేడిన ఫలమీయ ఁజాల రరిఁ డీకొని తాఁకిన నిల్వఁజాలరున్.)" అని, రెండవ పద్యమునందు "(ఈ ననియ తలఁ)

చుఁ భాగియు" అని కోరాడ రామకృష్ణయ్యగారి పూరణము.[44] ఇంత పూరణము కవిగారికి అనిష్టము కాదు.

7. "కరువలి రూపు చేకొనిమి గంధతరంగులు మూర్తిఁ దాల్చె నా
తరుస జవాతిరేకముల వల్గన ధావన లంఘనంబులన్
దరణి రథాశ్వసంహతికిఁ దా నధికంబనఁ జాలి జాల ధీ
కరగతిఁ బన్ని వచ్చె ........ నల్లెట వేయు మెట్టుచున్"
639 ప. II ఆ.

ఇది తంజావూరి ప్రతియందు "వచ్చె నల్లెటవేయు" అని కలిసి ఏకపంక్తిగ కలదు. తాళపత్రము క్రిమికీటకదష్టము కాదు. కనుక లేఖకస్ఖాలిత్యము. ఇట "వచ్చె (ఁ దురగంబులు)" అని కోరాడ రామకృష్ణయ్యగారి పూరణము.[45] ఈ పాటి పూరణము కవిగారికి అనభ్యాసము కాదు.

8. "వడి నరకుఁడేయు నమ్ములు
నడుమనే తెగనేసి మార్గణము లొండ్లొగి నిం
డొడకుండ ముందఱ గ్రక్కింతు నంచు
.... .... .... ....  682 ప. 12 ఆ.

...................నచ్యుతు నంచున్
బృందారకతతి బేదర ము
కుందునిఁ దలపడియె నాదరికొని మురుఁ డలుకన్. 663ప.12ఆ.

ఇది తంజావూరిప్రతియందు "నిండొడకుండ ముందఱ గ్రక్కింతునంచు నచ్యుతునంచున్" అని కలిసిపోయి ఏకపంక్తిగ కలవు. తాళపత్రము క్రిమికీటకదష్టము కాదు. కనుక లేఖకస్ఖాలిత్యము. ఇట కోరాడ రామకృష్ణయ్యగారి పూరణము లేదు. కాని మఱొక విశేషము కలదు. పయి మొదటి పద్యమునందు మూడవ పాదమునందు "ముందఱఁ గ్రక్కింతునంచు" అను పంక్తి అనుకూలము కాదు. గణభంగకరము. అది పయి రెండవ పద్యమునందు రెండవపాదమునందు అనుకూలము. గణభంగ కరము కాదు. కాని యతిమైత్రిభంగకరము. అయినను కోరాడ రామకృష్ణయ్యగారి పరిష్కరణము అట్లు కలదు[46].

పై దానిని ఇట్లు పూరింపవచ్చును.

"వడి నరకుఁ డేయు నమ్ములు
నడుమనె తెగనేసి మార్గణము లొండ్లొగి నిం
దొడకుండ (జకరి)మును పై
చుడుఁ దెగిపడియె నరకుఁ డది చూచిన యంతన్)
ముందఱ (గక్కింతును (మై
నందు నుడుకురక్తమెల్ల) నచ్యుతునంచున్
బృందారకతతి బెదర ము
కుందునిఁ దలపడియె నొదరికొని మురుఁ డలుకన్."

ఇది ప్రకరణోచితమైన పూరణము. ఈపాటి పూరణమును కవిగారికి అనవకాశముకాదు.

ఇట్లు సాధ్యమై, శక్యమై, వశమై, చేతనై, తోచనై, ఇష్టమై, అభ్యాసమై, అవకాశమై కూడ, తంజావూరిప్రతిని అనుసరించియే, మూలాతిక్రమణము చేయరాదని కవిగారు పూరించలేదనుట పొసగదు. తంజావూరిప్రతిని అనుసరించిన పక్షమునందు మఱి పంచమాశ్వాసములోని 549వ పద్యమునందు రెండు సీసపాదములు, రెండు గీతపాదములు, 580వ పద్యమునందు ఒక సీసపాదములోని సగము, సప్తమాశ్వాసములోని 3వ పాదమునందు ఒక గీతపాదము, ఇంకను మఱికొన్ని మూలాతిక్రమణములుచేసి కవిగారు పూరించినవే కద ! కనుక ద్వితీయభాగమునందుచుక్కలు పొడిచిన స్థలములు బుద్ధిపూర్వకములు కావలయును.

ప్రథమభాగమునందు కవిగారు చుక్కలు పొడిచిన స్థలము లేదుగాని, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు చుక్కలు పొడిచిన సందర్భము కలదు.[47] అదికూడ పరిశీలనార్హము.

"వ. అని యందఱుం బ్రత్యేకంబ యివ్విధంబునం బలికిన విని దక్షుం డందఱ నాక్షేపించి మీరు భిక్షువలని భయంబున దాక్షాయణి పక్షంబునఁ బలికినం గర్మబాహ్యుండైన పాషండుండు పూజ్యుండగునే యని యెవ్వరిం గైకొనక మీఁదు లేక పలికిన విని సతీదేవి కోపో ద్దీపితహృదయయై 6 41

తే. 6 .... .... ....
.... .... దక్షు నాహుతి గొన నెగయునటు

నడరి మేనిలోఁ దనరు కోపాగ్నిధూమ
సమితి ముడిపడి వదనరంధ్రముల వెడలె.     42 ప. 2 ఆ.

5. ఇట మూలమునఁ గొంతభాగము లోపించినది. దీని తర్వాత వచన భాగమును ముందు పద్యములోనఁ గొంతభాగమును పోయినవి. వచనముగా వ్రాయఁబడినది. చ. లో ఈ లోపము గుర్తింపఁబడలేదు.
6. చ. ఈ పద్యభాగము పై వచనము తరవాయిని వచనముగానే గ్రహింపఁబడినది."

ఇందు మూలము అన తంజావూరిప్రతి. చ అన కవిగారి అచ్చుప్రతి. "దక్ష నాహుతి గొన" మొదలు "వెడలె" వఱకు గీతపద్యమునకు సరిపడుమాట నిజము. కాని "కోపోద్దీపితహృదయయై" అన్న వెంటనే "దక్ష నాహుతిగొన" అని యుండుటయే అర్థవంతము. ఆ తర్వాతనైన మఱొక వాక్యమునకు అవకాశము కానరాదు. ఆవశ్యకమునుకానరాదు.కనుక లేఖకస్ఖాలిత్యము కాదు. గీతపద్యమునకు సరిపడుట యాదృచ్ఛికము. అది వృత్తగంధివచనము అగును. కనుక లోపముకాదు. అచ్చుప్రతి తంజావూరిప్రతిని అనుసరించుట వలని అనర్థకమును కాదు. పరస్పరసంబంధము కల పదబంధములనడుమ గ్రంథపాతము కలదనుటయే అనర్థకము.

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి మఱొక అభిప్రాయమిది: [48]

"వేసినదే యొక ముద్రణము. కొన్ని చోట్ల నొకప్రతిలో నొక రీతిగను, మఱొకప్రతిలో వేఱొకరీతిగను గలదు. 1. "క. త్రిలోకాహిత దనుజతతికి లోఁబడరువరే" (౪-౯) అని యొక ప్రతిలోఁగలదు; మఱొక ప్రతిలో "....దనుజతతికి లోఁబడితిరచే" అని కలదు. "లోఁబడరువరే" అనియే తంజావూరిప్రతి పాఠము. 2. "స్మరకలహంబునఁ బతిచెస, గిరిసుత దిరుఁడైన నక్షకేళి మహోత్సన్, మరుడు దగిలించి గెలువఁగ గరమమరిన....గతి నింపొప్పున్" అని యొక ప్రతి. "స్మరహాలహంబునఁ బతిచెస, గిరిసుత తిరుమైన నక్షకేళి మహోత్సన్ మరుఁడు దగిలించి గెలువఁగఁ గరమమరిన గళలనంగఁ గచమింపొప్పున్" (౩-౭౧) అని మఱొకప్రతి. ఇందు మొదటి

పాఠమే తం. ప్ర. పాఠము. ఒకే ముద్రణమున నిట్టిభేదమెట్లు వచ్చెనను సందేహము గలిగినది. పాఠమునఁగొన్ని ప్రతులు ముద్రించిన తర్వాతఁ జేసిన మార్పు గావచ్చు ననుకొంటిని".

ఇందు మొదటి పద్యమునందు "లోఁబడరువరే" అనుచోట ఇటీవలి ముద్రణములందు "లోఁబడరుగదే" అని కలదు[49]. "లోఁబడితిరఁటే" అను పాఠము అర్వాచీనతాస్ఫోరకము. "లోఁబడరువరే" అను పాఠము ప్రాచీనతాద్యోతకము. కవిగారికి ప్రాచీనతాద్యోతకమైన పాఠమును కాదని, అర్వాచీనతాస్ఫోరకమైన పాఠమును ప్రదర్శింపవలసిన ఆవశ్యకములేదు. అర్వాచీనతాస్ఫోరకమైన పాఠమును కాదని, ప్రాచీనతాద్యోతకమైన పాఠమును ప్రదర్శింపవలసిన ఆవశ్యకము కలదు. తంజావూరి ప్రతియందు ప్రాచీనతాద్యోతకమైన పాఠమే కలదు. తంజావూరి ప్రతిని అనుసరించినచో, కవిగారి అచ్చుప్రతియందు అర్వాచీనతాస్ఫోరకమైన పాఠము ఉండవలసిన ఆవశ్యకములేదు. కాని ఉన్నది. కనుక అర్వాచీనతాస్ఫోరకమైన "లోఁబడితిరఁటే" అను పాఠమును మొదట కూర్చినట్లు, ప్రాచీనతాద్యోతకమైన "లోఁబడరువరే" అను పాఠమును పిదప మార్చినట్లు కాననగును. అది తంజావూరిప్రతియందు కలదు. అనగా కవిగారి అచ్చుప్రతిని తంజావూరిప్రతియే అనుసరించినట్లు కలదని అవగాహనమగును.

ఇక రెండవ పద్యమునందు "తిరులైన" అనుచోట ఇటీవలి ముద్రణములందు "బిరుదైన" అని కలదు[50]. అది "అక్షకేళి"కి విశేషణము కావచ్చును. కాని, "గిరిసుత"కు అన్వయము కుదరదు. "తిరులైన" అను పాఠమే కవిహృదయము. "తిరులు = వెఱ్ఱి" అని కవిగారి లఘుటీక[51]. ప్రణయకలహమున పరమేశ్వరుని యెడల పార్వతి వెఱ్ఱిదయిన, మన్మథుడు శివుని జూదమున దింపి గెలుచుటకు మిక్కిలి తగిన కొరడాలు అనునట్లు శిరోజవిలాసము ఒప్పునని అర్థమువచ్చును. ఇందు ఉపమానమైన "కశలు" బహువచనము. ఉపమేయమైన "కచము" ఏకవచనము. అంతేకాదు. జూదమున గెలుచుటకు కొరడాల ఆవశ్యకములేదు. అది గ్రహించినపుడు "కశలనంగ" అను పాఠమును అంతర్ధానము చేయవలయును. అగతికముగ చుక్కలు పెట్టవలయును. ఉపమానమైన "కశలు" ఉపసర్జనీభూతమైన, ఉపమేయమైన "కచము" ఉద్వాసన బొందవలయును. యతిమైత్రికి "గతి" కల్పన సాగవలయును. ఇంత జరిగిన అసమగ్రపద్యము సిద్ధమగును. అందు "దిరుఁడైన"

అనునది మఱల అచ్చుతప్పు. "హాలహాంబున" వలె. అచ్చుతప్పుతోడి అసమగ్ర పద్యము తంజావూరి ప్రతియందు కలదు. అనగా తంజావూరిప్రతి కవిగారి అచ్చు ప్రతికి అనుసరణమనియే అవగాహనమగును.

తాళపత్రగ్రంథములందు లేఖకదోషములు ఉండుట సహజము. ముద్రిత గ్రంథములందును ముద్రణదోషములు ఉండుట అంతకంటె సహజము. తాళపత్ర గ్రంథములలోని లేఖకదోషములు సవరించి ముద్రితగ్రంథములను ప్రకటింతురు. కనుక లేఖకదోషములు సాధారణముగ ముద్రణదోషములు కావు. ఒకటిరెండైన యాదృచ్ఛికము. అనేకములైన ఐచ్ఛికము. 1909వ సంవత్సరమునందు కవి గారు ప్రకటించిన కుమారసంభవము ప్రథమభాగములోని ముద్రణదోషములు అనగా అచ్చుతప్పులు అనేకము తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని కుమార సంభవము తాళపత్రగ్రంథమునందు కలవు.

| సంఖ్య | పద్యము | అచ్చుతప్పు | వ్రాతతప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 1 | రామా | రామా | ధామా |
| 2 | 2 | మకుటాదిభాతి | మకుటాదిభాతి | మకుటాతిభాతి |
| 3 | ,, | బర్హిణ | బర్హిణ | బర్హణ |
| 4 | ,, | సముద్ధ | సముద్ధ | సముత్థ |
| 5 | 10 | శుభగస్థితి | శుభగస్థితి | సుభగస్థితి |
| 6 | 12 | కవిసజ్జనకునకు | కవిసజ్జనకునకు | కవిసజ్జనజనకు |
| 7 | 17 | అలులకెల్ల | అలులకెల్ల | అల్పులెల్ల |
| 8 | 41 | మలరి | మరి | మఱియు |
| 9 | ,, | గరమే | గరమే | శరమే |
| 10 | 62 | లలాటేక్షునకున్ | లలాటీక్షునకున్ | లలాటాక్షునకున్ |
| 11 | 85 | వమన | వమన | వామన |
| 12 | ,, | పోతిక | పోతిక | పోతక |
| 13 | 90 | సీదోన్మద | సీదోన్మద | సీధూన్మద |
| 14 | ,, | మురజలు | మురజలు | బురజలు |
| 15 | 111 | జలజాత్యంతక | జలజాత్యంతక | జలజార్యంతక |
| 16 | 116 | తద్గళ | తద్గళ | తద్గిల |
| 17 | 119 | బహిర్గణ | బహిర్గణ | బహిర్గత |

| సంఖ్య | పద్యము | అచ్చుతప్పు | వ్రాతతప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 18 | 124 | చేతయూధము | చేతయూధము | ఁప్రేతయూధము |
| 19 | 126 | నిజోషధీ | నిజోషధీ | నిజౌషధి |
| 20 | 132 | దురీషణా | దురీషణా | దురేషణా |
| 21 | 137 | సితహోప్రభావిచలిత | సితహాప్రభాచలిత | హసితప్రభావిచలిత |
| 22 | 139 | అనియె | అనియె | అనియు |
| 23 | 144 | కలకలప్యాది | కలకలప్యాది | కనకరౌప్యాది |
| 24 | ,, | దుత్తుంభ | దు త్తుంభ | తుత్తుంభ |
| 25 | 145 | సుతుఁడు | సుతుండు | నుతుఁడు |
| 26 | 152 | దోదూయ | దోదూయ | దోధూయ |
| 27 | 154 | గాఁడె | గాండె | రాఁడె |
| 28 | 158 | అందియా | అందియా | అందుపీ |
| 29 | 160 | పీరిఁబట్టి | పీరిఁబట్టి | పీరిఁబట్టితి |
| 30 | 164 | ఁబరవిడి | ంబరవిడి | ఁబరువిడి |
| 31 | 172 | ఁదివ్వం | ందివ్వం | ద్రవ్వం |
| 32 | 175 | నందు | నందు | లందు |
| 33 | 176 | వడన | వడన | వదన |
| 34 | 183 | కృతాంతకుండు | కృతాంతకుండు | కృతాంతాంతకుండు |
| 35 | 184 | అనేక | అనేక | అనీక |
| 36 | 205 | యార్ప | యార్ప | యార్వ |
| 37 | 210 | లెప్పును | లెప్పును | విప్పును |
| 38 | 213 | వదాధ్యాపదల | వదాధ్యాపదల | వధాద్యాపదల |
| 39 | 233 | యదు | యదు | యమ |
| 40 | ,, | గుణ | గుణ | గణ |
| 41 | ,, | లోర్వ | లోర్వ | లూర్వ |
| 42 | 234 | ననునోల | ననునోల | ననుకూల |
| 43 | 235 | ఎఱుఁగ | ఎఱంగ | తెఱఁగ |
| 44 | ,, | తనరుచులు | తనరుచులు | తనురుచులు |
| 45 | 251 | గణా | గణా | గుణా |

| సంఖ్య | పద్యము | అచ్చుతప్పు | వ్రాతతప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 46 | 219 | భావించి | భావించి | భావించు |
| 47 | 279 | గూళ్లను | గూళ్లను | కూళ్లను |
| 48 | 282 | ంగవ్వంబు | ంగవ్వంబు | మవ్వంబు |
| 49 | 293 | జనార్ధిం | జనార్ధిం | జలాబ్ధిం |
| 50 | ,, | యది | యది | యిది |
| 51 | 305 | తేనెతలన్ | తేనెతలన్ | తేనెతెలన్ |
| 52 | 306 | శిశిర | శిశిర | శిఖర |
| 53 | 310 | హారము | హారము | సారము |
| 54 | 314 | తరలతా- | తరలతా- | తరులతా- |
| 55 | 319 | మన్నెరసి | మన్నెరసి | మున్నెరసి |
| 56 | 333 | అశోకానీక | అశోకానీక | అశోకానోకహ |
| 57 | ,, | నిజయోగంబులంద | నిజయోగంబులంద | నిజనియోగంబులంద |
| 58 | 351 | ఏఁగులింపకుండ | ఎంగ్గులింపకుండ | ఎంగిలింపకుండ |
| 59 | 371 | పలుపఱు | పలుపఱు | పలుమఱు |
| 60 | 418 | పూనికాఁడవై | పూనికాఁడవై | పూన్కికాఁడవై |
| 61 | 460 | నజి | నజి | నవి |
| 62 | 467 | పద్మపద్మవిభ్రమము | పద్మపద్మవిభ్రమము | పద్మవిభ్రమము |
| 63 | 494 | అశోకసహకారంబు | అశోకసహకారంబు | అశోకానోకహంబు |
| 64 | 497 | గనిపింపనగున్ | గనిపింపనగున్ | గలిగింపనగున్ |
| 65 | 503 | మంత్ర | మంత్ర | మాత్ర |
| 66 | 504 | జాగ్రమవస్థా- | జాగ్రమవస్థా- | జాగ్రదవస్థా- |
| 67 | 507 | పుష్పకర | పుష్పకర | పుష్పశర |
| 68 | 520 | నుడువిల్లుగదియించు | నుడివిల్లుగదియించు | గదియించునుడువిల్లు |
| 69 | 544 | అవిభీత | అవిభీత | అతిభేత |
| 70 | 556 | వేషిత | వేషిత | చేష్టిత |
| 71 | 561 | -నమలరుచుల | -నమలరుచుల | -నరుణరుచుల |

| సంఖ్య | పద్యము | అచ్చుతప్పు | వ్రాతతప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 72 | 562 | -నోరి | -రోరి | -నోలి |
| 73 | 573 | కులపాలికాధమవృత్తి | కులపాలికాధమవృత్తి | కులపాలికాధర్మవః |
| 74 | 592 | ప్రోషిత్తతి | ప్రోషిత్తతి | యోషిత్తతి |
| 75 | 597 | మమ్మడి | మమ్మడి | మమ్మిడి |
| 76 | 674 | గోలి | గోలి | గోలు |
| 77 | 687 | చూచు | చూచు | చూపు |
| 78 | 711 | ధూమోద్ధ | ధూమోద్ధ | ధూమోత్థ |
| 79 | ,, | రోశిత | రోశిత | రూషిత |
| 80 | 717 | స్రష్టాన్వయ | స్రష్టాన్వయ | స్రష్ట్రన్వయ |
| 81 | 722 | విహిత | విహిత | రహిత |
| 82 | 726 | అనుభవింపతనికి | అనుభవింపతనికి | అనుభవించితనిసి |
| 83 | 794 | బిండగిల | బిడగిల | బీటగిల |
| 84 | 871 | కాంతఁ | కాంతఁ | కాంతుఁ |
| 85 | 880 | ఏరండు | ఏరండు | ఎఱుఁగడు |
| 86 | 901 | అభ్యంగన | అభ్యంగన | అభ్యంజన |
| 87 | 931 | ఁబండన్ | ఁబండన్ | ఁబడ్డన్ |
| 88 | 935 | కమలవన | కమలవన | కలమవన |
| 89 | 940 | సాహస్తుడై | సాహస్తుడై | సాహసుడై |
| 90 | 953 | ఆదేశ | ఆదేశ | అద్వేశ |

ఇవి స్థూలదృష్టికి కనిపించినవి. ఇంకను సూక్ష్మపరిశీలన చేసిన ఇతోధిక మగును. ఇన్ని అచ్చుతప్పులు తంజావూరి ప్రతిని కవిగారి అచ్చుప్రతి అనుసరించినదైన, తంజావూరి ప్రతియందు తటస్థించుట దుర్ఘటము. కవిగారి అచ్చుప్రతిని తంజావూరిప్రతి అనుసరించినదైన, తంజావూరి ప్రతియందు తటస్థించుట సుకరము. ఇవియెల్ల లేఖకదోషములే, కవిగారు సవరింపలేదనుట సంగతము కాదు. అంతేకాదు. ముద్రణసమయమునందు ముద్రితపాఠములను కొన్ని ప్రతులందు సవరించిన కవిగారు లేఖకదోషములను సవరింపలేదనుట అసంగతము. ఒకేముద్రణములోని భిన్న పాఠములును పెక్కులు కలవు.

| సంఖ్య | పద్యము | ఒక అచ్చుప్రతి | మరొక అచ్చుప్రతి |
|---|---|---|---|
| 1 | 1 | అర్పిత | అర్చిత |
| 2 | ,, | రామా | కామా |
| 3 | 3 | దంశ | కంద |
| 4 | 9 | వశ్యగతి | వలగతి |
| 5 | 120 | మొగళు | మొగుళు |
| 6 | 176 | వడన | మొదలి |
| 7 | 291 | మందిరమ్ము | మందిరమున |
| 8 | 367 | లోఁబడరువరే | లోఁబడితిరటే |
| 9 | 925 | శంఖులు | శంఖులు |
| 10 | 940 | సాహసుడై | సాహసుడై |

ఇవి కొన్ని మాత్రమే. ముద్రణసమయమునందు ఇంత శ్రద్ధ వహించిన కవిగారు పరిష్కరణసమయమునందు ఎక్కువ శ్రద్ధ వహించుట సహజము. అందును "నన్నియభట్టునకు నూఱేండ్లు ముందున్న రాజకవిచంద్రుని గ్రంథమొకటి లభియించె" నని వార్తాప్రకటనము కావించి ఖండింపకున్న మహాపాపమన్న వదంతికి గుఱియైన కవిగారు లేఖకదోషములను సవరింపకుండ అట్లే ముద్రించుట అసంభవము. 1909వ సంవత్సరమునందు ప్రకటించిన ప్రథమభాగములోని అచ్చుతప్పులు అనేకము తాళపత్రగ్రంథమునందు కలవుగాని, 1914వ సంవత్సరమునందు ప్రకటించిన ద్వితీయ భాగములోని అచ్చుతప్పు ఒకటి మాత్రమే (3ప.8ఆ.) తాళపత్రగ్రంథమునందు కలదు. అది యాదృచ్ఛికము. శతాధికము యాదృచ్ఛికము కాదు. ముద్రితగ్రంథమునకు మూలము తాళపత్రగ్రంథమైన లేఖకదోషములు ముద్రాపకదోషములు కావు. తాళపత్రగ్రంథమునకు మూలము ముద్రితగ్రంథమైన ముద్రాపకదోషములు లేఖకదోషములు కాఁగలవు. కనుక తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథము *1912*వ సంవత్సరమునందు తయారైనట్లు కరతలామలకము.

కవిగారు 1909వ సంవత్సరమునందు కుమారసంభవము ప్రథమభాగమును ప్రకటించినపుడు గాని, *1912*వ సంవత్సరమునందు పాఠభేదమును ప్రకటించినపుడు గాని, 1914వ సంవత్సరమునందు కుమారసంభవము ద్వితీయభాగమును ప్రకటించి నపుడు గాని, మఱెపుడు గాని, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు

కుమారసంభవము తాళపత్రగ్రంథము కలదని మాటవరుసకైన తెలుపలేదు. కాని, "తంజావూరు పుస్తకశాలలో కుమారసంభవమున్నదని యెల్లరు నెఱిఁగిన తర్వాతనే" ద్వితీయభాగమును ప్రకటించిరని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అందిచ్చినసమాచారము[52]. అనగా తంజావూరు సరస్వతీమహలుగ్రంథాలయమునందు కుమారసంభవము తాళపత్రగ్రంథము కలదని 1914వ సంవత్సరమునకు ముందు మాత్రమే ఎల్లరకును తెలిసినదని అర్థము. అంతేకాదు. అతఃపూర్వము ఎవ్వరికిని తెలియదని కూడ అంతరార్థము.

తెలుగు సాహిత్యవేత్తలను, తెలుగు సాహిత్యపోషకులను తంజావూరి సరస్వతీమహలు గ్రంథాలయము 1900వ సంవత్సరమునుండి ఆకర్షించినదని, అందు కందుకూరి వీరేశలింగముగారు ప్రథములని, కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుగారు (పోలవరముజమిందారు) ద్వితీయులని నిడుదవోలు వేంకటరావుగారి అభిప్రాయము[53].

కందుకూరి వీరేశలింగముగారి స్వీయవచనమిది[54]

> "నేను చేసిన గ్రంథములలో నెల్ల నాంధ్రకవుల చరిత్రము ప్రధానమైనదని చెప్పవచ్చును. దీనియొక్క ప్రథమభాగమును నేను 1887వ సంవత్సరమునందుఁ బ్రకటించితిని....దీని విషయమై........తంజావూరిలోని సరస్వతీభాండాగారములో తెలుఁగుపుస్తకము లున్నవని విని అక్కాలము నందక్కడ మండలన్యాయాధిపతిగా నుండిన హామ్నెట్టుదొరగారి సాహాయ్యమున నక్కడనున్న తెలుగుపుస్తకముల పట్టికను సంపాదించి, నేను స్వయముగా నక్కడకుఁ బోయి పుస్తకములు చదివి వానిలో నుండి నాకు కావలసిన భాగములను వ్రాసికొని వచ్చితిని. అంతేకాక యక్కడనున్న పెక్కు పుస్తకములకుఁ బ్రతులు వ్రాయించి తెప్పించితిని."

ఇది 1-4-1915వతేదీని వీరేశలింగముగారు ప్రకటించిన విషయము[55]. ఆంధ్రకవుల చరిత్రము ప్రథమభాగము ప్రథమతః 1887వ సంవత్సరమునందు ప్రకటింపఁబడినది కావున, వీరేశలింగముగారు తంజావూరి సరస్వతీభండారములోని తెలుగు పుస్తకముల పట్టికను సంపాదించిన, తెలుగుపుస్తకములు చదివిన, కావలిసిన భాగ

ములు వ్రాసికొనివచ్చిన, అక్కడనున్న పెక్కు పుస్తకములకు ప్రతులు వ్రాయించి తెప్పించిన కాలము స్థూలముగ 1886వ సంవత్సరము కావలయును. అవియెల్ల ఆంధ్ర కవుల చరిత్రము రచించుటకు వీరేశలింగముగారు కావించిన వ్యాసంగము. అయినను వీరేశలింగముగారు 1887వ సంవత్సరమునందు ప్రకటించిన ఆంధ్రకవుల చరిత్రము ప్రథమభాగమునందు మాత్రమేగాక, 1899వ సంవత్సరమునందు ప్రకటించిన ఆంధ్ర కవుల చరిత్రము మూడుభాగముల మొత్తమునందును "నన్నెచోడుని కుమార సంభవము" ప్రసక్తి నామమాత్రముగ నైనను లేదు. 1917వ సంవత్సరమునందు ప్రకటించిన ఆంధ్రకవులచరిత్రము ప్రథమభాగమునందు వివరముగ కలదు. అందుకు 1909వ సంవత్సరమునందు మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమార సంభవము ప్రథమభాగము, 1914వ సంవత్సరమునందు ప్రకటించిన కుమార సంభవము ద్వితీయభాగము మాత్రమే ఆధారము[56]. అనగా మానవల్లి రామకృష్ణ కవిగారు ప్రకటించువఱకు "నన్నెచోడుని కుమారసంభవము" గుఱించి కందుకూరి వీరేశలింగముగారికి తెలియదని అవగాహనమగును. అంతేకాదు. 1899వ సంవత్స రమునాటికి వీరేశలింగముగారు "నన్నెచోడుని కుమారసంభవమునకు ప్రతిని వ్రాయించి తెప్పించుకొనలేదని, అందలి కావలసినభాగములను (అవతారికాదులను) వ్రాసికొన లేదని, కుమారసంభవమును చదువలేదని, చూడలేదని, హామ్మెట్టుదొరగారి సాహాయ్యా మున తంజావూరు సరస్వతీభండారములోని తెలుగుపుస్తకముల పట్టికను తెప్పించు కొనలేదని, తెప్పించికొన్నను అందు "నన్నెచోడుని కుమారసంభవము" నామ ధేయములేదని కూడ అవగాహనమగును. కాని, 7-12-1917వ తేదీని కందుకూరి వీరేశలింగముగారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి వ్రాసిన ఉత్తరములో ఇట్లు కలదు[57].

> "'సత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్" అన్న పాఠము వ్రాఁత ప్రతిలో లేని పక్షమున మన రామకృష్ణకవిగారి కా పాఠ మెక్కడ నుండివచ్చినది? ౧౮౭౦ సంవత్సరప్రాంతమునందే నేను తంజావూరి మండలన్యాయాధిపతియైన యొక మిత్రుని సాహాయ్యమున నక్కడి తెలుగుపుస్తకముల పట్టికను దెప్పించి తరువాత కొన్ని సంవత్సరము లకు నేనేపోయి కుమారసంభవాదికావ్యములను జూచితిని గాని నా కప్పటికీ గ్రంథమునందు శ్రద్ధ లేకపోయెను."

ఇది నిమిత్తముగ వేటూరి ఆనందమూర్తిగారి అభిప్రాయములివి[58];

> "(1)కవిగారు కు॥సం॥ ప్రకటించడానికంటె చాలాకాలానికి పూర్వమే కం॥వీ॥గారు తంజావూరులో ఆ కావ్యాన్ని చూశారు. (2) తంజావూరులోని అప్పటి పుస్తకాల పట్టికలో కూడా ఆ కావ్యం పేరున్నది. (3) ఆ పుస్తకాల పట్టిక, అందులో పేర్కొనబడిన ఆ కావ్యము 1870లో పంతులుగారు చూడడానికి పూర్వమే తంజావూరులో ఉండినవి."

ఇవి కేవలము ఉత్తరమునుబట్టి చేసిన ఊహాగానములు. పూర్వాపరములు తెలిసికొనకుండ తేల్చిన తీరుమానములు.

ప్రథమతః "1870 సంవత్సరప్రాంతమునందు" వీరేశలింగముగారి వయస్సు ఇరువదిరెండు సంవత్సరములు. (1870—1848=22). ఆ వయస్సున వీరేశలింగముగారికి తంజావూరి మండలన్యాయాధిపతి హామ్నెట్ దొరగారు మిత్రులా? అప్పటికి వీరేశలింగముగారు అప్రసిద్ధులు. సుప్రసిద్ధులు కారు. అంతేకాదు. పూర్వాశ్రమమును వీడలేదు. ఉపరి, ఆ వయస్సునందు, ఆ కాలమునందు, వీరేశలింగముగారికి ఆంధ్రకవుల చరిత్రను రచించు సంకల్పము కలుగుటకైనను అవకాశము లేదు. అట్టి సంకల్పము కలుగకుండ తంజావూరులోని తెలుగుపుస్తకముల పట్టికను తెప్పించుకొనవలసిన ఆవశ్యకము లేదు. "1870 సంవత్సరప్రాంతము"నందు గాక, "1885వ సంవత్సరప్రాంతమునందు మాత్రమే తదావశ్యకము కలదు. అప్పుడైనను వీరేశలింగముగారు తెప్పించుకొన్న తంజావూరు తెలుగుపుస్తకముల పట్టికలో "కుమారసంభవము" పేరు కలదేని, తరువాత కొన్ని సంవత్సరములకు తంజావూరు వెళ్లినపుడు కుమారసంభవము తాళపత్రగ్రంథమును చూచిరేని, ఆంధ్రకవులచరిత్రమును రచించుటకు కుమారసంభవ "గ్రంథమునందు శ్రద్ధ" ఉండవలసిన ఆవశ్యకము కలదు. అది కవులచరిత్ర రచించుటకు అవశ్యకర్తవ్యము. "తంజావూరు తెలుగుపుస్తకముల పట్టికను తెప్పించు"కొన్నందుకు, తంజావూరు వెళ్ళి "కుమారసంభవాదికావ్యములను జూచి"నందుకు పరమప్రయోజనము. 1887వ సంవత్సరమునందు మాత్రమేగాక, 1899వ సంవత్సరమునందును ప్రకటించిన ఆంధ్రకవుల చరిత్రమునందు వీరేశలింగముగారు నన్నెచోడుని పేరెత్తలేదు. కుమారసంభవము ఊసెత్త లేదు.

1899వ సంవత్సరమునందు ప్రకటించిన ఆంధ్రకవులచరిత్రమునందు సుమారు 215 మంది కవుల చరిత్ర కలదు. అందు శతాధికముగ అప్రసిద్ధకవుల చరిత్ర కలదు. అయినను నన్నెచోడుని చరిత్ర నామమాత్రముగనైన లేదు. అనగా 1899వ సంవత్సరము నాటికి, వీరేశలింగముగారు తెప్పించుకొన్న "తంజాపూరు తెలుగు పుస్తకముల పట్టిక'' యందు "నన్నెచోడుని కుమారసంభవము ప్రసక్తి లేదని, వీరేశలింగముగారు "కుమారసంభవాదికావ్యములను చూడ" లేదని అవగాహనమగును.

కుమారసంభవాదికావ్యములన- మానవల్లి రామకృష్ణకవిగారు 1909వ సంవత్సరమునందు ప్రకటించిన "నన్నెచోడుని కుమారసంభవము", 1910వ సవంత్సరమునందు ప్రకటించిన "ప్రబంధమణిభూషణము", వల్లభామాత్యుని క్రీడాభిరామము 1912వ సంవత్సరమునందు ప్రకటించిన రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము మొదలైనవి. అవి చూడకుండ చూచినట్లు, శ్రద్ధ లేకపోయినట్లు వీరేశలింగముగారు ప్రభాకరశాస్త్రిగారికి ఉత్తరము వ్రాయుటకు కారణము, కందుకూరి వీరేశలింగముగారు 1917వ సంవత్సరమునందు ప్రకటించిన ఆంధ్రకవుల చరిత్రమును సంస్కరించుటకు 1916వ సంవత్సరమునందు మానవల్లి రామకృష్ణకవిగారు కల్పించిన ''ఆశాభంగము'' కావచ్చును[59]. చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము, తిక్కన విజయసేనము, అధర్వణుని భారతము, అథర్వణుని ఛందస్సు మొదలైన అనుపలబ్ధ గ్రంథములు తమయొద్ద కలవని మానవల్లి రామకృష్ణకవిగారి ప్రదర్శనము ! వాని అవతారికలు వ్రాయించి పంపుడని వీరేశలింగముగారి అభ్యర్థనము. ఒకసారి కాదు; బహుపర్యాయములు. లేఖతః మాత్రమేకాదు ; ముఖతః కూడ. అయినను మఱి అవతారికలు వ్రాయించిపంపుటకు రామకృష్ణకవిగారికి కార్యభారము అడ్డువచ్చినదట ! కడకు ''మఱునాడేపంపెద'' మని కూడ కవిగారు పంపలేదు. ఇది 11-10-1917వ తేదీని వీరేలింగముగారు పీఠికలో వ్రాసినది. ప్రభాకరశాస్త్రిగారికి ఉత్తరము వ్రాసినది 7-12-1917వ తేదీని. రెండు తేదీల నడుమ సుమారు రెండునెలల కాలవ్యవధానము కలదు. ''వీరేశలింగముగారి గ్రంథము సహస్రదోషజుష్ట'' మని కవిగారి ప్రచారము కలదు[60]. కవిగారియెడల అక్కసు కొలది వీరేశలింగముగారు వ్రాసిన ఉత్తరమును పట్టుకొని ఆనందమూర్తిగారు ఆవేశపడుట చింత్యము.

కందుకూరి వీరేశలింగముగారు 1899వ సంవత్సరమునందు ప్రకటించిన ఆంధ్రకవుల చరిత్రమును బట్టి 1. కవిగారు కుమారసంభవమును ప్రకటించుటకు

కొలది కాలమునకు పూర్వమైనను కందుకూరి వీరేశలింగముగారు తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు కుమారసంభవము తాళపత్రగ్రంథమును చూడ లేదు. 2. తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని అప్పటి పుస్తకముల పట్టికయందు "నన్నెచోడుని కుమారసంభవము" పేరు కలదనుటకు, వీరేశలింగము గారు తెప్పించుకొన్న తంజావూరు తెలుగుపుస్తకముల పట్టికయందు "నన్నెచోడుని కుమారసంభవము" ప్రసక్తి కలదనుటకు ప్రమాణములేదు. 3. అప్పటి పుస్తక ముల పట్టికయందు కలదనుటకు ఆధారములేకుండ, వీరేశలింగముగారు చూచినట్లు నిదర్శనములేకుండ "నన్నెచోడుని కుమారసంభవము" తాళపత్రగ్రంథము తంజా వూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు వీరేశలింగముగారు చూచుటకు పూర్వమే కలదనుట విపరీతము.

కందుకూరి వీరేశలింగముగారు తెప్పించుకొన్న తంజావూరు తెలుగుపుస్తక ముల పట్టికయందు "79కావ్యముల పేళ్ళు మాత్రమే" కలవని నిడుదవోలు వేంకట రావుగారు అందిచ్చిన సమాచారము[61]. అందు శతకముల పేరులును కలవు[62]. మఱి తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు 1933వ సంవత్సరమునాటికి మూడువందలపది తెలుగుగ్రంథములు కలవు[63]. అందు పద్యకావ్యములు, శతకములు అయినను వంచకలవు. అంతేకాదు. వీరేశలింగముగారు తెప్పించుకొన్న పట్టికలోని వజ్రపంజరశతకము 1933వ సంవత్సరమునందు ప్రకటింపబడిన వివరణపట్టిక యందు కలదుగాని, మరున్నందనశతకములేదు[64]. అనగా వీరేశలింగముగారు తంజా వూరు తెలుగుపుస్తకముల పట్టిక తెప్పించుకొన్న నాటికి, ఆంధ్రవిశ్వకళాపరిషత్ తంజావూరు తెలుగుగ్రంథముల వివరణపట్టిక ప్రకటించునాటికి, మధ్యకాలమునందు తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని తెలుగు తాళపత్రగ్రంథములు, కొన్ని అదృశ్యమైనవని అవగాహన మగును.

కందుకూరి వీరేశలింగముగారు 1885-1899 సంవత్సరముల నడుమకంటె 1899వ సంవత్సరము తర్వాత తెప్పించుకొన్న "తంజావూరు తెలుగు పుస్తకముల పట్టిక" ఇప్పుడు రాజమహేంద్రవరములోని హితకారిణీసమాజమునందుగాని, "మ్యూజియము" నందుగాని కానరాదు[65]. 1899వ సంవత్సరమునాటికి కందుకూరి వీరేశలింగముగారికి "నన్నెచోడుని కుమారసంభవము" పరిచితపూర్వము కాదనుటకు ఆ సంవత్సరమునందు వారు ప్రకటించిన ఆంధ్రకవుల చరిత్రమే ప్రబలనిదర్శనము.

1900-1901 సంవత్సరముల నడుమ సరస్వతి పత్రికలో ప్రకటించుటకుఁగాను కొచ్చెర్లకోట రామచంద్రవేంకటకృష్ణారావుగారు తంజావూరు సరస్వతీభండారమునకు పంపిన క్రొత్తపల్లి సూర్యారావుగారికిని "నన్నెచోడుని కుమారసంభవము" నయనగో చరముకాలేదు[66]. సరస్వతి పత్రిక తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని శ్రీనాథుని హరవిలాసము, మంచెన కేయూరబాహుచరిత్ర, నవరము చిన నారాయణ నాయకుని కువలయాశ్వ చరిత్రము, దామెర వెంగళభూపాలుని బహులాశ్వచరిత్ర, పాలవేకరి కదిరీపతి శుకసప్తతి, చేమకూర వెంకన విజయవిలాసము, మట్ల అనంత భూపాలుని కకుత్స్థవిజయము ప్రకటించినది[67] గాని "నన్నెచోడుని కుమారసంభ వము"ను ప్రకటింపలేదు. ఇవి యెల్ల 1901-1908 సంవత్సరముల నడుమ ప్రక టింపఁబడినవి. కనుక 1908వ సంవత్సరము వఱకు సరస్వతీపత్రికాధిపతులు కొచ్చెర్ల కోట రామచంద్రవేంకటకృష్ణారావుగారికిఁ గాని, తత్పండితులు కొత్తపల్లి సూర్యా రావుగారికిఁగాని తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు "నన్నెచోడుని కుమారసంభవము" కలదను విషయము తెలియదు అనగా 1908 వ సంవ త్సరము వఱకు తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు కుమారసంభవము తాళపత్రగ్రంథము లేదని అవగాహనమగును.

ఇక తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు గ్రంథపట్టికల తాళ పత్రసంపుటములు రెండుకలవు. ఒకటి "రౌద్రినామసంవత్సర మార్గశీర్షశుద్ధవిదియా మంగళవారము" అనగా 18-11-1800వ తేదీని తయారుచేసినట్లు అంచేకలదు. అది కేవలము సంస్కృతగ్రంథపట్టిక. మఱొకటి సంస్కృతాంధ్రగ్రంథపట్టిక. ఇందు సంస్కృతాంధ్ర గ్రంథములతోపాటు సకృత్తుగ తమిళకర్ణాట మహారాష్ట్రహిందీగ్రంథ ములును కలవు. కాని తయారుచేసిన కాలము ఎక్కడను లేదు. ఇందలి గ్రంథ సంఖ్యలు 1856వ సంవత్సరము నాటి తాళపత్రముఖపత్రికలలోని గ్రంథసంఖ్యలను సవందించునవి కావు. 1933వ సంవత్సరము నాటి ముద్రితవివరణగ్రంథపట్టికలోని తాళపత్రిగ్రంథసంఖ్యలను సంవదించునవి. ప్రబంధసారముఖపత్రికయందు 150, 152 258, 504 సంఖ్యలు కలవు. సంస్కృతాంధ్రగ్రంథపట్టికయందు, ముద్రితవివరణ గ్రంథపట్టికయందును 353, 354, 355, 388 సంఖ్యలు కలవు. కనుక సంస్కృ తాంధ్రగ్రంథపట్టిక 1856వ సంవత్సరము నాటిది కాదు. అంతేకాదు. 1899వ సంవత్సరము తర్వాత కందుకూరి వీరేశలింగముగారు తెప్పించుకొన్న తంజావూరు తెలుగు పుస్తకముల పట్టికలోని మరున్నందనశతకము ప్రసక్తి సంస్కృతాంధ్ర

గ్రంథపట్టికయందు లేదు. కనుక సంస్కృతాంధ్రగ్రంథపట్టిక 1899వ సంవత్సరము తర్వాత కంటె తర్వాతది కావలయును. ఉపరి, సంస్కృతాంధ్రగ్రంథపట్టికయందు, విశ్వాతీతవిలాసము, రాధావంశీధరవిలాసము అను "ప్రాకృతనాటకము"ల ఏడు ప్రతులకును "ఇందుస్థానీభాష" అను నిర్దేశము కలదు. విశ్వాతీతవిలాసము, రాధా వంశీధరవిలాసము శాహాజీ రచించినట్లు కల సంస్కృతాపభ్రంశభాషామిశ్రితమైన హిందీనాటకములు[68]. హిందీభాషకు హిందుస్తానీభాష అను వ్యవహారము పందొమ్మి దవశతాబ్ది తుది వఱకు విదేశీయుల వ్రాతలందు వినా స్వదేశీయుల వ్రాతలందు మృగ్యము[69]. విదేశీయులైనను విరళముగ ప్రయోగించిన హిందుస్తానీభాష విష యము ప్రథమతః 1916వ సంవత్సరమునందు ప్రకటింపఁబడినది[70]. కనుక సంస్కృ తాంధ్రగ్రంథపట్టిక 1916వ సంవత్సరము కంటె తర్వాతిది కావలయును. ఏవంవిధ మైన సంస్కృతాంధ్రగ్రంథపట్టికలోని కుమారసంభవము ప్రసక్తి నిరుపయోగము.

మఱి తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని తెలుగు తాళపత్ర గ్రంథముల కట్టలపైన-క్వాచిత్కముగ లోపల-తాళపత్రముల మీద లిఖించిన ప్రాచీన నవీన, ముఖపత్రికలు కలవు. ప్రాచీనతాళపత్రముఖపత్రికలయందు తాళపత్రగ్రంథము పేరు, లిపి వివరము, తాళపత్రముల సంఖ్య, తాళపత్రగ్రంథసంఖ్య, గ్రంథసమగ్రతా సమగ్రత, ప్రక్రియావిశేషము తోపాటు ప్రత్యేకముగ ఇట్లుకలదు.

> "నళనామసంవత్సర చైత్రశుద్ధప్రతిపదాభానువారం మధ్యస్థులు
> సేనా ధురంధరరాజశ్రీ రామయ్యవరహాప్పయ్యదీక్షితులువారి యాజ్ఞా
> ప్రకారం...............రుజు........"

ఇందలి నలనామసంవత్సరచైత్రశుద్ధపాడ్యమీ-ఆదివారము సరిగా 6-4-1856వ తేదీ. ఇట్టి ప్రాచీనతాళపత్రముఖపత్రికకల తెలుగు తాళపత్రగ్రంథము 1856వ సంవ త్సరము నాటికి తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు ఉండుటతథ్యము. మఱి "నన్నెచోడుని కుమారసంభవము" తాళపత్రగ్రంథము కట్టపైనగాని, లోపలగాని ఇట్టి ప్రాచీనతాళపత్రముఖపత్రికలేదు. నవీనతాళపత్రముఖపత్రిక కలదు. అందు ఇట్లు కలదు.

> "Telugu D 152 नन्ने चोड
> 189 प द्यकाव्यम् कु मारसंभवम्
> కుమారసంభవము Kumara Sambhavamu by
> Complete Nannechoda

ఇది చూడగానే ఇటీవలి తాళపత్రముఖపత్రిక అని తెలియును. ఇందు D 152 అనగా Descriptive Catalogue No. 152. వివరణపట్టికలోని క్రమసంఖ్య. అది 1933వ సంవత్సరమునందు ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రకటించినది. అందు152వ క్రమసంఖ్య "నన్నెచోడుని కుమారసంభవమే." కనుక నవీనతాళపత్రముఖపత్రిక లేఖనకాలము స్థూలముగ 1933వ సంవత్సరము. తదనంతరమును కావచ్చును. కుమారసంభవము తాళపత్రగ్రంథము కట్టపైన గాని, లోపలగాని ప్రాచీనతాళపత్ర ముఖపత్రిక లేకపోవుట ప్రాగభావమా ? ప్రధ్వంసాభావమా ? అను ప్రశ్న వ్యర్థము ఇదియెల్ల 1912వ సంవత్సరముకంటె పూర్వము తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు కుమారసంభవము తాళపత్రగంథము లేదనుటకు నిర్ధారక సాధనము.

తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయము 1855వ సంవత్సరము వఱకు పాలకుల సొంత గ్రంథాలయము. 1918వ సంవత్సరము వఱకు వారసుల ఆస్తి గ్రంథాలయము. అప్పటి వఱకు గ్రంథాలయము పేరు సరస్వతీభండారము. 1918వ సంవత్సరమునుండి ప్రభుత్వప్రజాగ్రంథాలయము. అప్పటి నుండి గ్రంథాలయము పేరు తంజావూరు మహారాజ శరభోజీ సరస్వతీమహాలు గ్రంథాలయము. 1900—1901వ సంవత్సరప్రాంతమందు సరస్వతీభండారమును సందర్శించిన క్రొత్తపల్లి సూర్యారావుగారు నిడుదవోలు వేంకటరావుగారికి తెలిపిన విషయమిది[71]:

> "గ్రంథములు వ్రాసికొనుటకు కోటకు వెళ్ళెడు వారందఱు కరవ భాష వచ్చి తీరవలసినదే- కోటకు వెళ్ళి గ్రంథము తెమ్మన్న తరువాత అచ్చటనుండే తమిళోద్యోగి యాజ్ఞపై సేవకుడు లోపలనుండి గ్రంథము పట్టుకొని వచ్చి యిచ్చెడువాడు. అది ఒక్కొక్కప్పుడు మేము కోరెడి గ్రంథమై యుండక, మఱియొకటి యయ్యెడిది. దానితో మాకు పట్టరాని సంతోషము గలిగేది. ఆ గ్రంథము మాకిచ్చి యా సేవకుడు వెళ్ళిపోయెడివాడు- తిరిగి వ్రాసికొనిన తరువాతనే తీసి కొనెడివాడు- ఆ గ్రంథమచ్చట పైకి తీసికొని వెళ్లకుండా, ఉంచి నారా లేదా యని మాత్రమే వాడు చూచెడివాడు. ఇట్లుండగా మేమొక సారి శ్రీనాథుని హరవిలాసము తాళపత్రప్రతి తెమ్మన్నాము- కాని వాడు- మంచెన కేయూరబాహుచరిత్ర తెచ్చినాడు- అట్టి కావ్యమున్న దనియే తప్ప దానిని గూర్చి మాకేమీ తెలియదు. అది దొరికినప్పు

దెంతో మనస్సులో ఆనందము పొందినను దాని నణచుకొని ఈ పుస్త
కము మేము కోరినదై నట్లుగా లేదు- అయినా చూచెదము- నీవు పోయి
హరవిలాసమును పట్టుకొని రమ్ము అని చెప్పినాము. వాడు పట్టుకొని
వచ్చినాడు. వాడు రెండు పుస్తకములు మేము వెళ్ళినప్పుడు చూచి
నాడు. తరువాత మేము కేయూరబాహుచరిత్రను గొడుగులో పెట్టి
(ఆకాలమున నెక్కడకు వెళ్ళిన గొడుగు పట్టుకొనివెళ్ళెడివారము)
యింటికి పట్టుకొనివచ్చి, రాత్రి యింటివద్దవ్రాసుకొని, తిరిగి గొడు
గులో పట్టుకొని వెళ్ళి కోటలో వ్రాతస్థలము దగ్గఱ యుంచెడు
వారము- ఎప్పుడో సేవకుడు వచ్చి రెండు ఉన్నవా లేవా అని
చూచెడివాడు. అంతే. ఈవిధముగా నేను, కేయూరబాహుచరిత్రము
కూడా హరవిలాసముతోపాటు వ్రాసి తెచ్చి ప్రకటింపజేసినాను."

ఇందు 1900-1901 సంవత్సరప్రాంతమునందలి తంజావూరు సరస్వతీ భండారము తీరుతెన్నులు కలవు. గ్రంథాలయోద్యోగి తమిళుడు. తత్సేవకుడును తమిళుడు. ఒక తాళపత్రగ్రంథమును అడిగిన మఱొకతాళపత్రగ్రంథమును ఇచ్చెడి వాడు. అది గొడుగులో పెట్టుకొని గ్రంథాలయమునుండి ఇంటికి తరలించుట, ఇంటినుండి మఱల గ్రంథాలయమునకు మఱలించుట బాహాటముగ జరిగెడిది! గ్రంథాలయమునందున్న తాళపత్రగ్రంథమును గ్రంథాలయోద్యోగులను గికురించి ఉద్ధరించుటకు వీలున్నప్పుడు, గ్రంథాలయమునందు ఉన్న తాళపత్రగ్రంథమును తొలగించి, లేని తాళపత్రగ్రంథమును గ్రంథాలయోద్యోగులను గికురించి ప్రతిష్ఠించుటకును అవకాశము లభించును. కనుక "నన్నెచోడునికుమారసంభవము" తాళపత్రగ్రంథమును 1912వ సంవత్సరమునందు తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునందు ప్రతిష్ఠించినట్లు కరబదరకము.

కవిగారు 1909వ సంవత్సరమునందు ప్రకటించిన కుమారసంభవము ప్రథమ భాగములోని అచ్చుతప్పులు అనేకము, తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయములోని కుమారసంభవము తాళపత్రగ్రంథమునందు ఉన్నట్లు, కవిగారి చారిత్రికవిషయ దోషమును "నన్నెచోడుని కుమారసంభవము"నందు కలదు.

"క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా

రము గూఢవస్తుమయకా
వ్యముగా హారులీల చెప్పి హరు మెచ్చించెన్." 12ప.1ఆ.

ఇందు నాల్గవపాదమునందు "హారులీల" అని ముద్రితమైనను అది "హరలీల" యే. "ఉద్భటుఁడు కుమారసంభవము, కావ్యాలంకారసారసంగ్రహము, హరలీలయుఁ జెప్పినవాఁడు" అని కవిగారి లఘుటీక[72]. అంతేకాదు. "ఉద్భటుఁడనువాఁడు భావగర్భము గల కుమారసంభవమను కృతి విరచించినట్లు కవి చెప్పుచున్నాఁడు. కాశ్మీరకవులలో జయాపీడసంస్థానవిద్యాపతియగు నుద్భటుఁ డొక్కఁడు క్రీ. శ. ౮౦౦ లో కావ్యాలంకారసారసంగ్రహమును రచించి దానిలోఁ దన కుమారసంభవ కావ్యములోనుండి శ్లోకములుదాహరించుకొనెను." అనికూడ కవిగారి వివరణము[73]. అనగా కాశ్మీరకవి అయిన ఉద్భటుడు సంస్కృతమునందు కుమారసంభవము, కావ్యాలంకారసారసంగ్రహము, హరలీల అను గ్రంథములు రచించినట్లు కవిగారికి అభిప్రాయము కలదని అవగాహనమగును. "నన్నెచోడుని కుమారసంభవము" నందలి పద్యములోని అభిప్రాయమును అదియే. ఇది చారిత్రికవిషయము.

ఉద్భటుడు హరలీల అను గ్రంథమును రచించినట్లు మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునందు కలదు.

"హరలీలాస్తవరచనా
స్థిరనిరుపమభక్తిఁ దనదు దేహముతోడన్
సురుచిరవిమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె రుద్రా." 410 ప.

ఇందు హరలీలాస్తవరచనమున అస్థిరమైన, అనుపమమైన భక్తిచేత, ఉద్భటుడు సశరీరముగ విమానముపై కైలాసమునకు ఏగెనని కలదు. అనగా మహాశివభక్తుడైన ఉద్భటుడు హరలీల అను స్తోత్రగ్రంథమును రచించెనని అవగాహనమగును. కనుక, ఉద్భటుడు కుమారసంభవము, కావ్యాలంకారసారసంగ్రహము, హరలీల అను గ్రంథములు రచించెనని అనుకొనవచ్చును. కాని, కుమారసంభవ, కావ్యాలంకారసారసంగ్రహములు రచించిన కాశ్మీరకవి ఉద్భటుడు హరలీల రచించినట్లు ఆధారములేదు. సరికదా, కన్నడకవి ఉద్భటుడు హరలీల రచించినట్లు ఆధారము కలదు. "కన్నడమున 'ఉద్భటయ్య' అనియు 'ఉద్భట' అనియుఁ బేళ్లతోఁ బ్రసిద్ధుడగు

కర్ణాటకకవి యొకఁడు గలఁడు. ఇతఁడు హరీశ్వరరాఘవాంకకవులచే స్మరింపఁబడినవాఁడు. ఈతఁడు హరకేలాస్తవము వేయివృత్తములలో రచించెనని బ్రహ్మశివనకవి సమయపరీక్షయను గ్రంథమునఁ జెప్పినట్లు కర్ణాటకవిచరిత్ర తెలుపుచున్నది." అని శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు అందిచ్చిన సమాచారము[74]. అంతేకాదు. మల్లికార్జునపండితుని శివతత్త్వసారమునందు భట్టబాణుని విషయముతోపాటు (396ప.) ఉద్భటుని విషయములేదు. శ్రీపతిపండితుడు, ఒడయనంబి, కిన్నెర బ్రహ్మయ, మలయరాజుల విషయముతోపాటు (406-409 ప.) ఉద్భటుని విషయముకలదు. తదుపరి కుమ్మరిగుండయ విషయముకలదు. (411ప.) కనుక హరలీల రచించిన ఉద్భటుడు దాక్షిణాత్యుడైన కన్నడకవి అగుట సంగతము. అయినను, ఔత్తరాహుడైన కాశ్మీరకవి ఉద్భటుడు హరలీల రచించినట్లు కవిగారి అభిప్రాయము. అది చారిత్రికవిషయదోషము, ఇది "నన్నెచోడుని కుమారసంభవము" నందు కలదు !

కవిగారు 1911వ సంవత్సరమునందు, ఆంధ్రభారతి అను పత్రికయందు, ప్రకటించిన "కవుల చరిత్రాంశములు" అను వ్యాసమున ఇట్లుకలదు[75]

> "కుమారసంభవకర్త యే చోళుఁడైనను దిక్కనకుఁ దరువాతివాఁడుకాదు. అయిదుగురు నన్నెచోళులలోఁ గడపటివాఁడు క్రీ॥ శ॥ 1220లో నుండియుండుటచే 1260లో నుండిన తిక్కనకుం బూర్వుఁడే విమర్శకులు చోళుని నన్నయకుఁ బూర్వుఁడు కాఁడని సాధింపఁ గలిగిరేనియుఁ దిక్కనకు నర్వాచీనుఁడని సాధించుట మాత్రము కానేరదు........కుమారసంభవములోఁ బ్రథమపద్యము స్రగ్ధరావృత్తమునఁ గూర్పఁబడినది. ఈ మర్యాద యాంధ్రమున నేఁటి వరకు గానరాదు. కావున నితఁడు 1911 క్రీ॥శకములో నుండఁబోవు వాఁడేమో ? ఇట్టి చిత్రములు కూడ హేతువులగునా ?"

ఇందలి అయిదుగురు నన్నెచోడుల విషయమును కవిగారు 1914వ సంవత్సరమునందు ప్రకటించిన కుమారసంభవము ద్వితీయభాగము పీఠికను కలదు[76]. అందు "వీరెల్లరును క్రీ॥శ॥ 850 మొదలు 1210 లోఁగా నుండినవారు" అనికూడ కలదు. అదియెల్ల శాసనప్రమాణసహితము. కనుక నన్నెచోడుని "తిక్కనకు నర్వాచీనుఁడని సాధించుట కానేరదు" అని కవిగారి అను శాసనము. తిక్కన తర్వాత

చోడబల్లి కొడుకు నన్నెచోడుడు కలడనుటకు చారిత్రికప్రమాణము లేనిమాట యథార్థము. కనుక "నన్నెచోడుడు" తిక్కనకు అర్వాచీనుడని సాధించుట జరుగ లేదు. కాని, విమర్శకులు కుమారసంభవమును నన్నయకు పూర్వగ్రంథము కాదని మాత్రమే గాక, తిక్కనకును పూర్వగ్రంథము కాదనికూడ సాధించుట జరిగినది. అనగా నన్నెచోడుడు తిక్కనకు పూర్వుడును, కుమారసంభవము తిక్కనకు తర్వాతి గ్రంథమును అన్నమాట ! ఇదొక చిత్రము.

కుమారసంభవమునందు స్రగ్ధరావృత్తములు రెండుకలవు. ఆ రెండును మత్తేభవిక్రీడితము మత్తేభవిక్రీడితవృత్తమున, మత్తకోకిల రావము మత్తకోకిల వృత్తమున, స్వాగతవాక్యము స్వాగతవృత్తమున, మానిని రూపము మానినివృత్త మున, మణిగణనికరవిభాతి మణిగణనికరవృత్తమున, క్రౌంచగతులు క్రౌంచపద వృత్తమున, ఉత్సాహము ఉత్సాహవృత్తమున వలె లేవు. మొదటి స్రగ్ధర ప్రార్థన (1ప. 1ఆ.) రెండవ స్రగ్ధర మర్దన. (213ప. 2ఆ.) మొదటి స్రగ్ధర అయినను ముద్రాలంకారముద్రాముద్రితము కాదు. అది కృత్యాదిపద్యము అగుట మాత్రమే విశే షము. ఈ మర్యాద ఆంధ్రమున నేటివఱకును కానరాని మాట నిజము. స్రగ్ధరా వృత్తమునకు తొలిగణము మగణము. మలిగణము రగణము. గణసంజ్ఞలు హ్రస్వము లైనను దీర్ఘములుగ ఉచ్చరించుట ప్రసిద్ధము. అంతేకాదు. "యమాతారాజభానస" అను గణసూత్రములోని మగణరగణసంకేతములు దీర్ఘములు. అనగా మా, రా అగును. కుమారసంభవము కృత్యాదిపద్యములోని ఆదిగణములు మా, రా. మాన వల్లి రామకృష్ణకవిగారి పేరులోని ఆదివర్ణములు మా. రా. అంతేకాదు. మా. రా. కవి అని వ్యవహారము. ఇది మఱొక చిత్రము.

> "తజ్ఞ నందేరనగుఁ గవితావిశేష
> మజ్ఞ నందేమి యెఱుగంగనగు సమస్త
> కనకవర్ణోత్కరమ్మను గానవచ్చు
> నన్నె తెఱుగంగఁబోలునే వట్టిరాత"      32ప. 1ఆ.

ఇది ప్రథమభాగములోని పద్యము. ఇట "రమ్మ........ రాత అశుద్ధము, "ర మ్మొరగంట నొరసి చూచికా తెఱుగవచ్చునే సుద్దరాత" శుద్ధము" అని కవిగారి "అశుద్ధసూచిక"ను కలదు[77]. ఇది పాఠభేదము కాదు: పాదభేదము. ఇతరభేదము

తప్పొప్పుల పట్టికను తటస్థించినది. అంతేకాదు. శుద్ధపాఠమునందు గణభంగము ఘటిల్లినది. అందుకు "తజ్జనందెర్గనగు........ కనకవర్ణోత్కరమ్మొరకంట నొరసి చూచి కా కెఱ్ఱవచ్చునె సుద్దరాత" అని తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయము లోని తాళపత్రగ్రంథమునందు కలదు. ముద్రితపద్యములోని "దేరనగు" అను చోట "దెర్గనగు" అని, శుద్ధపాఠములోని "కెఱుగవచ్చునే" అనుచోట "కెఱ్ఱ వచ్చునె" అని తత్తత్సన్నిహితములుగ తంజావూరిప్రతిలోని రేఫశకటరేఫలేఖనము కలదు. ముద్రితపద్యములోని "వట్టిరాత"లోని "వట్టి"శబ్దము అర్వాచీనకాలికము. అది తొలగించుటకు అంత పాఠభేదము తప్పొప్పుల పట్టికను తప్పనిసరి. అది తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథమునందు కలదు. ఇది ఇంకొక చిత్రము.

పూర్వోదాహృతమైన "అన్యతారక"పద్యమునందు "శుభోదయమున"అని కలదు. శుభలగ్నము, శుభముహూర్తము, శుభసమయము, శుభవేళ అను వ్యవహార ములు ప్రాచీనము. శుభోదయము అను వ్యవహారము నవీనము. "ఆన్ ఒన్ ఫైన్ మార్నింగ్" అను ఇంగ్లీషు పలుకుబడిని స్ఫురింపఁజేయునది. ఇది వేఱొకచిత్రము.

"క్రొవ్విరి తమ్మితావి గొని క్రోలి మదంబునఁ దేలి తేఁటి కొం
దెవ్విరి పువ్వు కంపు సొగయింపని భంగి మహేశ్వరుండు నా
జవ్వని యౌవనం బనెడు చంద్రికఁ గ్రోలుఁ జకోరభంగి మైఁ
దివ్వఁడు లోకవర్తనకు దేవత లెంత విహీనభాగ్యలో." 3ర్ర్తప.9ఆ.

ఇది ద్వితీయభాగములోని పద్యము. ఇట "సొగయింపని భంగి మహేశుఁ డయ్యుమాయవ్వనవారిపూర్ణ సురతాబ్ధివివర్ధితుఁడై మదించి మైఁ దివ్వఁడు" అనియుఁ బాఠము గలదు. ఇందులో యౌవనశబ్దము 'యవ్వన' అని చెప్పుట దోషము. ప్రాచీనకవితలో నిట్టి ప్రయోగములు సాధువులై యుండఁగా వైయాకరణులు నాలం కారికులును దోషపరిచ్ఛేదముల విస్తారముగా వ్రాసి యించుక కఠినముగాఁ జేసినట్లు తోచుచున్నది. మహాప్రామాణికుఁడగు ననంతకవి భోజరాజీయమున "నవ్వుచుఁ జెక్కు మీటి నళినస్ఫుటలోచన మాటలేల నీ యవ్వనలక్ష్మికిన్ ఘటుఁడనైతి ననుం గరుణింపుమంచు వాఁడువ్విళులూరుచుం బలుక నుత్పలగంధియు నో మహాత్మ

౩.౧౦౮. అని ప్రయోగించెను. అనంతునకుఁ బ్రాచీనకవి ప్రయోగము లక్ష్యములై యుండును." అవి కవిగారి వివరణము[78].

దీనిపై శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారి విమర్శనమిది[79]:

> "వారు (కవిగారు) తంజావూరి ప్రతిపాఠము చూచి 'యవ్వన' శబ్దప్రయోగము దోషమని యెంచి మూలమున నన్యథా గ్రహించిరి యని తోఁచుచున్నది. అందు 'యవ్వని'ని 'జవ్వని'నిగాఁ జేసి యతికై యవ్వనమును జంద్రికగా నిరూపించి దాని గ్రోలుటకై చకోరమును గల్పించుకొని పాదము పూర్తి చేసిరిగాని 'జవ్వని యౌవ నంబనెడు చంద్రికఁగ్రోలు చకోరభంగిమై' అనుటచే పార్వతీయౌవ నము ననుభవించుట చకోరమునకుఁ దెచ్చిపెట్టిన దోషము సంపా దించిరని తోఁచుచున్నది. అది 'యవ్వన'శబ్దప్రయోగ దోషమునకు మించిన దోషము. ఈ పాఠమెక్కడిదో! లఘుటీకలో 'యవ్వన' శబ్దప్రయోగము సాధించి నన్నిచోడకవికి ప్రాచీనతాభంగప్రసంగము వచ్చుననెడి భయమునఁ గాఁబోలును అనంతునికిఁ బ్రాచీనకవిప్రయోగ ములు లక్ష్యములై యుండునని సరిపెట్టుకొనిరి."

ఇందు "మహేశుఁ డయ్యుమాయవ్వనవారిపూర్ణసురతాబ్ధివివర్ధితుడై మదించి" అను పాఠము కాళిదాసు శ్లోకమునకు (91శ్లో.8స.) సన్నిహితము[80]. కనుక తొలి పాఠము కావలయును. "మహేశ్వరుండు నా జవ్వని యౌవనంబనెడు చంద్రికఁ గ్రోలు చకోరభంగిమై" అను పాఠము కాళిదాసు శ్లోకమునకు అసన్నిహితము. కనుక మలిపాఠము కావలయును. తొలి పాఠములోని "యవ్వన"శబ్దమును సాధువని సమర్థించినను దోషమనియే కవిగారి ఉపక్రమణిక. అంతేకాదు. సమర్థించుటకు ఆధారమైన అనంతామాత్యుని "యవ్వన"శబ్దప్రయోగము నిర్ధారకము కాదు. అనంతా మాత్యుని భోజరాజీయములోని పద్యమునకు,

> "నావిని చెక్కు మీటి నలినస్ఫుటలోచన మాటలేల నీ
> యౌవనలక్ష్మికిన్ భటుఁడనైతి ననుం గరుణింపుమంచు వాఁ

డూవిశులూరుచుం బలుక నుత్పలగంధియు నో మహాత్మ నీ
కీవిధ మెట్లు చొప్పడిమె నేనొక ప్రాతిమె నీదు కోర్కికిన్"

అని పరవస్తు చిన్నయసూరిగారి పాఠము[81]. అది ప్రకరణోచితము. అయి నను, "యవ్వనముతోన యిలగల యవ్వనంబు నెలమిఁబొంద" (139వ.3ఆ,) అని కూడ అనంతామాత్యుని ప్రయోగము కలదని నిడుదవోలు వేంకటరావుగారి నిర్ణ యము[82]. కాని, భోజరాజీయమునందు "జవ్వనముతోన యిలగల యవ్వనంబు నెలమిఁబొంద" అని కలదు. అది "యవ్వనము" అని వాదించినను వ్యస్తపదము. తద్భవముగ సమర్థనీయము. "ఉమాయవ్వన-", "యవ్వనలక్ష్మి" అను ప్రయోగ ములు సమస్తపదములు. తద్భవములుగ కాని, సమాసవికృతులుగ కాని సమర్థ నీయములు కావు. కనుక దోషమను కవిగారి ఉపక్రమణిక సరియైనది. సమాసగత మైన "యవ్వన" శబ్దప్రయోగము పదునారవశతాబ్దికి పూర్వము కావ్యములందు కాన రాదు. ఇవియెల్ల కవిగారికి తెలియని విషయము కాదు. అందుకు ప్రమాదపతితమైన, సమాసగతమైన "యవ్వన"శబ్దప్రయోగమును పరిరక్షించుట,పరిష్కరించుట ఆవశ్య కము. కనుక గ్రంథభాగమునందు మలిపాఠము, లఘుటీకను తొలిపాఠము కలవు. ఇది కొంపొకచిత్రము.

ఇట్టి చిత్రములు కుమారసంభవమునందు కోకొల్లలు. అవియెల్ల నిర్హేతుక విధానములగుట కంటె, సహేతుకసంధానములగుటయే సంగతము.

౬

# కూటసృష్టి

నన్నయకు పూర్వగ్రంథమని పుట్టిన "నన్నెచోడుని కుమారసంభవము" భాషావిషయమును బట్టి పదునారవశతాబ్దికంటె ప్రాచీనగ్రంథము కాదని ప్రతీయమానము. ఛందోవిశేషమునుబట్టి కూడ పదునారవశతాబ్దికంటె ప్రాచీనగ్రంథము కాదని ప్రకాశమానము. "నన్నెచోడుని కుమారసంభవము"లోని పద్యములను ఆదికవి నన్నయ మొదలు అర్వాచీనకవి వెన్నెలకంటి వేంకటాచలము వఱకు ముప్పదిమంది కవులు అనుకరించుటకంటె, ఆదికవి నన్నయ మొదలు అర్వాచీనకవి వెన్నెలకంటి వేంకటాచలము వఱకు ముప్పదిమందికవుల పద్యములను కుమారసంభవకర్త అనుకరించుటయే సంభవము. కుమారసంభవములోని శృంగారము సద్రసబంధురమైన ప్రబంధములకు నాందీవాచకము కాదుగాని, అసద్రసబంధురమైన ప్రబంధములకు భరతవాక్యము. కుమారసంభవములోని నన్నెచోడుని వర్ణనము కూహకమని అనుమేయము. కుమారసంభవకర్త జన్మస్థలము నన్నెచోడుని పరముగ అంతుపట్టని విషయము. మానవల్లి రామకృష్ణకవిగారి పరముగ చిక్కుపెట్టని విషయము. అంతేకాదు. "సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్" అను పాఠమునకు "చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అను పాఠభేదమును కల్పించవలసిన ఆవశ్యకము మానవల్లి రామకృష్ణకవిగారికి మాత్రమే కలదు. ఉపరి, "చాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అను పాఠభేదము కల, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని కుమారసంభవము తాళపత్రగ్రంథము గుఱించి, కుమారసంభవము ద్వితీయభాగము ప్రకటింపఁబడుటకు ముందువఱకు ఎవ్వరికిని తెలియదు. అది మానవల్లి రామకృష్ణకవిగారి అచ్చుప్రతికి ఆధారమనుటకు సాధకముల కంటె బాధకములుకలవు. కవిగారు ప్రకటించిన కుమారసంభవము ప్రథమభాగములోని అచ్చుతప్పులు అనేకము, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని కుమారసంభవము తాళపత్రగ్రంథమునందు కలవు. అంతేకాదు. తంజావూరు సరస్వతీమహాలుగ్రంథాలయములోని తెలుగుపుస్తకముల పట్టికను తెప్పించుకొన్న కందుకూరి వీరేశలింగముగారికిఁ గాని, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథములను సంప్రదించిన క్రొత్తపల్లి సూర్యారావుగారికిఁగాని, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని కుమారసంభవము తాళపత్రగ్రంథము గుఱించి తెలియదు. ఉపరి, 1912వ సంవత్సరమునకు పూర్వము తంజావూరు సరస్వతీమహాలు గ్రంథా

లయమునందు కుమారసంభవముతాళపత్రగ్రంథము కలదనుటకు నిర్ధారకసాధనములేదు. పైపెచ్చు, కుమారసంభవము తాళపత్రగ్రంథము కట్టమీదఁగాని, లోపలఁగాని ఋజువు పఱిచిన ప్రాచీన తాళపత్రములఖపత్రిక లేదు. మానవల్లి రామకృష్ణకవిగారి చారిత్రిక విషయదోషము "నన్నెచోడుని కుమారసంభవము" నందు కలదు. ఇట్టి కుమార సంభవము కృత్యవతారికలోని సమాచారమునుబట్టి కుమారసంభవము రచనాకాలము నిర్ణయించుటకు సరియైన చారిత్రికసాక్ష్యము లేదు. కవితాసాక్ష్యము కావలసి నంత కలదు.

1. "దాసతాం కాళిదాసస్య కవయః కేన బిభ్రతి
ఇదానీమపి తస్యార్థా నుపజీవ న్త్యమీ యతః" 7శ్లో. 1స.
(కవులు ఇప్పటికిని ఎవరి అర్థములను గ్రహించి జీవింతురో, ఆ కాళిదాసునకు దాసులు కాని కవులు ఎవరు కలరు?)

అను శ్లోకమునకు,

"భాసురమతి వాల్మీకి
వ్యాసాదులు చనిన జగతి వరకవితాసిం
హాసనమెక్కి కవీంద్రుల
దాసులఁగా నేలెఁ గాళిదాసుఁడు పేర్మిన్." 19ప.1ఆ.

అను కుమారసంభవములోని పద్యము— సాహిత్యదర్పణశ్లోకమునకు పూర్వో దాహృతపద్యము మెఱుగు వలె— సానపట్టిన వజ్రము. అంతేకాదు.

"స్ఫుటనఖరదనాఙ్కానాం
పరిలగదార్ద్రదుకూలదర్శితోరు
వపు రనుకల మైక్షతక్షితీశో
జలకణదన్తురదీర్ఘకున్తలాగ్రమ్." 67శ్లో.6స.

(నీటి బిందువులతో నిమ్నోన్నతములైన దీర్ఘశిరోజాగ్రముల తోను, నీటితో తడిసిన సన్నని వలువలు ఒంటికి హత్తుకొనుట వలన కనఁబడు ఊరువులతోను, (దేవతావస్త్రములగుటచేత) ప్రస్ఫుట ముగా కనఁబడు నఖక్షతదంతక్షతములతోను ఒప్పుచున్న అంగనల శరీరములను రాజు అదేపనిగ చూచెను.)

అను ముంచటి శ్లోకమునకు,

"అంబరనామధేయ ముచితార్థముగా జలసిక్తమై దుకూ
లంబు లదృశ్యమయ్యెఁ గడులజ్జఁ జలింప సఖుల్ విటాలి మో
హంబునఁ జూడఁ గాలిఁ దడియారి తదంబరముల్ కటిప్రదే
శంబులఁ బొల్చెఁ దత్సతులు సంతసమంద విటాలి వందఁగన్.
292వ.9ఆ.

అను కుమారసంభవములోని పద్యము తీగసాగిన రాగి. పయి శ్లోకములు రెండును గంగాదేవి మధురావిజయములోనివి. మాఘుని శిశుపాలవధము మార్గము, బిల్హణుని విక్రమాంకదేవచరితము విధానము, శ్రీహర్షుని నైషధీయచరితము ప్రభావము తోపాటు, గంగాదేవి మధురావిజయము గమనమును గల గ్రంథము తెలుగు కుమార సంభవము. గంగాదేవి వీరకంపరాయల ప్రియభామిని. వీరకంపరాయలు విజయ నగరరాజు మొదటి బుక్కరాయల కొడుకు. మొదటి బుక్కరాయల కాలము[1] 1355—1377. మధురావిజయము 1371వ సంవత్సరమునందు జరిగినది[2]. కనుక మధురావిజయము కావ్యము రచనాకాలము పదునాల్గవశతాబ్ది చతుర్థపాదము. అందలి శ్లోకములను అనుసరించిన కుమారసంభవము రచనాకాలము పదునాల్గవశతాబ్ది కంటె అనంతరమగుట అపరిహార్యము. అనగా తిక్కనయుగము తిరిగిపోయి, ఎఱ్ఱన యుగము ఎగిరిపోయి శ్రీనాథయుగము వచ్చినది.

గంగాదేవి మధురావిజయమునందు తిక్కన స్తుతి కలదు. కనుక గంగాదేవి తెలుగు కావ్యములను చదివినట్లు కానవచ్చును. అందు కుమారసంభవమును ఒకటై, కుమారసంభవపద్యములను గంగాదేవియే అనుసరించినదని పూర్వపక్షము కల్పించ వచ్చును. కాని గంగాదేవి తిక్కనను స్తుతించినది కాని నన్నెచోడుని స్మరింపలేదు. అంతేకాదు. ఆమెయే అనుసరించిన సానపట్టిన వజ్రమును ముడివజ్రము చేయుట, తీగసాగిన రాగిని ముడిలోహము చేయుట సంగతముకాదు. ఉపరి, ఎందరో సంస్కృతకవులు తెలుగు కుమారసంభవమును అనుసరించుటకంటె, కుమారసంభవ కర్తయే ఎందరో సంస్కృతకవులను అనుసరించుట సహజము.

2. "కాదుకా దుదయాద్రికనకకూటం బిది
దంబైన సానవట్టంబు గాని
కాదుకా దిది సుధాకరపూర్ణబింబంబు
కాశ్మీరశంభులింగంబు గాని

కాదుకా దుదయరాగప్రకాశం బిది
నవకుంకుమాలేపనంబు గాని
కాదుకాదివి కళంకచ్ఛటారింఛోళి
పూజచేసిన కల్వపువ్వుఁగాని
యనఁగ సప్తార్ణవములు మిన్నందికొనఁగఁ
జంద్రకాంతోపలంబులు జాలువాఱ
నసమశరసార్వభౌము ముత్యాలగొడుగు
విధుఁడు విశ్వంబు వెన్నెలవెల్లిఁ దేల్చె." 42 ప. 2 .ఆ

ఇది శ్రీనాథుని భీమఖండములోని పద్యము. సంపుల్లసరసీరుహము.

"ఉదయగ్రావము పానవట్ట మభిషేకోదప్రవాహంబు వా
ర్ధి దరధ్వాంతము ధూపధూమము జ్వలద్దీపప్రభారాజికొ
ముది తారానివహంబు లర్పితసుమంబుల్‌గాఁ దమోదూరసౌ
ఖ్యదమై శీతగభస్తిబింబశివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్." 
133 ప. 2 ఆ.

ఇది ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యములోని పద్యము. పుండరీకముకుళము.

"శ్వేతద్వీపము చంద్రబింబము మహాక్షీరాబ్ధి దత్‌జ్యోత్స్న ద
ద్భాతిం గృష్ణుఁడు దన్మృగాంకము లసత్పద్మాలయాక్షిద్యుతుల్
ప్రీతిం జారుచకోరదంపతులు నాఁ బృథ్వీధరుంబోలి వి
ఖ్యాతిం బొల్పగు శారదాభినుతరాకారాత్రుల లత్యున్నతిన్."
774 ప. 6 ఆ.

ఇది కుమారసంభవములోని పద్యము. కుటిలకుట్మలము. ఇందు శ్రీనాథుని సీసము, ధూర్జటి మత్తేభము శివపరము. కుమారసంభవములోని పద్యము విష్ణుపరము. శ్రీనాథుని పద్యమునకు ధూర్జటి పద్యము శిష్యప్రాయము. ధూర్జటి పద్యమునకు కుమారసంభవములోని పద్యము వరివస్యామాత్రము. "ఉదయగ్రావము పాన వట్టము" అను ఎత్తుగడ, "శ్వేతద్వీపము చంద్రబింబము" అను పన్నుగడ సమానము. అంతేకాదు శ్రీనాథుని సీసపద్యమునందు వ్యర్థపదము లేదు. ధూర్జటి మత్తే

భమునందు పొల్లుమాటలేదు. కుమారసంభవములోని శార్దూలమునందు తద్యుతి, ప్రీతి, విఖ్యాతి అను పదములు ప్రాసమాత్రప్రయోజనములు. రెండుపాదములకు మూడుతత్తులు గణమాత్రప్రయోజనులు. ధూర్జటి పద్యములోని "జ్వలద్దీపప్రభారాజి" కి, కుమారసంభవములోని పద్యమునందలి "లసత్ప్రద్మాలయాక్షీద్యుతుల్" ప్రతిబింబము. "జ్వలత్" ఎంత అర్థసహితమో, "లసత్" అంత అర్థరహితము. ధూర్జటి పద్యములోని "ప్రాచీదిశన్" స్థలనిర్దేశము. కుమారసంభవములోని పద్యమునందలి "అత్యున్నతిన్" పాదపూరణము. చకోరదంపతులకు చారువిశేషణము చారువిశేషముకాదు. ఉపమానమైన "పృథ్వీధరున్" ఏకవచనము. ఉపమేయమైన "శారదాభినతరాకారాత్రులు" బహువచనము. అంతేకాదు. శ్రీనాథుని సీసపద్యము ఎంత ధారాశుద్ధిమంతమో, ధూర్జటిపద్యము అంతకు కొంత ధారాశుద్ధిమంతము. కుమారసంభవములోని పద్యము ఎంతమాత్రమును ధారాశుద్ధిమంతము కాదు. శ్రీనాథుని సీసపద్యమునకు ధూర్జటి మత్తేభము అనుసరణమువలె, ధూర్జటి మత్తేభమునకు కుమారసంభవములోని శార్దూలము అనుకరణము. ధూర్జటి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి. అష్టదిగ్గజకవి. శ్రీకృష్ణదేవరాయల కాలము[3] 1509-1530 కనుక ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యము రచనాకాలము పదునారవశతాబ్ది పూర్వార్థము. అందలి పద్యమును అనుకరించిన కుమారసంభవములోని పద్యము రచనాకాలము పదునారవశతాబ్ది పూర్వార్థముకంటె అనంతరమగుట అనుల్లంఘ్యము. అనగా, వచ్చిన శ్రీనాథయుగమును చెల్లిపోయి రాయలయుగము రాజిల్లినది.

కుమారసంభవములోని పద్యమిది ప్రబంధసారశిరోమణియందు కలదు. అది పదునెన్మిదవశతాబ్దికంటె అనంతరగ్రంథము. కుమారసంభవము పదునెన్మిదవ శతాబ్దికంటె పూర్వగ్రంథమైన, కుమారసంభవపద్యమును ప్రబంధసారశిరోమణియందు చేర్చినట్లు, కుమారసంభవము పదునెన్మిదవశతాబ్దికంటె అనంతరగ్రంథమైన, ప్రబంధసారశిరోమణిలోని పద్యమును కుమారసంభవమునందుకూర్చినట్లు గ్రాహ్యము. అదటుంచి పద్యమును అరసిన, ప్రబంధసారశిరోమణియందు చేర్చినట్లుకంటె, కుమారసంభవమునందు కూర్చినట్లు గోచరించును. కుమారసంభవకర్త వీరశైవుడు కాదుగాని శివభక్తుడు. శివభక్తులైన శ్రీనాథ, ధూర్జటుల భావాంబరవీథులలో శివస్వరూపము రూపుదాల్చినది. మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుడైన కాలమునందు తిక్కన భావాంబరవీథిలోను శివస్వరూపము రూపుదాల్చినది. (66 ప. 6 ఆ.ఉ.రా) శంభుదాసుడైన ఎఱ్ఱన భావాంబరవీథిలోను నృసింహపురాణమునందు శివస్వరూపము

రూపుదాల్చినది. (34 ప. 1 ఆ.) శివభక్తుడైన కుమారసంభవకర్త భావాంబరవీథిలో మాత్రము శివగాథ రచించుచున్నను విష్ణురూపము రూపుదాల్చినది ! ఉపరి, విష్ణువు బదులు కృష్ణుడు ! ఇది విష్ణుభక్తుడైన లేదా కృష్ణభక్తుడైన కవికి మాత్రమే సహజము. కుమారసంభవకర్తకు అసహజము. కనుక, ఏ లక్ష్మీపరిణయములోని పద్యమునో, ప్రబంధసారశిరోమణికర్త పరిగ్రహించిన, అది కుమారసంభవకర్త సంగ్రహించినట్లు అవగాహనమగును. ఇది ప్రబంధశిరోమణిలోని పద్యములు కుమారసంభవమునందు కూర్పునేర్పులగుటకు ఉపలక్షణము.

3. "అడిగెద నని కడువడిఁ జను
నడిగినఁ దను మగుడ నుడుగఁడని నెడ నుడుగున్
వెడనెడ చిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్." 103ప.8స్కం.

ఇది బమ్మెర పోతన భాగవతములోని పద్యము. జగత్ప్రసిద్ధము.

"తగుఁ దగదని మనమున మును
వగవఁగ నొడఁబడఁగ వగవ వగవఁగఁ బడయున్
దగుఁ దగదని వగవని వగ
వగవఁగఁ బని గలదె తనకు వగ మఱి జగతిన్." 551ప.10ఆ.

ఇది కుమారసంభవములోని పద్యము. అప్రసిద్ధము. పోతనగారి పద్యము మూసలో పోతపోసినట్లు కలదు.

ఇందు పోతనగారి పద్యము ఎంత సందర్భశుద్ధిసహితమో, కుమారసంభవములోని పద్యము అంత సందర్భశుద్ధిరహితము. పోతనగారి పద్యము ఎంత నిసర్గరమణీయమో, కుమారసంభవములోని పద్యము అంత కృతకవికారము. పోతనగారి పద్యము ఎంత సుదృఢబంధమో, కుమారసంభవములోని పద్యము అంత శిథిలబంధము. తనకు చెప్పకుండ, తల నిమురకుండ, తన కుచోపరిచేలాంచలమునైన వీడకుండ, ఏకాకిగ, వాహనమును గైకొనక, ఆయుధమును చేతఁబట్టక, పరివారమును పిలువక, హఠాత్తుగ, హడావిడిగ ఎక్కడికో బయలుదేరిన భర్తవెంట పరుగెత్తుచు, అడిగిన ఏమి కోపమునుగునో అని కొందలపడుచు మహాందోళన చెందిన లక్ష్మీదేవి సందేహడోల భాగవతపద్యము. కుమారస్వామితో యుద్ధమునకు సిద్ధపడిన

తారకాసురుని వారించుటకు సావకాశముగ శుక్రాచార్యులు వల్లెవేసిన రాజనీతిలోని ఏడవడొల్ల కుమారసంభవపద్యము. భాగవతములోని సర్వలఘుకంచము లక్ష్మీదేవి లఘుత్వమునకు వ్యంజకము. కుమారసంభవములోని సర్వలఘుకందము శుక్రాచార్యుల గురుత్వమునకు భంజకము. భాగవతపద్యము భావగతము. కుమారసంభవ పద్యము కూటకరణము. పోతన పద్యము అచ్యుప్రకృతి, కుమారసంభవపద్యము సాధ్యవికృతి అని స్వయంవేద్యము. అర్థవంతమైన పోతన పద్యమునకు అర్థహీనమైన కుమారసంభవపద్యము అనుకరణము. పోతన భాగవతము రచనాకాలము పదునైదవశతాబ్ది ఉత్తరార్థము. అంచలి పద్యమును అనుకరించిన కుమారసంభవము రచనాకాలము పదునైదవశతాబ్ది ఉత్తరార్థము కంటె అనంతరమగుట అనివార్యము. అనగా రాజిల్లిన రాయలయుగము రాణకెక్కినది.

ఇట "మన కవిరాజు రాజులకు "వగ''కలుగు విధమును హ్రస్వాక్షరములఁ గూర్చి వచించినాఁడు. హ్రస్వాలోచన గల రాజు వగఁగూడునని కవి భావించి యట్లు రచించెనని తోచుచున్నది." అని అమరేశం రాజేశ్వరశర్మగారి అభిప్రాయము[4]. కాని, "రాజులకు "వగ"కలుగు విధమును హ్రస్వాక్షరములఁగూర్చి వచింపవలసిన ఆవశ్యకము లేదు. హ్రస్వాలోచన గల రాజు వగఁగూరవచ్చును. ప్రకరణమునందు రాజు తారకాసురుడు. తారకాసురుని ఆలోచన హ్రస్వము కాదు. దీర్ఘముకాదు. పూర్ణానుస్వారము. కుమారస్వామి శక్తి తెలియనిఆలోచన. అంతేకాదు. కుమారసంభవపద్యమునకు తారకాసురుడు శ్రోత. వక్త శుక్రాచార్యుడు. వక్తృపరముగ పద్యము వక్రము. పోతన పద్యమును అనుకరించుటవలని అనర్థకము. పోతన గజేంద్రమోక్షములోని పద్యమునే కాదు; వామనావతారచరితములోని పద్యమును కుమారసంభవకర్త అనుకరించినట్లు పూర్వోక్తము. కనుక బలవత్సారస్యకల్పనము కేవలము కల్పనాగౌరవమునకు తావలము.

4. "మదనాగయూధసమగ్రదేశము గాని
కుటిలవర్తనశేషకులము గాదు
ఆహవోర్వీజయహరినివాసము గాని
కీశసముత్కరాంకితము గాదు
సుందరస్యందనమందిరంబగుఁ గాని
సంతతమంజులాశ్రయము గాదు

మోహనగణికాసమూహగేయము గాని
　　యూథికా నికర సంయుతము గాదు
సరసపత్పుణ్యజననివాసమ్ము గాని
కఠినవిర్దయ దైత్యసంఘమ్ము గాదు
కాదుకాదని కొనియాడఁ గలిగినట్టి
పురవరాగ్రమ్ము సాకేతపురవరమ్ము."　　　　27 ప. బా. కాం.

ఇది మొల్ల రామాయణములోని పద్యము. ఇట్టి సీసపద్యము మొల్లరామాయణమునకు ముందు గ్రంథములందు మృగ్యము. తర్వాతి గ్రంథములందైనను క్వాచిత్కము. మొల్లరామాయణమునందే ఇట్టి సీసపద్యములు మఱొక రెండుకలవు. (34, 36 ప. బా. కాం.)

"రాజకదంబవిరాజితంబగుఁ గాని
　　కంటకపార్థివోత్కరము గాదు
పద్మాలయాతిశోభనమనం జనుఁ గాని
　　కుముదోదయాదిసంకులము గాదు
శుద్ధసువర్ణప్రసిద్ధాత్మమగుఁ గాని
　　వరచిత్రవర్ణసంకరము గాదు
పరమౌషధిప్రభాభాసురంబగుఁ గాని
　　దుస్తృణజ్యోతివిద్యుతము గాదు
వనకులంబునుఁ దత్సరోవరకులంబుఁ
జెలువమగు హర్మ్యకులము సత్క్షేత్రకులముఁ
బోలయ విన్నింటిలోఁ దాను బోలియున్న
ప్రస్తుతంబగు నోషధీప్రస్థపురము."　　　　963 ప. 7 ఆ.

ఇది కుమారసంభవములోని పద్యము. సీసపాదములు మొల్లరామాయణములోని పద్యమును, ఎత్తుగీతము ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్రములోని పద్యమును సంవదించునది.

ఇందు మొల్ల పద్యము మొత్తము మృదుమధురపదసంయోజన విలసితము. కుమారసంభవములోని పద్యము సంవదింపనంతవఱకు కటుకర్కశపదగుంభన పటి

ష్టము. మొల్ల పద్యము నిసర్గరమణీయము. కుమారసంభవములోని పద్యము సంసర్గరమణీయము. అనగా మొల్లరామాయణములోని పద్యమునకు, ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్రములోని పద్యమునకు కలిసి, కుమారసంభవములోని పద్యము అనుకరణమని అవగాహనమగును. మొల్ల రామాయణము రచనాకాలము పదునైదవశతాబ్ది తుదిభాగము. ఎడపాటి ఎఱ్ఱన మల్హణచరిత్ర రచనాకాలము పదునారవ శతాబ్ది పూర్వార్ధము[5]. అందలి పద్యములను అనుకరించిన కుమారసంభవములోని పద్యము పదునారవశతాబ్ది పూర్వార్ధముకంటె అనంతరమగుట అవశ్యము. అనగా రాజిల్లిన, రాణకెక్కిన రాయలయుగము రాటుదేలినది.

కుమారసంభవములోని పద్యమిది ఉదాహరణపద్యములు అను సంకలన గ్రంథమునందు కలదు[6]. ఓషధిప్రస్థపురవర్ణనము కావున, కుమారసంభవపద్యమని తోచును. కాని, కుమారసంభవమునందు ఓషధిప్రస్థపురవర్ణనము సుమారు నలుబది పద్యములందు కలదు. (923-965) అందు మున్ముందుగ ఓషధీప్రస్థపురవర్ణన సీస పద్యము ఇట్టిదే కలదు. తదుపరి పొలము, పొలముపనులు సేయు పొలతులు. ఫల వృక్షములు, పురంధ్రులు, కృత్రిమాచలములు, పక్షిరావములు, మదకరులు, ఉద్యాన వనములు, పంఖాజలము, కోట, హర్మ్యములు, రాజహర్మ్యము, దేవాలయములు, పురవీథులు, విప్రులు, వైశ్యులు, భటులు, కామినులు, వాయువు, ధ్వనులు-వీని వర్ణనము కలదు. మఱల ఓషధీప్రస్థపురవర్ణన సీసపద్యము కలదు. తొలి, మలి ఓషధీ ప్రస్థపురవర్ణనసీసపద్యములందు "ఓషధిప్రస్థపురము" అను మకుటముకలదు. ఒక సారి ఒకవిధముగ ఓషధీప్రస్థపురమును వర్ణించి, మఱల అదేవిధముగ ఓషధీప్రస్థ పురమును వర్ణించవలసిన ఆవశ్యకములేదు. ఆవశ్యకములేని పద్యమే ఉదాహరణ పద్యములు అను సంకలనగ్రంథమునందుకలదు. అందును, ఇందును తృణజ్యోతి అనుటకు బదులు తృణద్యోతి అను అపపాఠముకలదు. కనుకవే గిరిజాపరిణయము లోని పద్యమునో ఉదాహరణసంకలనకర్త పరిగ్రహించిన, అది కుమారసంభవకర్త సంగ్రహించినట్లు అవగాహనమగును.

5. "కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్కమ చూచినట్ల తోఁ
బలుకఁ గడంగినట్ల కడుభావగభీరత లబ్బినట్ల పెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంచెను దాను బోటియున్.

138ప.1అ.

ఇది పింగళి సూరన ప్రభావతీప్రద్యుమ్నములోని పద్యము. ప్రకరణోచితమని పూర్వోక్తము.

“కలకల నవ్వునట్లు దనుకంబునఁ గన్గవ విచ్చి ప్రాణపతిన్
పోలయఁగఁ జూచునట్లు దనివోవఁగఁ జెల్వయుఁ గౌఁగిలింపఁ జే
తులు పచరించు నట్లచటుతో రతికేలికి నప్పళించు న
ట్లెలమి నటించుచుండె సతి కీశ్వరు రూపెదురం బ్రసన్నమై.”

598ప.5ఆ.

ఇది కుమారసంభవములోని పద్యము. ప్రకరణానుచితమని పూర్వోక్తము.

ఇందు కుమారసంభవపద్యమునకే పింగళి సూరన ప్రభావతీప్రద్యుమ్న పద్యము అనుకరణమని ఇంతవఱకు అందఱి అభిప్రాయము.— ఒక్క కట్టమంచి రామలింగారెడ్డిగారికి మాత్రము ఒకింత సందేహము కలదేమో!— రాయలయుగము రాజిల్లిన, రాణకెక్కిన, రాటుదేఱిన తర్వాత ప్రభావతీప్రద్యుమ్నపద్యము కుమారసంభవమునకు అనుకరణమని అభిప్రాయపడవలసిన ఆవశ్యకము లేదు. అంతేకాదు. రాయలయుగములోని తిమ్మన, పెద్దన, రాయలు, ధూర్జటి, తెనాలిరామకృష్ణుడు మొదలైన ప్రసిద్ధకవుల పద్యములకును కుమారసంభవమునందు అనుకరణములు కలవని పూర్వోక్తము. కనుక పింగళి సూరన పద్యమునకును కుమారసంభవపద్యము అనుకరణమగుట అనుకూలము. ఉపరి, ప్రభావతీప్రద్యుమ్నమునందు కలకలలాడు పద్యము కుమారసంభవమునందు మిలమిలలాడు వేషము. కారణము, ప్రభావతీప్రద్యుమ్నములోని చిత్రఫలకము ప్రధానకథాప్రయోజనాత్మకము. సహజసిద్ధము. అది లేనిది కథ అరంగుళము ముందునకు సాగదు. కుమారసంభవములోని చిత్రఫలకము ఉబుసుపోని ఉద్యోగము. అనుకరణసాధ్యము. అది లేకుండ కథ ఆమడ దూరము కాదు; అంతము వఱకు హాయిగా సాగిపోవును. ప్రభావతి,ఆమె చెలికత్తె పార్వతి ఇచ్చిన చిత్రఫలకములోని ప్రద్యుమ్నుని రూపమును చూచుటకు జంకిరని పింగళి సూరన కల్పనము. పార్వతికి తానే రచించుకొన్న చిత్రఫలకములోని శివుని రూపము కౌగిలించుకొనుటకు చేతులు సాచినట్లు, అమాంతము రతికేళికి అప్పళించు నట్లు నాట్యము సేయుచు కనిపించినదని కుమారసంభవకర్త జల్పనము! పింగళి సూరన కల్పనము రాయలయుగమునకు రాచబాట. కుమారసంభవకర్తజల్పనము దక్షిణాంధ్రయుగమునకు దగ్గఱిదారి. దక్షిణాంధ్రయుగలక్షణలక్షితములైన పద్య

ములు కుమారసంభవమునందు కొల్లలు. కనుక ప్రభావతీప్రద్యుమ్నములోని కళకళ లాడు పద్యమునకు, కుమారసంభవములోని మిలమిలలాడు పద్యము అనుకరణము. ప్రభావతీప్రద్యుమ్నము రచనాకాలము పదునారవశతాబ్ది ఉత్తరార్ధము. అందలి పద్యమును అనుకరించిన కుమారసంభవము రచనాకాలము పదునారవశతాబ్ది ఉత్తరార్ధము కంటె అనంతరమగుట అప్రధృష్యము. అనగా రాటుదేలిన రాయలయుగము రంగు పోయి, దక్షిణాంధ్రయుగము దఖలుపడినది.

6. "గంగాప్రవాహంబు గాఁబోలునని వసి
ష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబు వెల్లువయని నిలింపాదులు
మునుకొని దోసిళ్ల ముంచిక్రోల
దుగ్ధాంబునిధి యని తోయజాక్షుఁడు శేష
పర్యంకమిడుకొని పవ్వళింపఁ
బరమేశు విశ్వరూపంబని బ్రహ్మాదు
లమర దండప్రణామములు సేయఁ

దలఁప భూనభోంతరముల కొలఁది వెలిసి
బెరసి యెన్మిది దిక్కులఁ బొరలి పొరలి
దట్టముగ నంతకంతకుఁ దనరి తనరి
యిట్టలంబుగ వెన్నెల నిట్ట వొడిచె." 69ప, 6అ.

ఇది జక్కన విక్రమార్కచరిత్రములోని పద్యము.

"ఆకాశనదియని యనిమిషాంగనలెల్ల
వేడుకతో జలక్రీడ సలుపఁ
బాలమున్నీరని పంకజనాభుండు
ఫణిశయ్యఁ గావించి పవ్వళింపఁ
బాదరసంబని మోదించి సిద్ధులు
మించి ఘటంబుల నించుకొనఁగ
నమృతంబు సోనని యఖిలామరశ్రేణి
చెలఁగి పానంబులు సేయుచుండ

వెల్లివిరియుచు నుబ్బుచు విశదకాంతిఁ
బొదలుచును దివ్యమగుచును భూరిమహిమ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్ఛవెన్నెల విమలమై పెచ్చు పెరిగె."

ఇది వేంకటకవి కృష్ణవిలాసములోని పద్యము.

"దుగ్ధాంబునిధి నిట్టఁ దోఁచెనోయని శేషుఁ
బాన్పుగా హరినీటఁ బవ్వడింప
నొదవి సుధారస ముప్పొంగెనో యని
దేవతల్ దనివోవఁ ద్రావఁదలఁపఁ
దొలఁకాడు మిన్నేఱు వెలివిరిసెనొ యని
లీల సురాంగనలోల లాడఁ
బాదరసంబుర్విఁ బరఁగెనో యని సిద్ధ
నికరంబు కలశముల్ నించికొనఁగఁ
బాండురాంగుండు విశ్వరూపంబు దాల్చి
యెలసెనోయని సద్భక్తు లెలమిఁగొలువ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్ఛవెన్నెల విమలమై యలరి కాసె.'' 118 ప. 8 ఆ.

ఇది కుమారసంభవములోని పద్యము.

ఇందు "ఈ భావములలో జక్కనయొక నాలుగును, వేంకటకవి మఱియొక నాలుగును గ్రహించుట చోద్యము.'' అని మానవల్లి రామకృష్ణకవిగారి ఆశ్చర్య ప్రకటనము[8]. అది యథాక్షరముగ తిమ్మావఝ్ఝుల కోదండరామయ్యగారి అనుకరణము[9]. పయి సీసపద్యములను సరిగా పరిశీలించిన, "చోద్యము" అర్థాంతరమును ఆశ్రయించును.

జక్కన పద్యమునందు ఋషులు, దేవతలు, విష్ణువు, శివుడు అను ఆరోహణ క్రమము కలదు. 'ఉత్తరోత్తరము బలీయము' అన్నట్లు ఉజ్జ్వలము. నాలుగు సీస

పాదములందును నాలుగు సంభావనములు, ఎత్తుగీతమునందు వెన్నెల విరిసిన చందము కలదు. పద్యరచన పొందిక పొసగినది.

వేంకటకవి పద్యమునందు అప్సరసలు, విష్ణువు, సిద్ధులు, దేవతలు అని క్రమభంగము కలదు. నాలుగు సీసపాదములందును నాలుగు సంభావనములు, ఎత్తు గీతమునందు వెన్నెల విరిసిన చందమును కలదు. పద్యరచన పొందిక పొసగినది. కాని, జక్కన సంభావనములలోని ఒక సంభావనము వేంకటకవి సంభావనములందు లేదు. అది శివవిలాసము. కృష్ణవిలాసమునకు వ్యతిరేకము. పరమేశ్వరుని విశ్వ రూప ప్రదర్శనమును కాదని, కృష్ణుని విశ్వరూపప్రదర్శనమును సంభావించుటకు, అది వెన్నెలకు విరుద్ధము. కనుక జక్కనను అనుకరించిన వేంకటకవి పరమేశ్వర పరమైన సంభావనమును పరిహరించి, సిద్ధులపరమైన సంభావనమును ప్రత్యామ్నాయ కల్పనముగ పరిభవించుట సహజము. అంతేకాదు శ్రీనాథయుగములోని జక్కన గంగాప్రవాహమునకు వసిష్ఠాదుల అనుష్ఠానమును భావించుట, క్షీణయుగములోని వేంకటకవి ఆకాశనదికి అనిమిషాంగనల జలక్రీడను తలపోయుట అంతకంటె సహ జము. కనుక జక్కన సీసపద్యము ఒజ్జబంతి. వేంకటకవి సీసపద్యము వంతపాట. అనగా జక్కన పద్యమునకు వేంకటకవి పద్యము అనుకరణము.

ఇక కుమారసంభవపద్యమునందు విష్ణువు, దేవతలు, అప్సరసలు, సిద్ధులు అని ముందు అవరోహణక్రమము, తర్వాత అమాంతము శివుడు అని ఆరోహణ క్రమముకలదు. ఈ ఆరోహణావరోహణక్రమవిపర్యయమునందు సంగీతరహస్యము కలదేమోగాని, సాహిత్యసారస్యము కానరాదు. అంతేకాదు. నాలుగు సీసపాదము లందును నాలుగుసంభావనములు కాక, ఎత్తుగీతమునందును ఒక సంభావనము వ్యాపించినది. పద్యరచన పొందిక సడలినది. ఉపరి, సహజములైన జక్కన, వేంకటకవుల సంభావనములు అయిదును కుమారసంభవపద్యమునందు కృతకముగ కుదిరినవి. కుమారసంభవమునకు పరమేశ్వరపరమైన సంభావనము వ్యతిరేకము కాదు. సిద్ధపరమైన సంభావనమును విరుద్ధముకాదు. అంతేకాదు వసిష్ఠాదుల అను ష్ఠానము అనిష్టము కాదుగాని, అనిమిషాంగనల జలక్రీడ అభీష్టము. "శేషపర్యంక మిడుకొని పవ్వళింప", "ఫణిశయ్యఁ గావించి పవ్వళింప" జక్కన, వేంకటకవుల రచనలలోని సారళ్యము, "శేషుఁ బాన్పుగా హరినీటఁ బవ్వళింప" అను కుమార సంభవపద్యరచనమునందు కుప్పకూలినది. దుగ్ధాంబునిధి అని తోచిన హరి క్షీర

సముద్రమున పవ్వళించెననక, క్షీరసముద్రమున (నీట) పవ్వళించెననుట అనాలోచితము. సుధారసమునకు "ఒదవి" అను విశేషణము అధికప్రసంగము. "వెల్లి విరిసెనో" అనుటకు బదులు "వెలివిరిసెనో" అనుట ప్రాసయతిమాత్రప్రయోజని. కనుక, జక్కన విక్రమార్కచరిత్రములోని పద్యమునకు, వేంకటకవి కృష్ణవిలాసములోని పద్యమునకు, కలిసి కుమారసంభవములోని సీసపద్యము అప్పగింత. అనగా జక్కన, వేంకటకవుల పద్యములు రెండింటికిని కుమారసంభవపద్యమే అనుకరణము.

> "ఈ కృష్ణవిలాసకర్తయగు వేంకటకవి, కవిస్తుతిలోఁ గవిత్రయమును వేములవాడ భీముని కేతన కవిరాక్షసుని శ్రీనాథసోమభాస్కర పుత్తేటి రామన పెద్దన తిమ్మన తెన్నాలిరామలింగుల స్తుతించి యుండినందున నిటీవలివాఁడని చెప్పనక్కఱలేదు. నన్నెచోడుని ౨౦౦ సంవత్సరములకిటీవలి వాడని చెప్ప సాహసింతురేమో!"

అని కుమారసంభవము ప్రథమభాగమును ప్రకటించినపుడే, మానవల్లి రామకృష్ణ కవిగారి ఆందోళనము[10]!

కృష్ణవిలాసకర్త అగు వేంకటకవి అనగా వెన్నెలకంటి వేంకటాచలము. ఇతడు విష్ణుపురాణమును తెనిఁగించిన వెన్నెలకంటి సూరన మునిమనుమడు వెన్నెలకంటి వెంగన్నకు మునిమనుమడు[11].




ఇందు తిప్పన్న తెట్టు సంస్థానాధిపతి "వేజెళ్ల పెదనారాయణరాజపుత్త్రుఁడగు కృష్ణమరాజు వలనఁ గరణికమును సంపాదించినట్లున్నది."[12]

"పరఁగ వేజెళ్ల కృష్ణభూపాలు కరుణా
కరణమన నేర్పు మీఱంగ ధరణిఁ బ్రజల
నరసి పాలించి శుభముల నలవరించి
మించి బంధులఁ జాల పోషించె నెలమి."

ఇందలి కృష్ణమరాజు కాలము[13] 1730-50. కనుక వెన్నెలకంటి తిప్పన్న కాలము పదునెన్మిదవశతాబ్ది మధ్యభాగము. అతని తమ్ముడు జగ్గన్న పెద్దకొడుకు వెన్నెలకంటి వేంకటాచలము కాలము పదునెన్మిదవశతాబ్ది తుదిభాగము. అప్పటి వేంకటకవి కృష్ణవిలాసములోని పాదరసము, పాదద్వయమును ప్రతిఫలించిన కుమారసంభవము రచనాకాలము పదునెన్మిదవశతాబ్ది తుదిభాగము కంటె అనంతర మగుట అగతికము. అనగా దళితుపడిన దక్షిణాంధ్రయుగమును దాటిపోవుచు, ఆధునికయుగము సమీపించినది!

7. "హారహాసాకాశగఙ్గాజల జలరుహనీహారనీహారధాత్రీ
ధరనీహారాంశుతారావనిధరశరదమ్భోధరక్షీరనీరా
కరతారాభారతీ దిగ్గదనిరదనపీయూషడిణ్డీరముక్తా
కరకున్దేన్దేభహంసోజ్జ్వలవిశదయశోవల్లభం శాన్తినాథం."

ఇది ఒక శాసనములోని శ్లోకము.

"హారహాసాకాశగంగాత్యమలజలమరాళాబ్జనీహారధాత్రీ
ధరకర్పూరేందుకాకోదర వరపతి దిగ్దంతిపక్షీరనీరా
కరముక్తాహారకుందోత్కరరజతశరత్కౌముదీద్యోతకీర్తి
శ్వరు నాత్మారాము వాణీవరు వరగురు నర్వజ్ఞు నజ్ఞానదూరున్."
475వ.4ఆ.

ఇది కుమారసంభవములోని పద్యము.

ఇందు కుమారసంభవపద్యమును శాసనకవి సంగ్రహించెనని మానవల్లి రామకృష్ణకవిగారి వల్లవి[14]. అందుకు శాసనకవి జైనకవి అగుటవలన "జైనకవులు శబ్దార్థచౌర్యమునకు వెనుదీయరనుటకు సహస్రప్రయోగములు కలవు." అని కూడ మానవల్లి రామకృష్ణకవిగారి అనువృత్తి[15]. "జైనకవులు శబ్దచౌర్యమునకు వెను

దీయరసుటకీ ప్రయోగమొక్కటే చాలు." అని దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారి చరణము[16]. అంచటి బృందగానము. "శబ్దార్థచౌర్యమునకు వెనుదీయని" లక్షణము ఒక్క జైనకవులకు మాత్రమే "జన్మహక్కు" కాదు. శైవకవులకు, వైష్ణవకవులకు, స్మార్తకవులకు, పూర్వకవులకు, నవ్యకవులకు- సర్వకవులకును సర్వస్వామ్య సంకలితము. అది నిమిత్తముగ శ్లోకపద్యముల పౌర్వాపర్యము అనిశ్చేయము. శ్లోకపద్యములే నిశ్చాయకములు. కనీసము "జల జలరుహనీహారనీహార" అను శ్లోక పంక్తి, "అత్యమలజలమరాళాబ్జ" అను పద్యపంక్తి తఱచిచూచిన తత్త్వదర్శనము కాఁగలదు.

శ్లోకము, పద్యము మహాస్రగ్ధరావృత్తములు. సంస్కృతమహాస్రగ్ధరకు యతిస్థానమునందు అక్కఱలేని అక్షరమైత్రి తెలుగుమహాస్రగ్ధరకు మఱి అవశ్యకము. "హారహాసాకాశగఙ్గాజలజలరుహనీహారనీహార-" అను శ్లోకపంక్తిని అనుప్రాసము కలదుగాని, మొదటి యతిస్థానమునందు అక్షరమైత్రిలేదు. "హారహాసాకాశగంగాత్యమలజలమరాళాబ్జనీహార-" అను పద్యపంక్తిని అనుప్రాసము చెడినదిగాని, మొదటి యతిస్థానమునందు అక్షరమైత్రి కుదిరినది. పద్యము శ్లోకమైన, సంస్కృతయతికి పద్యపంక్తిని మార్చవలసిన ఆవశ్యకములేదు. శ్లోకము పద్యమైన, ఆంధ్రయతి మైత్రికి శ్లోకపంక్తిని మార్చవలసిన ఆవశ్యకముకలదు. ఇది శ్రీనాథుని నైషధాంధ్రీకరణములోని శబ్దానుసరణము[17] తెలిసినవానికి తేటతెల్లము. కనుక శాసనశ్లోకము మూలము, కుమారసంభవపద్యము అనువాదము.

ఒక్క ప్రథమపాదము మాత్రమేకాదు; ద్వితీయతృతీయపాదములును ఇందుకు సాకిరులే. శ్లోకద్వితీయచరణములోని రెండు యతిస్థలములందును అక్షరమైత్రిలేదు. అందుకు "తారావని" అను పదబంధము తావున "కాకోదర" అను పదబంధము, "అమ్భోధర" అను పదబంధమునెడ "దిగ్దంతి" అను పదబంధము పద్యద్వితీయ పాదమునందు అక్షరమైత్రికి ఆవశ్యకము. అట్లే శ్లోకతృతీయచరణములోని రెండవ యతిస్థలమునందు అక్షరమైత్రిలేదు. అందుకు "పీయూష" అను పదబంధమునకు బదులు "శరత్కౌముది" అను పదబంధము పద్యతృతీయపాదమునందు అక్షర మైత్రికి ఆవశ్యకము. అంతేకాదు. శాసనశ్లోకములోని సహజశబ్దసౌందర్యము కుమార సంభవపద్యమునందు శ్లథమైనది. ఉపరి, శాసనశ్లోకములోని ధారాశుద్ధి కుమార సంభవపద్యమునందు కుంటువడినది. కారణము శ్లోకము మూలము, పద్యము అనువాదము అగుటమాత్రమే. ఇది పద్యరచనాపాటవము-కాదు-ఛందః పరిజ్ఞానలేశము

కలవారికిని కన్నులకు కట్టవలసిన విషయమే. అంచయును శ్లోకమే పద్యమునకు అను వాదమని తలంచుట ఆశ్చర్యజనకము. శ్లోకపద్యములను సరిగా పరిశీలించిన, పద్యమే శ్లోకమునకు అనువాదమని స్వయంవేద్యమగును.

శాసనశ్లోకము గురించి, "కాలాముఖమతము ప్రక్కనుండు జైనమతములో ....నగపడుచున్నది. ఈ శాసనము త్రైలోక్యమల్లుని కాలములోనిది." అని మానవల్లి రామకృష్ణకవిగారు అందిచ్చిన సమాచారము[18]. త్రైలోక్యమల్లుడు కల్యాణి చాళుక్యరాజైన మొదటి సోమేశ్వరుడు. అతని కాలము[19] 1042-1068. అనగా రాజరాజనరేంద్రుని సమకాలికుడు. కనుక శాసనకాలము నన్నయయుగము. నన్నయయుగమునందైన, కుమారసంభవకర్త కాలాముఖమతములోని శాసనమును గాక, "కాలాముఖమతము ప్రక్కనుండు జైనమతము" లోని శాసనమును చూడవల సిన ఆవశ్యకము కానరాదు. అంతేకాదు ఆ శాసనశ్లోకమును అనుకరించవలసిన ఆవశ్యకమును కానరాదు. ఉపరి. శాసనశ్లోకము జైనగురుశాంతినాథస్తుతి. కుమార సంభవపద్యము గురులింగజంగమమల్లికార్జునస్తుతి. "కాలాముఖమతము ప్రక్కను జైనమతము" కంటె, జైనమతము ప్రక్కను కాలాముఖమతము వెలసినను, జైన మతము పొత్తున శైవమతములేదు. జైన, శైవమతములకు వలె, జైనవైదిక మతములకును బద్ధవైరము. జైనగురువునకు, శైవగురువునకును షష్ఠాష్టకము. జైనగురుస్తుతిని శైవగురుస్తుతిని మాత్రమేగాక, అభేదాధ్యవసాయి కల్పనమున శ్రీశైలమల్లికార్జునస్వామిస్తుతికూడచేయుట ప్రాచీనకవిపద్ధతికాదు. అంతేకాదు. జైనమతములోని శాసనశ్లోకము నన్నయయుగము మొదలు దక్షిణాంధ్రయుగము వఱకు ప్రాచీనకవికి కన్నులపండుగకాదు. శాసనపరిశీలనాభ్యాసముకల నవీనకవికి మాత్రమే వయనపర్వము కాఁగలదు. భారతావనియందు చరిత్రభానూదయము కానిది శాసనపరిశీలనావకాశములేదు. దక్షిణభారతదేశమునందు శాసనపరిశీలనము పంతొ మ్మిదవశతాబ్ది ఉత్తరార్థమునందు ఉజ్జ్వలముగ సాగినది. ఆ కాలమునుండి మాత్రమే నవీనకవికి శాసనపరిశీలనము సాధ్యము. కనుక శాసనశ్లోకమును అనుక రించిన కుమారసంభవము రచనాకాలము పంతొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధము లేక పంతొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధము కంటె అనంతరమగుట అనతిక్రమణీయము. అనగా దక్షిణాంధ్రయుగము దాటిపోయి ఆధునికయుగము అరుదెంచినది !

కుమారసంభవకర్తకు కొణిదెనశాసనముతోను, బలిగ్రామశాసనముతోను, పరి చయము కలదని పూర్వోక్తము. ఇది జైనమతములోని శాసనముతోడి పరిచయము. ఇన్ని శాసనముల పరిచయము శాసనపరిశీలనాభ్యాసము లేనిచో దుర్ఘటము.

8. "మరణకాలమైన మఱి జన్మదేశంబుఁ
దలఁచు నష్ట మట్టి తలఁపు తలఁపె
యధిపుఁ బాసినపుడ యలఁదుర వలవదె
మెఱత మెట్టఁబడిన మీను వోలె."   162ప.8ఆ.

ఇది కూడ కుమారసంభవములోని పద్యము. విటీవిటులు "కామతత్త్వమత భేదములు గోష్ఠీవాదములు సేయు" ఘట్టములోనిది. దీని ముందు పద్యమునందు సమరతివిషయము కలదు. (161ప.) దీని తరువాతిపద్యమునందు సంభోగగతివిష యము కలదు. (163ప.) ఇందేమి విషయము కలదు? ఒంటె చనిపోవునపుడు జన్మదేశమును తలచును. కాని చేరలేదు. కారణము చనిపోవు సమయము. కనుక అట్టి తలపు తలపు కాదు. అనగా ఆవిధమైన ఆలోచన నిష్ప్రయోజనము. ఇది పూర్వార్ధములోని విషయము. ఇక ఉత్తరార్ధములోని విషయము— ఆడది భర్తను బాసినప్పుడే దుఃఖింపవలయును. ఎట్లు? మెట్టఁబడిన మీను వలె. అప్పుడే ఎందుకు దుఃఖింపవలయును? ఆ తర్వాత దుఃఖించి ప్రయోజనము లేదు. అప్పుడే దుఃఖించి మాత్రము ప్రయోజనము కలదా? ప్రయోజనము లేకపోయినను అప్పుడే దుఃఖించుట లోకసహజము కద! దుఃఖింపవలదా? అను ప్రశ్నఎందుకు? దుఃఖింపవలయును అను ప్రబోధమును ఎందుకు? అదటుంచి, సమరతికి, సంభోగగతికి నడుమ అధిపుఁ బాసిన అతివ స్థితి ఎందుకు? అందేమి కామతత్త్వమతభేదము కలదో?

ఇట "'ఇంకెడు పంకమధ్యమున నెండఁ దలంకెడు మీను వోలె నేణాంకని భాస్య యుండెఁ దలిరాకులఁ జేసిన పాన్పుపై' ఉ-ఆ—౨'' అని కవిగారి లఘుటీక[20]. ఉ అనగా ఉదయనోదయము. ఉదయనోదయములోని పద్యమిది:

"ఇంకెడి పంకమధ్యమున నెండఁ దలంకెడు మీను వోలె నే
ణాంకనిభాస్య యుండెఁ దలిరాకులఁ జేసిన పాన్పుపై సఖుల్
శంకిలి కప్పటప్పటి కలందిన చందనకర్దమంబులోఁ
గ్రుంకి మనోజతాపమునఁ గుందుచు నుల్లము దల్లడిల్లగన్."

ఇది మృగావతి విరహావస్థ. ఆమె చెలికత్తెలు మెత్తిన మంచిగంధమనెడి బురదలో మునిగియు, మన్మథతాపమువలన ఉల్లము తల్లడిల్ల దుఃఖించుచుండెను. అందుకు నీరింకెడి బురద నడుమనుండియు ఎండలో తలంకెడు చేప ఉపమానము. మృగావతికి చేపకు, చందనకర్దమమునకు ఇంకెడి పంకమధ్యమునకు, మనోజ

తాపమునకు ఎండకు, ఉల్లము తల్లడిల్లుటకు తలంకుటకు ఉపమానోపమేయభావము ఉజ్జ్వలముగ కలదు. సాదృశ్యకల్పనము సమగ్రసుందరము. బురదలోనుండియు ఎండకు తట్టుకొనిలేకపోవుట చేపకు నైజము. ఉదయనోదయపద్యము సహజము.

కుమారసంభవపద్యము మాత్రము కృతకము. అంతేకాదు. "మెట్టఁబడిన మీను" అను పలుకుబడి అరయవలసినది. అధిపుఁ బాసినపుడె అతివ మెట్టఁబడిన మీను వలె అలదురవలెనట! మెట్టమీద పడిన చేప అలదురునా?- "మెట్టబడిన మీను- ఒడ్డున బడిన చేప - గిలగిలలాడుతుంది" అని పదబంధ పారిజాతమునందు కలదు[21]. కాని, ఒడ్డున బడిన చేప, గట్టున బడిన చేప అను ఆరోపములు పదబంధ పారిజాతమునందు లేవు. కాని, లోకవ్యవహారమునందు కలవు. ఒడ్డున పడిన చేప, గట్టున పడిన చేప అనగా, "గంగాయాం ఘోషః" అన్నటుల, ఒడ్డువద్దని వలలో పడిన చేప, గట్టువద్దని వలలో పడిన చేప అని, అవి మిక్కిలి రుచికరములని మత్స్యభక్షకుల వాడుక. అది వైజ్ఞానికశాస్త్రము అంగీకరించునది. ఆడచేప గ్రుడ్లు పెట్టునపుడు తక్కువలోతు నీటిలోనికి వచ్చునట. ఒడ్డువద్దని, గట్టువద్దని నీటిలోతు తక్కువ ఉండును. గ్రుడ్లుపెట్టుటకు ఒడ్డువద్దకి గట్టువద్దకి, వచ్చిన చేప వలలో పడును. అది గ్రుడ్లతోడి చేప. అనగా సెన గల చేప. సెన రుచికరము. సెన గల చేప మిక్కిలి రుచికరము. పదబంధపారిజాతములోని "మెట్టబడినమీను" అను ఆరోపమునకు కుమారసంభవములోని ప్రకృతసందర్భమే ఆధారము. అది ఒడ్డున పడిన చేప, గట్టున పడిన చేపవంటి పలుకుబడి కాదు. "ఇంకెడు పంకమధ్యమున నెండఁ దలంకెడు మీను" వంటి పలుకుబడియును కాదు. "ఫిష్ అవుటాఫ్ వాటర్" అను ఇంగ్లీషు పలుకుబడివంటిది. "హి ఈజ్ లైక్ ఎ ఫిష్ అవుటాఫ్ వాటర్" అనగా అతడు గిలగిలలాడుచున్నాడు అని గాన, చచ్చుచున్నాడు అనిగాని అర్థము కాదు. నీటిలోని చేపవలె ఎగురలేడని అనగా నిస్సహాయుడని అర్థము. "అధిపుఁ బాసినప్పుడె యలఁదుర వలువదె మెలుత మెట్టఁబడిన మీను వోలె" అనగా భర్తను బాసినప్పుడే స్త్రీ నిస్సహాయురాలివలెదుఃఖింపవలయునని అర్థము. ఏతదర్థమున "మెట్టఁబడిన మీను" అను పలుకుబడి "ఫిష్ అవుటాఫ్ వాటర్" అనుఇంగ్లీషు పలుకుబడికి అనుసరణము.

కుమారసంభవమునందు "యెస్" (6-21) అని యింగ్లీషుమాటను చోడుడు వాడినాడు. "రిమ్మలు" (8-159) అనియు వాడినాడు. గనుక నతఁడు ఇంగ్లీషు

వారు మనదేశమునకు వచ్చి వాళ్ల భాషను మనదేశమున ఆడువాళ్లవరకు వ్యాపింపఁ జేసిన తరువాతనే అనగా, 1880 క్రీ॥ శ॥ ప్రాన్తములలోనే యుండవలసిన వాఁడ గును" అని వేదాల తిరువేంగళాచార్యులుగారి ఒక అభిప్రాయము[22]. అంతేకాదు కుమారసంభవకర్తకు "సంస్కృతపదముల సరిగా నుపయోగించుట కానీ కూర్చుట కానీ తెలియదు. నిరర్థకములు, అనర్థకములు, పునరుక్తములు నగు పదములు, తగని వాక్యరచనలు, మాటల కసుకురీతి, అపప్రయోగములు చాలచోటుల నానా భాషాసాంకర్యము, అధికముగా పరభావచౌర్యము ఇత్యాదిలోపములు చాలాయున్నవి" అని కూడ వారి వివరణము[23]. మఱి రిమ్ములు అను పదమునకు "రిమ్మల = రెమ్మల = ఉపశాఖలలో" అని కవిగారి లఘుటీక[24]. "యెస్" అను పదమునకు కవిగారి అనుబంధమునందు ఏమియునులేదు. "ఎస్సని (వోయెదేని) = తిరస్కార సూచకముగ ధ్వనిచేసి" అని కోరాడ రామకృష్ణయ్యగారి అర్థవివరణము[25]. "ఎస్సు (తిరస్కారసూచకధ్వన్యనుకరణము)" అని నన్నెచోడపదప్రయోగసూచికయందు కలదు[26]. ఇట్టి ప్రయోగము ఇతరకావ్యములందు మృగ్యము. ఎస్సు లేక యెస్సు, రిమ్మ అనుపదములకంటె, "మెట్టఁబడిన మీను" అను పలుకుబడి అతి ముఖ్యమైనది.

నీటిలోని చేపనుతీసి గట్టుమీద వైచిన, అది మొదట అటునిటు కొట్టుకొని అనంతరము చచ్చిపోవును. భర్తను బాసిన స్త్రీ చచ్చిపోవలయునని కుమారసంభవ పద్యార్థముకాదు. దుఃఖింపవలయునని మాత్రమే కుమారసంభవపద్యార్థము. కనుక "మెట్టఁబడిన మీనువోలె" అనగా నిస్సహాయురాలివలె అనియే కవిహృదయము. అది "ఫిష్ అవుటాఫ్ వాటర్" అను ఇంగ్లీషు పలుకుబడియందుమాత్రమే కలదు. కనుక "మెట్టఁబడిన మీను" అను 'కుమారసంభవములోని అపూర్వప్రయోగము, ఆంగ్లభాషలోని "ఫిష్ అవుటాఫ్ వాటర్" అను నుడికారమునకు అనువాదము. ఇంగ్లీషునుడికారమునకు అనువాదము ప్రయుక్తమైన కుమారసంభవము రచనాకాలము పంచొమ్మిదవశతాబ్ది ఉత్తరార్థములేక పంచొమ్మిదవశతాబ్ది ఉత్తరార్థముకంటె అనంతర మగుట అపరిత్యాజ్యము. అనగా దక్షిణాంధ్రయుగముదాటిపోయి అరుదెంచిన ఆధునిక యుగము ధ్రువపడినది.

9. చరమమైనను పరమమైనది చక్రబంధము, కుమారసంభవమునందు చక్రబంధము కలదు. అది "చక్రవిద్య" అని కూడ తదనంతరవచనమునందు కలదు. అయినను, "చోళుని చక్రబంధమునఁ గృతి కృతి కర్తృపతినామములు గుప్తములుగా

లేవు. ఈవిధముగానే కన్నడమునఁ గవిరాజమార్గమను ప్రాచీనతమ కావ్యములో నీ నియతి కానరాదు. ఈమర్యాద యిటీవలఁబుట్టెనని తోచుచున్నది." అని మానవల్లి రామకృష్ణకవిగారి ప్రతిపాదనము.[27] కన్నడములోని ప్రాచీనతమకావ్యమనిన కవి రాజమార్గము నృపతుంగుని లక్షణగ్రంథము నృపతుంగుడన రాష్ట్రకూటరాజైన అమోఘవర్షుడు. అతనికాలము[28] 814-877. అనగా తొమ్మిదవ శతాబ్ది. కనుక తొమ్మిదవశతాబ్దిని కన్నడచక్రబంధమునందు, పదవశతాబ్దిని తెలుగుచక్రబంధము నందును కృతికర్తృ, కృతిభర్తృనామములు నిక్షిప్తముచేయు మర్యాదలేదని కవిగారు ప్రకటించిన తాత్పర్యము. ఇది కవిగారి "నన్నెచోడుని కాలనిర్ణయము"నకు మాత్రమే అనుగుణము. "నన్నెచోడుని" కాలము పదవశతాబ్దికాదు. పదవశతాబ్దిని తెలుగు చక్రబంధము లేదు. కుమారసంభవమునందు చక్రబంధము కలదు. అది చక్రవిద్య అనికూడ అందే కలదు. ఇది గమనార్హమైన విశేషము.

తెలుగుదేశములోని 1245వ సంవత్సరమునందలి మయూరుని శాసనములోని సంస్కృత చక్రబంధమునందు కవిపేరు, కావ్యముపేరు, నాయకునిపేరు, లేఖకుని పేరు కలవు[29]. 1258వ సంవత్సరము నందలి ఈశ్వరభట్టోపాధ్యాయుని శాసనము లోని సంస్కృతచక్రబంధమునందు కృతికర్తృ, కృతిభర్తల పేరులుగలవు[30]. పదమూడవశతాబ్దిశాసనములందు మాత్రమేకాదు; పదునాల్గవశతాబ్ది పూర్వార్ధములోని విద్యానాథుని ప్రతాపరుద్రీయమునందలి చక్రబంధమునందును కృతికర్తృ, కృతిభర్తల పేరులు కలవు. పదునైదవశతాబ్ది ప్రారంభములోని (1402) విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలోని తెలుగుచక్రబంధమునందు కృతిపేరు, కృతికర్త పేరు కలవు. (66, 67 ప. 6ఉ.) పదునేడవశతాబ్దిమధ్యభాగములోని (1656) కాకునూరి అప్పకవి ఆంధ్రశబ్దచింతామణిలోని చక్రబంధమునందు కవిపేరు మాత్రమే కలదు. (400 ప. 4ఆ.) కృతిపేరుగాని, కృతికర్త పేరుగాని, కృతిభర్తపేరుగాని లేని చక్ర బంధరచనము సంస్కృతాంధ్రసంప్రదాయము కాదు. అయినను, కుమారసంభవము లోని చక్రబంధమునందు కృతికర్తృ, కృతిభర్తల పేరులు లేవని అంచటి అభిప్రాయము. అర్థమేమో "తెలియుటలేదు." అని ఒక్క వేదము వేంకటరాయశాస్త్రిగారి అభి ప్రాయము[31]. సంస్కృతాంధ్రచక్రబంధములందు కృతికర్తృ, కృతిభర్తల పేరులు లేకపోవుట లక్షణవిరుద్ధము. అట్లుండుట అసంగతము. అనగా కుమారసంభవము లోని చక్రబంధమునందు ఏదోమర్మము కలదని, అది చక్రవిద్య అని మఱి అవ గాహనమగును. ఆ మర్మము పట్టువడిన చక్రవిద్య అర్థమగును.

ఆ పద్యమిది:

"ముక్తాముక్తఘనానురాగమదనమ్మోదైకసంసేవ్య సం
త్యక్తా కర్మపదప్రభేదమతివిద్యాదేహాశోషైకహా
భక్తాలంబకమంత్రతంత్రమయసద్భావస్థితైకస్పృశా
శాక్తేయా మునిచింత్యమానభరతా సంతాపహా సద్యశా." 980ప.12ఆ.

ఇందు మూడవవలయమున అనగా తొలి మూడు పాదములలోని మూడవ, పదునెన్మిదవ అక్షరములవరుస యథాకథముగ "ముకలంసేషైక" అని కలదు. అది కృతికర్త పేరుకాదు. కృతిభర్త పేరునుకాదు. ఇక ఆరవ వలయమున, అనగా తొలి మూడుపాదములలోని ఆరవ. పదునైదవ అక్షరములవరుస యథాతథముగ "నాదమందైదేవ" అనికలదు. అదికూడ కృతికర్త పేరుకాదు. కృతిభర్త పేరునుకాదు. అందువలన కుమారసంభవములోని చక్రబంధమునందు కృతికర్త, కృతిభర్తలపేరులు లేవని అందఱి అభిప్రాయము. శబ్దతః లేనిమాట నిజము. కాని అర్థతః కలవు.

"ముకలంసేషైక" అనునది కతిపయాక్షరసంస్కారము కావించిన, వర్గపంచమాక్షరలేఖనవ్యవహారమును పాటించిన, "ముకులశేషైక" అగును. ముకులశబ్దము మల్లికాసాధకము. శేషశబ్దము అర్జునబోధకము. ఏకశబ్దము దేవప్రతిపాదకము. "ఏకశబ్దవాచ్యుడు దేవుడు. శేషశబ్దవాచ్యుడు ఆదిశేషువు. అతడు తెలుపు. "ఆదిశేషుఁడు తెల్పు హంస తెల్పు" అని చాటువు. తెలుపు అర్జునశబ్దార్థము. "అవదాత వర్ణమారఁగలుగుట నర్జునుఁడంద్రు" అని తిక్కన ప్రయోగము. (146 ప. 4 ఆ. వి. ప.) ముకుల మనమొగ్గ. వట్టి మొగ్గ మల్లెమొగ్గ. కనుక మల్లిక. ముకుల + శేష + ఏక = మల్లిక + అర్జున + దేవుడు = మల్లికార్జున దేవుడు. కుమారసంభవమునకు కృతిభర్త మల్లికార్జునదేవుడు. (58 వచ. 1 ఆ) మల్లికార్జునశివయోగి కూడ. ఇతడు గురువు. గురులింగజంగమాత్ముడైన శివుడు ఒక్కడే అని శైవసంప్రదాయము.

"ఏక ఏవ శివః సాక్షాత్సర్వానుగ్రహకారకః
గురుజఙ్గమలిఙ్గాత్మా వర్తతే భుక్తిముక్తిదః." 59 శ్లో. 9 పరి.

అని సిద్ధాంత శిఖామణి. ఇందు "సర్వానుగ్రహకారకుడు, భోగమోక్షప్రదాయకుడు అయిన శివుడు ఒక్కడే గురులింగజంగమస్వరూపమున

వర్తించు"నని కలదు. జంగమమల్లికార్జునదేవునికి, జంగమమల్లికార్జునశివయోగికి, కుమారసంభవమునందు అంతట కల అభేదాధ్యవసాయికల్పనమునకు, చక్రబంధగత కృతిభర్తృనామములోని ఏకశబ్దము వ్యంజకము. అంతేకాదు. మల్లికార్జునదేవుడు శ్రీశైలమల్లికార్జునస్వామి. (58 వచ. 1 ఆ.) శ్రీశైలమల్లికార్జునస్వామి పేరు మల్లికాదామము అర్జునకాంతిని అందగించుట వలన ఏర్పడినదని పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరితమునందు కలదు. స్కాందపురాణసంజ్ఞితమైన శ్రీశైలఖండమునందుకలదు. నాగులూటి శేషనాథార్యుని శ్రీపర్వతపురాణమునందుకలదు. అనగా మల్లిక + అర్జున + దేవుడు = మల్లికార్జునదేవుడు అను అనుసంధానము అర్థవంతము. కనుక కుమారసంభవములోని చక్రబంధమునందు మూడవలయమున కృతిభర్తపేరు అర్థతః కలదని కరతలామలకము.

ఇక "నన్నెచోడుని కుమారసంభవము" లోని పంద్రెండు ఆశ్వాసాంత గద్యలందును "నన్నెచోడదేవప్రణీతంబు" అనికలదు. అనగా కృతికర్తపేరు నన్నెచోడదేవుడు. మానవల్లి రామకృష్ణకవిగారు 1909వ సంవత్సరమునందు ప్రకటించిన కుమారసంభవము ప్రథమభాగము ముఖపత్రమునందు "NANNAI CHODADEVA" అని ఆంగ్లభాషను, అంతర్ముఖపత్రమునందు "నన్నెచోడదేవ" అని ఆంధ్రభాషను పెద్ద అక్షరములతో ముద్రింపఁబడినది. కనుక నన్నెచోడుడు కాక, నన్నెచోడదేవుడు కృతికర్తపేరు. అందు "నన్నె" ఆధునికరూపము. "నన్ని" ప్రాచీనరూపము. అనగా నన్నిచోడదేవుడు అసలుపేరు. నందమపూడి శాసనములోని "నన్నినారాయణుని" వలె.[32] నన్నిశబ్దమునకు ప్రియము, సుందరము అని తెలుగునిఘంట్వర్థములు. సత్యము, నిశ్చయము, ప్రేమ, అనురాగము, అనుబంధము అని కన్నడనిఘంట్వర్థములు. మంచి, మంచితనము, మేలైన, గొప్పతనము, పెద్దతనము, గుణము, సుఖము, సంతోషము, చర్య, లాభము, అభివృద్ధి, స్వర్గము, ఆమోదప్రకటనము అని తమిళనిఘంట్వర్థములు. చోడశబ్దమునకు వంశవిశేషము, దేశవిశేషము అనిమాత్రమే తమిళ, కన్నడనిఘంట్వర్థములు. కంచుకమని సంస్కృతనిఘంట్వర్థము. చోడ లేక చోళ శబ్దమునకు మూలము సంస్కృత-కాల ( = నలుపు), కోల ( = అనార్యజాతి), చోర ( = దొంగ)-శబ్దములని, తమిళ చోళమ్ (చోళ్లు) శబ్దమని చరిత్రకారుల అభిప్రాయములు[33]. ఇందు కాలశబ్దముకంటె కోలశబ్దము తాలవ్యీకరణమున చోలశబ్దమగుట సహజము. అది చోళ, చోడ శబ్దములను అగును. చోళులు ద్రావిడులు. కనుక అనార్యజాతీయులగుట యథార్థము.

కాని, కథార్థము కాశ్యపసగోత్రము, సూర్యవంశక్షత్రియత్వము కాలక్రమమున సంక్రమించిన తదుపరి అనార్యజాతీయతాపరిగణనము సముచితముకాదు. అందుకు చక్రబంధమునందు అర్థాంతరమును ఆశ్రయించుట ఆవశ్యకము. సంస్కృతకోల శబ్దమునకు అనార్యజాతి అను అర్థముమాత్రమేగాక, శనిగ్రహమను అర్థమునుకలదు. కాలశబ్దమునకును శనిగ్రహమను అర్థముకలదు. కుమారసంభవము లోని చక్ర బంధమునందలి "నాదమందై దేవ" అనునది వర్గపంచమాక్షర లేఖనవ్యవహా రమును వదలి, సంధిరహిత స్థానికసహజ వర్ణస్వీకారముచేసిన, "నదమం దదేవ" అగును. ఇది స్థూలముగ "నన్నిచోడదేవ"కు స్ఫోరకము. సూక్ష్మముగ నిర్ధా రకము. నదశబ్దమునకు పశ్చిమదిశకు ప్రవహించెడునది అని స్పష్టార్థము. "దః" అను ఏకాక్షరమునకుగల నానార్థములందు వైరాగ్యము ఒకటి. నఞ్ + దః = నదః = వైరాగ్యవ్యతిరేకము. అవైరాగ్యము. అనగా అనురాగము. ఇది క్లిష్టార్థము. అదికన్నడములోని నన్నిశబ్దార్థము. తెలుగులోనినన్నిశబ్దార్థమునకు (ప్రియము) సన్ని హితము.కనుక నద = నన్ని. ఇక మందశబ్దార్థము శనిగ్రహము. తదర్థకకము కోల శబ్దము. అది చోడశబ్దమునకు ఆద్యప్రకృతి. కనుక మంద = కోల = చోల = చోళ = చోడ. మఱి దేవశబ్దము దేదీప్యమానము. అనగా నదమందదేవుడు = నన్నిచోడ దేవుడు. కనుక, కుమారసంభవములోని చక్రబంధమునందు ఆరవ వలయమున కృతి కర్త పేరు అర్థతః కలదని కరబదరకము.

ఇందు సంధిరహితస్థానికసహజవర్ణస్వీకారముచేయుట, కతిపయాక్షరసంస్కా రము కావించుట, వర్గపంచమాక్షరలేఖనవ్యవహారమును పాటించుట, వదలుట విల క్షణముకాదు. సలక్షణము.

విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలోని చక్రబంధ మిది:

"చిత్తోపేతవికస్వరోత్తమగుణున్ శ్రీలంపటున్ సత్క్రియా
విత్తోద్దండును విశ్వభూరమణు నుర్వీకృత్యసత్కృత్యదున్
విత్తాయక్షమతావిధిజ్ఞ మహితున్ వీరక్రమాత్తప్రియా
యత్తుం జూచి నినున్ విశేషవిదుగా యాచింపుదుర్ దుర్జయా" 67ప,6ఉ.

ఇందు మూడవ వలయమున "పెద్దయ సత్కృతి"అని, ఆరవ వలయమున "కవితాలంకృతి"అని కలవు. "నడుచుట్లఁ గవికృతిపేళ్లరెండు చక్రబంధమునకు నిడి

చదువవలయు" అని పెద్దన లక్షణము.(66వ. 6ఉ.) "పేద్దయ సత్కృతి" అనునది ఆద్యక్షరహ్రస్వస్వీకారమున పేద్దయ సత్కృతి అగును. అది పెద్దన సత్కృతి. "కవితాలంకృతి" అనునది,"కావ్యాలంకారచూడామణి"కి సంకేతము.

కాకునూరి అప్పకవి ఆంధ్రశబ్దచింతామణిలోని చక్రబంధమిది:

"భద్రాకాముకసూర్యనయనాభ్రాజిష్ణుసౌర్యక్రమా
క్షుద్రాక్రుద్ధవిమర్శితాంగనతతాస్తోకప్రసంపత్కరా
భద్రానూనజయావహావినయవాగ్భావిష్కృతాయక్షమా
మాద్రీశాభవతక్షకాకుభకరామాంగల్యరాసోద్యమా" 400వ. 4ఆ.

ఇందు మూడవ, ఆరవ వలయముల కలిసి "కాక్రునూర్యపయసూమయాజి కవి" అని కలదు. అది సంయుక్తాక్షరైకవర్ణపరిగ్రహణమున, పకారద్విత్వకల్పనమున, కతిపయాక్షరసంస్కారమున, "కాకునూర్యప్పయసోమయాజి" అగును.

"విద్యానాథుని ప్రతాపరుద్రీయములోని చక్రబంధమిది:

"లక్ష్మీవీక్షితవైభవస్య జగతాం నాథస్య భద్రశ్రియో
దిక్స్వైరబద్ధ నిజప్రతాపజనితాం భాకృద్ధురాం యచ్ఛతః
నిత్యం రుద్రజనాధిపస్య జయినో భాతిప్రకాశం స్థిరా
రాజత్వాలనమోదితాత్మని భుజే యోగ్యాశ్రితత్వాద్ధరా."

శబ్దాలఙ్కారప్రకరణమ్.

ఇట "అత్ర చక్రబన్ధే వైద్యనాథకృతి వీరభద్రయశ ఇతి ప్రతీయతే" అని విద్యానాథుని వివరణము. కాని మూడవవలయమునందు "వైజనాథకృతి" అనికలదు. విద్యానాథశబ్దముకంటె వృద్ధిరూపము వైద్యనాథశబ్దము కాక, వైజనాథశబ్దము నిష్పన్నము కాదు. ఒక్క తద్భవ వ్యాజమున మాత్రము "వైజనాథకృతి" అనునది వైద్యనాథకృతి" కాఁగలదు. సంస్కృతశ్లోకమునందు తద్భవవ్యాజము విలక్షణము. అయినను, ప్రతాపరుద్రీయములోని చక్రబంధము సలక్షణము.

వారణాసి ధర్మసూరి సాహిత్యరత్నాకరములోని చక్రబంధమిది:

"దర్వాన్ధప్రసరాసురస్థిరమదప్రాణప్రహారిక్రియో
విష్ణుర్మన్మథమన్మథః స్థిరశివంభానుక్షపాకృత్ప్రభాః

దత్త్వాంసూనృతగుర్విపద్ధరవిధస్ఫ్వాతిః ప్రహేతిః పరం
రమ్యో మే దయయా విరాధవమనో యోగీన్ద్రః ఖావ్యశ్చిరమ్.''52శ్లో;6ఆ.

ఇట "అత్రతృతీయే వలయే- ధర్మసూరికృతిః, షష్ఠే- రామగుణనుతిః, అష్టమే రథపదబన్ధ ఇతి చ ప్రతీయతే. వబయో రభేదాత్." అని వారిణాసి ధర్మ సూరి వ్యాఖ్యానము. ఇందు మూడవ వలయమున యథాతథముగ "ధర్మసూరికృతిః" అని, ఎనిమిదవ వలయమున యథాతథముగ ''రథఃపదవంధ'' అనియు కలవు. వర్గ పంచమాక్షరలేఖనవ్యవహారమును వదలిన మూడవ వలయమున "ధర్మసూరికృతిః" అగును. విసర్గను వదలిన, వబలకు అభేదమును పాటించిన, ఎనిమిదవ వలయమున "రథపదబంధ'' అగును. అంతేకాదు. రథపదబంధము అర్థతః చక్రబంధము.

ఇట్లు కుమారసంభవములోని చక్రబంధమునందు కతిపయాక్షరసంస్కారము కావించుట, వర్గపంచమాక్షరలేఖనవ్యవహారమును పాటించుట, వదలుట, శ,సలకు అభేదమును పాటించుట సంధిరహితసాన్నికవర్ణసహజస్వీకారము చేయుట మాత్రమే గాక, అర్థతః గ్రహించుట కూడ సంస్కృతాంధ్రచక్రబంధరచనాసంప్రదాయము.

కుమారసంభవములోని చక్రబంధమునందు కృతికర్త పేరు అర్థతః కలదు. కనుక అతడే కృతికర్త కావలసిన ఆవశ్యకము లేదు. రసికాభిలాషములోని చక్రబంధమిది:

''కన్యా! శృంగిసమానబంధురకుచా! కల్యాణసు శ్రీరమా!
ధన్యా! గానకళాధురంధర! కళాతంత్రాసమానాదరా,-
జన్యైరమ్మద చైత్రసుందరకటాక్షా, యిద్దియే ధర్మమా?
మాన్యాత్మా! కడు బాధ గల్గెనను లేమాటన్న రాఁజూడుమా॥"

ఇందు మూడవవలయమున "శృంగారశ్రీనాథ'' అని కలదు. అనిచెప్పి రసికాభిలాషము శ్రీనాథుని రచనము కాదు. పెట్టి లక్ష్మీనరసింహముగారి రచనము!

ఇంకను, "నన్నెచోడుని కుమారసంభవము" లోని చక్రబంధమునందు, నన్నెచోడదేవుని నామధేయము పరమనిగూఢముగకలదు. మల్లికార్జునదేవునిపేరు అరచాటుగ కలదుగాని, నన్నెచోడదేవునిపేరు నెరచాటుగ కలదు. అది నిర్నిమిత్తము కాఁజాలదు. అంతేకాదు. నిజముగ కుమారసంభవకర్త నన్నెచోడదేవుడు అయిన, అతడు తనపేరు అంత పరమనిగూఢముగ చక్రబంధపద్యమునందు నిబిడీకృతము చేయవలసిన ఆవశ్యకములేదు. ఉపరి, కుమారసంభవకర్త మఱొకరు అయిన

పక్షమునందు మాత్రము నన్నెచోడదేవునిపేరు అంత పరమనిగూఢముగ ఉండుట సంభవము. చక్రబంధమునందు నన్నెచోడదేవనామధేయము శబ్దతః కలదేని, కుమారసంభవము నన్నెచోడదేవకృతముగ శాశ్వతముద్రాముద్రితమగుట తథ్యము. అది మఱల అనధికమైన మఱొకరు శబ్దతః కాక, అర్థతః, అదికూడ స్పష్టముగ కాక క్లిష్టముగ చక్రబంధమునందు ఇమిడించుట ఎప్పటికైన ఇష్టార్థసిద్ధికి దోహదము చేయును. ఆ మఱొకరు చోళశబ్దమునకు ఆద్యప్రకృతి సంస్కృత-కోల లేక కాల శబ్దమును చారిత్రికపరిజ్ఞానము కల నవీనకవి అగుట న్యాయము. ఏవంవిధమైన చారిత్రికపరిజ్ఞానము వర్తమానశతాబ్ది వైభవము. చోళశబ్దమునకు ఆద్యప్రకృతి సంస్కృత-కోల లేక కాలశబ్దమని ప్రథమతః ప్రతిపాదించిన చరిత్రపరిశోధకుడు కర్నల్ జెరినీగారు[34]. అది గ్రంథరూపమున 1909వ సంవత్సరమునందు ప్రకటితము[35]. చక్రబంధముకల కుమారసంభవము ద్వితీయభాగము ప్రథమతః 1914వ సంవత్సరమునందు ప్రకటితము. చక్రబంధములేని ప్రథమభాగము ప్రథమతః 1909వ సంవత్సరమునందు ప్రకటితము. అతః పూర్వము కుమారసంభవము అజ్ఞాతము. అనగా కుమారసంభవము కూటసృష్టి స్థూలముగ-ముద్రణసంవత్సరములకు ముందు రెండేసి సంవత్సరములు వదలిన, 1907-1912 సంవత్సరముల మధ్య కాలమునందు జరిగినట్లు అవగాహనమగును.

కుమారసంభవము ప్రథమభాగమునందు ఉత్తరకథాప్రశంస, ద్వితీయభాగములోని మూడుపద్యములుకలవు[36]. కనుక 1909వ సంవత్సరమునాటికే మొత్తము కూటసృష్టి జరిగినను తుదిమెఱుగులు దిద్దినకాలము 1912వ సంవత్సరము, తొలి మెఱుగులు చిందిన కాలము 1907వ సంవత్సరముకంటె పూర్వమును కావచ్చును. కనుక 1907-1912 సంవత్సరములమధ్యకాలము స్థూలము.

అసలు కూటసృష్టి అన్నది కవులకు అనభ్యస్తవిద్యకాదు. సంస్కృతమున భాసుని యజ్ఞఫలము, శ్యామభట్టు శ్రీ చాళుక్య అయ్యనవంశచరితము[37], కన్నడమున ముద్దణ అశ్వమేధయాగె, తెలుగులో శ్రీనాథుని రసికాభిలాషము, మోహనాంగి మారీచీ పరిణయము మొదలైనవి ఆధునికయుగములోని అపరావతారములే. అట్లు "నన్నెచోడుని కుమారసంభవము"ను కూటసృష్టి అగుట నిరాఘాటము.

అయిన కుమారసంభవకూటసృష్టికర్త ఎవరు ?

మానవల్లి రామకృష్ణకవిగారు సంఘటించిన కుమారసంభవప్రథమ, ద్వితీయ భాగపీఠికలను, అథస్సూచికలను, టీకలను చదివిన, కుమారసంభవకర్త సంస్కృత

కర్ణాట తమిళకావ్యగ్రంథపరిజ్ఞాత అని విశదమగును. ప్రకృతనిరూపణములను పరికించిన ఆంధ్రకావ్యపరిజ్ఞాత, ప్రాచీనశాసనపరిజ్ఞాత, నవీనచరిత్రపరిజ్ఞాత అని స్పష్టమగును. ఆ యీ పరిజ్ఞానములెల్ల, ఆ కాలమున, మానవల్లి రామకృష్ణకవిగారికి అధీనములని వారి వ్రాతలబట్టి వ్యక్తమగును. కనుక-పాపముశమించునుగాక-కుమారసంభవకూటసృష్టికర్త మానవల్లి రామకృష్ణకవిగారే కావలయును.

అయిన మానవల్లి రామకృష్ణకవిగారు కుమారసంభవమును కూటసృష్టిచేయఁగల సమర్థులా ?

''నా యట్టి వానికిట్టి కావ్యమును వ్రాయు సామర్థ్యము లేదనుట తెల్లము'' అని కవిగారు అతివినయమును ప్రకటించినను[38], అసమర్థులుకారు. మహాసమర్థులు.

నిడుదవోలు వేంకటరావుగారి నిర్దేశమిది[39]:

"తెలుగుభాషలో సహజమగు కవితాశక్తి వారికి చిన్ననాటనే యలవడినది....తెలుగుకవిత్వరచనకు పూర్వకవిసంప్రదాయమే ఆదర్శమని ప్రాచీనాంధ్రకావ్యములు కూలంకషముగా పఠించినారు .... సంస్కృతము వారికి వంశానుగతమైన భాష....మదరాసు వాస్తవ్యులందఱికి తమిళభాష వ్యవహారరీత్యా అలవడకతప్పదు. కవిగారు తమిళ వ్యవహారభాషనేకాక, అందలి ప్రాచీనకావ్యములు చదివి దానియందు మంచి ప్రవేశము గడించినారు. తెలుగుకన్నడభాషలకు పరస్పరముగా నధికసంబంధమున్నదని గుర్తించి, కన్నడభాషలో రత్నత్రయకృత గ్రంథములు-పంపభారతము, రన్నని గదాయుద్ధము, పొన్నని శాంతి పురాణము-తలస్పర్శిగా చదివినారు. ఇరువదేండ్లు వచ్చుసరికి కవిగారు సంస్కృతము, తెలుగు, ఆంగ్లము, తమిళము, కన్నడము-ఈ భాషలలో ప్రావీణ్యము గడించిరి.

కవిగారి ధారణాశక్తి అసాధారణమైనది, అద్భుతమైనదీ అని చెప్పవచ్చును. ఏభాషలో కానిండు వారు చదివిన ప్రతిగ్రంథమునుండి వారు ఉదాహరింపగల సమర్థులు....

[39]

కవిగారు బిరుదముచే గాక జన్మతః కవులు........

ఆకాలమున మదరాసులో నాంధ్రసాహిత్యపోషకులుగా నుండిన వారు పనప్పాకము ఆనందాచార్యులుగారు. వారి పాండిత్యవిభూతిని, వైదుష్యమును మెచ్చుకొని, నవద్వీపపండితులు వారికి- "విద్యా వినోది" అను బిరుదు నొసగిరి. ఆనందాచార్యులుగా రున్నతన్యాయ స్థానమున ప్రముఖ న్యాయవాది. నెలకు వేలకు మించిన యార్జన గల వారు. వారిగృహమే యానాటికవిపండితులకు రాజాస్థానము....ఆనందా చార్యులవారి యింట నెప్పుడును విద్వద్గోష్ఠులు జరుగుచుండెడివి......

ఒకనాడా గోష్ఠిలో - "ప్రాచీనపండితులు, ప్రాచీనకావ్య సంప్రదాయము నెఱిగిన కవులు తప్ప, పాశ్చాత్యభాషాపట్టభద్రులు తెలుగున కవిత్వము చెప్పలేరని- అక్కడివారు పలికిరట- వెంటనే ఆనందాచార్యులుగారు మీమాట ఎంతమాత్రమూ సరిగాదు. ఇక్కడనే మనయెదుటనున్న మానవల్లి రామకృష్ణయ్యగారు- ప్రాచీనకవులతో తులతూగునట్లు కవితారచన చేయగలవారు" అని వారికి ప్రత్యుత్తర మిచ్చి,కవిగారిని కవితజెప్పుమనిరట. వారు తత్‌క్షణమే, అసమాన ధారాశుద్ధితో, అనుపమానపదబంధముతో పాటలీపుత్రకమను తమ రచనలోని కొన్నిపద్యములను ఆశువుగా చదివిరట- ఆనందాచార్యులు గారును సభ్యులును నత్యంతాశ్చర్యములో మునిగిరట. గోష్ఠిలోని వారందఱు నేకగ్రీవముగా "వీరే నిజముగా కవులు" అని ప్రశంసించి నారట. అప్పుడందఱి సమక్షమున- ఆనందాచార్యులుగారు, "రామ కృష్ణయ్యగారూ! నేటినుండి మీకు, మానవల్లి రామకృష్ణకవి-అని బిరుదుపేరు సభాముఖమున నందజేయుచున్నాను. మీరీ పేరుతోనే పేరెక్కుదురు గాక" అని వారిని సత్కరించిరట ! నాటినుండి రామ కృష్ణయ్యగారు జీవితాంతమువఱకు కవిగానేయున్నారు-వారి సంతకము గూడ నదియే.

కవిగారి కవితారచన యనన్యసామాన్యమైనది. అది నవీనయుగ మున ప్రాచీనమహాకవి తిరిగి యవతరించెనా యని తోపింపజేయును. కవితారచనయందు వారికి గల యిట్టి యద్భుతశక్తిని పురస్కరించు

> కొనియే మొదట కవిగారు క్రీ. శ. 1908లో కుమారసంభవము ప్రకటించినపుడు అది వాస్తవముగా ప్రాచీనకవియగు నన్నెచోడుని రచన కాదనియు, కవిగారే రచియించి, నన్నెచోడకవి పేరు పెట్టినారన్న యపవాదము దేశమున బ్రాకినది."

ఇందు మానవల్లి రామకృష్ణకవిగారి సామర్థ్యముతోపాటు, అపవాదమో ఉపవాదమో, కుమారసంభవమును కవిగారే రచియించి నన్నెచోడకవి పేరుపెట్టి ప్రకటించినారన్న విషయము దేశవ్యాప్తమైన సమకాలికసమాచారముకూడ గమనార్హమైన విశేషము.

కుమారసంభవమును కవిగారే రచియించిన, నన్నెచోడుని పేరుపెట్టి ప్రకటించవలసిన అవసరమేమి?

కుమారసంభవము ప్రథమభాగమును ప్రకటించినపుడు, "(ఇట్టి) కృతి నేటికెట్లు క్రొత్తదగును ? " అని ప్రశ్నించిన[40] కవిగారు, ద్వితీయభాగమును ప్రకటించినపుడు "ఒకవేళ మన కవి ప్రాచీనుడు కాఁడయ్యేనేని కొఱంతయేమి ? నన్నయాదులకుఁ బూర్వకావ్యములు రాజప్రోక్తములే వెలువడనున్నవి" అని ఒక హెచ్చరిక చేసిరి[41]. ఈ ప్రకటన వెలువడి ఇప్పటికి అరువదియైదు సంవత్సరములు పైగా అయినవి. అయినను నన్నయాదులకు పూర్వకావ్యము రాజప్రోక్తముకాదు సరికదా, రాజేతరప్రోక్తమును ఇంతదనుక వెలువడలేదుకద ! ఇట్టి ప్రకటన చేయుటలోని ఆంతర్యము, నన్నయకు పూర్వము కావ్యమును ప్రతిష్ఠించుట కవిగారికి అభిమతమనుటకు మూదల. అసలు నన్నయ అనిన, కవిగారికి మిక్కిలి అనిష్టము.

> "శబ్దశాసనుని లాక్షణికుఁడనియు నాదికవియనియు గౌరవింప వలయును. ఇతని కవిత్వము మిక్కిలి రసవత్తరమైనది కాదు.... అథర్వణభారతము తిక్కనభారతముతో సరిపోల్పఁదగినది కాకున్నను నన్నయకవిత్వము కంటె రసవంతముగా నుండును........నన్నయభట్టారకుఁడు వయసు మీఱిన వాఁడగుటచే సందర్భశుద్ధినివి బాటింపఁడయ్యె....నన్నయభట్టారకుని భాషాంతరీకరణ... మెంతమాత్రమును తృప్తికరముగాలేదు."

అని 19-5-1895వ తేదీని మదరాసులోని పురశవాకమునందు మానవల్లి రామకృష్ణకవిగారి వ్యాసోపన్యాసము[42]. ఇందు ప్రథమతః అధర్వణభారతము ఇంత వఱకు ఉపలబ్ధము కాలేదు. లక్షణగ్రంథములందు, సంకలనగ్రంథములందు అధర్వణ భారతములోని పద్యములు ఉదాహృతములు. అవికూడ అతిస్వల్పము. అయినను, నన్నయభారతముకంటె అధర్వణభారతము రసవంతమని కవిగారిరాద్ధాంతము. అధర్వణభారతమునుండి ఉదాహృతమైన ఒక్క పద్యమును నన్నయ పద్యముకంటె రసవత్తరముకాదు. అయినను కవిగారు అట్లనుటకు కారణము, నన్నయయెడల న్యూనతాభావము. ఇది 1895వ సంవత్సరమునాటి మానవల్లి రామకృష్ణకవిగారి అభిప్రాయము. అది మొదలు నన్నయకు ఆదికవిగౌరవమును అణచివేయుట అభీష్టము కావచ్చును. అందుకు నన్నయకు పూర్వగ్రంథమని "నన్నెచోడుని కుమారసంభవము" ను కూటసృష్టి చేయుట ఆవశ్యకము.

కవిగారికి పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము. బాలబోధచ్ఛందస్సు, సర్వలక్షణసారము, గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరము కరస్థములు. కంఠస్థములుకూడ. ప్రబంధరత్నాకర, బాలబోధచ్ఛంద, స్సర్వలక్షణసారములందు నన్నెచోడకుమారసంభవముకలదు. ప్రయోగరత్నాకరమునందు నన్నెచోడ కళావిలాసము కలదు. చోడులు చోళులు. చోళులు చాళుక్యులకంటె బహుపూర్వులు. కనుక నన్నెచోడునిపేర కుమారసంభవమును కూటసృష్టిచేసిన, నన్నయకుపూర్వము రాజకవిచంద్రుని కావ్యము కలదను కథ రక్తికట్టఁగలదు. కట్టినదికూడ. ఈ డెబ్బది సంవత్సరములకాలము కుమారసంభవమునకు ఎందఱు వందిమాగధులు కాలేదు ? ఎంతలేసి కైవారగానములు సేయలేదు ? ఎన్నెన్ని పఠనములు, పాఠనములు, పాఠాంతరములు, పరిష్కరణములు, విమర్శనములు, ప్రతివిమర్శనములు, పరిశోధనములు, పదకోశములు, వ్యాఖ్యానములు, భాషాశాస్త్రభేషజములు, పాషాణాస్త్రపైభిషజములు వెలయలేదు ? వెలయుచుండలేదు ? ఇక వెలయఁబోవు ! ఇంత కావ్యగౌరవము ఇతరమార్గమున సిద్ధించుటకల్ల. ఇదియెల్ల ఆనుషంగికఫలము.

ఒక నన్నెచోడుడు అను పూర్వకవి కలడనుటకు, అతని కృతి కుమారసంభవము అను పూర్వకావ్యము కలదనుటకు, ఒకానొక ఆధారము లేకుండ "నన్నెచోడుని కుమారసంభవము" ను కూటసృష్టి చేయుట సంభవము కాదు. గతశతాబ్దియందు కావలి వేంకటరామస్వామిగారు ప్రకటించిన దక్కనుకవుల జీవితచరిత్రరేఖలు అను

గ్రంథమునందు, మోహనాంగి అను పూర్వకవయిత్రి కలదని, ఆమెకృతి మారీచీ పరిణయము అను పూర్వకావ్యము కలదని ఆధారము కలదు[43]. గావున, వర్తమానశతాబ్దియందు సెట్టి లక్ష్మీనరసింహముగారు "మోహనాంగి మారీచీపరిణయము"ను కూటసృష్టి చేయుట జరిగినది. అది కూటసృష్టి కాదని, కృష్ణదేవరాయల కూతురు మోహనాంగియే రచించినదని ఇటీవల ఒక వాదము తలయెత్తినది[44]గాని నిలువలేదు. అంతేకాదు. శ్రీనాథుడు రసికుడు అను జనశ్రుతి ఆధారముగ "శ్రీనాథుని రసికాభిలాషము"ను సెట్టి లక్ష్మీనరసింహముగారి కూటసృష్టియే. అట్లు ప్రబంధరత్నాకర, బాలబోధఛంద, సర్వలక్షణసారములు ఆధారముగ "నన్నెచోడుని కుమారసంభవము"ను మానవల్లి రామకృష్ణకవిగారి కూటసృష్టి అగుట సంభవమే.

మానవల్లి రామకృష్ణకవిగారు ప్రథమతః కవులు. తదుపరి పరిశోధకులు. వారు పాతికసంవత్సరముల వయస్సు రాకుండ వ్రాసిన ప్రథమకావ్యము మృగావతి. అది వైజయంతి అను పత్రికయందు 1890వ సంవత్సరమునందు, 1897వ సంవత్సరమునందు ప్రకటింపఁబడినది[45]. "ఈ కావ్యం తెలుగు పంచకావ్యాలూ పిండి పెట్టిన పంచామృతమంటే సరిపోతుంది" అని తిరుమల రామచంద్రగారి అభిప్రాయము[46]. కవిగారు ప్రకటించని వసంతవిలాసము ప్రాచీనాంధ్రకావ్యములు కాచి వడపోసిన రసకుండిక. పాతికసంవత్సరములు నిండని వయస్సున తెలుగుపంచకావ్యముల అమృతమును చూఱలిచ్చు మృగావతిని, బహుశః ముప్పదిసంవత్సరములు నిండిన వయస్సున ప్రాచీనాంధ్రకావ్యముల రసమును తొణికిసలాడించు వసంతవిలాసమును రచించిన కవి గారు, నలుబదిసంవత్సరములు దాటిన వయస్సున సంస్కృతాంధ్రతమిళకర్ణాటకావ్యముల రసామృతమును జుబ్బనచూఱలిచ్చు కుమారసంభవమును కూటసృష్టి చేయుట సంగతమే. అంతేకాదు. కుమారసంభవములోని సమధికసంస్కృతాంధ్రతమిళకర్ణాటకవితాసంవాదము మానవల్లి రామకృష్ణకవిగారికిమాత్రమే సాధ్యము. ఉపరి, మానవల్లి రామకృష్ణకవిగారికి స్వీయకవితను పూర్వకవిపరముగ చేయు అభ్యాసము కలదు. కవిగారు తెనిఁగించిన కర్ణభారము ఉపోద్ఘాతమునందు ఇట్లు కలదు[47].

"కీర్తిసేన అను కవయిత్రి

క. చిరకాల మెడపి క్రమ్మఱ

నరుదెంచిన యోఱు వోలె నస్మత్కవితా

సరణి యనుకూలి గామియుఁ
దరతర మెడఁబాటు సేఁత తథ్యము మాకున్

అన్నట్టు లగునేమో!"

ఇందు "చిరకాలమెడసి" అను పద్యము కీర్తిసేన అను కవయిత్రి రచించి నట్లు ఇదమిత్థముగ కలదు. ఇంతవఱకు కీర్తిసేన అను కవయిత్రి కీర్తిచంద్రికలు ఎచ్చటను ప్రసరించిన జాడ కానరాదు. అంతేకాదు. పయి కీర్తిసేన పద్యము అక్షరశః కవిగారి వసంతవిలాసమునందు కలదు[48]. "అలువోలె'' అనుచోట "అలిఁబోలె" అని, ''అనుకూలి" అనుచోట" ''అనుకూల" అని మాత్రము అలతి భేదము కలదు. అనగా కవిగారిపద్యము కల్పనాజగత్తులోని కీర్తిసేన పద్యమయినట్లు అవగాహనమగును.

వసంతవిలాసములోని ఆశ్వాసాంతగద్య ఇట్లు కలదు[49].

"ఇది శ్రీకలాంక కవి విరచితంబగు వసంత
విలాసంబునందుఁ బ్రథమాశ్వాసము.''

ఇందు వసంతవిలాసము అను కావ్యమును, కలాంకుడు అను కవి రచించి నట్లు ఇదమిత్థముగ కలదు. ఇంతవఱకు కలాంకుడు అను కవి యశశ్చంద్రికలును ఎచ్చటను ప్రసరించిన జాడ కానరాదు. అంతేకాదు. వసంతవిలాసము కవిగారు రచించిన కావ్యము. కనుక, " 'కలాంకకవి' అనునది కవిగారు పెట్టుకొన్న సాహిత్య నామము (Pen - Name)" అని విడుదవోలు వేంకటరావుగారి నిర్ణయము[50]. కాని, కవిగారు కలాంకకవి అను కలముపేరు గాని, మఱొక కలముపేరు గాని వాడిన సందర్భము మచ్చునకైన లేదు. మృగావతికావ్యమునందు కళింగసేనప్రకరణము నందు ''రామకృష్ణప్రణీత"మనియే కలదు[51]. వసంతవిలాసమునందు మాత్రము ''కలాంకకవివిరచిత"మని కలదు. ఆ వసంతవిలాసమునందే "కీర్తిసేనపద్యము"ను కలదు. అంతేకాదు. కవిగారి వసంతవిలాసములోని ప్రథమాశ్వాసమును కీర్తిసేన అను కవయిత్రి, మిగిలిన ఎనిమిది ఆశ్వాసములను కలాంకుడను సుకవి రచించినట్లు వసంతవిలాసమునందు పద్యమే కలదు!

''ప్రథమాశ్వాసముఁ గీర్తిసేన రచియింపం దక్కు నాశ్వాసముల్
కథనోత్సేకతఁ దోచినట్ల యతివేగస్ఫూర్తిఁ బూరించె నీ

కథఁ బూర్వప్రథితాంధ్రసంస్కృతమహాకావ్యప్రబంధాబ్ధిని
ర్మథనఖ్యాతిఁ గళాంకుఁడ న్సుకవి ధర్మఖ్యాపనోత్సాహియై." 448ప.9ఆ

ఇది వసంతవిలాసము అను కావ్యమునందు ప్రథమాశ్వాసము కీర్తిసేన అను కవయిత్రి, ద్వితీయాదినవమాశ్వాసపర్యంతము కలాంకుడను సుకవి రచించి రనుటకు గ్రంథస్థనిదర్శనము. కాని వసంతవిలాసమును కవిగారు రచించినట్లు జగద్విదితము. కానిచో, వసంతవిలాసము కీర్తిసేనాకలాంకులు రచించిన కావ్యమే అయ్యెడిది. 8-6-1952వ తేదీని వ్రాసిన వసంతవిలాసము కాగితపుప్రతియందు "వసంతవిలాసము- కవి- మహాకవి మానవల్లి రామకృష్ణ తిరుపతి'' అని కలదు. అంతే కాదు. ''Manavalli Ramakrishna Kavivara" అని కూడ కలదు. అనగా కవిగారు కీర్తిసేన, కలాంకుడు అను పూర్వకవులు రచించినట్లుగ వసంతవిలాసమును రచించినట్లు అవగాహనను గును. కనుక కీర్తిసేనాకలాంకుల వసంతవిలాసమువలె నన్నెచోడుని కుమారసంభవమును మానవల్లి రామకృష్ణకవిగారి మాయావాగుర కావచ్చును.

"కవిత లోక కొన్ని చచ్చుం
గవి యెదుటనె కొన్ని చచ్చి కాలిన పిదపం
గవి బూదిలోన లేచుం
గవి వలదనఁ గొన్ని కల్పకాలము చూచున్." 450ప.9ఆ.

ఇది కవిగారివసంతవిలాసములోని మఱొక పద్యము. ఇందు కవి బ్రదికియుండగానే కొన్ని కావ్యములు చచ్చిపోవునని, కవి అనంతరము కొన్ని కావ్యములు బ్రదుకునని, కవి వలదనిన కొన్నికావ్యములు కల్పాంతము బ్రదుకునని కలదు. నిజమే. మానవల్లి రామకృష్ణకవిగారు బ్రదికియుండగానే మృగావతికావ్యము చచ్చిపోయినది. వారు బ్రతికియుండగా వసంతవిలాసము ముద్రణభాగ్యమునైన పొందలేదు. కర్తృత్వము వలదనిన కుమారసంభవము కల్పాంతము బ్రదుకనదియేకాని, సంకల్పమునకు వికల్పము కలిగినది.

కవిగా పేరు గడింపవలయునని ఒక కండూతి. కావ్యము గౌరవము గడించిన చాలునని మఱొక మనస్సంతృప్తి. మనస్తత్త్వము బహుభంగిమలు ధరించు జగన్మోహిని. కావ్యము గౌరవము గడించిన చాలునను మనస్సంతృప్తి కలిగినను, గౌరవమును గడించిన కావ్యమునకు మఱల కవిగాకూడ లోకమునకు ఎప్పటికైన తెలియవలయునను ప్రలోభము కలిగియుండుటకూడ మానవహృదయదౌర్బల్యము.

కావ్యకర్తృత్వము కారణాంతములచేత మఱొకరికి ధారాదత్తము చేసినను, కష్టపడి కావ్యమును వ్రాసిన కవికి దానిమీద మమకారము మాటుమణగదు. అది దత్తత ఇచ్చిన కన్నబిడ్డమీద కన్నతల్లికి ఉండు మమకారమువంటిది. కనుక గూఢముగ నైన కవి తనపేరు కావ్యమునందు నిక్షిప్తము చేయును. సంస్కృతరామాభ్యుదయము, తెలుగుబిల్హణోపాఖ్యానము ఇందుకు నిదర్శనములు. కుమారసంభవకూటసృష్టికర్త మానవల్లి రామకృష్ణకవిగారే అయిన, మఱి ఆయనపేరు కుమారసంభవమునందు గూఢముగ ఉండుట సంభవము. కుమారసంభవము కూటసృష్టియందు లోకప్రతారముకలదు. అందుకు సాధారణపద్ధతి అవలంబనీయముకాదు. ప్రమాదకరము. కనుక అసాధారణపద్ధతియే అవలంబనీయము. ప్రమోదకరము.

కుమారసంభవములోని చక్రబంధము పద్యమునుగాక, క్రిందనున్న చిత్రమును పరికించిన, చిత్రములు కనిపించును.



కుడిప్రక్క క్రింది వర్తులాకృతిని ఒక చిన్నగడి, దానికి ఇరువైపుల రెండు పెద్దగడులు కలవు. చిన్నగడి పెద్ద "బ్రాకెట్స్" చిహ్నములు కలిసిపోయినట్లు కలదు. కనుక చిన్నగడిలోని అక్షరము కుండలీకరణములోని అక్షరమువలె వర్జనీయము. అది వదలి, పెద్దగడులలోనిరెండేసి అక్షరముల పదములు రెండును కలిపిన, "మాన + రతా = మానరతా" అను పదబంధము నిష్పన్నమగును. అయిన, "వబయోరభేదాత్" అని ధర్మసూరి అన్నటుల, "రలయోరభేదాత్" అనిన, "మానరతా" అను పదబంధము "మానలతా" అను పదబంధమగును. లతాశబ్దమునకు పర్యాయపదము వల్లి. రథపదబంధము = చక్రబంధమువలె, "మానలతా" = మానవల్లి. అది కవిగారి గృహనామము. ఇది చాలును కుమారసంభవ కూటసృష్టికర్త మానవల్లి రామకృష్ణకవి అనుటకు. చాలదనిన, రామకృష్ణకవియు సాక్షాత్కారమగును. చక్రబంధము చిత్రములోని కేంద్రవృత్తమునందు "మ" అను వర్ణము కలదు. దానిపైన ఒక వలయమును వదలిన, ఆపై వలయమునందు "రా" అను వర్ణము కలదు. రెండువర్ణములు కలిపిన "మరా" అగును. మరామంత్రోపదేశము లోని మర్మము రామనామజపము. అనగా "రామ". "రా" అను వర్ణము కల వలయమున ఎడమవైపు ఆకున, "స" అను వర్ణము కలదు. దానిక్రింది ఆకున దానికి రెండింతలు "విద్యా" అను రెండు వర్ణముల పదముకలదు. దాని కుడివైపు ఆకున దానికి రెండింతలు "సమ్మోదైక" అను నాలుగువర్ణముల పదబంధము కలదు. అన్నియు కలిపిన, రా + స + విద్యా + సమ్మో దైక = "రాసవిద్యాసమ్మోదైక" అను సమాసము అవతరించును. రాసవిద్య అన రాసకేళి. రాసకేళిని సమ్మోదించు ఏకవ్యక్తి కృష్ణుడు. కనుక రాసవిద్యాసమ్మోదైక = "కృష్ణ." విద్యాసమ్మోదైక అను పదబంధములోని ఆద్యంతాక్షరములనువ్యత్యస్తముచేసిన వి, క = కవి అగును. రామ + కృష్ణ + కవి = రామకృష్ణకవి. అది కవిగారి వ్యక్తినామము. కనుక మానవల్లి రామకృష్ణకవి అనుపేరు అసాధారణపద్ధతిని కుమారసంభవములోని చక్రబంధమునందు కలదు. ఇది నిజముగ "చక్రవిద్య" యే కద !

కుమారసంభవమునందు విలక్షణములైన విశేషములు కలవు. అందుకొన్ని ప్రాచీనతను అధఃకరించునవి. మఱికొన్ని నవీనతను పృథక్కరించునవి. ప్రాచీనతాభ్రాంతికల్పనము బుద్ధిపూర్వకము. నవీనతాక్రాంతిజల్పనము సిద్ధిమూలకము. ప్రాతక్రొత్తల మేలుకలయికను, కుమారసంభవము కూటసృష్టి కావున, నన్నెచోడ

వేదనామధేయము చక్రమార్గమున, మానవల్లి రామకృష్ణకవినామము వక్రమార్గమున కలవు. ఇది "ఘుణాక్షరన్యాయము" కాదు. గూఢవస్తుమయకావ్యన్యాయము.

కుమారసంభవమునందు ఉప్పటుని కుమారసంభవము గూఢవస్తుమయకావ్యమని కలదు. (21.ప 1 ఆ.) "నన్నెచోడుని కుమారసంభవము"ను గూఢవస్తుమయ కావ్యమని, కుమారసంభవపద్యములు రెండిటియందు కుమారసంభవము రచనాకాలము గూఢముగ కలదనియు, దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారి అభిప్రాయము[52]. కుమార సంభవము ప్రాచీనగ్రంథమని కూర్చిన వారి గణితము అప్రయత్నసిద్ధముకాదు. అంతేకాదు. ఆంధ్రదేశవ్యవహారప్రసిద్ధమైన శాలివాహనశకము సరిపడక, అన్యదేశ వ్యవహారప్రసిద్ధమైన విక్రమశకమును ఆశ్రయించి విమర్శకు గురియైనది[53]. ఉపరి, ఆస్థానపతితము. స్వస్థానపతిష్ఠమగునేమో పరిశీలనార్హము. ఆపద్యములివి. :

1. "కరి సిరమాడ షణ్ముఖుఁడు గైకొను వ్రేయుడుఁ గుంభమౌక్తికో
   త్కర మసిధారఁ దొల్పెసఁగెఁ దారకు భంగము సూచి నవ్వు సం
   గరజయకాంతకాంతరదకాంతియొ కాదని నాఁటు దీటి వి
   స్ఫురదవదాతఖడ్గలత పూచెనొ నా జయచైత్రసంపదన్." ౹ 961ప.12ఆ.

ఇది కుమారసంభవము ముగింపు ఘట్టములోని పద్యము. ఇందు "కుమార స్వామి కైపెక్కి ఏనుగు తలమీద కత్తితో కొట్టగా, ఏనుగు కుంభస్థలములోని ముత్యాలు కత్తికి అంటుకొని అందగించినట్లు కలదు. అంతేకాదు. ఆ ముత్యాలకోవ "తారకాసురుని ఓటమిని చూచి, జయలక్ష్మి నవ్వగా, ఆమె పలువరుసయో అన్నట్లు. లేదా, జయము అను వసంతసంపదను కత్తి అను తీగ పూచెనో అన్నట్లు కలదు" అని కూడ ఉత్ప్రేక్ష కలదు. అది కాదనవలసిన అవసరము లేదు. కాని, వసంత శబ్దమునకు బదులు చైత్రశబ్దము ప్రయుక్తమగుట వలన, జయశబ్దము సంసక్తమగుట వలన అర్థాంతరమును ప్రతీయమానము. చైత్రమాసము వసంతర్తుప్రారంభమైనను, చైత్రశబ్దము ప్రథమతః చైత్రమాసస్ఫోరకము. మాసస్ఫోరకమైన చైత్రశబ్దము నకు జయశబ్దవిశేషణము సంవత్సరప్రేరకము. జయనామసంవత్సరచైత్రమాసము ధన్యమాసము. అంతేకాదు. పద్యమునందు "సంగరజయకాంత" అనునెడ మఱొక" జయ" శబ్దము కలదు. అది తిథి, వారబోధకము. తదియ, అష్టమి, త్రయోదశి జయతిథులు, మంగళవారము జయవారము "విస్ఫురదవదాతఖడ్గలత" అను సమాసములోని అవదాతశబ్దము శుక్లపక్షసూచకము. మొత్తము మీద జయనామ సంవత్సరచైత్రశుద్ధతదియా అష్టమీ త్రయోదశీమంగళవారము ప్రతీయమానము. అది

సరిగా 17-4-1894వ తేదీ. ఆనాడు ద్వాదశి ".16" వఱకు మాత్రమే కలదు[54]. అనగా సూర్యోదయాత్ప్రభృతి 25 నిముసములు కలదు. కనుక త్రయోదశి కలసి వచ్చును.

పద్యమునందు ఒక జయశబ్దము "సంగరజయకాంతకాంతరదకాంతిమా" అను సమాసమునందు కలదు. కనుక "కాంతకాంత" వలె "జయజయ" కావచ్చును. కాని జయజయనామసంవత్సరము లేదు. కనుక జయనామసంవత్సరము జయాధికముకావచ్చును. 3,8,13 జయసంఖ్యలు. జయనామసంవత్సరమైన 1894వ సంవత్సరమునకు జయసంఖ్యను అధికము చేసిన 1897, 1902, 1907 సంవత్సరము లగును. ఇందు 1907వ సంవత్సరము స్థూలముగ ప్రతిపాదించిన కుమారసంభవ కూటసృష్టికాలములోని ఆదిమకాలమును సంవదించును.

1895వ సంవత్సరము సన్నిహితము. 1907వ సంవత్సరము సన్నికర్షము,

2. "ద్వాదశార్ధార్ధనయను నా ద్వాదశార్ధ
వదనుఁ డొగిఁ జుట్టె నిజభుజద్వాదశమున
నుదయపశతకిరణుఁ డయ్యుదయనగముఁ
గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు." 993వ.12ఆ.

ఇది కుమారసంభవమును ఇంచుమించు ముగించు సందర్భములోని పద్యము. ఇందు "సూర్యుడు కిరణములతో ఉదయపర్వతమును చుట్టినట్లు, కుమారస్వామి శివుని చుట్టుకొనెను" అనుటకు, అక్షరముల పొందిక కంటె, అంకెల ఇంద్రజాలము అధికముగ కలదు. అది నిర్నిమిత్తము కాఁజాలదు. రచనాకాలము కలదనుటకు విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిలోని "చతురుపాయబాహుశక్తిక్షమావలి" అను పద్యపంక్తిని 1324+78=1402వ సంవత్సరము ఉండుట ఉపబలకము. కుమారసంభవములోని పద్యమునందు ప్రథమ, ద్వితీయపాదములందు ఉపమేయము కలదు. తృతీయచతుర్థపాదములందు ఉపమానము కలదు. ఉపమానోపమేయముల కలయిక ఉపమాలంకారము. ఉపమానోపమేయసంఖ్యలకలయిక రచనాకాలము. ఉపమేయములోని ద్వాదశార్ధార్ధసంఖ్య 3. ద్వాదశార్ధసంఖ్య 6. మొదటి పాదము మొత్తము సంఖ్య 3+6=9. రెండవ పాదములోని ద్వాదశసంఖ్య. 12. రెండు క్రమపాదముల క్రమసంఖ్య 9, 12=912. ఇది ఉపమేయములోని నిష్కృష్టసంఖ్య. ఇక ఉపమానములోని దశశతకిరణములు, దశశతకరములు ఒకటే. కనుక సంఖ్యకూడ

ఒకటే. దశశతసంఖ్య 1000. ఇది ఉపమానములోని నిర్ధారకసంఖ్య. ఉపమానోపమేయసంఖ్యల కలయిక 1000+912=1912. ఇది విక్రమశకముకాదు. శాలివాహనశకముకాదు. క్రీస్తుశకము 1912వ సంవత్సరము స్థూలముగ ప్రతిపాదించిన కుమారసంభవకూటసృష్టికాలములోని అంతిమకాలమును సంపదించును.

కవిగారు 1804వ సంవత్సరమునందు శ్రీకారముచుట్టి, 1907వ సంవత్సరమునందు ప్రాకారముకట్టి, 1912వ సంవత్సరమునందు సాకారముపెట్టి, కుమారసంభవ కృతిని ప్రతిష్ఠించుట సానుకూలము. అది ప్రాచీనగ్రంథముగ తిరముకాదు. నవీన గ్రంథముగ స్థిరము.

నిడుదవోలు వేంకటరావుగారి మరొక నిర్దేశమిది[55]:

"కుమారసంభవమను ప్రాచీనకావ్యమును తాము ముద్రించుచున్నామని ప్రకటించినప్పుడే-కవిగారిపై (శ్రీరామకృష్ణకవిగారే స్వయముగా కుమారసంభవమును రచించి నన్నెచోడుని పేరుపెట్టి ప్రచురణ చేసిరను) అభాండము పడినది-కాబట్టియే వారాగ్రంథపీఠికలో-తనకట్టి శక్తి లేదనియు, నిది ప్రాచీనకావ్యమే యనియు, తరువాతి కవులు కుమారసంభవమ్ము ననుసరించిరనియు సోపపత్తికముగా నిరూపించిరి. కాని వారు చూపించిన కావ్యములును నాకాలమున నెవ్వరికి దెలియవు. అందువలన నది కవిగారి రచనయే యన్నవారే ప్రాయికముగా హెచ్చుగానుండిరి.

కవిగారు తమపై సాహిత్యలోకమున గల నీ యపనిందను బాపుకొనుటకై మరి రెండేండ్లలోనే ప్రబంధమణిభూషణమును ప్రకటించిరి. ఇందు నన్నెచోడుని కుమారసంభవమునుండి ఒకటిగాదు-రెండుకాదు పదునేడుపద్యములున్నవి. కుమారసంభవముతోపాటు దేశమున ప్రచారముననున్న మనుచరిత్ర, వసుచరిత్ర, విజయవిలాసములనుండి పద్యము లుదాహృతములగుటచేత, సాహిత్యలోకము నన్నెచోడ కుమారసంభవము తప్పకయున్నదనియు, దానికొఱకు గవేషణ చేయవలెననియు, నిశ్చయించినది. తంజావూరి పుస్తకభాండాగారములో కుమారసంభవమున్నట్లు తెలిసినతరువాత కవిగారిపై యపప్రథ పూర్తిగా మాసిపోయెను. నాటినుండియే కుమారసంభవకాలనిర్ణయ చర్చలు ప్రారంభమైనవి."

ఇది 1-10-1970వ తేదీని రచించినది[56].

ఇందు కవిగారు చూపించిన కావ్యములు ఆ కాలమున ఎవ్వరికిని తెలియక పోవుటవలన, కుమారసంభవము "కవిగారి రచనయే యన్నవారే ప్రాయికముగా హెచ్చుగానుండిరి. అను విషయము గమనార్హమైన విశేషము.

కుమారసంభవము ప్రాచీనకావ్యమనుటకు కవిగారు చూపించిన కావ్యములందు తిక్కన విజయసేనము, కేతన కాదంబరి చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము, పెదపాటి సోమయ కేదారఖండము, బొడ్డపాటి పేరయ పద్మినీవల్లభము మొదలైనవి ఆ కాలమునందే కాదు, ఈ కాలమునందును ఎవ్వరికిని తెలియవు. ఎవరికి తెలిసి నను పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు, అజ్ఞాతకవి ఉదాహరణ పద్యములందు ఉదాహరించిన, ఆ యా కవుల గ్రంథములలోని పద్యములు కొన్ని మాత్రమే తెలియును. అందలి పద్యములకే కుమారసంభవములోని పద్యములు అనుకరణములని పూర్వోక్తము.

పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరము పదునేడవశతాబ్దిగ్రంథముగ తలంచుట పరిపాటి. కాని, ప్రబంధరత్నాకరమునందు ఉదాహరించిన నెల్లూరి ముత్తరాజ పద్మావతీకల్యాణములోని పద్యము అంత ప్రాచీనముగతోచదు. ఆ పద్య మిది :

"నీవెంత వేడుకొన్నను
కేవలపాతకుల కేల కృప బుట్టు మదిన్
దేవున్నహి గురువున్నహి
భావజచంద్రులకు వికచపద్మదళాక్షీ."

ఇందలి "దేవున్నహిగురువున్నహి" అను పలుకుబడిని "దేవుఁడు నహి గురువున్ నహి" అని పరిష్కరించినను అంత ప్రాచీనముకాదు. కనుక ప్రబంధ రత్నాకరము పదునెన్మిదవశతాబ్దిగ్రంథము కావచ్చును. అందలి పద్యములకును అనుకరణములు కల కుమారసంభవము అంతకంటె ప్రాచీనగ్రంథము కాఁజాలదు.

ఇక ప్రబంధమణిభూషణము. ఇది ప్రాచీనగ్రంథము కానేకాదు. ప్రాచీనగ్రంథ మైన ప్రబంధసారశిరోమణికి కవిగారి రూపాంతరకల్పనము. ప్రబంధమణిభూషణ మను గ్రంథనామమును కవిగారి నామకరణవిశేషము. ప్రబంధసారశిరోమణిలోని తొమ్మిదిపద్యములు కుమారసంభవమునందు కూర్చినట్లు సోపపత్తికముగ నిరూపితము. ప్రబంధసారశిరోమణి కూడ పదునెన్మిదవశతాబ్దికంటె అనంతరగ్రంథము. అందలి

పద్యములను అనుసంధించిన కుమారసంభవము అంతకంటె ప్రాచీనగ్రంథము కాఁజాలదు.

మఱి ప్రబంధమణిభూషణమును బట్టి, "సాహిత్యలోకము నన్నెచోడకవి కుమారసంభవము తప్పకయున్నదనియు, దానికొఱకు గవేషణ చేయవలెననియు నిశ్చయించినది" అను విషయము కూడ అవశ్యగమనార్హమైన విశేషము.

ఒక గ్రంథమునకు మఱొక గ్రంథము వలన గవేషణ చేయవలసిన స్థితి ఒక్క "నన్నెచోడుని కుమారసంభవము"నకు మాత్రమే తటస్థించినది! గవేషణకు ఫలితము తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు కుమారసంభవము తాళపత్రగ్రంథము కనిపించినది. అది మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన "నన్నెచోడుని కుమారసంభవము''నకు మాతృక వలె గాక, పుత్త్రిక వలె కలదని పూర్వోక్తము. నిజముగ 1909వ సంవత్సరమునకు పూర్వము తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయమునందు "నన్నెచోడుని కుమారసంభవము" తాళపత్ర గ్రంథము కలదేని, కవిగారు తనమీద పడిన అభాండమును తొలగించుటకు, కవిగారు స్వయముగ మహాపాపమనిన వదంతిని ఖండించుటకు, లేని లక్షణగ్రంథములను ప్రమాణీకరించుట, ఉన్న సంకలనగ్రంథమును రూపాంతరీకరించుట అనావశ్యకము. "తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునందు నన్నెచోడుని కుమారసంభవము తాళపత్రగ్రంథము కలదు'' అను ఒక్కమాట చాలును. అభాండము తొలగి పోవును. మహాపాపమనిన వదంతి ఖండింపఁబడును. కాని ఆ మాట కవిగారి నోట రాలేదు. కారణము? కూటసృష్టియే!

సమష్టిపై భాషావిషయమును బట్టి, ఛందోవిశేషమును బట్టి, కవిత్వతత్త్వమును బట్టి, పాఠభేదప్రదర్శనమును బట్టి, మతభేదనిదర్శనమును బట్టి, తాళపత్ర గ్రంథస్వరూపమును బట్టి- సాహిత్యపురాతత్త్వసరణిని, చారిత్రికపద్ధతిని, చక్రబంధ రచనాసంప్రదాయపక్కిని, గూఢవస్తుమయకావ్యన్యాయమున- నన్నెచోడుడు శివకవి గాక నవకవి అని, కుమారసంభవము ప్రాచీనగ్రంథము గాక నవీనగ్రంథమని సిద్ధాంతము.

ఇంచలి భ్రమప్రమాదములను తెలిపి, ఇంతకంటె బలవత్తరమైన ఉపపత్తులు చూపి- నన్నెచోడుడు శివకవి అని, కుమారసంభవము ప్రాచీనగ్రంథమే అని వివరించునెడ మదుపజ్ఞమైన సిద్ధాంతమును సవరించుకొనుటకు సంసిద్ధము.

౧

# నన్నెచోడ కళావిలాసము

28-12-1908వ తేదీని మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసిన మఱొక విషయమిది[1].

"ఈ మహాకావ్యమును రచించిన కవి నన్నెచోడదేవుడు............ ఇతఁడు కలావిలాసమను మఱియొక్క కావ్యమును గూడ రచించెను. అది నాకు లభింపకున్నను దానిలోని పద్యములు కవిసంజీవిని, రత్నాకరము, అథర్వణచ్ఛందము, గణపవరపు వేంకటకవి లక్షణశిరోమణిలో నుదాహరింపఁబడినవి. ఆపద్యములలోఁ గొన్నిటి నిందుదాహరించినయెడల సుముఖులెవ్వరైనఁ దద్గ్రంథమును వెదకి దానినవర్ణ్యమగు మరణమువలనఁ దప్పింతురను నాసగలుగుచున్నది.

సీ॥ పృథులవిశ్వంభరారథమున...............

క॥ తలపోయఁగ...............

చ॥ తొడవులు పెట్టు...............

చ॥ లలనలు కొంచలు...............

క్షేమేంద్రుడను నొకానొక కశ్మీరమహాకవి కలావిలాసమని సంస్కృతమున నొకగ్రంథము వ్రాసియున్నాడు. తెనుఁగు పద్యముల నన్నియుఁగూర్చి పోల్చిచూడఁగా నద్దానికిది తెనుఁగు గావనియు నిందుఁ గథాభాగము కూడఁ గలదనియు సంస్కృతమున దానిలోఁ గథాంశములు లేకుండటయు జూడగా రెంటికిని నామమాత్రసాదృశ్యము గలదని తేలినది."

ఇందు కవిసంజీవని కల్పితము. అధర్వణచ్ఛందము అబద్ధము. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు "కళావిలాసము" నుండి, గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరమునందు నన్నెచోడకలావిలాసము" నుండి పద్యములు కలవు. కవిగారి ప్రతిపాదనమునుబట్టి, లేదా ప్రయోగరత్నాకరమునుబట్టి కాఁబోలు ప్రబంధరత్నాకరమునందు "నన్నిచోడని కళావిలాసము"నుండి పద్యములు ఉన్నట్లు

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన ప్రబంధరత్నావళియందుకలదు[2]. కాని, పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు "కళావిలాసము" అనియేగాని, "నన్నిచోడని కళావిలాసము"అనిలేదు. అంతేకాదు ప్రబంధరత్నాకరములోని కళావిలాసమునందలి పద్యములకు, ప్రయోగరత్నాకరములోని నన్నెచోడకలావిలాసమునందలి పద్యములకు అంతరముకలదు. అయినను, "ప్రబంధరత్నావళిలో 187 పద్యముగానున్న 'శ్రీమంతుడు' అన్న పద్యము కవిగారీయలేదు. దానికి బదులుగా "చ. లలనలు కొందఱు............" ఇందువలన (నన్నెచోడుని) కళావిలాసమున మనకు లభించిన పద్యము లైదని తెలియవలెను" అని నిడుదవోలు వేంకటరావుగారి అభిప్రాయము[3].

ఇంతకు పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు ఇట్లు కలదు.

1. తాటాకు 24 a/b "మదనస్తుతి :.... కళావిలాసం

సీ॥ పృథులవిశ్వంభరా రథమున కెదురుగా ।
పూన్పించె నెవ్వఁడు । పువ్వు దేరు ।
కాంచనాచలకార్ము । కమ్మునకు సాటిగా ।
చేపట్టి నెవ్వాడు । చెరుకువిల్లు ।
అవిరళశాకుప । తాఫ్రమునకు వాణి ।
మిగిలించె నెవ్వండు । చిగురు తూపు ।
అతులితామరదాన । వాదిబలంబుల ।
గెలిపించె నెవ్వఁ డ । య్యళిబలంబు ॥

గీ॥ నట్టి జగజెట్టి మన్మథు । డఖిలలోక
ములకు వెరగొంగ జీవుల । మూలకంత ।
యతని యిలు చొచ్చి వెడలని । యతడు గలడు ।
యతని యమ్ముల బడకున్న । యతడు గలడె ॥

2. తాటాకు 108/b తాంబూలానకు । కళావిలాసం

క॥ తలపోయంగ రుచులారును
గలుగును వాతంబు క్రిమియు। కఫముం చెడునా

కలిబుట్టు దగయు చెడుద।
మ్మలము పదార్థంబు రాగమూలము ధరణిన్॥

3. తాటాకు 142/ఎవిటలక్షణం। కళావిలాసం

క॥ శ్రీమంతుడు గుణవంతుడు।
ధీమంతుడు రూపయుతుడు। ధీరుండు కళా।
ధాముండును గావలయును
(దా)మహి కాముండు కామతంత్రవివేకీ॥

4. తాటాకులు144/b,145/a,b భద్రదత్తకూచిమారపాంచాలులు॥ కళావిలాసము

[గ్రంథపాతము]

చ॥ ...................... ........................ .............. .....
.............. . . ...............................................
.......... ....... .....ష్టి యతం దరుదేర గాంచియున్
దడవకయుండ నెప్పటివి।దంబని కౌగిట జేర్ప నంతకున్॥

కళావిలాసము

చ॥ తొడవులు పెట్టు సంభ్రమము తో దిలకించు మణుంగు గట్టు బై।
బడు దడవోప దింపెరిగి। పట్టుదు నేర్పులు గట్టిపెట్టు బ।
లెక్కడు నెడ దొట్రుపా టొదవు। గింకకు చేగిలు మేన్ చెమర్పగా।
జిటుముడి బొందు కాంత పతి। జేరిన కూరిమి గల్గె నేనియున్॥

చ॥ లలనలు గొంద రాత్మవరు।లం దమకూడిన చెయ్వులన్నియున్।
దలచి సఖీజనంబులకు। దప్పక చెప్పెడు వారు పుణ్యజీ।
వులు చెలియామదీశుని క।వుంగిలి డాయుడు నాకు వల్బునే
ల్డొలగు బెరుంగబోలునట। తోపవు మీద రతిప్రయోగముల్॥"

ఇందు "లలనలు గొందఱు" అను పద్యము భాస్కరప్రెగ్గడ రసాలంకారము లోని పద్యముగ ఛందము లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారము అను అముద్రితలక్షణగ్రంథమునందు ఉదాహరింపఁబడినది. అంతేకాదు. "యామదీశుని"

అనుచోట "యామినీశుని" అని, "నాకువల్బ్రే "అనుచోట" కాకతాల్మికీ" అనియు సాధుపాఠములు కలవు. అవియే కవిగారి ఉదాహరణములందును కలవు. ఉపరి, ఛందము లేక బాలబోధచ్ఛందస్సు లేక సర్వలక్షణసారము అను అముద్రితలక్షణ గ్రంథము కవిగారి అంకస్థితార్థపేటి. అందు భాస్కరప్రెగ్గడ రసాలంకారములోని పద్యమని ఉదాహరించిన పద్యము నన్నెచోడుని కళావిలాసములోని పద్యముగ ఉదాహరించుట చిత్రము.

పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు "లలనలు కొంచరు"అను పద్యమునకు ఆకరము లేదు. ఇట్టి పద్యములు ఇంకను కలవు. ఉదాహరణపద్యములు అను సంకలనగ్రంథమునందును అట్లు కలవు. అందును, ఇందును ఆకరములు లేని పద్యములకు అంతకుముందున్న ఆకరములకు లగించి ప్రబంధరత్నావళియందు ప్రకటింపఁబడినవి.

ప్రబంధరత్నాకరములోని కళావిలాసపద్యములకు గల మదనస్తుతి, తాంబూలమునకు, విటలక్షణము,భద్రదత్తకూచిమారపాంచాలురు అను ఉపశీర్షికలను అరసిన, ప్రబంధరత్నాకరములోని కళావిలాసము కామశాస్త్రమని అవగాహనమగును.

ఇక గణవవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరమునందు ఇట్లు కలదు. తాటాకు 22/A "వ. ఇందుకే (అర్ధబిందుప్రాసమునకు) నన్నెచోడకళావిలాసం-

క॥ నగజాత నారద నుడి వి
నఁగ లేకాగ్రహము జెంది నగ నీ హరుఁడు లె
నగవు సెలవి నిగుడఁగ లి
న్నగ పలికెన్ సతికి మునికి సాయము దోఁపన్."

తాటాకు / "వ. ఇందుకే (వర్గ్యప్రాసమునకు) నన్నెచోడకళావిలాసం—

క॥ పాథోనిధిగాంభీర్యన్
రాధాకాముకపదాబ్జరాజత్సేవా
మేధాధుర్యతపోరా
గాధేయుని మునివతంసగాధేయు వనిన్."

ఇందు లెనగవు లేనగవు అని,సాయము నాయము అని,ధుర్య ధుర్యుఅని ఉండవలయును. మొదటి పద్యమునందు "నారదుని మాటవిని పార్వతి ఆగ్రహముచెంది

నవ్వగా, ఈ శివుడు పెదవిమీద చిఱునగవు విరియగ, పార్వతికి నారదునికి న్యాయము తోచునట్లు తిన్నగా పలికెను" అని కలదు. పార్వతికి కోపము వచ్చు నట్లు నారదుడు ఆడినమాట ఏమో, ఈ హరుడు అను వక్త ఎవరో వ్యక్తము కాదు గాని, ఇది పార్వతీపరమేశ్వరులకు నారదునికి మఱొకవ్యక్తికి మధ్యనడిచిన వ్యవ హారమని వ్యక్తమగుచున్నది. రెండవ పద్యమునందు వనమునందున్న గాధేయుని గుఱించికలదు. గాధేయుడు తపోరాగాధేయుడు. రాధాకాముకపదాబ్జిరాజత్సేవామేధా ధుర్యుడు. పాథోనిధిగాంభీర్యుడు. రాధాకాముకుడన కృష్ణుడు. కృష్ణుని పాదార విందములయందు ఒప్పుచున్న సేవాబుద్ధి కలవారిలో గాధేయుడు శ్రేష్ఠుడని సమా సార్థము. అనగా కృష్ణభక్తుడని అర్థము. గాధేయుడన విశ్వామిత్రుడు. విశ్వా మిత్రుని కృష్ణభక్తి అపూర్వము. అట్టి విశ్వామిత్రుని వనమునందు ఎవరో ఏమో చేసిరనియో, చూచిరనియో రెండవపద్యమునందు కలదు. ఒక పద్యమునందు పార్వతీపరమేశ్వరనారదుల ప్రసక్తి, మఱొక పద్యమునందు కృష్ణభక్తుడైన విశ్వా మిత్రుని విషయము కల "నన్నెచోడకళావిలాసము" నానాపురాణకథావిలాసమని అవ గాహనమగును.

కనుక ప్రబంధరత్నాకరములోని "కళావిలాసము", ప్రయోగరత్నాకరము లోని "నన్నెచోడ కళావిలాసము" కాదు.

నన్నెచోడకళావిలాసపద్యములోని రాధాకాముకపదబంధప్రయోగము, అల్లసాని పెద్దన మనుచరిత్రములోని స్వాహాకాముకపదబంధప్రయోగమునకు సహోదరము. అంతేకాదు. శ్రీనాథుని భీమఖండమునకు పూర్వము తెలుగు కావ్యములందు రాధ ప్రసక్తి కానరాదు. కనుక నన్నెచోడకలావిలాసము శ్రీనాథునిభీమఖండముకంటె, అల్లసానిపెద్దన మనుచరిత్రకంటె అనంతరగ్రంథము కావలయును. అయిన చరిత్రకు విరుద్ధము.

పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు, రంగయ(?) సర్వలక్షణ సారమునందును "నన్నెచోడకుమారసంభవము" అని, గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరమునందు "నన్నెచోడకళావిలాసము" అని గ్రంథనామములు సమాసఘటితములుగ కలవు. ఈ మూడుగ్రంథములందును ఇతరగ్రంథముల గుఱించి ఇట్టు లేదు. ఇది విలక్షణము.

గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరమునందు, కస్తూరి రంగకవి ఆనంద రంగరాట్ఛందమునందు నన్నయ ఇంద్రవిజయము మొదలైన గ్రంథములనుండి పద్యములు కలవు. ఇట్టివాని గుఱించి వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయమిది[4]:

"ప్రయోగరత్నాకరము రంగరాట్ఛందము మొదలగు కొన్ని లక్షణగ్రంథములందుఁ బ్రాచీనకవికృతములుగాఁ గొన్ని ప్రబంధముల పేళ్లతోఁ బద్యము లుదాహరింపఁబడియున్నవి. ఆ పద్యములను గూడ నీ కూర్పునందుఁ జేర్పఁజూచితిని గాని యాలోచింపఁగా నం దసత్యతాసంశయము సంఘటిల్లెను. గణపవరపు వేంకటకవిప్రభృ తులు కొందఱు తమకు సమ్మతములగు కొన్ని ప్రయోగములను నిల్వ రించుకొనుటకయి తమ లక్షణగ్రంథములందు లక్షణకల్పనము చేసి లక్ష్యముగాఁ బ్రాచీనకవీశ్వరకృతులై నట్లేవో గ్రంథనామములును, పద్యములును సృష్టించియుందురని తోఁచెను. నన్నయ ఇంద్రవిజ యములోనిదట యీ పద్యము?

క॥ "అంగజుఁ డను మావటి చ
క్కంగను రాయంచయేనుఁగను నూఁకుచుఁ జే
చెంగలువ నోజ చేఁజెలి
చంగవ వడుచక్కిఁ గ్రుమ్మి సరగున నార్చెన్."

విశ్వాస్యమగునా? ఇట్లే భాస్కరుని సునందోపాఖ్యానము, సోముని హారవిలాసము, భీముని నృసింహపురాణము మొదలగునవి."

ఇందు నన్నయ ఇంద్రవిజయము నన్నయకృతము కాకపోవుట ఇదమిత్థము. అనగా కల్పితమని అర్థము. నన్నయకృతముగనే ఇంద్రవిజయమును సృష్టించిన గణపవరపు వేంకటకవి, నన్నెచోడుని పరముగ కళావిలాసమును సృష్టించుట విప రీతము కాదు. ప్రాచీనులకు తెలిసిన ప్రసిద్ధుడైన నన్నెచోడుడు నీతిశాస్త్రముక్తావళికి లేక నీతిసారముక్తావళికి సంబంధించిన బద్దెన్నృపాలుడు. బద్దెనీతి లేక బద్దెననీతి పద్యములందు బద్దెన్నృపాలునికి పర్యాయపదముగ "నన్నెచోడనరేంద్రా" అను సంబుద్ధులు కలవు. ఆ పద్యములు మడికిసింగన సకలనీతిసమ్మతమునందు ఉదాహ రింపఁబడినవి కూడ.

అవి :

క॥ సాధింపఁ గడిఁది శత్రుల
సాధించిన బలిమి వృథ నిజక్షితిజనులన్
బాధించు కంటకులఁ బతి
శోధింపనినాఁడు నన్నెచోడనరేంద్రా. 113 ప. 1 ఆ.

క॥ తనకెన్నఁడుండియును ద
క్కని భృత్యులఁ బెరుగ మనుపఁగాఁ జనదు ప్రయో
జనమునకుఁ దగిన వెల యి
చ్చునది నరేశ్వరుఁడు నన్నిచోడనరేంద్రా. 420 ప. 2 ఆ.

క॥ మనుపఁ గొలయేని జీతము
దనియఁగ నిచ్చునది యెంత దయగల్గిన నే
రనివాని నెఱతనమునకుఁ
జొనుపుట దుర్నయము నన్నిచోడనరేంద్రా. 421ప. 2ఆ.

ఇక నీతిశాస్త్రముక్తావళిలోని ఇతరపద్యములు :

క॥ భూపగుణమలిగి చెఱుపఁగ
నోపుట కరుణించి మనుప నోపుట జడుఁడై
కోపప్రసాదగుణములు
సూపని నతి పతియె నన్నచోడనరేంద్రా. 10 ప.

క. నతి కంటె నబల వసుమతి
నతి పతిలేకున్నఁ జెడదు సత్యము ధాత్రీ
పతి లేని నాఁడు నద్య
చ్చ్యుతి వసుమతి కంద్రు నన్నచోడనరేంద్రా. 48 ప.

మఱి నీతిశాస్త్రముక్తావళియందు బద్దెనరేంద్రునికి నన్నెచోడనరేంద్రా అనియే గాక కీర్తినారాయణుడా, ఉదారవైరోచనుడా, దశదిశాభరణాంకా, పరపక్షభైరవా, సన్నగంధవారణా, నరేంద్రచతురాననుడా, రాజమనోజభూభుజా, కావ్యచతుర్ముఖుండైభూపతీ, రాజరాజమనోజా, కొమరురభీమా, నయతత్త్వనిధీ, భూపదిలీపా,

సర్వజ్ఞనిధీ, యశోనిధీ, వివేకచతురాననుఁడా, వివేకభూషణా, రాజభూషణా అను సంబుద్ధులును కలవు. అనగా బద్దెభూపతి ప్రాచీనకాలమునందు ప్రసిద్ధుడని అవగాహనమగును. కనుక బద్దెనరేంద్రుడైన నన్నెచోడునిపేర కళావిలాసమును కల్పించుటసంభవము. అంతేకాదు. బద్దెనరేంద్రుడు ఉరవు నన్నెచోడనరేంద్రుడు ఎంత ప్రసిద్ధుడైనను, కావ్యచతుర్ముఖబిరుదాంకితుడైనను, రాజు కావున, ఆ కాలమునందు రాజులపేర ఆస్థానకవులు రచించుట కలదుగావున, అది స్ఫురింపఁజేయుటకును అనుకూలముగ "నన్నెచోడ కళావిలాసము" అని సమాసఘటితముగ నిర్దేశించుటకూడ సంభవము.

గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరములోని "నన్నెచోడకళావిలాసము" వంటిదే, రంగయ (?) సర్వలక్షణసారములోని "నన్నెచోడకుమారసంభవము" ను కావచ్చును. అందలి పద్యము, సమాసఘటితగ్రంథనామము పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు కలదు. ప్రబంధరత్నాకరములోని రెండవపద్యమును రంగయ (?) సర్వలక్షణసారములోనిది కావచ్చును. ఒకటి రేఫప్రాసమునకు, మఱొకటి శకటరేఫప్రాసమునకు లక్ష్యములు. రంగయ (?) సర్వలక్షణసారమునకు ఏకైకప్రతి లభించినది. అది "గ్రంథపాతశైథిల్యములు" లేనిదికాదు[5]. కనుక "నన్నెచోడకుమారసంభవము" రంగయ (?) కల్పనము, "నన్నెచోడకళావిలాసము" గణపవరపు వేంకటకవి కల్పనము కావచ్చును.

లక్షణగ్రంథముల కంటె, గ్రంథలక్షణము ముఖ్యము.

౨

# మోహనాంగి మారీచీపరిణయము

1829వ సంవత్సరమునందు ప్రకటింపఁబడిన కావలి వేంకటరామస్వామిగారి దక్కను కవుల జీవితచరిత్రరేఖలు అను గ్రంథమునందు ఇట్లు కలదు[1].

> *"This poetess (Mohanangi) was a princess, and the daughter of Krishna Roya, she received an excellent education in her infancy and was well versed in rhetoric and poetry; while in the bloom of youth she married Ramaroyulu, after which she still continued her studies, and employed much of her time in reading those works in Telugu composed by the poets at her fathers court; by constant application she attained to considerable proficiency, in the art of versification, and wrote a poem entitled "Marichi Parinaya" the subject of which is taken from Mahabharat; in this poem very elegant description is given, of the Marichi damsels, the work consists of five books; this Prince had no issues and became unfortunately a widow; in the Prime of life (according to tradition) she was immolated on the funeral pile of her husband."*

ఇందు శ్రీకృష్ణదేవరాయల కూతురు, అళియరామరాయల భార్య అయిన మోహనాంగి, మహాభారతమునుండి ఇతివృత్తమును గైకొని, మారీచీపరిణయము అను అయిదాశ్వాసముల కావ్యమును రచించినట్లు కలదు.

1929వ సంవత్సరమునందు ప్రకటింపఁబడిన సమదర్శిని అను పత్రిక యందు సెట్టి లక్ష్మీనరసింహముగారు ప్రకటించిన మోహనాంగి మారీచీపరిణయము

అవతారిక, చతుర్థాశ్వాసాది, కథాసంగ్రహము కలదు[2]. అది సెట్టి లక్ష్మీనరసింహముగారి కూటసృష్టి అని సాహిత్యజగత్తునకు తెలిసినది. సర్వసమ్మతమయినది.

1973వ సంవత్సరమునందు కావుటూరు వేంకటరామచంద్రరావుగారు ప్రకటించిన "శ్రీకృష్ణదేవరాయల తనయ మోహనాంగీవిరచిత మారీచీపరిణయము (ఉపలబ్ధగ్రంథము)"నందు సెట్టి లక్ష్మీనరసింహముగారు సమదర్శినిపత్రికయందు ప్రకటించినది కలదు. అంతేకాదు. అది సెట్టి లక్ష్మీనరసింహముగారి కూటసృష్టి కాదని, కృష్ణదేవరాయల కూతురు మోహనాంగి రచనము కావచ్చునని, కానిచో 'కాకమాని మూర్తికవి వ్రాసి మోహనాంగి పేరుతో చలామణి చేయలేదుగదా అని కూడ అనుమానింపవచ్చున'ని, 'ఒకవేళ మోహనాంగియే వ్రాసియుండిన ఎప్పుడు వ్రాసియుండును?' అని విచారించుచు, విపులమైన బహువిషయభరితమైన పీఠికలు ఆంధ్రాంగ్లభాషలందు కలవు. అయినను, "ఉపలబ్ధగ్రంథము"ను అరసిన, "మోహనాంగి మారీచీపరిణయము" సెట్టి లక్ష్మీనరసింహముగారి కూటసృష్టి అనియే స్వయంవేద్యమగును.

కుమారసంభవమునందు శైవశబ్దము వలె, మారీచీపరిణయమునందు శైలీశబ్దము కలదు.

అసలు శైలి అను శబ్దము సంస్కృతశబ్దమే. "శైలీరీత్యాం" అని ఇరుగపదండనాథుని నానార్థరత్నమాలయందు కలదు. అంతేకాదు. మనుస్మృతికి కుల్లూకభట్టు వ్యాఖ్యానమునందును కలదు.

> "ప్రాయేణాచార్యాణామియం శైలీ యత్స్వాభిప్రాయమపి పరోపదేశమివ వర్ణయంతి. అత ఏవ 'కర్మాణ్యపి జైమినిః ఫలార్థత్వా'దితి బాదరాయణస్యైవ శారీరకసూత్రం."

ఇది మనుస్మృతియందు అనగా మనువు రచించిన స్మృతియందు మనువు చెప్పినట్లు కల సందర్భమును సమర్థించునది. ఒక్క మనుస్మృతియందు మనువు చెప్పినట్లు మాత్రమే కాదు; జైమిని రచించిన పూర్వమీమాంసయందు జైమిని చెప్పినట్లు, బాదరాయణుడు రచించిన ఉత్తరమీమాంసయందు బాదరాయణుడు చెప్పినట్లు కల సందర్భములు బహుళము. జైమిని రచించిన పూర్వమీమాంసయందు "కర్మా

ణ్యపి జైమినిః ఫలార్థత్వాత్" అను సూత్రముకలదు. బాదరాయణుడు రచించిన ఉత్తరమీమాంసయందు "అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ-" అను సూత్రము కలదు. మనువు రచించిన మనుస్మృతియందు "యో యస్యైషాం వివాహోనాం మనునా కీర్తితో గుణః- " అను శ్లోకముకలదు. మనువు రచించిన మనుస్మృతియందు మనువే చెప్పుట, బాదరాయణుడు రచించిన ఉత్తరమీమాంసయందు బాదరాయణుడే చెప్పుట, జైమిని రచించిన పూర్వమీమాంసయందు జైమినియే చెప్పుట సంశయము కలిగించును. అట్లు రచించుట ఆచార్యుల సాధారణపద్ధతి అని కుల్లూకభట్టు సమర్థనము. అనగా కుల్లూకభట్టు ప్రయోగించిన శైలీశబ్దమునకు పద్ధతి అని మాత్రమే అర్థము. అది దేనికి సంబంధించిన పద్ధతి అయినను కావచ్చును. కనుక కుల్లూకభట్టు ప్రయోగించిన శైలీశబ్దము సామాన్యవాచి. కవితాపద్ధతినిమాత్రమే ప్రతిపాదించు శైలీశబ్దము విశేషవాచి.

కవులు, ఆలంకారికులు కవితాపద్ధతికి శయ్యా, రీతిశబ్దములనే గాని, శైలీశబ్దము ప్రాచీనకాలమునందు ప్రయోగింపలేదు. అనగా శైలీశబ్దము విశేషవాచిగ ప్రాచీనకాలమునందు సాహిత్యరంగమునందు ప్రసిద్ధము కాదని అవగాహనమగును. సంగీతరంగమునందుమాత్రము వ్యవహారప్రసిద్ధము. అంతేకాదు. సంగీతపరమైన శైలీశబ్దము సంశయముగ పాలకుఱికి సోమనాథుని పండితారాధ్యచరితమునందు, నిర్ధారకముగ శ్రీనాథుని శృంగారనైషధమునందు, పలనాటి వీరచరిత్రమునందును కలవు.

"అరుదగు దాసయ్య నఱువత్తుమూఱు
సరితంబులును, శ్రీబసవపురాణంబు
నేలలు వెట్టంగ నింపు సొంపారు
శైలిచేఁ గ్రాలుచుఁ జదివెడు వారు" పర్వతప్రకరణము. పుట 433.

ఇందు శైలీశబ్దము కవనపద్ధతికి గాక పఠనపద్ధతికి ప్రయుక్తము. కనుక సంగీతపరమైన శైలీశబ్దప్రయోగము. కాని "శైలీచేఁ గ్రాలుచు" అనుచోట "శైలంబు ఘూర్ణిల్ల" అను పాఠాంతరముకలదు. కనుక సోమనాథుని ప్రయోగము నిర్ధారకము కాదు.

"టంకముఖంబుల న్మణివిటంకములన్ లిఖియించియున్న మీ
నాంకరసప్రసంగమధురాదిమగాథలు పారదారికా

హంకరణక్రియాసమభిహారమహాపరిహాససంకథా
సంకలితంబు లొప్పిదపుశై లిఁ బఠింతురు ప్రౌఢభామినుల్."
157ప.7ఆ.శృం.నై.

ఇందు శైలీశబ్దము కవనపద్ధతికి గాక పఠనపద్ధతికి ప్రయుక్తము. ప్రౌఢ భామినులు శృంగారగాథలు ఒప్పిదపుశైలిని పాడుదురని తాత్పర్యము. కనుక సంగీతపరమైన శైలీశబ్దప్రయోగము. ఇట పాఠాంతరము లేదు. కనుక శ్రీనాథుని ప్రయోగము నిర్ధారకము.

"భరతశాస్త్రోచితబహురాగములను
గరిమతో నేర్చిన కంతు బాణంబు
... ... ...
పుష్పాంజలి యొసంగి పూని నాట్యంబు
సమకట్టి నాదంబు సభయెల్ల గ్రమ్మ
కైకోలు విడుదలల్ ఘనకళాశైలి
కైముడి కట్నముల్ కనుపింపజేసి
... ... ...
ప్రేరణి దేశిని ప్రేంఖణశుద్ధ
దండికాకుండలి తగు బాహుచారి
సప్తతాండవములు సల్పె చిత్రముగ." 185-213.ప.వీ.చ.

ఇందును శైలీశబ్దము కవనపద్ధతికి గాక పఠనపద్ధతికి ప్రయుక్తము. రాజ నర్తకి సప్తతాండవములు ఘనకళాశైలిని పాడుచు ప్రదర్శించినదని తాత్పర్యము. కనుక సంగీతపరమైన శైలీశబ్దప్రయోగము. ఇట కూడ పాఠాంతరము లేదు. కనుక శ్రీనాథుని ప్రయోగమిది కూడ నిర్ధారకము.

ఇంతకు మించి శైలీశబ్దప్రయోగము ప్రాచీనాంధ్రకావ్యములందు మృగ్యము. సంశయముగను, నిస్సంశయముగను ఉన్న ప్రయోగములు మూడును సంగీతపరము. సాహిత్యపరమైన శైలీశబ్దప్రయోగము, ఆంగ్లభాషలోని Style అను శబ్దము నిమిత్తముగ ఆధునికయుగమునందు మాత్రమే వ్యవహారప్రసిద్ధము. అది కూడ కందుకూరి వీరేశలింగముగారి ఆంధ్రకవులచరిత్రము వలన అభివ్యాప్తము. ఇట్టి ఆధునిక

వ్యవహారమైన, సాహిత్యపరమైన శైలీశబ్దము "మోహనాంగి మారీచీపరిణయము" నందు ద్విధా ప్రయుక్తము.

"తండ్రి, సమస్యపూర్తికి నెదం దలపోయుట లేదు; మీరలే
మంద్రో మదీయసాహసము నారసి, కావ్యమొనర్పఁబూనితిన్;
'వీంద్రకుఁ బాకముండఁగఁ, గవిత్వపుఁబాకమునేల?' యంచు ని
ల్లాంద్రను గేలిసేయు జనులందఱు మెచ్చెడు నట్టి శైలితో" 20 ప.
"చదువుల సరస్వతివి; నీ
మృదుకవితాశైలి స్త్రీలకే యననేలా ?
తుదకుం గొమ్మలు తిరిగిన
మదవత్కవిపుంగవులకు మహిని గలుగునే ?" 22 ప.

ఇందు మొదటి పద్యమునందు శైలీశబ్దము పఠనపద్ధతికి గాక కవనపద్ధతికి ప్రయుక్తము. రెండవ పద్యమునందును కవనపద్ధతికి ప్రయుక్తమే గాక, "మృదు కవితా" ముద్రాముద్రితము. ఇట్లు ఆధునికవ్యవహారమైన, సాహిత్యపరమైన, శైలీ శబ్దము ద్విధా ప్రయుక్తమైన మారీచీపరిణయము ఆధునికగ్రంథమే. కనుక "మోహ నాంగి మారీచీపరిణయము" సెట్టి లక్ష్మీనరసింహముగారి కూటసృష్టి అని కరతలామ లకము. అంతేకాదు.

శ్రీకృష్ణదేవరాయలు ఏదులఖానును జయించినట్లు ఆముక్తమాల్యదయందు కలదు. ఆ పద్యమిది :

"అలుకన్ ఘోటకధట్టికాఖురపుటీహల్యన్ ఖురాసాని పు
చ్ఛలు వో దున్ని చలచ్ఛమూగజమదాసారప్లుతిం గీర్తి పు
ష్కలసస్యం బిడి యేకధాటి బళిరా కట్టించితౌ దృష్టి కే
దులఖానోగ్రకపాల మర్దపహరిద్భూజాంగలశ్రేణికిన్." 42 ప. 1 ఆ.

ఇందు ఏదులఖానశబ్దము దుకారవిశిష్టముగ కలదు. అది యతిమైత్రి ఘటి తము. కనుక నిర్ధారకప్రయోగము. ఏదులఖానుడన బీజపూరుసుల్తాను యూసఫ్ ఆదిల్ ఖాన్. ఆదిల్ ఖాన్ అను శబ్దము రోమక లిపిని (Adilkhan) అని యుండును. అది ఏదిల్ ఖాన్ అనియు ఏడిల్ ఖాన్ అనియు గ్రహించుటకు అవకాశముకలదు. ఆదిల్ ఖాన్‌కు ఎడిల్ ఖాన్ అను వ్యవహారము ఆంగ్లభాషాప్రభావము. అదికూడ మారీచీపరిణయమునందు కలదు.

"ఏఁడిలఁ గృష్ణరాయధరణీశునితో నని సేయఁగల్గువాఁ ?
డేడిలఖాను, బీజపురమేలు పటానటుచేసి, ప్రాణముల్
వీడి, యముండు జేఁడయిన వీటికిఁ బోవక రంభ మేడకున్
వీడియముం గొనంజనియె, వేల్పుబొజుంగులు వెచ్చనూర్చఁగన్." 83ప.

ఇందు ఏడిలఖానుశబ్దము డికారవిశిష్టముగ కలదు. అది ప్రాసఘటితము. కనుక నిర్ధారక ప్రయోగము. ఇది కేవలము ఇంగ్లీషుప్రభావము. అనగా ఆంగ్లభాషా పరిచయముగల కవి ప్రయోగమని అవగాహనమగును. కనుక "మోహనాంగి మారీచీపరిణయము" సెట్టి లక్ష్మీనరసింహముగారి కూటసృష్టి అని కరబదరకము.

"ఊర్వశి నెమ్మేని హొయలు చూపుటమాని
బురఖాను ధరియించి తిరుగసాగె,
మేనక చీరలు మాని యిజారులుఁ
గుడితినీలున్ వేసికొనఁగ సాగె;
రవికల విడనాడి రంభ జుబ్బాలు క
బ్బాలు బిబ్బీలట్లు వాడసాగె;
లోచనంబులకుఁ దిలోత్తమ కాటుక
మాని సుర్మా నిత్యమూన సాగెఁ;
గృష్ణరాయకరాసిచేఁ ద్రెళ్లి గోల
కొండ బీజపురంబులనుండి స్వర్గ
పట్టణంబున కరుదెంచినట్టి దొడ్డ
ఖాను బిడ్డల కుంపుడుకత్తె లగుచు." 84 ప.

ఇది "మోహనాంగి మారీచీపరిణయము" లోని పద్యము ! ఇందలి "బురఖా, ఇజారులు, కుడితినీలు, జుబ్బాలు, కబ్బాలు, సుర్మా" ఇట్టివలివి.

ఇక శ్రీకృష్ణదేవరాయలు "తెనుఁగు నృపాలుడై నరపతిత్వము కల్గిన వీర భద్రపుత్రిని, మఱి యోఢ్రుఁడై గజపతిత్వము కల్గు ప్రతాపరుద్రు పుత్రిని వరియించి" నట్లు కల విషయము (90ప.) చరిత్రకు విరుద్ధము. మఱి ప్రతాపరుద్రుని కూతురు పేరు "లక్ష్మి" అని కల విషయము (81 ప.) జనశ్రుతికిని విభిన్నము. ప్రతాప రుద్రుని తనయ పేరు "జగన్మోహిని" అని రాయవాచకమునందు, "తుఖ్కా" అని

కృష్ణరాయవిజయమునందు (25 వ. 4 ఆ.) కలదు. రాయవాచకముకంటె కృష్ణ
రాయవిజయము అనంతరగ్రంథము. రాయవాచకము, కృష్ణరాయవిజయములకంటె
మారీచీపరిణయము అనంతరగ్రంథమేకాదు; ఆధునికగ్రంథము.

అయిన, 1929వ సంవత్సరమునందు సెట్టి లక్ష్మీనరసింహముగారు కూట
సృష్టికావించిన మోహనాంగి మారీచీపరిణయము గుఱించి, అప్పటికి శతాబ్దిపూర్వము
1829వ సంవత్సరమునందు కావలి వేంకటరామస్వామిగారు రచించి, ప్రకటించిన
దక్కను కవుల జీవితచరిత్రరేఖలు అను గ్రంథమునందు ఎట్లు ప్రసక్తమైనది ?
అను ప్రశ్నకు అవకాశము కలదు. 1929వ సంవత్సరమునందలి "మోహనాంగి
మారీచీపరిణయము" అను గ్రంథముగుఱించి 1829వ సంవత్సరమునందలి దక్కను
కవుల జీవితచరిత్రరేఖలు అను గ్రంథమునందులేదు. 1829వ సంవత్సరమునందలి
దక్కనుకవుల జీవితచరిత్రరేఖలు అను గ్రంథమునందు మోహనాంగి మారీచీపరిణ
యము గుఱించి ఉండఁబట్టి, 1929వ సంవత్సరమునందు "మోహనాంగి మారీచీ
పరిణయము కూటసృష్టి చేయఁబడినది. ప్రాచీనగ్రంథమనుటకు ప్రమాణములేనిచో
కూటసృష్టి కళ కట్టదు. ఆంధ్రశబ్దచింతామణియందు "హవేర్మతమ్" అని ఉండఁ
బట్టి, పరవస్తు చిన్నయసూరిగారి బాలవ్యాకరణమునకు మూలముగ శిష్టు కృష్ణమూర్తి
శాస్త్రిగారి హరికారికలు కూటసృష్టి చేయఁబడినవి. దక్కను కవుల జీవితచరిత్ర
రేఖలు అను గ్రంథమును రచించుటకు విషయమును దేశాటనము చేసినపుడు సేక
రించినట్లు కావలి వేంకటరామస్వామిగారి కంఠోక్తి[3]. దేశాటనము చేసినపుడు సేక
రించిన విషయమునందు జనశ్రుతియును ఉండును. జనశ్రుతియందు ఏ రాయలు
కూతురైన శ్రీకృష్ణదేవరాయల కూతురుకాఁగలదు. ఒకానొక రాయల కూతురు -
బహుశః వేశ్యాపుత్రి?- మోహనాంగి మారీచీపరిణయమును రచించినదేమో అనుట
కైన, దక్కనుకవుల జీవితచరిత్రరేఖలు అను గ్రంథమునందు మోహనాంగి మహా
భారతమునుండి ఇతివృత్తమును గైకొని మారీచీపరిణయమును రచించినట్లుకలదు.
మారీచీపరిణయము అని కావ్యనామకరణము చేయుటకు అనువైన ఇతివృత్తము మహా
భారతమునందులేదు. రామాయణమునందుకలదు. అంతేకాదు. సెట్టి లక్ష్మీనర
సింహముగారి కథాసంగ్రహమునందు రామాయణకథ సంగ్రహముగకలదు. రామా
యణ కథ మహాభారతమునందు ఉన్నను, మారీచీపరిణయమునకుమూలము రామాయ
ణము గాని మహాభారతముకాదు. కనుక దక్కను కవుల జీవితచరిత్రరేఖలు అను

గ్రంథములోని మోహనాంగి మారీచీపరిణయమునకు సంబంధించిన విశేషములకు ఆధారము జనశ్రుతి అగును. జనశ్రుతి వస్తుతః ప్రామాణికముకాదు.

కుమారసంభవము ప్రథమభాగమునందు ఉత్తరకథాప్రశంస, ద్వితీయభాగ పద్యత్రయమువలె, "మోహనాంగి మారీచీపరిణయము"నందు కథాసంగ్రహము, చతుర్థాశ్వాసాదిపద్యగద్యచతుష్టయముకలవు. పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునందు, రంగయ (?) సర్వలక్షణసారమునందు ప్రస్తుతమైన "నన్నెచోడ కుమార సంభవము" ను బట్టి మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన "నన్నెచోడదేవుని కుమారసంభవము" నకు, కావలి వేంకటరామస్వామిగారి దక్కనుకవుల జీవితచరిత్ర రేఖలు అను గ్రంథమునందు ప్రసక్తమైన "మోహనాంగి మారీచీపరిణయము"నుబట్టి సెట్టి లక్ష్మీనరసింహముగారు ప్రకటించిన "మోహనాంగి మారీచీపరిణయము" నోల్లుంతనప్రాయము.

3

# సరస్వతీమహాలుగ్రంథాలయము

## - సంగ్రహచరిత్ర

ఇది తంజాపూరునందు రఘునాథనాయకుడు కట్టించిన రాజభవనమునందు కలదు. రఘునాథనాయకుడు ఉరపు రఘునాథరాయలు తంజాపూరు రాజ్యమును పరిపాలించిన నాయకరాజు. తంజాపూరు రాజ్యమునకు తంజాపూరు రాజధాని. తంజాపూరు గ్రంథాలయమునకు రఘునాథరాయల కాలమునందే (1601-33) బీజావాపన జరిగియుండును. అది విజయరాఘవనాయకుని కాలమునందు (1633-73) అంకురితదశ నందియుండును. తంజాపూరు రాజ్యాధిపతులైన మహారాష్ట్రపాలకులు మొదటి ఏకోజీ (1676-83), శహాజీ (1684-1710) మొదటి శరభోజీ (1710-28) మొదటి తుళజాజీ ఉరపు తుక్కోజీ (1728-36) రెండవ ఏకోజీ (1736-37) ప్రతాపసింహుడు (1739-63) రెండవ తుళజాజీ (1765-87) అమరసింహుని (1788-98) కాలమునందు పల్లవితదశ నందియుండును. రెండవ శరభోజీ (1798-1832) కాలమునందు పుష్పితదశనందినది. అది రెండవ శివాజీకాలమునందు (1832-55) అట్లే కలదు. ఆధునికయుగమునందు ఫలితదశకు వచ్చినది.

తంజాపూరు గ్రంథాలయమునకు రెండవ తుళజాజీ కాలమునుండి సరస్వతీభండారమను పేరు కలదు. (1776) కాని, రెండవ శరభోజీ పట్టము గట్టుకొను వఱకు సరస్వతీభండారములోని గ్రంథములకు పట్టిక లేదు. రెండవ శరభోజీ పట్టము గట్టుకొన్నను (1798) పాలకరాజు కాడు. నామకరాజు మాత్రమే. అతని కాలమునందు సంస్కృతగ్రంథపట్టిక తయారైనది. అది మధ్యస్థుడు [illegible]దమూర్తి గంగాధరభట్లు సదాశివభట్లు ఋజువు చూచి వ్రాసినది. (1800) రెండవ శరభోజీ గ్రంథాలయాభివృద్ధికి అనేకవిధముల పాటుపడెను. ప్రత్యంతరములు వ్రాయించెను. (1803) తాళపత్రగ్రంథములను కొనెను (1805) కాశీయాత్ర చేసినపుడు సంస్కృతగ్రంథసంచయమునందు అత్యధికభాగమును సేకరించెను. (1820-30). గ్రీకు, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలలోని పెక్కు ముద్రితగ్రంథములను భద్రపఱిచెను. సంస్కృతాంధ్ర

తమిళమహారాష్ట్రభాషలలోని లిఖితగ్రంథముల తోపాటు; గ్రీకు, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలలోని ముద్రితగ్రంథములును జతకూడి సమగ్రమైనది సరస్వతీభండారము.

రెండవ శరభోజీ తర్వాత రెండవ శివాజీ కూడ నామకరాజు. అతడు 22-11-1855వ తేదీని చనిపోయెను. అతనికి ఇరువదియొక్కమంది భార్యలున్నను పురుషసంతానము లేకపోయినది. అందువలన మహారాష్ట్రుల నామకరాజ్యాధిపత్యమును అంతరించినది. ఆ కాలమునందు సరస్వతీభండారములోని తెలుగు తాళపత్రగ్రంథములను ఋజువు చూచిన తాళపత్రముఖపత్రికలు తయారైనవి. అవి మధ్యస్థులు సేనాధురంధర రామయ్య వరహాప్పయ్య దీక్షితులు వ్రాయించినవి. (6-4-1856) తంజావూరు రాజ్యప్రతినిధి హెచ్.ఫోర్బ్సు వారసుని నియమింపవలసినదిగా సిఫారసు చేసినను, లండనులోని రాజ్యాంగశాఖ నిరాకరించి, అతనినే 'కమిషనరు'గ నియమించెను. (16-4-1856) తదుపరి లండనులోని రాజ్యాంగశాఖ సరస్వతీభండారములోని గ్రంథములకు పట్టిక తయారుచేయింపవలసినదిగా తాఖీదు పంపించెను. (8-6-1856) కాని, రాజవంశీయులు సహకరింపలేదు. రాజభవనాధికారి తంతు చేసెను. క్రమముగ రాజభవనము 'కమిషనరు' అధికారములోనికి వచ్చినను గ్రంథపట్టిక తయారు కాలేదు. (18-10-1856.) రెండవ శివాజీ మొదటి భార్య కామాక్షీబాయికి వారసత్వపు హక్కు దఖలుపడినది. [21-8-1862]

ఆంగ్లేయ ప్రభుత్వము భారతావనిలోని గ్రంథాలయములందు లిఖితగ్రంథముల పరిశీలన, కొనుబడి, ప్రత్యంతరలేఖనము, పట్టికారచనము, తన్ముద్రణప్రయత్నము చేయుటకు ఆదేశించెను. [3-11-1869.] అదే సంవత్సరము డిశంబరు నెలలో ప్రభుత్వాదేశానుసారము, ప్రొఫెసర్ బర్నెల్ సరస్వతీభండారములోని లిఖితగ్రంథములకు పట్టిక వ్రాయుట ప్రారంభించెనుగాని, తీవ్రమైన అస్వస్థతకు గురియై ఐరోపాఖండమునకు వెడలిపోయెను. [1870] మఱి తిరిగి రాలేదు. ఆయన తయారుచేసిన అసమగ్రపట్టిక అయినను లభింపలేదు. తర్వాత పట్టికారచనకు డాక్టర్ బర్నెల్ నియమింపఁబడెను. (16-3-1871). ఈయన తయారుచేసిన సంస్కృతగ్రంథముల వర్గీకృతసూచిక (Classified Index) మూడు భాగములుగ లండనులో ప్రకటింపఁబడెను. [1878,1880.]

వారసత్వపు హక్కు దఖలు పడినను, కామాక్షీబాయికి ఆమె సవతులకు అన్యోన్యత కుదరక వ్యాజ్యమునకు దిగిరి. మఱల సరస్వతీభండారము మధ్యస్థుని

అధీనమైనది. అది 3-5-1912వ తేదీ వఱకు సాగినది. ఆ సంవత్సరము రెండవ శివాజీ ఆఖరి భార్య జిజాంబభాయికూడ చనిపోయెను. వారసుల తరపున మధ్యస్థుడు వ్యాజ్యము వేసెను. ఆస్తి వివరములందు మొట్టమొదటి అంశము సరస్వతీభండారము. న్యాయస్థానమునందు విచారణజరుగుచున్నకాలమునందు వారసులందఱును, రాజ గ్రంథాలయమైన సరస్వతీభండారమును ప్రజాగ్రంథాలయముచేయుటకు సమ్మతించి, బ్రిటిషుప్రభుత్వమునకు దరఖాస్తు పెట్టుకొనిరి. (14-10-1917) అందు సరస్వతీ భండారమును అది మొదలు "తంజావూరు మహారాజ శరభోజీ సరస్వతీమహాలు గ్రంథాలయము" అను పేర వ్యవహరింపవలయునను అభ్యర్థనము కలదు. అందు నిమిత్తము గ్రంథపట్టికల ఆవశ్యకము కలదు. కనుక సంస్కృతాంధ్రగ్రంథపట్టిక అప్పటిది కావచ్చును. వారసుల కోరిక మేరకు న్యాయస్థానము ఒడంబడికతీర్పు ఒసగినది. [25-3-1918] బ్రిటిషు ప్రభుత్వాదేశానుసారము మదరాసు రాష్ట్రప్రభుత్వము ప్రజాగ్రంథాలయనిర్వహణమునకు ప్రణాళికను సిద్ధపఱిచెను [5-10-1918]

తంజావూరు సరస్వతీభండారము 1918వ సంవత్సరమునుండి తంజావూరు మహారాజ శరభోజీ సరస్వతీమహాలు గ్రంథాలయము.

ప్రభుత్వాదేశానుసారము, సరస్వతీమహాలుగ్రంథాలయములోని గ్రంథములకు వివరణపట్టిక (Descriptive catalogue) తయారుచేయు పనిని, నిర్వహణ సంఘము డాక్టర్ పి. పి. యస్. శాస్త్రిగారికి అప్పగించెను. [9-4-1927] శాస్త్రి గారి కృషిఫలితముగ ఇరువదియొక్క వివరణగ్రంథపట్టికలు ప్రకటింపఁబడినవి. అవి యెల్ల సంస్కృతగ్రంథముల వివరణపట్టికలే. వారే కురుగంటి సీతారామయ్య గారిచేత తెలుగు గ్రంథముల పట్టికలు రెండు తయారు చేయించిరి. అవి సరస్వతీ మహలు గ్రంథాలయమునందలి కాగితపు'రిజిష్టర్లు' కావచ్చును. 17-1-1932వ తేదీని, ఆంధ్రవిశ్వకళాపరిషత్ తెలుగుశాఖ అధ్యక్షులు పింగళి లక్ష్మీకాంతముగారు, 10-7-1932వ తేదీని ప్రొఫెసర్ పి. పి. యస్. శాస్త్రిగారు హిందూపత్రికలో ప్రకటించిన వ్యాసముల ఫలితముగ, 1933వ సంవత్సరమునందుఆంధ్రవిశ్వకళాపరిషత్, సరస్వతీమహాలుగ్రంథాలయములోని తెలుగుగ్రంథముల వివరణపట్టికను ప్రకటించినది. అందు "చేరని గ్రంథములను వెదకి" విరలదేవుని సుందరశర్మగారు తయారు చేసిన తదనుబంధమును 1959వ సంవత్సరమునందు తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయము ప్రకటించినది.

ఇవి తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయము సంగ్రహచరిత్ర. ఇందుకు తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయమునకు ఇప్పటి నిర్వహణాధికారి పి. పరశ్వనాథన్‌గారు, తెలుగు పండితుడు యస్. విశ్వనాథముగారు వ్రాసిన లేఖలు, ఆంధ్రవిశ్వకళాపరిషత్, సరస్వతీమహాలుగ్రంథాలయము ప్రకటించిన వివరణ గ్రంథ పట్టికలు, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయనిర్వహణసంఘసభ్యులు ఆర్. జయరామన్‌గారు ఆంగ్లమున ప్రకటించిన సరస్వతీమహాల్ అను గ్రంథము మూదల.

## ౪
# కవిగారి కతిపయపద్యములు

కుమారసంభవములోని సంస్కృతశ్లోకానువాదములు, తమిళకన్నడపద్యాను సరణములు, తెలుగుపద్యానుకరణములు, అన్యపద్యములును అథఃకరించిన మిగులు సొంత పద్యములు ఎన్నో ఉండవు. అవియైన మానవల్లి రామకృష్ణకవిగారు కూట సృష్టి చేయఁగలరా? అను సందేహము, కొందఱికి కలుగవచ్చును. కవిగారి మృగావతి, కళింగసేన, పాటలీపుత్రకము, వసంతవిలాసము, కర్ణభారము మొదలైన కృతులు దుర్లభములు. కనుక చతురక్షరసంయోగమునకు కతిపయపద్యములు.

కవిగారు ఇరువదినాల్గవయేట (1890) ప్రకటించిన మృగావతిలోని పద్యములు.

"అపరసంధ్యావిచారపరులై కొమరాంఢ్రు
చికురబంధమ్ములఁ జేర్చు వేళ
బృందారకాంగనాబృందంబుతో వీణె
వాయింప సుతి చక్కఁబఱచు వేళ
యన్యోన్యసరసత్వమలయింప ముద్ధియ
ల్గాడి గీరనగింజలాడు వేళ
యమునాతరంగిణీ కమలకేళీమనో
హరల మనోవిభు లరయు వేళ

శారికాకీరశిష్యసంపదులు వారి
వారి పాఠముల్ శుద్ధాంతవరవధూటి
కాగురుస్థలి సరిచెప్పఁగలయు వేళ
ఘూతలేంద్రుఁడు రథమెక్కఁబోవు వేళ. 36ప.1ఆ.

స్రగ్ధర. ప్రాలేయోత్తుంగశృంగప్రభవదమలధారాగళద్గండశైలం
బాలంబక్రూరవానర్యవగణితమదవ్యాఘ్రపుంభోఘురాస
త్కూలత్యక్తద్రుమాళిన్ గులిశమణివిభాకోటివీక్షయమానం
బాలోలత్సిద్ధబృందంబగు హిమకధరవ్యాప్తగాంతారమెన్నన్. 41ప.1ఆ.

అష్టాంభోజదళోపమస్థమణిఘృణ్యాకారహాలావళ
భ్యష్టాశాపరివర్ధమానరుచులై యంత్రాంత్రసంస్థాపితా

వష్టంభభ్రమదభ్రచుంబికలశవ్రాతంబులై మంజుమాం
జిష్ఠశ్రీయుతసాలభంజికములై చెన్నొందు సౌధాగ్రముల్. 62ప.1ఆ.

తనిమఁ గదల్చె మాతలి రథంబు విరుల్లయినుండి రాలె న
య్యనిమిషకాంత లాన్నృపునయం బెదబాయ సహింపకప్పరం
బునకు విహంగి చక్కిలము ప్రుచ్చిలి పోయిన నిల్చు బొట్టె భం
గిన నిలుచుండి రంగజుఁడు కేరఁగ భూపతి వెంటనంటఁగన్. 120ప.1ఆ.

పాలుబొజ్జలఁ బుచ్చి పడతి కేలూత కె
ట్లడిగింతు నాననా పుడమిఱేని
బుయిలోడ కేత్తేటఁ బొలఁతిఁ గూర్చుట కిచ్చ
వడునొ తాము ను మున్న వలుకఁడొక్కొ
వలుక నేమాయె నమ్మలికంబు వోనె యి
ల్లాలేమి విసమెంచి పొలువడునొ
నెలఁత యానుడువుల వలను వీనులఁబెట్ట
కంజలిఁ జిట్టుముట్టాడునొక్కొ
కలసి యివియన్ని దైవసంఘటనఁ జేసి
విధివిపాకంబు దలకొన వెట్టి గాదె
యనుచు దుఃఖించి యాత్మల్ నాడు నిటులు
దర్పకావేశశాసితద్యైర్యుఁడగుచు." 145ప.1ఆ.

అమరారివీరాళనావమానితదాన
వవ్రాతుఁ దేరాజవరుని తండ్రి
కద్రూతనూభవవిద్రావణైకమా
ననవజ్రుఁ దేభూమినాథు తాత
గాండీవనిర్ముక్తఘనబాణపరితప్త
ధరణీపుఁ దేని ముత్తాతతాత
దంభోళిధారాహతక్రూరరక్షస్స
మూహుఁ దేవిభు దివ్యమూలపురుషుఁ
డట్టి వీరాన్వయాంబుధి బుట్టినట్టి
బెట్టిదుఁడు చిన్నదనములోఁ బెఱదొరలకుఁ

బెలుచ తలవంపు గలుగంగ సలిపె నతఁడు
జననఫలమొక్కొ యతని నల్లునిగఁ గోర 17ప.2ఆ.

హస్తవిన్యస్తవీణారవంబును మించు
గళగళద్గాయకగమకలీల
గళగళద్గాయకగమకలీలను మించు
నభినయవ్యాపార మరసిచూడ
నభినయానందంబు నవఘళింపఁగఁజాలు
సంచలన్మధ్యప్రసంగవృత్తి
సంచలన్మధ్యప్రసంగవృత్తిని మీఱుఁ
బాదపద్మన్యాసబహుళత లొగి

ముఖవికాసంబు గాత్రసమ్మోహనంబు
వినయతోక్తులు నడవడి వ్రీడ నమ్ర
తాగుణంబును రూపవిస్తరత చతుర
తయును మధురిమ మించు నెద్దానినైన. 43ప.2ఆ.

పౌణ్యాశీర్వచనారవంబు లమరీమాధుర్యకంఠస్వనం
బన్యోర్వీపనుతిశ్రుతుల్ కుసురపుణ్యాహధ్వనుల్ దేవతా
ధన్యస్త్వంరుతు లుద్భవిల్లి కలయం దంజాపురీవాద్యముల్
కన్యాదానము సేసెఁ బాణులఁ బయఃకాంతుల్ విడంబింపఁగన్. 62ప;2ఆ.

ఒఱపు వెన్నెలలు నెత్తెఱలై వెలుంగఁ బూ
గుత్తు లొగి రసంబు గుండ్లు గాఁగఁ
జెట్లు వాయిదకాంద్ర చెలువుదోపఁగ నికుం
జారామరంగంబులందుఁ గేకి
శుకపికజనములు చూచుచుండఁగ రతీ
కుసుమమార్గణులు కొక్కొకకూచి
మారనాటకముల వీరశృంగార వ
సంతమోహనరమల్ సఖులు గాఁగ

చైత్రచంద్రాదు లుచితవేషకులు గాఁగ
దంపతులు నా మృగావతీధరణిపతులు

నాయికానాయకులుగ నిర్ణయము సేసి
తమి యథావిధిఁ దత్ప్రయోగము లొనర్తు. 79ప.2ఆ.

ఇచ్ఛాకేళివిలాసదత్తతనుపై యేలాలతాసౌమన
స్యాచ్ఛత్వం బొనగూడ రక్తజలయోగాయత్తయై శోణర
త్నచ్ఛాయల్ పెను ప్రోదివెట్టఁగ మనోనాళీకమావాపిలో
స్వచ్ఛస్వర్ణలతాంగి విచ్చెను నభోవాటీచరుల్ చూడఁగన్. 111 ప. 2 ఆ.

ఈ నిర్మానవభూమి యీ వనతలం బీయంబరోల్లేఖిసా
ధానీకప్రచరత్తరప్లవగసింహవ్యాళభేతాళికా
ధ్వానప్రాప్తవికార మీ కటకసంత్రాసంబు నన్నెంచినన్
ప్రాణంబుల్విడనాడు నిక్కమిది మోహప్రాప్తినుంచుర్విపై. 26ప.3 ఆ.

మహాస్రగ్ధర. నవకవ్యాఘ్రాసనాసీనవిమలచతురామ్నాయసూత్రాత్తహవ్య
స్తవనీయం బర్కతేజస్తరుణపధికవాచంయమవ్రాతమాది
త్యవధూట్యానీతపుష్పస్తబకవిహితపాద్యప్రణామత్సరంబ
భ్యవితాంతేవాసివాసంబగు వరజమదగ్నాశ్రమంబొత్తిరంతన్.63ప.3ఆ

ఆరోహించి కృపీటరంగనటదుద్యద్భంగముగ్ధాళిడిం
డీరచ్ఛద్మదరస్మితం బొలయఁబాణిన్ శోకరోద్వాసనా
నీరంబుల్ పయిఁజల్ల క్రోశమరుగన్ నేత్రద్వయిన్ గూర్చెఁ బా
పీరాహార్యసదాగతుల్ సుధల వృష్టిన్ స్త్రీలు హర్షింపఁగన్. 79ప.3ఆ.

విమలతపోధికత్వమున వ్రేల్మిడి విశ్వచతుర్దశంబు లొ
క్కమొగిన వ్రస్సిపోయెడిని గామవిపద్విముఖుండు స్వఃపురీ
రమ వరియింపఁగోరెడినొ గ్రక్కున నొక్కయు పాయమెంచుఁ డ
న్న మగపలెట్టులైన యమినైష్ఠిక మంబుపసాలు సేయుదుర్. 116ప. 3ఆ.

ఈతఁడు దివ్యదృష్టిఁ బరమేశుని చేఁతలు సైత మొక్క మా
టే తలపోయు నన్నిపుడెఱింగి శపించినఁ బోడివారి సం
గాతము తప్పునంచుఁ గనుగందుచు నొక్క లతాంతమార్గణ
ద్యోతతరైకవేషమున నొప్పెడి వశ్యముఖిన్ భజింపుచోన్. 123ప. 3ఆ.

రవివృషభంబునన్ మిథునరాశి బుధుండు మృగేంద్రరాశిలోఁ
గవిగురుచంద్రులోజఁ గటకంబున నుండఁగఁ గర్కిలగ్నమం

దువిదకు( బుత్రుడుద్భవిలు యుక్తవిలక్షణపద్మచామరా
దివివిధరేఖలంగ్రఘికరదివ్యతలంబుల ముద్దువారఁగన్. 20ప. 4ఆ.

దారుణశైలసానుపరితాపవిభగ్నమనస్కుఁడైన హ్ర
ద్ఘోరవనాంతరశ్రమవికుంఠితపాదసరోజుఁడైన సం
ధ్యారమణీయతాండవకళాధిగతప్రమదాత్ముఁడైన సం
సారవియోగియైన సుతు జల్పవచంబుల వాసి గానఁడే. 37 ప. 4 ఆ.

రాజకులాగ్రగణ్యరతిరాజసమాన విమానచారిణీ
పూజితదివ్యరూప మునిముఖ్యవివర్ధిత యస్త్రశస్త్రవి
ద్యాజయగాండివిప్రవర ధైర్యరమాధిక మత్తరాజతే
జోజయశీలి శీలితవిశుద్ధనయార్జన సత్యవర్ధనా. 67ప. 4 ఆ.

ఎలసి పథశ్రమం బపనయించుచుఁ గొండొకసేపులోన గు
జ్జులిడుచు నిద్రవోయిరి యెఱుంగరొకో యుదయాచలాటవీ
స్థలములటంచుఁ గానియెడఁ దాల్చునె యిట్టి విరామ మాప్రియా
జలజముఖావలోకనవిచారమహీధవచిత్తమెంతయున్. 104 ప. 4 ఆ.

దవ్వుల వెల్ల క్రొంబొగల దార్కొను కైవడి గ్రాలు కొండలోఁ
బువ్విలుతుండు నెవ్వలపుబోదె ముదంబను తొట్లఁబెట్టి కన్
గవ్వలరాల్చు నీశలవగాహసుధాకణభంగిఁగామి మున్
మవ్వమెలర్ప నూఁచునను మాడ్కి వెలుంగిడెఁ దామచూళికల్." 119ప.4ఆ.

కవిగారు ముప్పదవయేట (1896) రచించిన స్మృతికవిత్వము చంపకమాలిక ఉపక్రమణిక

"ప్రకృతివధూటి ! పుష్పఫలపత్రరసాలవిశాలవాటులన్
శుకపికశారికారుతులు సోలము పెంప ముదంబు నింపఁ జం
పకనవమల్లికాకుసుమమంజరి క్రొమ్ముడి గందగింప నె
మ్మొకము దరస్మితంబగుచు బ్రుంగిన మల్లకు సేద దీర్పఁగా
సకి వనలక్ష్మి రాధికయు సల్లపనామృతసారధారలన్
జికిలుప దక్షిణానిలము చిత్తము జిల్లనఁ గౌఁగలింప ను
త్సుకమతిఁ దూఁగుటుయ్యేలలఁ దూఁగవు మోహతమంబుగాఁ దటాం
తికమున సన్నగాలి వడదేరెడు శాఖలతోడి వృక్షపం

జ్జీక్క కదలు ముంగురు ల్గలిగి దివ్యరుచిస్మితయుక్తలైన బా
లికలను మూవులందిడి చేలంగెడు చూపఱఁగాఁగ, దేవక
న్యకల యనుంగురూపులకు నానలు దెచ్చుచు శుద్ధవాహినీ
సికతల మందవాయువులు జిల్లని యాడఁగఁ బెక్కణంబు స
ల్పక మనేదేల? తామరకొలంకులఁ బద్మినులోలగింప హం
సికలకు మాన్మథీఘుటిక చెందమిరేకుల నిచ్చి మున్న ద
ర్పకపరమార్చనానియతి రాల్చిన రక్తసరోజపత్త్రముల్
సకియలపై విదిర్చికొన జక్కవ లుల్లసమాడు మాడ్కిఁ జూ
చుకముఖవిభ్రమత్త్సనవిచుంబిసితాంశుకనుల్లలాడ మౌ
క్తికముల సేస చల్లి కొను తీరున శీకరపంక్తు లొండొరుల్
మొకములఁ జల్లఁ జల్లఁ దెలిమోములఁ జెమ్మటలూరఁ జిత్తవం
చకజలకేళి సల్పి స్మరశంభళినంపి సుపర్వకోటిఁ బి
ల్వక యిటువేఁగుదే? భువనవర్ణితమాధవమైన నీ ముఖ
ప్రకటితచంద్రికారసము ప్రాలిన మంచుమునుంగుతోడ క
ప్పికురులు వీడి క్రొమ్ముడికి ప్రేఁగుఁదనంబుఁ బ్రాతరాత్తపు
ష్పకమకరందబాష్పకణపంక్తులతో వగదేలెదేల? హా!-"

కవిగారు బహుశః మువ్పదవయేటనే [1896) రచించిన కళింగసేనలోని పద్యములు:

"మదనాగ్నియుఁ గదనాగ్నియు
నెదిగిన దావాగ్నివోలె నెరియించుఁ జుమీ
మదవతులను మదపతులను
విదితశరత్కాలమహిమ వెలఁది యెఱుఁగుమా

ముల్లోకంబుల లేని మూర్తులు జగన్మోహాకృతుల్ వైద్యుతీ!
కల్లోలంబు లదృష్టపూర్వసుషమాకందర్పదర్పధ్వజ
వ్యల్లేఖ్యప్రతిమావతారములు పుష్పోత్క్రాంతకాంతాప్సర
సల్లావణ్యములైన యీ తనులతల్ చక్షుఃప్రియామోదముల్
గగనోల్లేఖశిఖాసహస్రవిటపిగ్రామంబు ఘామంబుగా
జగదుద్ఘోరవిహారవీరకలనాశార్దూలకంఠీరవీ

ఖగరాడ్జాతము శాతమై వెలయు నీ కాంతారమధ్యంబునం
బ్రగుణానందకళిందపుష్పవనముం బాలించి రెవ్వారొకో

కోమలవికచకలాప
శ్యామశ్యామలమనోజ్ఞచంద్రకరత్న
స్తోమమణిచాపములతో
సీమంతశిఖావతంసశృంగారముతో

ధనురాకర్షణమంత్రసిద్ధత గుణధ్వానంబు రోదోంతర
స్తనితోల్లాపముగాఁగ వీరకళఁ బ్రత్యాలీఢపాదంబుతో
జనితాంగారపరంపరాకరశరాసారంబు తోరంబుగా
జెనకంజేయ నజేయవిక్రమకళాశింజానమై పర్విడన్.

పలుకయు మఱువును లేమిన్
బలితంబగు ఖడ్గపుత్రి పాదాహతిచే
నిలువునఁబూచు నశోకము
పొలుపున నెత్తురులు గాఱ మూర్ఛిలి నిలిచెన్."

కవిగారు బహుశః ముప్పదియైదవయేట (1901) రచించిన వసంతవిలాసము లోని పద్యములు :

"గుఱుతెఱిఁగి తెలుఁగు మఱుఁగులు
తెఱఁగొప్పఁగ మార్గదేశితెలుఁగుల నోలిన్
గఱచి చవివుట్టఁ జెప్పక
మఱకువ నోరార్చు మమ్ము మ్రందింపకుడీ. 20ప.1ఆ.

వేదనాదంబును వీణారవంబు నిం
డిండిరంబుల నిద్రఁ దెలుపఁ గొలువ
వీరవిహారంబు విటవిలాసంబు న
చ్చరల బింకపుఁజూడ్కిఁ మఱలఁజేయ
ద్వీపగజాశ్వస్ఫీతవిపణిరత్నవిధాతి
రత్నాకరతరంగరాజిఁ బిలువ
వరిపోరువులఁ గేలివనులఁ బూసారువుల్
మేరుశృంగంబుల మెఱుగులీన

సురతసమ్మర్దముదితవిచ్ఛురితవకుల
మాలికలును సాయంతనమల్లికలును
పుష్పధన్వు నంతఃపురస్ఫురణ నెఱప
రేపుమాపులు తత్పురశ్రీలు మెఱయు. 27ప. 1ఆ.

శిశిర ర్తువాసనాపర
వశమగు సమదాలికులము వాసంతరమా
విశదాగమనముఁ దీర్చుచుఁ
గుశేశయేతరరసంబుఁ గూర్పఁగ వెడలెన్. 65ప. 1ఆ.

ఇది నే పట్టినఁ బుష్పబాణములఁ బుష్పేశుండు పోఁద్రోలి బ
ల్లిదుఁడై సంయమినిర్వికల్పకసమున్లీనస్ఫురజ్జ్యోతిఁ గ్ర
క్కదలం జేయుచు గాఢచుంబకశిలాకర్షక్రియంబోలెఁ బా
రదభంగిం జెదరింపడే మదవతీభ్రామ్యత్కటాక్షంబులన్. 127ప. 1ఆ.

వేదము మాలపాలు మొగవీణలు నట్టుల పాలు గీతముల్
వీదుల జోగిజంగముల విత్తము, దొమ్మరిపాలు యోగముల్
వాదము పారిహాసకులు వస్తుకవిత్వము బట్టులున్ ధను
ర్వేదము చిత్రలేఖకులు వీగి హరింపరె యింత కూటికిన్. 169ప. 1ఆ.

ఒండొరు జవ్వనంబు కరువో తమ యుల్లము లూపు ప్రేమపుం
గండరు వోక్కొ చిత్తముల కాటున వాగమృతంబుఁ జిల్కు పూ
గిండియొ మేనువోయి నదికింపగఁ గౌగిలి యిచ్చు వజ్రపుం
బిండమొ నా సుతుండు సిరిపెంపునుఁ బ్రాలును గల్గఁ గల్గడో 175ప. 1ఆ.

అంబుధి నీరు చంద్రకిరణావలి సోకిన నుచ్ఛరించు న
చ్చుంబక మాత్మరుకరిధిఁ జొచ్చిన యాయసపిండ మీడ్చు నీ
లాంబరబద్ధసూత్రమయి యాడును పుత్రిక యెట్టి దృశ్యసూ
త్రంబును గానకాడెడు నరప్రతిమల్ గడుఁ జిత్రభంగులన్ 247ప. 1 ఆ.

తాత్కారధ్వనిశీర్యమాణపటుగండగ్రావముల్లోల జి
హ్వోత్కంఠార్దిత సత్వసత్వనివహాంబుస్లేఖిశాఖాగ్రఖే
లత్కాషాయపటభ్రమజ్జ్వలనకీలాసంభ్రమోద్భ్రాంతవా
తోత్కీర్ణప్రపతీషతత్కులమునై యొప్పారుఁ గార్చిచ్చదే. 8ప. 2 ఆ.

అతిలోకోత్సవదర్శనంబు శివసంధ్యాపూజవర్ధిల్లఁ ద
ద్ద్వతియై చంద్రకళంద్రిపుష్కరమునన్వాయింప నందీశుఁడు
ద్ధతదూరీకరణాంగహారయుతసంహారక్రియాతాండవ
స్మృతిలీల న్నటియింప భృంగి ప్రమదోన్మేషంబునంజూడవే. 19ప. 2ఆ.

బొమలల్లార్చుచు వింతచూడ్కిఁ దొలరంబుల్ సార్చుచు న్నేలపై
సమతం బాదము మోపుచున్ నడపునం జాతుర్యముం జూపుచున్
సుమనోభావముఁ బాయఁబెట్టి దటిసెన్ జోణీశ్వరున్మానుషీ
రమణీమాకృతి దేవకాంత నటనప్రారంభశిక్షాగతిన్. 65ప. 2 ఆ.

కనకరత్నప్రభాకమనీయకుట్టిమ
స్తంభకుడ్యోల్లాభసదనచయము
పారిజాతలతాంతబహుగంధవాస చూ
ర్ణ విసారి ధూపితాంతర్గృహంబు
కృతకాద్రివనసరః క్రీడాసహాసిత
భోగినీ పరిభోగ పూతతనువు
చతుర వేశ్యావిదూషక వేషభాషా వి
చిత్ర ప్రయోగ విస్మిత సదస్య
మైన భోగంబుఁ జెంది జన్మాంతరముల
నైన వాసనబలమున ననవరతము
సౌఖ్యవారాశిఁ దేలంగఁ జాలు నరుఁడు
కమల క్రీగంట నించుక కాంచెనేని. 128ప. 2 ఆ.

స్రగ్ధర. వాసంతీకుందపుష్పవ్యతి కరవకుళవ్యాపిగంధానుబంధో
ల్లాసి శ్రీ చంచరీకోల్లసిత సుమధనుర్జ్యాస్యటంకారశంకా
వాసంబై నీలరత్నోజ్జ్వలమకుటశిఖావ్యాళవైతానరోచి
ర్వ్యాసంబై తప్తకార్తస్వరతనుసుషుమన్ ద్వారదేశం బెసంగన్. 150ప. 2ఆ.

కాముండు స్వఃపురీకలశాబ్ధిఁ బెంచిన
రసదాడి మూగు బేడిసలనంగ
మరుఁ దొడ్డు తెల్ల చుంటకశిలామూర్తికై
లాచిన యినుప శలాకలనఁగ

రూపాభిజాతమారుం డొక్క పెట్టి మైఁ
గురియు నీలోత్పలశరములనఁగ
భవిఁ బరీక్షింపఁ బుష్పశరుండు నవనీత
ఘృణికిఁ బట్టిన నీలమణులనంగ
ఆఖరూప్యరసైక పానాభిలాష
యోషిదుత్సిక్త వివిధభావోపబృంహ
కుటిలితకటాక్షపటలమొక్కటను నాఁటెఁ
దవిలి ధరణీశు చారుసౌందర్యరేఖ 55ప. 3ఆ.

వలరాజు మేనఁదోచిన
కలుపుల గాయములు సూచి కలఁగిన రతిపై
వలరమ్ములేయు మదనుని
యలవులు సూపించు రంభ హరిణీయుతయై 118ప. 3ఆ.

లలితపుంవేషమధురవిలాసవేణు
గాఢఫూత్కార సత్వరాగ ప్రకర్ష
ఆర్ద్రి సుకుమారహృదయచార్వంగకరణ
చిత్తఙ్ఞ తిలోత్తమ నృత్తరేఖ 144ప. 3ఆ.

కారణమేది యచ్చమగు కాయువు నాయెడఁ బుట్ట నీయెడం
బోరాచియై సరూపమయి పొందుల చందమయై మనోభవో
త్తారకజీవమై మెయి విదల్చి నిరస్తసమస్త భేదమై
వారకనిల్చెనో పురుషవల్లభ యుల్లములోనఁ దాల్పవే. 201ప. 3ఆ.

చిలుకల గోళలు సోకని
బలుముక్కుల పోటుఁగనని పరిపూర్ణరసో
జ్జ్వలమధురరుచిరఫలములు
గలవటఁ జవిఁజూడ నీకుఁ గాంక్షయ యున్నన్. 243ప. 3ఆ.

కలయఁజూడ్కుల సోగఁబొలయించి నడపాడు
నుదిరి కీల్బొమ్మలు పదియువేలు
సానబట్టిన జీవజాతిరత్నంబులఁ
దళుకారు వన్నెల చిలుకపిండు

యమృతాబ్ధి క్రొన్నురువలఁచి చిక్కఁగఁబట్టి
పొలుపుచేర్చిన యంచబోదెపదుపు
మేరుసానువులఁ జిమ్మించిన పొడిమన్ను
పట్టచేసిన చిత్రపక్షిగణము
మఱియు వర్ణింపనేరని మెఱుఁగులీన
మనముఁ గన్నులు విస్మయింపంగ వెలయు
తళుకుఁ జూపుల జగజంపుఁ గొలువుకూట
మిట్టిదన నేరమా బొమ్మయింటి పొలుపు        69 ప. 4 ఆ.

సకలపదార్థసంచయము సర్వగుణంబుల ప్రోపు ధీరరం
జక శుచిభావసంపదయు శ్రవ్యమహాచరితార్థవృత్తి వ్యం
జకమహితాంతరంగరుచిసారము దృశ్యగుణానుమేయకో
రకితకలాకలాపముగ రంజిలు నీదు వచః ప్రచారముల్.        151ప. 4 ఆ.

అనిన నిరమ్మదస్ఫురణమానినభంగి లయాంతకాలసం
జనితఘనాఘనస్తనిత సర్వనిసర్గ విసర్గలీలఁ గొ
ట్టినగతిఁ దిట్టినట్టులు నటించినయట్లు ఘటించినట్లు నా
మనమును గన్న మే నొఱఁగి మాయము చూచిన రీతి వ్రాలితిన్. 218ప. 4ఆ.
పునరుపలబ్ధయయ్యె నొక పోడిమిఁ జూడక మున్న చల్లఁగా
మనసులు పొందు సేసికొని మాటయు నాడక మున్న వజ్రలే
పనముగఁ గౌగిలించె మఱువారిన మేనులు సేరమున్న వే
చనియెనె ? మోవులం బ్రణయసార రసామృతమానుమున్న యే. 242ప. 4ఆ.

మణిమంత్రౌషధయోగధాతు రసమర్మజ్ఞానులం గూర్చి త
త్గణ నిర్మాపిత దేహదోహదకలాసంరక్షణస్ఫూర్తిమై
గణరాత్రంబులఁ బ్రాణసంచరణమార్గంబల్ల సాధించి కా
ర్మణవృద్ధింబరిబోధబోధితయగున్ మాదేవి దైవస్పృహన్.        45ప. 5ఆ.

త్రేతాద్వాపరకాలముల్గడవ దైతేయప్రభల్మాసి ధ
ర్మాతంకప్రబలోపవర్గమరణవ్యాధ్యుగ్రదుర్భిక్షవి
ఖ్యాతంబైన కలిప్రవేశమున నుత్కంఠాచితప్రాణులై
ఖ్షితిం జత్తురటంచుఁ బల్కిరి మునిశ్రేష్ఠుల్ త్రికాలజ్ఞులై        133ప. 5ఆ.

వైతంసికవై దేహక
వైతనికాంధసికవైశ్యవై శికవేశ్యా
ఘాతుకవై వధికాది
వ్రాతగృహావళుల లక్ష్మి రహి నర్తించెన్. 162ప. 5ఆ.

చతురంగసైన్యంబుఁ జావఁదెచ్చితివేని
  నుగ్గునూచఁగ నేల నూటి నూటి
మల్లయుద్ధంబున మాఱునిల్చితివేని
  మేనెల్ల ముద్దగా మెదిచి మెదిచి
ఎక్కటిపోర విల్లెక్కుపెట్టితివేని
  పెంపెక్కు విలుత్రాడు త్రెంపి త్రెంపి
మగవాఁడనని గడఁదెగిపూనితేనియు
  గదతోడు చెఱుకుఁగాఁ గాల్చి కాల్చి
యకట ! మదమెక్కి మాఱ్కొని యసురవీర
వర్యుఁడగు భీష్మదంష్ట్రునివలనఁ జిక్కి
చచ్చె నుజ్జయినీశుఁ డన్మెచ్చు నీకుఁ
గలుగుఁ బౌరాణికులు నాదు గాథఁ జదువ. 210ప. 5ఆ.

చౌర్యసూత్రము సక్కఁగఁ జదివినావు
వానికింపుగ భాష్యంబు వ్రాయరాదె
.... .... ....
.... .... .... 222ప. 5ఆ.

ప్రజ్ఞాపారమితాధిక
విజ్ఞాన వివేకమార్గవిధిపారిప్రా
జ్యజ్ఞానోపజ్ఞత స
ర్వజ్ఞప్రోక్తామృతాబ్ధిరతిఁ గ్రీడింతున్. 35ప. 7ఆ.

దత్తకసూత్రపాఠనవిధానము మన్మథయజ్ఞయాజి ని
ర్వృత్త మనోజ్ఞసామకుచివృత్తము వేశకుమారికాసమా
వృత్తశిశువ్రతంబు నృపవీరరణాంగణకార్మణాప్సరో
నృత్తఝళంఝళం ధ్వనివినీతము నీ మృదుగీతమెంతయున్. 148ప. 7ఆ.

అరుణభూషాంబరతరళకాంతులు సోకి
ముఖము సంధ్యాచంద్రసఖము గాఁగ
దీర్ఘాసనస్థితిఁ దెలిమేను చెమరించి
ముత్యాల సేసల మురువు సూప
హోమాగ్నిధూమంబు యోగికన్యాపర
స్వరవీక్షలకుఁ దెరచాటు సేయ
స్వాహాపదోచ్చరచ్చారుకంఠంబుతోఁ
గరకంకణధ్వని [వి] గమక మెత్త
మూఁడు దినములు నేకాంతముద్రితుండు
కపటవిప్రుండు మనసు దాఁగట్ట నిల్పె
నంతకంబెను నద్భుత మరసిచూడ
వికృతి సూపక ప్రాయంపు వెలఁది నిలిచె. 259ప. 7 ఆ.

చనఁ జొత్తెంచి మృదిష్ఠదిష్టమగు సెజ్జ న్యాంధ్యరాగంబు మూ
సిన రాకావిధుబింబమ ట్లతనుమాంజిష్ఠాంబరాగ్రావకుం
ఠనమై పండిన చంద్రలేఖఁ గని శాత్యంబో శ్రమాఘాతచే
తననిద్రాలసభావమో యనుచుఁ జింతం గొంత సైరించుచున్. 6ప. 8 ఆ.

కలశరత్నద్యుతుల్కామినీముఖపద్మ
మెలరార మెఱసి రేయెండఁ గాయ
ఘంటావినాదంబు కలసి యందియలతో
లయభంగతాళలీలలు ఘటింప
బసపు పయ్యెదలోని బంగారుగిన్నెల
దొలఁకిన పాలబిందువులు సెదర
దొట్ల నవ్వించు నింతుల ముద్దుబిడ్డలు
దేవీశరశ్చంద్రదీప్తి నాడ
నంబికాగాత్రనీలద్విపాంబరమున
వెలఁది చిఱునవ్వు వెన్నెల వెలదిసేయఁ
జంద్రలేఖాలలాటికా చంద్రలేఖ
కాళికాపాదనఖతారకాంతి మెఱసె. 83ప. 8ఆ.

తత్సంపర్కముచేఁ బునర్మనుజసంతానంబులోఁ జేసి భూ
భృత్సేవాకలనంబు నీ మహితదృక్పీయూషధారాప్రవా
హోత్సేకస్నపనంబుఁ గాంచితిగదే యుష్మాంశుఁడస్త్రాద్రిసా
నూత్సంగంబు భజించుచున్న చని రాయుద్యన్మతు ల్కన్యకల్. 197ప. 8ఆ.

గ్రామ్యకిరాతస్త్రీజన
రమ్యోల్లోకితపృషచ్ఛరవ్యంబై దు
ర్దమ్యజవవిభ్రమార్జిత
కామ్యంబుగ ఖచరరథము గడచుచునుండన్. 209ప. 8 ఆ.

అధికారదృష్టిభేద
వ్యధితంబులు శాస్త్రగతులు నవియును దేశా
వధికాలావధి యనఁగా
నధిగతసౌఖ్యంబు వడయు నార్యకుమారీ ! 305ప. 8ఆ.

పలుకులు మృదుమధురములై
యొలుకుచు రస మొక్కరొక్క రుల్లంబులఁ దాఁ
దలఁచిన తలపుల కనువై
కలిచిన కలుపులకుఁ గానుకలయై యొప్పున్. 49ప. 9ఆ.

కొలనిం జూడుమిదే షడశ్రసమషట్కోణంబు స్నిగ్ధాశ్మని
ర్మలసోపానతటంబు స్ఫాటికగభీరస్ఫీతతోయంబు మం
గళవృక్షప్రతిబింబకం బపరసంధ్యాకాంతికిమ్మీరచం
చలవీచీమణిచాపచిత్రము సరచ్చక్రాంగసాంగత్యమున్. 172ప. 9ఆ.

నీతో హంసికలై సరోవరముల్ నిర్యంత్రణానంగలీ
లాతోద్యత్క్రియ విస్మృతాత్మలయి యొప్పారంగ సంపూర్ణచి
త్తాతిధ్యంబొనఁగూడె నీకుఁ గద మాయాదేహసంక్రాంతవే
గాతీతప్రసరద్ధలాహలము బెండై నిల్చె మా మేనులన్. 221ప. 9ఆ.

కల్పన్ తెక్కల గప్పి లోఁగొనఁగ సంకల్పోద్భవుండేనియుం
దెల్వంజాలని శిల్పవై ఖరులు చిత్తింబుట్టి శంపాశతా
నల్పోద్వేగతసూమనోనయన మాచ్ఛిత్రపారంపరీ
కల్పం బర్ధనిమేషమాత్ర గడచెన్ ఖండాద్భుతస్వప్నమై. 361ప. 9ఆ.

మదనగురుండు నేర్పిన క్రమంబున రాజుపదేశమీయ న
మ్మదవతు లాత్మబుద్ధిమహిమంబున సూక్ష్మవిచారదక్షలై
పొదలఁగ నాఁడునాఁటికి నపూర్వకళానుభవానుభావముల్
గదురఁగ నొప్పఁజెప్ప గురుకంబెను శిష్యలు ప్రౌఢలై రటన్. 440ప. 9ఆ.

లలితచిత్రవిలాసకళల నర్పించిన
నిదియేమి చూడుమం చెదురు చూపు
గగనయానోల్లాసగతిభేదములఁ జూపఁ
దనురాగముల వానిఁ దడవనిచ్చు
వృక్షాధిరోహణక్రియలతాపేల్లితం
బులఁ జూప మేనులఁ గలయఁజూపు
శ్లేషగర్భితబంధచిత్రప్రహేళికల్
కృతుల రచింపఁ దాఁ గ్రియలఁ జూపు
పదము నర్థంబుఁ బూవును బరిమళంబు
పాలు నీరును కనకంబుఁ బారదంబు
నాత్మ పరమాత్మయును బొందు నలవుఁజూపె
ధరణివిభుఁ డంగనలతోడ బెరసినపుడు. 446ప. 9 ఆ.

సరసమహాకవిజనపద
సరసిరుహామత్తచిత్తషట్పదుఁడై ని
ర్భరభాషోద్యానకలా
వరలతికాసేచనంబు వడిఁ గావింతున్. 454.ప. 9ఆ.

కవిగారు రచించినవని నిడుదవోలు వేంకటరావుగారు తెలిపిన ఎఱ్ఱన నృసింహ పురాణములోని పద్యములు :

చ. సమధికభక్తియుక్తుఁడయి శార్ఙ్గి భజించు నరుండు సంతత
స్థిమితయశోవిలాసుఁడయి చెన్నలరారెడు భోగభాగ్యదు
ర్గమవిభవంబుమై సుకృతి తద్దయుఁగాంచుచు మర్త్యలోకని
ర్గమనమునాఁడు విష్ణుపదకంఠము నొందు వినిశ్చలంబుగన్. 193

క. అని దేవశ్రవుఁ డెఱిఁగిం
చిన దివ్యక్షేత్రమహిమఁ జిత్తమెలర్పన్

విని గాలవుండు ముదమును
దనువునఁ బెనఁగొన నృసింహు దలంచుచునుండెన్. 194

వ. అని రోమహర్షణుఁడు వినిపించుటయు సంయమిప్రవరులు
భక్తిరసావేశంబున నానందామృతధారల మునింగి మహాబల
నాథు నిచ్చలు దలంచుచు యథేచ్ఛం జనిరి. 195

క. గర్వితదైత్యవిఖండన
దర్వీకరశయన వరసువర్ణనశార్ఙ్గా
ఖర్వాయుధమండితభుజ
గీర్వాణావనముదాత్మ కేశవ నృహరీ. 196

శా. పారావారశయాన సింధుతనయాపాంగేక్షణోదారను
స్మేరాలోకనమూర్తి దైత్యవిభవశ్రీవర్ధనవ్యత్యయా
కారుణ్యామృతవృష్టితర్పితసుభక్తవ్రాతనిత్యోదయా
రారాజచ్చరణాబ్జసంజనితగీర్వాణాపగా శ్రీహరీ ! 197

మాలిని. ప్రకృతిగుణతరంగా ప్రస్తుతౌదార్యసంగా
సుకృతిజలధిభంగా సూరిచేతోబ్జభృంగా
నికృతిజనవిదూరా నిర్మలాకారమారా
నికృతిదనుజ వీరావేశసంహారకారా. 198

ఇట "ఇట వ్రాఁతప్రతియందు చం. స. .... అని మాత్రమున్నది. క్రింది దంతయు వెనుక యొరులచేఁ బూర్తి చేయఁబడినట్లున్నది" అని వేలూరి శివరామ శాస్త్రిగారి అథస్సూచనము.

కవిగారు నలుబదినాల్గయేట (1901) ప్రకటించిన క్రీడాభిరామము పీఠికయందు "అధర్వణుని భారతవిరాటపర్వమున మొదటి యాశ్వాసమునుండి గ్రహించి పొందు పఱిచితిమి" అని ఉదాహరించినను, ఎవరి భారతములోని విరాటపర్వము మొదటి ఆశ్వాసమునందును ఉండవలసిన ఆవశ్యకము కనరాని, అధర్వణుని పద్యముగ అన్య గ్రంథములందు కలదని వినరాని పద్యమిది :-

"అంబరసీమఁ దారలు జటాటవి మల్లెవిరుల్ భుజాంతరా
ళంబు సహారసంతతు లిలాస్థలిఁ బువ్వుల వర్షముల్ ప్రసూ
నంబులు సత్కృతాంజలి ననందగి మౌక్తికతుల్యమౌళిగం
గాంబుకణంబు లుట్టిపడ నాడెడు శంభుఁడు మిమ్ముఁ బ్రోవుతన్.

కవిగారు నలుబదియేడవయేట (1913) ప్రకటించిన కర్ణభారమునందు కవిగారు తెనిగించిన శ్లోకముల పద్యములు :-

"అన్యోన్యశస్త్రవినిపాతనివృత్తగాత్ర
యోధాశ్వవారణరథేషు మహాహవేషు. 8 శ్లో॥

చండరణంబులన్ మొనసి సాదినిషాదిరథిప్రవీరులొం
డొండ కడంగి శస్త్రహతి నొందొరు మేనులఁ జీల్చుచుండఁగా
మండి లయాంతకాగ్రహసమంబుగ మార్తురవిక్రమించు నే
ఖండనవేళ సంకుచితభావుఁడనై జడపాటు సెందితిన్.

విద్యుల్లతా కపిలతుంగజటాకలాప
ముద్యత్ప్రభా వలయినం పరశుం దధానమ్. 9 శ్లో॥

వెలయు తటిల్లతాకపిల విభ్రమతుంగజటాకలాపమున్.
వెలువడు నాత్మకాంతిపరివేషముగా వెలుఁగొందు గండ్రగొ
డ్డలియును దాల్చి క్షత్రమకుటంబుల మాపిన భార్గవాన్వయో
జ్జ్వలు కడకేఁగి యమ్మునికిఁ జాగిలి మ్రొక్కి వినీతి నిల్చినన్.

సురద్విపాస్ఫాలనకర్కశాంగుళిః
మయా కృతార్థః ఖలు పాకశాసనః 23 శ్లో॥

దే। వాళికిఁ జక్రవర్తి యమరారి కృతాంతుఁడు దేవతాగజా
స్ఫాలనకర్కశాంగుళియుఁ జూచి కరంబులఁ బొందె నర్థమున్."

కవిగారు రచించినవని క్రొత్తపల్లి సూర్యారావుగారు సూచించిన నారయ సూరన ఉదయనోదయములోని పద్యములు :-

"కం. శ్రీసుతు సభావసథమగు
వాసగృహంబున విలాసవర్తనమదనో

ల్లాసక్రీడానటనా
యాసతజాగరము సేసి రతిపయు విభుఁడున్.

క. మదనుండు వేచి సమయము
గదిరెన్ యౌవనధనంబు ............
నెదురెక్కి రాఁగఁ జుక్కయు
నెదురయ్యెనొ యనఁగఁ జుక్క యెక్కెన్ మింటన్

ఆ.వె. ప్రణయకుపితలైన పడఁతుల కనుతాప
మగ్గలంపు రతుల నలరు జంప
తులకు. రమవేళ దొంగల కెల్ల హె
చ్చరికగాఁ ద్రిభంగి మొరసెఁ గోడి

చ. తమ మరుదేర లోఁదలఁపుఁదల్పులు మూసికొనంగ నంగజా
గమములఁ బాడియాడ నెఱిగల్గిన చక్కటి దక్కెనంచు మీ
గమియుట చాలు రండు వెలిఁ గంజసఖుం డరుదెంచె చూడుఁడీ
భ్రమరములార నా నులిసె పద్మవనంబుల వాతపోతముల్

వ. అంత.

క. లేఁతలగు మొగములుం బలు
వాఁతల నెఱియెక్కు కెంపువాతెఱ లుఱుమై
పూఁతలు సొగియుచు సోలుచు
మూఁతలు పడు కన్నుగవలు మోఁపులు దెలుపన్.

సీ. ఇనుఁ బొడచూచి పద్మినులెల్ల నలరుచో
నేలకో యిదియొండు సోలెఁ జూడు
జక్కవ కవలెల్లఁ జల్లాడ రవిరశ్మి
నేలొకో మైఁపూత నెడపెనిదియ
తనుగాలి బొలయంగఁ దక్కిన లతలెల్ల
నేలొకో యీలీల యీడ విడిచె
పులుగులెల్లయు వించు నెలుగులు గురియంగ
నేలొకో యీపక్షి యెలుఁగు దక్కె

చెలఁగి పురినమ్మలెల్ల రంజిల్లుచుండ
కాలికి నెమ్మి పురియేల కలఁక వాటె
ననుచు నన్యాపదేశంబు లాడు చెలులు
కాంతఁ దోడ్తెంచి రొయ్యన నంతిపురికి.

వ. ఇట్లనవారితమదనసుఖలీలాపరవశులై యొండొరు లెడబాయక

క. క్రీడాచలములపై నడ
యాడుచుదనికొలన నోలలాడుచు జూదం
బాడుచు నింపుగ వీణలఁ
బాడుచు గాఢానురాగబద్ధాత్మకులై.

వ. కొండొక కాలంబు గడుపుచుండ

శా. మితహితసత్యభాషణ యయేయకృపాపరిపాకహృష్టపం
డితవరవర్ణి నీవిమలనేత్రచకోరమనోజ్ఞచంద్రికా
యితముఖకాంతవైరిధరణీశ్వరమానసధూమకేతుసం
మితకదనై కవిక్రమసమృద్ధరమానిలయైకభావనా.

క. ధర్పితరిపుగజసింహా
తర్పితయాచనకహేలితదశారంహా
దర్పకజనకపదాబ్జయు
గార్పితహృదయావధానయమదశితాంహా

మా. మదననిభశుభాంగా మానినీచిత్తసంగా
విదళితరిపుచక్రా విక్రమాంభోధినక్రా
హృదయనిహితపద్మాధీశదివ్యాంఘ్రిపద్మా"

ఇందు "ఇనుఁబోడసూచి" అను సీసపద్యమునందు రెండవపాదమున రెండవదళమునందు "యీ వగ యెందుఁజొచ్చె యీడ విడచె" అని ముందు వ్రాసి, కొట్టివేసి "మైఁపూత నెడపె నిదియ" అని పైన వ్రాయఁబడినది. అంతేకాదు. ఎత్తు గీతమునందు చెఁలగి అనుచోట "రమణ" అనియు, రంజిల్లుచుండ అనుచోట "పేరణము సూవ" అనియు పైన వ్రాయఁబడినది. "ఇది శ్రీ మానవల్లి రామకృష్ణ కవి ఎం. ఏ. గారు సంపాదించిన తంజావూరు ప్రతినుండి పరిషదుపయోగమునకై

వ్రాయబడినది'' అని కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయములోని కాగితపు ప్రతియందు 18-10-1918వ తేదీని క్రొత్తపల్లి సూర్యారావుగారి సంతకము చేయఁబడినది. పయి గద్యపద్యములకు ముందు ''ఇక్కడినుండి మానవల్లి రామకృష్ణ కవిగారి పద్యములు'' అని గలదు.

పయి గద్యపద్యములందు చివఱినాల్గును హైదరాబాదు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోని కాగితపుప్రతియందు కలవని, తద్గ్రంథాలయాధికారి వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావుగారు అందఁజేసిన సమాచారము. అది వారికి నిడుదవోలు వేంకటరావుగారిద్వారా అందిన ప్రతి అట. కాని ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథాలయములోని కాగితపుప్రతియందు పయిగద్యపద్యములు నాల్గును కూడ లేవు. ఇది 1938వ సంవత్సరమునందే ఆంధ్రవిశ్వకళాపరిషత్ వ్రాయించిన, తంజావూరు సరస్వతీమహాలు గ్రంథాలయములోని తాళపత్రగ్రంథమునకు సరియైన నకలు కాగితపు ప్రతి. పయి అశ్వాసాంతపద్యములు ఇతరాశ్వాసాంతపద్యములు కావు. ఇతరత్ర నారన సూరన ఉదయనోదయనమునకు మఱొక తాళపత్రగ్రంథము లేదు. కనుక పదమూడు పద్యగద్యములును కవిగారి కరకౌశలమే!

ఎఱ్ఱన నృసింహపురాణములోని కవిగారి పద్యగద్యములు ఎఱ్ఱన పద్యగద్యములవలెనే కలవు. నారన సూరన ఉదయనోదయములోని కవిగారి పద్యగద్యములు నారన సూరన పద్యగద్యముల వలెనే కలవు. ఇది మానవల్లి రామకృష్ణకవిగారి మహాప్రతిభకు మణిదర్పణము.

## ★ సూచికలు ★

### ౧ కుహనావాదము

1. వి.త: పు.200
2. అదే; పు.201
3. కు.సం; ప్ర.భా; పీ; పు.3,4.
4. ఆం.సా.ప.ప; సంపు.14; సం.1; పు.7
5. తె.భా.ఛం.రీ; పు.402.
6. కు.సం; ప్ర.భా; అను; పు.10.
7. ప్ర.మ.భూ; ప్ర.ము; పీ; పు.4;5
8. అదే; పు.5.
9. ప్ర.ర; ప్ర.ము; పీ;పు.22
10. ప్ర.మ.భూ; ద్వి.ము; పీ; అ.సూ;2,3; పు.4-5.
11. అదే; ప్ర.ము; పీ; పు.2.
12. స.నీ.స; ప్ర.ము; పీ; పు.10.
13. ఆం.క.చ; 1937; ప్ర.భా; పీ; పు.7.
14. శ.క.చ; ప్ర.ము; పు.56.
15. స.నీ.స; ద్వి.ము; పు.159.
16. అదే.
17. అదే; పు.163.
18. మా.క.ర; పు.76.
19. ప్ర.ర; ప్ర.ము; పీ; పు.20.
20. కు.సం; ద్వి.భా; పీ. పు.9.
21. ప్ర.ర; ప్ర.ము; పీ; పు.19.
22. ఆం.సా.ప.ప; సంపు.13. సం.3-4; పు.146-9.
23. వి.త; పు. 277-8.
24. కు.సం.వి; పు.3-6.
25. అదే; పు.2-3.
26. S.M. P.10.

27. ర; పు.143
28. క.జీ; పు.455
29. కు.సం; ద్వి.భా; పీ; పు.9-11.
30. ఆం.క.చ; 1937; ప్ర.భా; పు. 188,203-5.
31. కు.సం.వి; పు.173-9.
32. తె.క.చ; పు.205-12.
33. కు.సం.వి; పు.17.
34. కు.సం; వా.ప్ర; 1953; పీ; పు.12-6.
35. కు.సం; ద్వి.భా; పీ; పు.6-7.
36. కు.సం.వి; పు.34-41; 79-82; 126-45.
37. న.క; వే.వేం;
38. కు.సం.త; పు.231-40.
39. ఆం. సా.చ; పు. 80
40. న.క; వే.వేం. పు.92-3.
41. భా.చా.వ్యా; పు.29.
42. కు.సం; ద్వి.భా, లి.టీ; పు.118.
43. తె.వి.స; మూ.సం; పు.566.
44. న.క; వే. ం; పు.95
45. భా.చా.వ్యా; పు.20.
46. A.S.T.E.D.
47. భా.చా.వ్యా; పు.24.
48. H.O.S.L. PP.178-9.
49. న.క; వే.వేం; పు.97.
50. భా.చా.వ్యా; పు.27.
51. తె.వి.స; మూ.సం; పు.[illegible]33.
52. T.L.A.P.O.S.D.Pre. P.8.
53. న.క; వే.వేం; పు.94.
54. భా.చా.వ్యా; పు.9-11.
55. అదే; పు.9-11.

56. అదే; పు,13-5
57. కు.సం.ద్వి.భా: పీ; పు.10-11.
58. ఆం.సా.ప.ప; సంపు.40.సం.1-3;పు.29.
59. ఆం.క.చ; 1937; ప్ర.భా; పు.209.
60. భా; జూన్1982; పు.9.

## ౨ కృతకరచనము

1. క.రా.శి; పు.150-75.
2. కు.సం; ప్ర.భా: అను; పు.1.
3. ఆం.క.త; సంపు.8; పు.253.
4. అదే; పు.104-10.
5. ప్ర.ర: పు.107.
6. ఆం.క.త; సంపు.8. పు.256.
7. ప్ర.మ.భూ; ద్వి.ము; పీ; పు.20.
8. కు.సం.త; పు.158.
9. మా.క.ర; పు.404.
10. న.క.చ; పు.163.
11. కు.సం;ప్ర.భా; అను; పు.4.
12. అదే; పు.5
13. అదే; పు.8
14. అదే; పు.10.
15. కు.సం.వి; పు.7.
16. కు.సం; ప్ర.భా; అను: పు.11.
17. అదే: పు.1.
18. ప్ర.ర: పు.35-6.
19. ప్ర.మ.భూ; ప్ర.ము; పీ; పు.5.
20. తి.కా.శి; పు.6, 110-11.
21. ప్ర.మ.భూ; పు.33.
22. కు.సం; ప్ర.భా; పు.98.

11. ఆదే
12. ద.హిం.శా; సంపు.6 సంఖ్య206
13. న.క.చ; పు76-7
14. ఆం.సా.ప.ప; సంపు.14 సం.1; పు19
15. కు.సం; ద్వి.భా; పీ; పు 2,3,5,6,8
16. R.I.A; PP276-8 & 305
17. Ibid; P.277
18. Ibid; P.278
19. Ibid; PP.276-7
20. కు.సం: ప్ర.భా; పు1; ద్వి.భా; పు9
21. అదే; ద్వి.భా; పు4-8
22. తె.క.చ; పు223-4
23. క.రా.శి; పు83-4
24. అదే; పు84
25. కు.సం; ప్ర.భా; అను; పు5
26. న.క; - .వేం; పు202-3
27. స.ఆం.సా; సంపు.1; పు184
28. క.రా.శి; పు132-35
29. కు.సం; ద్వి.భా; పు9
30. ఆం.క.చ; 1937; ప్ర.భా; పు200-1
31. కు.సం; మ.వి.ప్ర; పీ; పు9-11
32. న.క; వే.వేం; పు169-70
33. కు.సం; ప్ర.భా; అను; పు7
34. న.క; వే.వేం; పు223-4
35. మా.క.ర; శ్రీ.మా.రా.క. పుట1

## ౫ కృత్రిమపాఠము

1. మా:క.ర; పు98
2. ప్ర.ర; ప్ర.ము; పీ; పు19-20

3. ఆం. సా.ప.ప; సంపు.13 సం.3-4; పు148
4. వి.త; పు277
5. కు.సం.వి; పు6
6. కు.సం; ప్ర.భా; పీ; పు1
7. అదే; ద్వి.భా; పీ; పు3,9
8. అదే; ప్ర.భా; అ.సూ; పు4
9, ఆం.క.చ; 1937: ప్ర.భా; పు66,188
10. T.D.R; PP.4-5
11. కు.సం; మ.వి.ప్ర; పు26
12. శా.ప.మం; ప్ర.భా; పు28
13. అదే; పు27
14. అదే; పు27-8
15. ప్ర.ర; ప్ర.ము; పీ. పు20
16. శా.ప.మం; ప్ర.భా; పు1
17, తె.క.చ: పు31-3
18. అదే. పు34-5
19. శా.ప.మం: ప్ర.భా; పు2-3
20. ధా. ఆగస్టు'82. పు45-52
21. అదే;
22. ఆం.చ; ప్ర.భా; పు295
23. N.I; Vol. II; PP 896-7 & 544-5.
24. ఆం.చ; ద్వి.భా: పు38-9
25. కు.సం; ప్ర.భా; పీ; పు8
26. ఆం.చ; ద్వి.భా; అవ; పు27
27. మా.క.ర; పు98
28. అదే; పు98-9
29. కు.సం; ద్వి.భా; పీ: పు12-3
30. కు.సం.వి; పు22,27
31. A.S.E.D.

32. కు.సం: ద్వి.ఖా: ల.టీ: పు117
33. కు.సం.వి: పు25
34. కు.సం: ద్వి.ఖా: ల.టీ: పు116
35. కు.సం.వి: పు21
36. వి.త: పు275-6
37. అదే.పు278-9
38. కు.సం: వా.ప్ర: 1953: పు270
39. అదే: మ.వి.ప్ర: పు195
40. అదే: పు239
41. అదే: పు282
42. అదే: పు284
49. అదే: పు290
44. అదే: పు297
45. అదే. పు300
46. అదే: పు338
47. అదే: పు35
48. కు.సం.వి: అ.సూ: పు7
49. కు.సం: వా.ప్ర: 1953: పు78
50. అదే: పు66
51. కు.సం: ద్వి.ఖా: ల.టీ: పు3
52. ప్ర.ర: ప్ర.ము: పీ: పు20
53. A.D.C.O.T. M.I.T. T.M.S.S.M.L. Vol. II. Intro.PP.15-6
54. స్వీ.చ: ద్వి.ఖా: పు230-1
55. అదే. అవ.
56. అం.క.చ: 1937: ప్ర.ఖా: పు133
57. మ.మం: సంపు.1. సం.1: పు28
58. అదే. పు33-4
59. అం.క.చ: 1937: ప్ర.ఖా: పీ: పు5-8

60. మా.క.ర: శ్రీ.మా.రా.క; పు26
61 అదే: అ.సూ.2: పు8
62. శ.క.చ. పు190,192
63. A.D.C.O.T.M.I.T.T.M.S.S.M.L. PP 1-85
64. Ibid; PP 134-44
65. హితకారిణీసమాజము కార్యదర్శి కందుల సంజీవరావుగారు, "మ్యూజియము" నిర్వాహకులు సాధనాల నరసింహమూర్తి గారు, వెదకి వెదకి తెలిపిన విషయము.
66. మా.క.ర; శ్రీ.మా.రా.క; పు8-9
67. A.D.C.O.T.M.I.T.T.M.S.S,M.L. Vol·II.Intro.P. 6
68. A హిం.నా.ఉ.ఔ.వి. పు370
    B పద్మా. పు47-48
69. హిం.నా:ఉ:ఔ.వి. పు196-7
70. L.S.O.I. Vol.1 & Vol. IX. Part I. P.47
71. మా.క.ర; శ్రీ.మా.రా.క:పు9
72. కు. సం; ప్ర.భా; అను; పు1
73. అదే; పు2
74. కు.సం.వి: పు118
75. మా.క.ర: పు153
76. కు.సం. ద్వి.భా: పీ: పు2
77. అదే: ప్ర.భా: అ.శు.సూ: పు13
78. అదే: ద్వి.భా; ల.టీ; పు115
79. కు.సం.వి; పు78
80. అదే; పు78-9
81. భో.రా; వా.ప్ర; రెం.కూ:పీ; పు34
82. ఛం.ద; వా.ప్ర: ద్వి.ము; పీ; పు62

## ౬ కూటసృష్టి

1. తె.వి.స; మూ.సం; పు372

2. అదే.
3. అదే; పు388
4. న.క; అ.రా.శ; పు51
5. ఆం.క.త; సంపు9; పు32
6. ప్ర.ర; పు126
7. క.త.వి; పు47
8. కు.సం; ప్ర.భా; అను; పు11
9. క.రా.శి; పు160-62
10. కు.సం; ప్ర.భా; అను; పు11
11. క.జీ; పు682
12. అదే; పు691-62
13. ఆం.సం.సా.పో; పు173-74
14. కు.సం; ద్వి.భా; పీ. పు7-8
15. అదే; పు8
16. న.క.చ; పు160
17. శ్రీ. పు548-63
18. కు.సం; ద్వి;భా; పీ, పు7-8
19. తె.వి.స; మూ.సం;పు186
20. కు.సం; ద్వి.భా; ల.పే;పు110
21. ప.బం.పా; ద్వి.సం; పు698
22. కు.సం.త; పు249
23. అదే; పు141
24. కు.సం; ద్వి.భా; ల.పే; పు110
25. అదే; మ.వి.ప్ర; వ.ప.-అ; పు6
26. న.ప.ప్ర.సూ. పు94
27. కు.సం; ద్వి.భా; పీ; పు11
28. ఆం.వా.వి; పు120
29. A. H.A.S; 19-64
    B. I.G.O.A.P. P. 103

30. A. H.A.S; 13-50-52
    B. న.క; వే.వేం; పు80
31 న.క; వే.వేం; పు80
32. ఆం.సా.ప.ప; సంపు.54. సం.4-5; పు70
33. T.C. P24
34. Ibid.
35. Ibid; P623
36. కు.సం; ప్ర.భా; పీ; పు7-8
37. J.O.I.H; Vol.L11; Pa.II & III PP 317-26
38. కు.సం; ప్ర.భా; పీ; పు3
39. మా.క.ర; శ్రీ.మా.రా.క; పు3,45-6
40. కు.సం; ప్ర.భా; పు4
41. అదే; ద్వి.భా; పీ; పు13
42. మా.క.ర; పు458,460-1
43. B.S.O.D.P. PP 77-78
44. మా.ప; 1973; Intro; ప్రస్తా
45. భా. అక్టోబరు 1957. పు25
46. అదే.
47. మా.క.ర; పు539
48. అదే; పు550
49. అదే; శ్రీ.మా.రా.క; పు52
50. అదే.
51. అదే; పు518,537
52. న.క.చ: పు.54-69
53. ఆం.క.త; సంపు.1; పు196-7
54. A.I.E; Vol.VII; P190
55. ప్ర.మ.ఘూ; ద్వి.ము; పీ; పు2-3
56. అదే. పు93

## అనుబంధము ౧

### నన్నెచోడకళావిలాసము

1. కు.సం; ప్ర.భా; పీ; పు1-2
2. ప్ర.ర; ద్వి.ము; పు41-2
3. అదే; ద్వి.ము; పీ; పు39-40
4. అదే; ప్ర.ము; పీ; పు10
5. A.D.C.O.T.T.M.I.T.T.M.S.S.L. P298

## అనుబంధము ౨

### మోహనాంగి మరీచీపరిణయము

1. B.S.O.D.P; PP 77-8
2. మా.ప; ప్రస్తా; పు1
3. B.S.O.D.P: Pre. P9

# ప్రసక్తగ్రంథపట్టిక

ఆం.క.చ. ఆంధ్రకవుల చరిత్రము
ఆం.క.త. ఆంధ్రకవితరంగిణి
ఆం.చ. ఆంధ్రుల చరిత్రము
ఆం.భా.వి. ఆంధ్రభాషా వికాసము
ఆం.సా.చ. ఆంధ్రసాహిత్యచరిత్ర
ఆం.సా.ప.ప. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక
ఆం.సం.సా.పో. ఆంధ్రసంస్థానములు- సాహిత్యపోషణము
క.జీ. కవిజీవితములు
క.త.వి. కవిత్వతత్త్వవిచారము
క.రా.శి. కవిరాజశిఖామణి
క.సా.చ. కన్నడసాహిత్యచరిత్ర
కా.అ.సం. కావ్యాలంకారసంగ్రహము
కు.సం. కుమారసంభవము
కు.సం.త. కుమారసమ్భవతత్త్వము
కు.సం.వి కుమారసంభవవిమర్శము
ఛం.ద. ఛందోదర్పణము
తి.కా.శి. తిక్కన కావ్యశిల్పము
తె.క.చ. తెనుఁగుకవుల చరిత్ర
తె.భా.ఛం.రీ. తెలుగుభాషలో ఛందోరీతులు
తె.వి.స. తెలుగు విజ్ఞానసర్వస్వము
ద.హిం.శా. దక్షిణహిందూదేశశాసనములు
న.క. నన్నెచోడుని కవిత్వము
న.క.చ. నన్నిచోడకవిచరిత్ర
న.ప.ప్ర.సూ. నన్నెచోడపదప్రయోగసూచిక
పద్మా. పద్మాకర్
ప.బం.పా. పదబంధపారిజాతము
పం.ఆ.చ. పండితారాధ్యచరిత్ర
పూ.ఆం.క. పూర్వాంధ్రకవులు
ప్ర.మ.భూ. ప్రబంధమణిభూషణము
ప్ర.ర. ప్రబంధరత్నావళి

| | |
|---|---|
| భా. | భారతి |
| భా.చా.వ్యా. | భాషాచారిత్రకవ్యాసావళి |
| భో.రా. | భోజరాజీయము |
| మ.మం. | మణిమంజరి |
| మా.క.ర. | మానపల్లి కవి- రచనలు |
| మా.ప. | మారీచీపరిణయము |
| ర. | రమణీయము |
| ర.రా. | రఘునాథరామాయణము |
| వా.చ. | వాల్మీకిచరిత్రము |
| వి.త. | విమర్శతరంగిణి |
| శ.క.చ. | శతకకవులచరిత్రము |
| శా.ప.మం. | శాసనపద్యమంజరి |
| శ్రీ | శ్రీనాథుఁడు |
| స.ఆం.సా. | సమగ్రఆంధ్రసాహిత్యం |
| స.నీ.స. | సకలనీతిసమ్మతము |
| స్వీ.చ. | స్వీయచరిత్రము |
| హిం.నా.ఉ.ఔ.వి. | హిందీనాటక్ ఉద్భవ్ ఔర్ వికాస్ |
| హిం.భా.ఉ.ఔ.వి. | హిందీభాషాకా ఉద్గమ్ ఔర్ వికాస్ |
| A.D.C.O.T.M.I.T.T.M.S.S. M.L. | A Descriptive Catalogue of Telugu Manuscripts in the Tanjore Mahārāja Sarfoji Saraswati Mahal Library. |
| A. I. E. | An Indian Ephemeris |
| A. S. T. E. D. | A Sanskrit to English Dictionary. |
| B. S. O. D. I. | Biographical Sketches of Deccan poets. |
| H. A. S. | Hyderabad Archaelogical series. |
| H. O. S. L. | History of Sanskrit Literature. |
| I. G. O. A. P. | Inscriptional Glassary of Andhra Pradesh. |
| J. O. I H. | Journal of Indian History. |
| L. S. O. I. | Linguistic Survey of India. |
| N. I. | Nellore Inscriptions |
| R. I. A. | Religion in Andhra. |
| S. M. | Saraswati Mahal. |
| T. C | The Colas |
| T. D. R. | The Da's Rūpa.a |
| T. L.A.P.O.S.D | The Law & practice of sanskrit drama |

# అన్వీక్ష

## ఆచార్య గంటి జోగిసోమయాజి

చిరంజీవి డాక్టరు కొర్లపాటి శ్రీరామమూర్తి వ్రాసిన గ్రంథమును నేను సాదరముగా చాలవఱకు పరిశీలించితిని. ప్రతిపంక్తియును ప్రతియుక్తియును శోధించి వ్రాయుటకు కాకపోయినను, అవసరమయినంతవట్టు, తొలినుండి తుదివఱకును పరిశీలించితిని. శ్రీరామమూర్తి సుమారు మూడు సంవత్సరములు పరిశీలించి, యెన్నో యితరగ్రంథములను, తమిళకర్ణాటభాషలలోని వానిని, కుమారసంభవములోని రచనలతో పరిశీలించి తేల్చుకొన్న సిద్ధాంతము లిందున్నవి.

కుమారసంభవము నన్నయకు పూర్వుడైన నన్నెచోడుడను కవి రచియించినట్లును, దీనికి మాతృకలైన మూడు ప్రతులున్నవనియును మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసిరి. కవిగారికి సమకాలికులును, ప్రాయశః కొంత ముందటివారైనవారును ఇది విశ్వసింపరానిదై యేర్పడినది. కందుకూరి వీరేశలింగముపంతులు, జయంతి రామయ్యపంతులు, వేటూరి ప్రభాకరశాస్త్రి, నడకుదుటి వీరరాజు, కొత్తపల్లి సూర్యారావు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి మొదలయిన విమర్శకులు, వాఙ్మయచరిత్రకారులును విభ్రాంతినంది మానవల్లి వారికి వ్రాయగా వారికి సరియైన సమాధానము లీయకపోయిరి. విమర్శకులందఱునుగూడ నన్నయ తరువాతదే యని వ్రాసిరి. తిక్కనకు సమకాలీనుడుగాని అర్వాచీనుడుగాని యయియుండవచ్చునని నాకు మిత్రులైన లక్ష్మీపతిశాస్త్రిలవారు నాతో చెప్పిరి. దేవరపల్లి కృష్ణారెడ్డిగారు క్రీ.శ.1057 కుమారసంభవరచనాకాలమని, జయంతి రామయ్యపంతులుగారు క్రీ.శ.1120 ప్రాంతమని, వీరరాజుగారు క్రీ.శ.980 ప్రాంతమని వ్రాసిరి. ఇట్లే అనేకులు అనేకవిధముల శాసనములలో చోడబల్లి, బల్లెచోడులు అను పేళ్ళున్నవని తెలిపిరి గాని కాలనిర్ణయముగాని, ఈ నన్నెచోడుని పేరును గాని నిర్ణయింపలేకపోయిరి. ఈతని కాలనిర్ణయమునకు వీలులేకుండ, శాసనబహుళసూచితమైన చోడవంశమును మానవల్లి వారు వెలిపఱిచిరి.

కుమారసంభవమునందు అర్వాచీనులైన తెలుగుకన్నడసంస్కృతకవుల యను

కరణములు కనుపట్టుచున్నవి. ఈ చిక్కు ప్రశ్నను విడదీయుటకు చిరంజీవి కొర్లపాటి విశేషప్రయత్నము చేసి ఈ గ్రంథమును ఆరు ప్రకరణములలో వ్రాసెను.

1. కుహనావాదము - కవిగారి ప్రథమభాగము అచ్చుప్రతికిని, రెండవ భాగము అచ్చుప్రతికిని, తంజావూరిలోని మూలమని చెప్పఁబడు ఏకైకలిఖితప్రతికిని అతుకని విషయములున్నవని నిరూపించుచు, అసత్యవాదమును కవిగారు సృజించిరని తేల్చెను. కవిగారికి దొరకినవని వ్రాసిన వ్రాతప్రతులు దొరకకుండక, ముద్రితప్రతి లోని ముద్రణదోషములు కూడ వ్రాతప్రతియందు కనుపించుచున్నవని వ్రాసెను.

దీనినిబట్టి ఈయన ప్రసిద్ధి కొఱకు కుమారసంభవకర్త ప్రాచీనుడను భ్రమను కల్పించెనని తోచవచ్చును. తన ముద్రితప్రతిరూపముననే వ్రాతప్రతిగా కూడ ఈయనయే తంజావూరిలో స్థాపించినారని కూడ ఒక అనుమానము పుట్టుచున్నది. దీనికి ఉపబలకముగా కన్నడసాహిత్యమున 'ముద్దణ' రచియించిన రామాశ్వమేధము అను ఒక గద్యగ్రంథము ప్రాచీనకన్నడభాషలో రచయించినది బయలుపడినది. అ కావ్యము చాల మనోహరముగా చదువుట కింపుగానుండి కన్నడవిద్వాన్ మొదలైన పరీక్షలకు పాఠ్యముగా విధింపఁబడినది. విమర్శకులు ఈ గ్రంథము ప్రాచీనుడైన ముద్దణ పేరుతో ఒక నవ్యుడు వ్రాసినట్లు అందున్న కొన్ని నవ్యశబ్ద ముల వలన నిర్ణయించిరి. దానికిది జోడేమో యనియు, మానవల్లివారు కూడ అనుసరించిరేమో యనియు అనుమానము.

2. కృతకరచనము- కుమారసంభవములోని పద్యములు కృతకములు. అర్వా చీనుల గ్రంథములలోని కల్పనలకును అనుకరణములుగా సృజించి తామే ఈ కుమారసంభవమున చేర్చినట్లు కనుపట్టుచున్నది. ఈ ప్రకరణములోని విషయమిది.

3. కుటిలశృంగారము - కుటిలమనగా వంకరమైనది అని అర్థము. సంస్కృత కుమారసంభవములోని సంభోగశృంగారమే, నవ్యప్రబంధములలోని కొన్ని ప్రబంధ ములలోని శృంగారరచనల వలె అతివేలమయి అసభ్యమయినదని, అనుచితముగా నున్నదని విమర్శకులు తలంచి ఆ భాగము ఎవడో వ్రాసి కాళిదాసుని గ్రంథమునకు అంటించినాడని పెద్ద వాదము కలదు. దానినిగూడ మించిపోయియున్నట్లును, ఇతరా నుసరణములలోఁగూడ అనుచితత్వమును నిరూపించుచు ఇందు విమర్శింపఁబడినది. అందుచేతనే ఇది కుటిలమని భావము.

4. కూడలిస్థలము- కూడలియనగా రెండుమూడుగాని అధికముగాఁగాని కూడిన ప్రదేశము. నన్నెచోడుని ఉనికి ఎక్కడ? అను విషయమును వివరించు ప్రకరణమిది. నన్నెచోడుడు ఒరయూరి కధిపతిగాడు. అతడు ఆంధ్రతమిళకర్ణాటరాష్ట్రములలోని వానివలె కనుపట్టుచున్నాడు. "ఎవరెన్నివిధముల వెదకినను దెబ్బది సంవత్సరములు విచారణ సలిపినను శాసనప్రమాణముగాని కాలము నిర్ణయించుటకుగాని వీలయినది కాదు. ఇది సత్యముగదా! ఆ కవిగారే నన్నెచోడునిగా నవతరించినాడేమో యనియు నొక సందేహము కలదు.

5. కృత్రిమపాఠము- ఇందు కవిగారు మార్గకవిత, దేశికవిత, సత్యాశ్రయుడు, చాళుక్యనృపులు- అను పేర్లతో గూడిన పద్యమును చేర్చిరి. లోకమున మార్గకవిత మునుపు ఉండగా దేశికవితను పుట్టించి ఆంధ్రదేశమున సత్యాశ్రయుని మొదలుకొని పలువురు చాళుక్యరాజులు తెలుగును ప్రోత్సహించిరి- అని యర్థము. 1909లో ముద్రించిన కవిగారి పాఠమునకు 1912వ సంవత్సరము కవిగారి వ్రాతలో "తెనుంగును నిలిపిరంధ్రవిషయంబున జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్" అను క్రొత్తపాఠము దొరికినదని వ్రాసిరి. ఈరెండవపాఠమును ఎట్లు గ్రహించిరి? దీని వలన ప్రయోజనమేమి? ఇది కవిగారు సృజించిన క్రొత్త పాఠము. కృత్రిమము. ఇక మార్గకవిత, దేశికవిత అని రెండు కవిత్వభేదములు ప్రసిద్ధములు గావు. అవి సంగీతమునందు ప్రసిద్ధములు. కవిగారు స్వోపజ్ఞముగ పాఠములను కల్పింప జంకరు. వారికి ఆధారము వారి యవసరములే. సమన్వయమార్గాంతరము మృగ్యము.

6. కూటసృష్టి - కూటమనగా అసత్యము. లేనివానిని క్రొత్తగా సృజించి కల్పించుట. ఇది యనేకవిధములు. అసలే లేనిదానిని పూర్తిగా కల్పించి చేర్చుట. కొంత భాగమును మాత్రమే ఇట్లు కూర్చుట. ఈ రీతి అనుకరణములోఁగూడ సృజింపవచ్చును. ఇవి వీరిగ్రంథములో అనేకము లున్నవి.

మానవల్లి రామకృష్ణకవిగారు విమర్శకులుగా, కవిగా, సంస్కృతాంధ్రములలో పండితులుగా ప్రసిద్ధి గొనిరి. అనేకతాళపత్రరచనలు, కాకితపురచనలు చూచినవారు. బహుదక్షిణదేశభాషావిదులు. సంస్కృతమున వారు సంపాదించిన గ్రంథములే వారి శాస్త్రపాండిత్యమునకు సాక్ష్యములు.

అయితే ఈ విధములయిన అవకతవక లేల వచ్చినవని అడుగవచ్చును.

నవ్యకల్పనాకుతూహలము. ప్రసిద్ధికయి ఉబలాటము. ఇవి మఱికొందఱు పూర్వ ఛాందసులైన పండితుల కుండినట్లు సి.పి. బ్రౌనుదొరగారి అనుభవములు తెలుపుచున్నవి. ఏవేళ కేదైన సమాధానము చెప్పి తప్పించుకొనుట, ప్రమాణము లేకుండ గనే కల్పించుకొనుట, వాదములో గెలుచుకొనుట వాదదోషము కాదు వాదినోష మనియే వారి యుద్దేశము. కాకున్న మన పవిత్రగ్రంథములకు అన్ని వ్యాఖ్యాభేదము లెట్లు కల్గును? పూర్వపక్షము పరాస్తమై సిద్ధాంతమేర్పడినప్పటికిని మొదటివానిని వదలకుండుటచేతనే గదా!

కొందఱు రాత్రియెల్ల క్రొత్తగ్రంథమును వ్రాసి దానిని ప్రమాణముగా తెల్లవారి నిరూపించి వాదజయము గొనిన వార్తలు ఉన్నవి. కవిగారే ఈ గ్రంథము సొంతముగా వ్రాసి దానిని వాడుకలోనికి తెచ్చిరనవచ్చును. కుమారసంభవమును సమగ్రముగా చదివి, భేదముల నన్నిటిని ధారణలో పెట్టుకొని వివరములతో బృహద్గ్రంథముగా రచించిన చిరంజీవి కొర్లపాటి శ్రీరామమూర్తి విమర్శనపటిమను, పరిశోధనప్రావీణ్యమును మెచ్చుకొనుచున్నాను.

శ్రీశంకరుల వారి నిర్గుణవాదమును, అనేకయుక్తులతో ఖండించి వేదార్థ సంగ్రహమును వ్రాసి విశిష్టాద్వైతమును స్థిరపఱిచి ఈశ్వరుని సకలకల్యాణగుణ పూర్ణతను స్థాపించిన శ్రీ రామానుజులు-

సారాసారవివేకజ్ఞాః గరీయాంసో విమత్సరాః
ప్రమాణతంత్రజ్ఞా స్సంతీతి కృతో వేదార్థసంగ్రహః

అని ముగించినారు.

విద్వాంసులు, పరిశోధకులు పరిశీలించి ఈ గ్రంథమునందలి విశేషములను గ్రహింతురుగాక.

# వివేచన

## ఆచార్య దివాకర్ల వేంకటావధాని

"నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా?" అను విమర్శగ్రంథమును జిజ్ఞాసతో నాద్యంతము చదివితిని. కుమారసంభవరచన నన్నయకు పూర్వమా పరమా అను వివాదమది వెలువడినప్పటినుండియుకలదు. కాని అది నన్నెచోడుడు వ్రాసెనా మఱెవ్వరైన వ్రాసి అతని పేరు పెట్టిరా అను విషయమున మాత్రము అభిప్రాయభేదము లిదివఱకు లేవు. రాజకవులు రచించిన గ్రంథములను గూర్చి కర్తృత్వవిషయమున వివాదముండుట సర్వవిదితమే. కాని వాని నా రాజులే రచించిరని చివఱికి విమర్శకులు సిద్ధాంతీకరించిరి.

కీ.శే. మానవల్లి రామకృష్ణకవిగారు బహుభాషావేత్తలు. కవిపుంగవులు. ముద్రితాముద్రితగ్రంథములందలి పద్యము లెన్నో చదివి వానిలో పెక్కింటిని కంఠగతము చేసికొన్నవారు. వారికి మహాకావ్యము రచించు సామర్థ్యము కలదా లేదా యని సంశయించువారెవ్వరు నుండరు. మిత్రులు డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారెంతో పరిశ్రమ చేసి, ఎన్నో గ్రంథములు విమర్శలు చూచి, అసంఖ్యాకములైన యుపపత్తులు చూపి, అర్వాచీనకవుల గ్రంథములందలి పెక్కు పద్యములతో కుమారసంభవమందలి కొన్ని పద్యములకు గల సంవాదము నిరూపించి, కొన్ని శబ్దముల ప్రాచీనతార్వాచీనతలు పరిశీలించి కుమారసంభవము కవిగారి సృష్టియని నిర్ణయించిరి. మొదటి స్రగ్ధర యందలి 'మారా'గణముల యునికి, కావ్యారంభమున మఱెవ్వరును ఆ వృత్తమును వాడకుండుట, చక్రబంధపద్యమందలి 'మానరతా' మున్నగు అక్షరముల పొందిక వీరి వాదమున కెంతో బలము చేకూర్చుచున్నవి. "రాసవిద్యానమ్మోద్దైక" అను సమాసము కొంచెము దూరాన్వయముగా నున్నది. బంధకవిత్వములో నట్లివుండుట సహజమే.

వీరు చూపిన హేతువులలో లోపమేదియు లేదు. వానిని చదివిన తరువాత అంగీకరింపకుండుటకును అవకాశము లేదు. వాదమును ప్రతిపాదించుటకు చూపిన పద్యముల సంఖ్య మొత్తము కుమారసంభవమునందలి పద్యముల సంఖ్యతో పోల్చి చూచిన స్వల్పము. కావ్య మత్యుదాత్తముగా నున్నది. కొన్ని లోపము లును

అనౌచిత్యములును ఉండుగాక. శ్రీకవిగారే యీ కావ్యమును రచించియుండినచో అంతటి మహాకవి ఆధునికులలో ఇంకొకరు లేరని చెప్పవచ్చును. ఇంత మహా కావ్యమును వ్రాసి దానిని తమపేర కాక అన్యుని పేర ప్రకటించుటకు వారికి నన్నయపై గల అకారణద్వేషము తప్ప మఱే హేతువును లేదు. నన్నయ పై వారి కెందుకంత ద్వేషము? నన్నయ చోడుని స్మరింపకుండుటకు కారణమేమి? కవిగారు కవియశఃప్రార్థులు కాని నిర్మములా? కావ్యము చదువునప్పుడు సర్వథా అది ప్రాచీనమే అనిపించును. వీరు చూపిన ఉపపత్తులు మిక్కిలి బలవంతములుగా నున్నవి.

ఈ గ్రంథము చదువుచుండగా హృదయమునకును బుద్ధికిని గల్గిన సంఘర్షణము యొక్క నైశిత్య మింతింత యని చెప్పలేకున్నాను. డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి గారు చేసిన పరిశ్రమ మాత్రమాశ్చర్యజనకముగా నున్నది.

# పరిశీలన

## విద్వత్కవి వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

నన్నెచోడమహాకవికృతమని కుమారసంభవకావ్యమును 1909సంవత్సరమున ముద్రించి వెలుఁగులోనికిఁదెచ్చినవారు మహాపండితకవి మానవల్లి రామకృష్ణకవి గారు. ఈ 80సంవత్సరములలో కాలనిర్ణయమును బట్టి యా కావ్యము నన్నయకుఁ బూర్వకావ్యము అనిన రామకృష్ణకవిగారి నిర్ణయముపై పెక్కు విమర్శనములు జరిగినవి- కొందఱు పెద్దలు నన్నయ తిక్కనల నడిమి కాలముగాఅనినారు. మఱి కొందఱు నన్నయతిక్కనలకుఁ దరువాతికాలమువాఁడు కాని నడిమివాఁడును కాఁడు: పూర్వుఁడును కాడు అనినారు.

ఇప్పుడు చిరంజీవి కొర్లపాటి శ్రీరామమూర్తి ఈ విమర్శనముల నన్నిటిని అక్షరశః చదివి "నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా?" అవి ఆఱు ప్రకరణములలో విపులమగు విమర్శనరూపమున నీ గ్రంథము వ్రాసి ప్రకటించెను. ఇందలి ప్రకరణముల నామముల వలన "కుమారసంభవమను కావ్యము సహజముగఁ బుట్టినదా? లేక కల్పితమా? నన్నెచోడుఁడనుకవి యుండెడి వాఁడా? లేడా? ఉన్నను అతఁడీ గ్రంథము రచించెనా? లేదా? అనునంతటి సంశయములు రేకెత్తుచున్నవి. ఆ ప్రకరణములివి: 1. కుహనావాదము 2. కృతకరచనము 3. కుటిల శృంగారము. 4. కూడలిస్థలము 5. కృత్రిమపాఠము. 6. కూటసృష్టి- ఈ యాఱు ప్రకరణములలోని విమర్శనము లెత్తిచూపుట గ్రంథమును పెంచుటయగునని ప్రకరణసంజ్ఞలను తెలిపితిని. సారస్వత ప్రియులు సావధానముగా చదువుకొనినచో నీ రచనాహృదయము గ్రహింపఁగలరని నా నమ్మకము. ఈ విమర్శనము కుమారసంభవకావ్యముపై నేఁటికి వెలువడిన యించుమించు సకలవిమర్శనములను నవగాహించుకొన్నదికాని, వానిలో నొకటియని తేలికగాఁ జూడఁదగినది మాత్రము కాదు. ఈ కావ్యము శ్రీ రామకృష్ణకవిగారి యపూర్వప్రాతిభోన్మీలనమని శ్రీరామమూర్తి తుది తీర్పు-

1925 మార్చి 1తేదీని శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యాలయమున ఆచ్ఛికపదపదార్థవిచారణసంఘమున నాకు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు ప్రవేశమిచ్చినారు. నాఁటినుండి నిన్నటిదాఁక- నన్నెచోడమహాకవి శైవకవులలోవాఁడనియు

కుమారసంభవము సంస్కృతాంధ్రకావ్యమర్యాదలనతిక్రమించి, తమిళకర్ణాటమళయాళకావ్యముల నాకళించుకొన్న యొక యపూర్వకావ్యమనియు, నన్నెచోడుని వ్యాకరణము విలక్షణమైనదనియు నొక యభిప్రాయము రూఢమైయున్నది. కాని యీ విమర్శనగ్రంథమున నెక్కడఁజూచినను చిరంజీవి శ్రీరామమూర్తి సిద్ధాంతము ననుసరించి నన్నెచోడుఁడు నన్నయ తిక్కనల నడుమను గాదుగదా, 16,17 శతాబ్ది కవుల క్రిందకిఁగూడ దిగజాఱిపోయి నట్లయినది. మీఁదుమిక్కిలి కుమారసంభవము "ప్రబంధరత్నాకరము, ప్రబంధసారశిరోమణి మున్నగు సంకలనపద్యగ్రంథము లందలి పద్యములకును అనుకరణముగాని, నన్నెచోడుఁడు కవికానిట్లే అతని రచనము కానేకాదు" అని నిశ్చితమగుచున్నది. కావుననే యిది సామాన్యవిమర్శనము మాత్రము కాదు. ఆఱు ప్రకరణములలో- ఛందస్సులో, సమాసఘటనములో, ఆశయములలో, అలంకారములలో, బంధకవితలో- దీన దాన ననవేల? కవితకుఁ గావలసిన యావత్సామగ్రియందును గల వైలక్షణ్యము లేశలేశములతో నిగ్గఁదీసి- ఆదికవి యనిపించుకొనుచున్న నన్నయకు పూర్వకావ్యమే యొకటి కనబడినదని 1909లో ముద్రించి ప్రకటించి ఆదికవిబిరుదము నన్నెచోడుని కిచ్చి యగ్రపీఠమున నిలుపుటకై శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారొనర్చినదెల్ల నింద్రజాలము అనుచు ఋజువొనర్చినాఁడు శ్రీరామమూర్తి.

విమర్శకాగ్రేసరుల భావముల నెల్ల పరిశీలించి వ్రాసినది కావున నేఁటికిది మూర్ధన్యము వలె నున్నను, "వాదిదౌర్బల్యముండును గాని వాదదౌర్బల్యముండదను సూక్తి చొప్పున నింకొక ధీమంతుడు దీనిపై విజృంభించి, క్రొత్త విమర్శనము వ్రాయవచ్చునుగదా!" అనవచ్చును. ఆ మాట శ్రీరామమూర్తి యెఱుఁగని వాఁడు కాఁడు. కావుననే తుట్టతుదిని వ్రాసిన యాతని వాక్యములివి:

"ఇందలి భ్రమప్రమాదములను దెలిపి, ఇంతకంటె బలవత్తరమైన ఉపపత్తులను జూపి "నన్నెచోడుఁడు శివకవి" అని "కుమారసంభవము ప్రాచీనగ్రంథమే" అని వివరించునెడ మదుపజ్ఞమైన సిద్ధాంతమును సవరించుకొనుటకు సంసిద్ధము"

ఇట్లు తన సత్యదృష్టిని విశాలహృదయమును వెల్లడించిన యీ విమర్శకాగ్రణి ఆయురారోగ్యభాగ్యములు కలిగి, స్వపరభేదము లేక యిట్లే విలువగల రచనలచే ఆంధ్రభారతి నారాధించుఁగాక అని ఆశీస్సులందించుచున్నాను.

# పర్యాలోచనము

## విద్వాన్ రావూరి దొరస్వామిశర్మ

"నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా" అను ప్రశ్నకు ఆది నుండి నేటివఱకు నిర్వివాదమగు సమాధానము లేదు. మానవల్లి రామకృష్ణకవిగారు గ్రంథమును బ్రకటించిన దాదిగ నన్నెచోడుని కాలనిర్ణయముసేయ ననేకులు ప్రయత్నించిరి. కవిగారు నన్నయభట్టారకుని ఆదికవిపదవీచ్యుతుని జేయ సంకల్పించుట యానాఁటి పండితుల తన్నిరసనకుఁ బ్రధానకారణమయినది. ఆంధ్రవాఙ్మయచరిత్రకారులు తుదకు నన్నెచోడుని నన్నయతిక్కనల మధ్యకాలము వాఁడుగ నిర్ణయించి సంతృప్తి నందిరి.

నన్నెచోడకుమారసంభవమునకు మూలభూతమగు తాళపత్రమాతృక వివరము కవిగారు నిష్కృష్టముగఁ దెలుపనందున విద్వల్లోకమునఁ దత్ప్రాచీనతను గూర్చిన శంక యేర్పడుటకు ఆస్కారము కలిగెను. ప్రాచీనలక్షణగ్రంథములలో కుమారసంభవ ముదాహరింపఁబడినట్లు కవిగారు పేర్కొన్న పట్టుల ఆ పద్యములు లేక పోవుటయు నీ యనుమానమును బలపఱచెను. చిరకాలముగ వివాదస్పదముగ నుండు ఈ సంశయముల సాధకబాధకతలఁ బర్యాప్తముగఁ బరిశీలించి మిత్రులు డా॥ శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు పరమార్థమును బ్రతిపాదింపఁబూనుకొనుట ముదావహము. వారి యీ పరిశ్రమ ప్రశంసనీయము.

ఆధునికపరిశోధనాసామగ్రితో చారిత్రకపద్ధతితో శాస్త్రీయ దృక్పథముతో డా॥ కొర్లపాటివారు కుమారసంభవమును చక్షురక్షరసంయోగముగఁ బరిశీలించిరనుట వారి యీ గ్రంథమును జదివిన సర్వులకు విదితము కాఁగలదు. 238 పుటల గ్రంథములో కొర్లపాటివారు అనేకములగు అంతస్సాక్ష్యముల బాహ్యాధారములఁ బ్రదర్శించుచుఁ దేల్చిన సిద్ధాంతము నన్నెచోడుఁడు శివకవిగాక నవకవి, కుమారసంభవము ప్రాచీనగ్రంథము గాక నవీనగ్రంథము, మఱి యీ గ్రంథము మానవల్లి రామకృష్ణకవిగారి కూటసృష్టి యనుట. నన్నయపై కవిగారికి సదభిప్రాయములేదు; కాన ఆతని నాదికవిస్థానమునుండి తొలఁగించుటయే కవిగారి కూటసృష్టికి ఏకైకలక్ష్యమని యీ గ్రంథమున సహేతుకముగ నిరూపితము. చక్రబంధచిత్రములో కృతికర్తృ

భర్తల పేళ్ళు శబ్దతః కాక అర్థతః కలవని సాధించుట, మఱి యంతకన్న నిజమైన కృతికర్త మానవల్లికవి పేరు అసాధారణపద్ధతిని రచితమని ప్రదర్శించుట కొంత దూరాదాకృష్టమైనను సహృదయులకు ఆహా పుట్టింపక మానదు.

మానవల్లివారి కూటసృష్టికూహకప్రౌఢిమను గూర్చి నాయనుభవాభిప్రాయము:

"కుమారసంభవములోని పద్యములు అథర్వణచ్ఛందము, పెద్దన లక్షణసార సంగ్రహము, కవి సంజీవని, రత్నాకరము, లక్షణశిరోమణి వీనిలో నుదాహరింపఁ బడినవి"అని మానవల్లికవిగారు పీఠికలోఁ దెలిపిరి. అథర్వణచ్ఛందము నేఁడుపలబ్ధము గాదు. అందలి కతిపయపద్యము లితరలక్షణగ్రంథములలో నుద్ధృతములు. అందెందును కుమారసంభవపద్యములు గానరావు. పెద్దన లక్షణసారసంగ్రహమున తత్కవి స్వీయపద్యములేకాని యితరగ్రంథలక్ష్యములు లేవు. కవిసంజీవనీ లక్షణశిరోమణులలో నెందును కుమారసంభవపద్యములు గోచరములుగావు. గణపవరపు వెంకటకవి ప్రయోగరత్నాకరమున నన్నెచోడ కుమారసంభవ పద్యములులేవుగాని నన్నెచోడ కళావిలాసములోని రెండుపద్యము లుదాహృతములు.

అథర్వణుఁడు వ్రాసినదని కుమారసంభవపీఠికలో మానవల్లి వారుద్ధరించిన పద్యము—

"మగణమ్ముఁ గదియ రగణము
వగవక కృతి మొదట నిలుపువానికి మరణం
బగు నిక్కమండ్రు మడియఁడె
యగునని యిడి తొల్లి వేంకణాదిత్యుఁ డనిన్.

ఉపలబ్ధముగాని అథర్వణచ్ఛందమునుండి యితరలక్షణగ్రంథములలో నుదాహృతములయిన పద్యములందెందును పై పద్యము గానరాదు. మఱి యీ పద్యము నా పరిశీలించిన ముద్రితాముద్రితలక్షణగ్రంథములలో నెచ్చటను గోచరముగాదు. పై పద్యచ్ఛాయలో మగణరగణసంయోగవిషయముఁ గూర్చి తెలుపు పద్యమొకటి కైరమ కవి ప్రణీత "కవిగజాంకుశమున" నిట్లున్నది—

"మగణముతోఁ బద్యాదిని
రగణము గదిసినను జావు రయమున వచ్చున్
తగణము డాసినఁ గృతిపతి
పగలకు వెన్నిచ్చి మానభంగముఁ బొందున్"

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (సంపుటము 18,- సంచిక-2, పుటలు 151-71) యందు కవిగజాంకుశము ప్రకటితము. ఆ కవిగజాంకుశప్రతి పరిషత్తునకు మానవల్లి రామకృష్ణకవిగారిచ్చినదనియందే యథసూచికలో 121 పుటముద్రితము. పైపద్యసంఖ్య 30. పైకందపద్యపూర్వార్థమునే కై కొని యించుక మార్పుచేర్పులుచేసి స్వీయసిద్ధాంతాను కూలముగ వేంకటాదిత్యుని విషయముఁగూర్చి క్రొత్త పద్యమును రూపొందించి అథర్వణచ్ఛందములోనిదిగా మానవల్లివారు పేర్కొనియుందురని నా యూహము.

"మగణమ్ముఁ గదియ" అను పద్యము అథర్వణుఁడు పూర్ణబిందుప్రాసము క్రింద నుదాహరించెనని మానవల్లి వ్రాఁత. ఇదియొక వింత. ఈ పద్యమునకు పూర్ణబిందుప్రాసకును సంబంధమేమో ? ఇది "అబద్ధం వా సుబద్ధం వా కుంతీపుత్రో వినాయకః" అన్నట్లున్నది.

ఇక లక్షణసార సంగ్రహ విషయము—

(చిత్రకవి) పెద్దన లక్షణసారసంగ్రహమున ౨వ ఆశ్వాసమునుండి కుమారసంభవ పద్యము లుదాహృతమని మానవల్లివారు తమగ్రంథపీఠికలో వ్రాసియున్నారు. ఈ విషయమును గూర్చి మానవల్లి కవిగారితో నా ప్రత్యక్షసంవాదవృత్తాంతము—

తిరుపతికి వరుసగ 1942, 1943, 1944 సం॥లో పరీక్షల పని మీఁద నేను వెళ్ళవలసి వచ్చెను. నేనప్పటికి లక్షణసారసంగ్రహవిమర్శనము (అముద్రితము) వ్రాసియుంటినిగాన అందు ఇతర గ్రంథలక్ష్యములున్నవను విషయము యొక్క యాథార్థ్యము నెఱుఁగఁగోరి మానవల్లి వారిని సందర్శించి యడిగితిని.

అందలి చిత్రమిది -

1942 సం. లో అడిగినపుడు ఇతరగ్రంథలక్ష్యములతోఁ గూడిన లక్షణసార సంగ్రహప్రతి తమ వద్దఁ గలదనిరి. కాని యది యెందో లిఖితతాళపత్రగ్రంథ సంచయములో నున్నది. పరిష్కృతము దానిని వెలికిఁదీసి యీయఁజాల ననిరి.

1943 సం. లో వెళ్ళినపుడు ఆ గ్రంథమును దీసి యీయఁగలరా యని యడుగ, అయ్యది యిప్పుడు నా వద్ద లేదు. మదరాసు ప్రాచ్యలిఖితగ్రంథాలయమున నున్నదనిరి. మదరాసు వాస్తవ్యుఁడనగు నా కా గ్రంథాలయమును లిఖితగ్రంథములు సుపరిచితములు గాన అందు లేదనఁగా మరల పరిశీలించండి అని యుగ్గడించిరి కవిగారు. అప్పుడే నాకు వారి మాట మీఁద సందేహముదయించెను.

మరల 1944 సం.లో వారిని జూచినపు డడిగితిని. వారు మున్ను చెప్పిన మాట మఱచి కొండబోలు ఆ గ్రంథము తిరుపతి ప్రాచ్యపరిశోధకసంస్థ కిచ్చివేసితిననిరి. ఆ నాఁడే యా సంస్థకరిగి యా గ్రంథము నునికి విచారించితిని. ఆ సమయమున వేటూరి ప్రభాకరశాస్త్రిలు అందుఁ గనఁబడిన పలుకరించిరి. వారి నాగ్రంథ మందుఁ గలదా యని యడుగ, వారు మానవల్లివారి మాటలో సత్యము లేదన్నట్లు నగుచు అట్టి లిఖితగ్రంథ మందు లేదనిరి. అప్పటికి కవిగారి మాట అబద్ధాల మూట యని యవగాహనమయ్యెను.

ఆ యీ సందర్భాలు కవిగారి కూటసృష్టికూహకోక్తులకు నిదర్శనములు కాగలవు.

డా॥ కొర్లపాటి వారి నన్నెచోడకుమారసంభవగ్రంథనవీనతావాదములోని సహేతుకవిస్తరవిషయపరామర్శనము ఆ గ్రంథము మానవల్లికవిగారి కూటసృష్టి యను సిద్ధాంతము ఎస్ (yes) అనిపించుననుటలో సందియము లేదు. (చూ. ఎస్సను కుమారసంభవప్రయోగము. 6ఆ.21ప; ఈ గ్రంథము పుట216)

కోవిదులు దీని పరమార్థమును బరిశీలింతురుగాక

ఈ గ్రంథమును బఠించిన తరువాత కుమారసంభవము మానవల్లి కవిరచన (కూటసృష్టి) యనుట పరమసత్యమని నిశ్చయింపఁగలిగితిని. ఆంధ్రపండితలోక మెట్లు భావించెడినో?

"లోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ"

# సింహావలోకనము

## శ్రీ ఆంధ్ర శేషగిరిరావు

అడుగడుగు మంటపాలు ఆకుతోటలు అనే ప్రసిద్ధిని తమ కాపురపు కాణాచి ఐన తమిళభూభాగానికి కూర్చిన చోడులు తెనుగువారికి చోడవరాలనే గ్రామాలను, చోడసముద్రాలనే జలాశయాలను, చోడకళింగగంగువంటి మంచిరాజును ఇచ్చారు. తడవులకు పూర్వం పుట్టి ఉన్న ఈ ఊవులకు నేటి తాతల తరంలో ఒక మేధావి బయలుదేరి నన్నెచోడుని వంటి కవిని కూడా చోడులు తెనుగువారికి ఇచ్చారనే గిలిగింత పెట్టారు,

వారు 1908లో ప్రచురించిన నన్నెచోడుని కుమారసంభవభాగం విద్యుద్దండం వలె తెలుగు మాగాణిని జిగేలుమనిపించింది. దాని రెండవభాగప్రచురణ కొరకు కట్టమంచి వారిచేత లొట్టలు వేయించింది.

ప్రచురణకర్త మదరాసు వైశ్యవరుడు శ్రీ గర్రె పార్థసారథిశ్రేష్ఠి రెండు పుష్కరాలకు పిమ్మట స్వహస్తాక్షరితో ఆ పుస్తకాన్ని ఇచ్చినప్పుడు అమందమైన ఆనందం — శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి ఆ గ్రంథంమీద వ్రాసిన వ్యాసాన్ని మదరాసు కన్నిమెరాలైబ్రెరీ రిసెర్చిరూములో చదివి వినిపించినప్పుడు ఏదోగొప్ప సారస్వతగోష్ఠి సల్పుతూ ఉన్నట్లు— శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి కుమార సంభవరచనాకాలాన్ని గురించి వ్రాసిన వ్యాసం "ఆంధ్రభూమి'' మాసపత్రికలో ప్రచురించి నప్పుడు ఏదో గొప్ప సారస్వత సేవ చేస్తూన్నట్లు భావన— నన్నెచోడుని గున్నమామిడులు అనే చిన్న వ్యాసరచన.

కాని నిలకడ మీద నెమ్మది నెమ్మదిగా నిజం పొటమరించింది. నవతులేని సారస్వతప్రతారణ.

ఈ డెబ్బది సంవత్సరముల కాలములో కుమారసంభవమునకు ఎందఱో వందిమాగధులు. ఎంతలేసో కైవారగానాలు. ఎన్నెన్నో పఠనములు, పాఠనములు, పాఠాంతరములు, పరిష్కరణములు, విమర్శనములు, పరిశోధనములు,పదకోశములు, వ్యాఖ్యానములు, భాషాశాస్త్రభేషజములు, పాషాణాస్త్రపైత్రిజములు వెలిశాయి.

కాని ఇకమీద వెలయబోవు.

ఏమంటే కుహనావాదము, కృతకరచన, కుటిలశృంగారము, కృత్రిమపాఠము మున్నగు శీర్షికలతో ఆరు ప్రకరణాలలో ఈ కూటసృష్టికి కూలంకషవిమర్శ వెలువడింది కాబట్టి.

ఈ కావ్యముయొక్క మాయావేషమునకు కొర్లపాటివారిది తుది చీటి.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 12 | లేని | ఉన్న |
| 15 | 16 | గురులింగమాభేదము | గురులింగజంగమాభేదము |
| 19 | 13 | పదములను | పదములును |
| 28 | 15 | హృతసూర్యకాంత | హృతసూర్యసూర్యకాంత |
| 34 | 16, 19 | వెంక | లెంక |
| 38 | 3 | కలితముగాన్ | కలితముగాఁగన్ |
| 39 | ,, | బాధు | భార |
| 41 | 19 | కలదు. | కలదు[5]. |
| ,, | 21 | కలదు. | కలదు[6]. |
| 42 | 12 | రూపకమునకు | రూపకమును |
| 43 | 25 | వజ్రమయుల్ | వజ్రమయముల్ |
| 59 | ,, | విలయములు | నిలయములు |
| 70 | 20 | వాయుంప | వాయింప |
| 72 | 6 | ప్రాసమాత్ర | ప్రాసయతిమాత్ర |
| 78 | ,, | పాండుకపోల | పాండురకపోల |
| 83 | 7 | కొమ్ములు | కొమ్మలు |
| ,, | 26 | హయఘోషా | హయహేషా |
| ,, | 28 | సుమహో | సుమహా |
| 84 | 17 | వెంకలవెంక | లెంకలలెంక |
| 94 | 6 | కర్టాటే | కర్ణాటీ |
| ,, | 10 | కటాక్షొ | కటాక్షౌ |
| 95 | 24 | నిమత్తహౌమవి | నిమిత్తమేమని |
| 98 | 9 | వాలయించు | వొలయించు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 103 | 7 | జోఁకుమమ్మ | జోఁకకుమమ్మ |
| 110 | 16 | ఇసుంతయు | ఇనుమంతయు |
| 112 | 12 | యిట్లు | ఇట్లు |
| 114 | 10 | దుకూల | తద్దుకూల |
| ,, | 11 | నీవీ | నీవి |
| 124 | 2 | బెందగాఁగలంజె | జెందఁగాఁగలండె |
| ,, | 22 | నిలుచునిట్టిది | నిలుచునట్టిది |
| 153 | 3 | కథా | తథా |
| 154 | 21 | నిర్లయింపపలసి | నిర్ణయింపవలసి |
| 171 | 1 | ముద్రాలేఖిత | ముద్రాలేఖిని |
| 173 | 23 | బాగియు | జాగియు |
| 174 | 1 | ,, | ,, |
| 180 | 25 | అతిభేత | అతిభీత |
| 182 | 11 | సాహసుడై | సాహసుడై |
| 194 | 27 | ఇతరభేదము | ఇంతభేదము |
| 199 | 20 | పరిలగదార్ఢ్రి | పరిగలదార్ఢ్రి |
| 202 | 2 | ప్రయోజనములు | ప్రయోజనులు |
| 205 | 18 | దుస్తృణజ్యోతి | దుస్తృణద్యోతి |
| 206 | 15 | పంఖాజలము | పరిఖాజలము |
| 210 | 5 | బొందిక | పొందిక |
| ,, | 26 | పవ్వళింప" జక్కన | పవ్వళింప"అను జక్కన |
| 212 | 13 | నీహరాంశు | నీహారాంశు |
| ,, | 15 | కుస్తేద్వేఁభ | కుస్తేద్వేభ |
| 219 | 7 | పదునెన్మిదవ | పదునేడవ |
| ,, | 9 | పదునై దవ | పదునాల్గవ |
| 222 | 5 | కాముకసూర్య | కాముకసోమసూర్య |
| ,, | 9 | సూమయాజి | సోమయాజి |
| 236 | 5 | 1804 | 1894 |